కాచాదిబుద్ధిరిత్యాది యథాయథమూహ్యం. యద్వా - తస్యైవ పరమార్థ సత్యత్వ ప్రతిపాదనాయ తదితరస్య మిథాత్వముక్తం. యత్ర మృషైవాయం త్రిసర్గో న వస్తుతస్సన్నితి. యత్రేత్యనేన ప్రతీతముపాధిసంబంధం వారయతి - స్వేనైవ ధామ్నా మహసా. నిరస్త కుహకం కపటం మాయికం విశ్వం యస్మిన్ తం. ధీమహీతి పూర్వేణైవ సంబంధః. తటస్థలక్షణమాహ - జన్మాదీతి. అస్య విశ్వస్య. జన్మాది జన్మస్థితి భంగాః. యతః పరమేశ్వరాత్. భవంతి. తం ధీమహీతి. తత్ర హేతుః - అన్వయాదితరతశ్చ. అర్థేషు ఆకాశాదికార్యేషు. పరమేశ్వరస్య సద్రూపేణాన్వయాత్. అకార్యేభ్యః ఖపుష్పాదిభ్యశ్చ తద్వ్యతిరేకాత్. యద్వా- అన్వయశబ్దేనాను వృత్తిః ఇతరశబ్దేన వ్యావృత్తిః అనువృత్తత్వాత్సద్రూపం బ్రహ్మ కారణం. మృత్సువర్ణాదివత్. వ్యావృత్తత్వాద్విశ్వం కార్యం. ఘటకుండలాదివదిత్యర్థః. యద్వా-సావయవత్వాదన్వయవ్యతిరేకాభ్యాం యదస్య జన్మాది, తద్యతో భవతీతి సంబంధః, తథాచ శ్రుతిః-'యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి, యత్ప్రయంత్యభిసంవిశంతి' ఇత్యాద్యా, స్మృతిశ్చ-'యతస్సర్వాణి భూతాని భవంత్యాదియుగాగమే, యస్మింశ్చ ప్రళయం యాంతి పునరేవ యుగక్షయే' ఇత్యాద్యా. తర్హి, కిం ప్రధానం జగత్కారణత్వాద్ధ్యేయమభిప్రేతం! సేత్యాహ-అభిజ్ఞః యః.తం. శ్రు.'స ఈక్షతేమాన్ లోకాన్ లోకాపాలాన్ను సృజా ఇతి. స ఇమాన్ లోకానసృజత' ఇత్యాది. ఈక్షతేర్నాశబ్దమితి.శారీరకసూత్రాచ్చ. (ఈక్షతేశ్శ్రవణాత్, బ్రహ్మైవజగత్కారణం. శ్రు. సర్వజ్ఞం బ్రహ్మ జగతః కారణం' ఇత్యాది. ప్రధానం జగత్కారణం న భవతీతి సూత్రస్యార్థః.) తర్హి .కిం జీవో ధ్యేయస్స్యాత్? నేత్యాహ-స్వరాట్ స్వేనైవ రాజతే యః తం స్వతస్సిద్ధజ్ఞానమిత్యర్థః. తర్హి కిం బ్రహ్మో హిరణ్యగర్భో ధ్యేయః శ్రు.'హిరణ్యగర్భస్సమవర్తతాగ్రే భూతస్య జాతః పతిరేక ఆసీత్, సదాధార పృథివీం ద్యామ్' ఇత్యాదిశ్రుతేః-నేత్యాహ-తేన ఇతి. ఆదికవయే చతుర్ముఖబ్రహ్మణేఽపి, బ్రహ్మ వేదం. యః , తేనే ప్రకాశితవాన్. శ్రు. 'యో బ్రహ్మాణం విధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై, తగ్ం హదేవమాత్మ బుద్ధిప్రకాశం ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే' ఇత్యాది. నను, బ్రహ్మణోఽన్యతో వేదాధ్యయనమప్రసిద్ధం? సత్యం. తత్తు హృదా మనసైవ, తేనే విస్తృతవాన్. అనేన బుద్ధివృత్తిప్రవర్తకత్వేన గాయత్ర్యర్థః ప్రదర్శితః. వక్ష్యతి 'ప్రచోదితా యేన పురా సరస్వతీ వితన్వతాఽజస్య సతీం స్మృతిం హృది, స్వలక్షణా ప్రాదురభూత్కిలాఽన్యతస్స మే ఋషీణామృషభః ప్రసీదతామ్' ఇతి. నను, బ్రహ్మ స్వయమేవ సుప్తప్రతిబుద్ధన్యాయేన వేదముపలభతాం? నేత్యాహ-యత్ యస్మిన్ శబ్దబ్రహ్మణి సూరయోఽపి ముహ్యంతి. తస్మాద్బ్రహ్మణోఽపి పరాధీనజ్ఞానత్వాత్. స్వతస్సిద్ధజ్ఞానః పరమేశ్వర ఏవ జగత్కారణం. అత ఏవ సత్యః. అసతస్సత్తాప్రదత్వాచ్చ పరమార్థసత్యత్వేన సర్వజ్ఞ త్వేన నిరస్తకుహక స్తం. ధీమహీతి గాయత్ర్యా ప్రారంభేణ

చ గాయత్ర్యాఖ్యపరబ్రహ్మ విద్యారూపమేతత్పురాణమితి దర్శితం. యథోక్తం మత్స్యపురాణే, పురాణదానప్రస్తావే–'యత్రాధికృత్య గాయత్రీం వర్ణ్యతే ధర్మవిస్తరః, వృత్రాసురవధోపేతం తద్భాగవతమిష్యతే. లిఖిత్వా తచ్చ యో దద్యాద్ధేమసింహసమన్వితమ్' పురాణాంతరే చ– 'గ్రంథో౽ష్టాదశసాహస్రోద్వాదశస్కంధసమ్మితః, హయగ్రీవబ్రహ్మవిద్యా యత్ర వృత్రవధస్తథా. గాయత్ర్యా చ సమారంభస్తద్వై భాగవతం విదుః' ఇతి. కించ పద్మపురాణే, అంబరీషం ప్రతి గౌతమవచనమ్ – 'అంబరీష శుకప్రోక్తం నిత్యం భాగవతం శృణు, పఠస్వ స్వముఖేనాపి యదీచ్ఛసి భవక్షయమ్.' ఇతి. (అత్ర సవితుర్దేవస్యేతి పదద్వయం వ్యాచష్టే 'జన్మాద్యస్య యత' ఇతి. వరేణ్యమిత్యస్య వివరణం 'పర'మితి. భర్గఇత్యస్య వ్యాఖ్యా 'స్వరా'డితి. 'ధామ్నా స్వేన సదా నిరస్తకుహక' మితి చ. తృతీయపాదవ్యాఖ్యానం 'తేన బ్రహ్మ హృదా య ఆదికవయ' ఇతి. కిం చాత్ర ప్రతిపదవివరణం విద్వద్భిరేవమప్యూహితుం శక్యం. తథాహి. గాయత్రీమంత్రాదిమతత్పదప్రతిపదం 'సత్య'మితి. శ్రు. 'తత్సత్యమిత్యాచక్షతే' ఇత్యాది. సవితృపదప్రతిపదం 'యత' ఇతి. వరేణ్యమిత్యస్య ప్రతిపదం 'పర' మితి, 'అభిజ్ఞ' ఇతి చ. భర్గ ఇత్యస్య ప్రతిపదం 'స్వరా' డితి. భర్గరూపం తేజ ఇత్యర్థః. దేవస్యేత్యస్య ప్రతిపదం 'అస్యే'తి. ధీమహీత్యస్య 'ధీమహీ' త్యేవ. ధియ ఇత్యస్య ప్రతిపదం విభక్తి వ్యత్యయేన 'హృదేతి'. య ఇత్యస్య 'య' ఇత్యేవ, న ఇత్యస్య 'ఆదికవయ' ఇతి. ప్రచోదయాదిత్యస్య 'తేన' ఇతి. తస్మాత్ గాయత్రీమంత్రస్థితధీమహి 'య' ఇతి పదద్వయేన చ తదితరపదాష్టకార్థోపబృంహకపదైశ్చాత్రారంభేణ గాయత్ర్యాఖ్య శ్రీపరబ్రహ్మ విద్యారూపమేతత్పురాణమితి సిద్ధం) అతఏవ భాగవతం నామాన్యదిత్యపి న శంకనీయమ్.(1)

వేదవ్యాసమహర్షి అనేక పురాణాలను శాస్త్ర ప్రబంధాలను రచించి కూడా మనః శాంతిని పొందక అక్కడక్కడ తిరుగుతూ సంతోషము నొందక నారదమహర్షి ఉపదేశమున శ్రీమద్భగవద్గుణాను వర్ణనమే ప్రధానమగు భాగవత శాస్త్రాన్ని ప్రారంభించే ఇచ్ఛకలవాడై దాని విఘ్నాలు నివారించబడవలెనను ఉద్దేశముతో ఆ భాగవతముచేత ప్రతిపాదించబడు పరమాత్మ స్మరణముగల మంగలాచరణమును "జన్మాద్యస్య" అను శ్లోకముతో చేస్తున్నాడు.

" సమాప్తి కామో మంగలమాచరేత" అను శిష్టాచారానుమిత శ్రుతి ఇచట అనుసరించబడినది. "పరం" అనగా పరమేశ్వరుని

'ధీమహి' ధ్యానించుచున్నా, మని అన్వయము. 'ధ్యై చింతాయాం' అను సంస్కృత ధాతువు యొక్క విధి లిఙ్ ఉత్తమ పురుష బహువచన రూపము. ఆత్మనే పదము వైదికము. ధ్యాయేమ అనునది ధీమహి అనుదానికి లౌకిక సంస్కృత అనువాదము. ఇచట బహువచనము శిష్యాభిప్రాయమని గుర్తించాలి. వ్యాసమహర్షి చేసిన ప్రార్థనను వారి శిష్యులు ఆచరించినపుడు అలా అనుకోవాలని భావము. ఇందు పరబ్రహ్మ స్వరూపుడగు ఆ పరమేశ్వరుని స్వరూప, తటస్థ లక్షణములతో వివరించుచున్నారు వ్యాసులవారు.

ఒక వస్తువు ఎలావుంటుందో పరిచయం చేయాలంటే దాని లక్షణం చెప్పాలి. ఆ లక్షణాలు పైన చెప్పినట్లుగా రెండు రకాలుగా ఉండును.స్వరూప లక్షణం అనగా అది ఇలా ఉంటుందని చెప్పడము. తటస్థ లక్షణం అనగా ఉపపత్తుల ద్వారా ఇతర విషయాలను పేర్కొని వాటి ద్వారా ఆ అసలు వస్తువు పరమాత్మ ఉన్నదని ఉన్నదని గుర్తించాలని అని చెప్పడము.

స్వరూప లక్షణం సత్యానికి హేతువు, అనగా పరమాత్మ సత్య స్వరూపము. సత్యము మూడు కాలాల్లోను అనగా భూత భవిష్యద్ వర్తమానాల్లో ఒకే రకంగా ఉంటుంది. అసత్యం రంగులు మారుస్తూ ఉంటుంది.

'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' అను తైత్తిరియోపనిషత్తు పరబ్రహ్మ సత్యస్వరూపుడని వెల్లడిస్తుంది. 'బ్రహ్మ సత్యం జగన్మిథ్య' అన్నట్లు పరబ్రహ్మమొక్కటే సత్యమైనది. మిగతావన్నీ అసత్యమే. కావున సత్యస్వరూపము బ్రహ్మము అనగా బ్రహ్మకు సత్యత (సత్త) లక్షణము. ఏ పరబ్రహ్మ వలన ప్రకృతి గుణాలగు తమోరజస్సత్త్వాల వలన ఏర్పడిన పంచభూతములు, ఇంద్రియాలు, దేవతారూపమగు సృష్టి సత్యముగా భాసించుచున్నదో అది పరబ్రహ్మము. అనగా ఏది ఉండడం వలన అసత్యమగు సృష్టి సత్యముగా భాసించుచున్నదో అది అని భావము. బ్రహ్మము ఉండడం వలననే ఆ అధిష్ఠానమునందు, లేని ప్రపంచము ఉన్నట్లుగా తోచుచున్నదని భావము. ఇది ప్రాతిభాసిక సత్యము. స్వప్నాన్ని మనము అనుభవించినంతవరకు అది సత్యంగానే తోచుతుంది. అందుకే హర్ష,శోక, భయాదులు కలుగుతాయి.మెలుకువ వస్తే అంతా అసత్యమే. ఇదే విధముగా జ్ఞానోదయమైతే ప్రపంచమంతా అసత్యమే. మసక చీకటిలో తాడు సర్పముగా భాసించును. దానికి కారణము తాడే. అది లేనిచో సర్పము (భ్రాంతము) లేదు. లేని పాము ఆ తాటియందు ఉన్నట్లుగా భాసిస్తుంది. అలాగే లేని ప్రపంచము

బ్రహ్మయందు భ్రాంతిచే ఉన్నట్లుగా తోచునని భావము. అటువంటి పరమ సత్యస్వరూపుడు పరబ్రహ్మ ఈ విషయమున దృష్టాంతము. తేజస్సు, నీరు, మట్టి ఒకదానియందొకటి భాసించును. వినిమయమనగా ఒకదానియందు మరొకటి భాసించుట. దీనినే ఆభాసమంటారు అధిష్ఠానమున్నందుననే దానియందు ఏదేదో అసత్యమైనది తోచుచుండును. ఎండమావులలో తేజస్సు యందు నీరున్నట్లుతోచును. ఇదే విధముగా మట్టియందు గాజుపెంకు, పెంకుయందు నీటిబుద్ధి, అటులనే నీటియందు గాజుపెంకు బుద్ధి ఊహించుకోవాలి.

లేదా ఆ పరమాత్మకు సత్యత్వం చెప్పడానికి తదితరములకు అసత్యం చెప్పబడినది. 'యత్ర సర్గోమృషా' అని చెప్పవచ్చు . 'బ్రహ్మ సత్యం జగన్మిథ్య' అనునది యథార్థము. 'యత్ర' అనడంతో సత్య బ్రహ్మకు అసత్య ప్రపంచంలో ఏదో ఉపాధి సంబంధం ఉందని తోచుచున్నది. కాబట్టి అలాకాదని స్వరాట్ అని బ్రహ్మకు విశేషణం వేయబడినది. ఆ పరబ్రహ్మమొక్కటే ఇతర సంబంధం లేకుండ స్వతః ప్రకాశించునని భావము. అదే అన్నింటిని ప్రకాశింపజేయును.

ఆ తేజస్సుతోనే తమోమయమైన మాయను వారించి మాయకు అతీతుడై విలసిల్లును. ఆయన మాయ ఇతరులను మోసగించునే కాని ఆయననేమి చేయదని భావము. నీటిలో ఉండి తామర నీటినంటనట్లు మాయాశ్రయుడైకూడా పరమేశ్వరుడు మాయాతీతుడని గుర్తించాలి. ఇక పరబ్రహ్మ తటస్థ లక్షణము చెబుతున్నాడు 'జన్మాద్యస్య' అని.

అస్య, ప్రపంచము యొక్క జన్మ, స్థితి, నాశనము దేనివలన కలుగుచున్నవో ఆ బ్రహ్మను ధ్యానింతునని భావము. దానికి కారణము అన్వయ వ్యతిరేక వ్యాప్తుడు బ్రహ్మము ఉన్నందుననే ఈ ప్రపంచము భాసిస్తున్నది. అది లేనిచో ప్రపంచమేలేదు. ఏది ఉంటే ఏది ఉండునో అనునది అన్వయవ్యాప్తి. పొగ ఉంటే తప్పక అగ్ని ఉంటుంది. 'అర్థేషు' అంటే అర్థములందు, ఆకాశాది కార్యములందు పరమాత్మ సద్రూపమున గోచరించును. లేని ఆకాశ పుష్పాదులందు భాసించడు. లేదా అన్వయ శబ్దానికి అనువృత్తి అనీ ఇతర శబ్దానికి వ్యావృత్తి అని తెలిసికోవాలి. బ్రహ్మ సావయవము అయినందున జన్మ, స్థితి, నాశనములు ఏ బ్రహ్మ వలన కలుగుచున్నవో అట్టి బ్రహ్మ ఇచట కారణమని భావము. దీనికి శృతి 'యతోవా ఇమాని భూతాని జాయన్తే యేన జాతాని జీవన్తి యత్ప్రయన్త్యభి సంవిశన్తీతి' అను శ్రుతి ప్రమాణము. ఇదే విధముగా స్మృతి (పురాణము) కూడా ప్రమాణము.

" యతస్సర్వాణి భూతాని భవన్త్యాదియుగాగమే యస్మింశ్చ ప్రలయంయాన్తి పునరేవ యుగక్షయే." మహాభారతమందలి విష్ణు సహస్రనామ శ్లోకము.

జగత్కారణమని చెప్పడంతో సాంఖ్యులు చెప్పే ప్రధానం మూలప్రకృతి జగత్కారణమని భ్రమపడతారేమోనని అలా కాదని 'అభిజ్ఞ ' అని చెప్పబడినది. ప్రధానము జడము, అచేతనము. పరబ్రహ్మము చైతన్యశక్తి కలవాడు. భిన్నుడు. లోకాలను సృజించాడు."స ఐక్షత లోకాన్ను సృజా ఇతి. స ఇమాన్ లోకానసృజతేతి శ్రుతిః" "ఈక్షతేర్నా శబ్దం" అని బ్రహ్మ సూత్రము ఈ విషయమున ప్రమాణము. ఐతే జీవుడే ధ్యేయుడా? అంటే కాదు అని, స్వరాట్ అని విశేషణం వేశారు వ్యాసులవారు. స్వయముగా ప్రకాశించువాడు స్వతస్సిద్ధ జ్ఞానం కలవాడు. పరమాత్మ సర్వజ్ఞుడు, ధ్యేయుడని భావము. కించిజ్జ్ఞుడగు జీవుడు కాదు. ఐతే ఇదే విధముగా సృష్టి కర్త బ్రహ్మ ధ్యేయుడా? "హిరణ్య గర్భస్సమవర్తతాగ్రే భూతస్య జాతః పతిరేక ఆసీత్" అని శ్రుతి కలదు కదా ! అంటే అట్టి చతుర్ముఖ బ్రహ్మ కూడా కాదనీ, "తేనే బ్రహ్మ హృదా య ఆది కవయే" అన్నారు. ఏ పరబ్రహ్మ వేదాన్ని బ్రహ్మకు మనస్సుతో ఉపదేశించాడో అట్టి పరమాత్మయని వచించారు వ్యాసులవారు.

"యో బ్రహ్మాణం విధధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై । తగ్ంహ దేవమాత్మ బుద్ధిప్రకాశం ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే."

అని కలదు బ్రహ్మ ఇతరుల వలన వేదం చదివినట్లు ప్రసిద్ధి లేదు కదా అని అంటారేమో. కాని బుద్ధిని ప్రేరేపించి వేదాన్ని బ్రహ్మకు పరబ్రహ్మ మానసికంగా ఉపదేశించాడు. దీని వలన బుద్ధి వృత్తిని ప్రేరేపించాడని గాయత్ర్యర్థము. "ధియో యో నః ప్రచోదయాత్" అనునది వివరించబడినది.

దానికి........ " ప్రచోదితా యేన పురా సరస్వతీ వితన్వతా యస్య సతాం స్మృతిం హృది । సలక్షణా ప్రాదురభూత్కిలాస్యతః స మే ఋషీణామృషభః ప్రసీదతామ్." ॥

అను భాగవత శ్లోకమే ప్రమాణం. బ్రహ్మ స్వయముగానే సుప్త ప్రతి బుద్ధ న్యాయంతో వేదమును తెలుసుకోవచ్చు గదా అను ఆక్షేపణ ఇక్కడ వస్తుంది. పడుకొని లేచినవాడు నిద్రలో మరచిన దానిని జ్ఞాపకం చేసికొంటాడు గదా ! అంటే అలా కాదని వారిస్తున్నాడు.

"ముహ్యంతి యత్సూరయః" ఏ వేదం విషయంలో విద్వాంసులు కూడా మోహాన్ని పొంది తెలుసుకోలేకపోతున్నారో అట్టిది వేదము. కాబట్టి బ్రహ్మ కూడా పరాధీన జ్ఞానము కలవాడే కావున స్వతస్సిద్ధ జ్ఞానం కల పరమేశ్వరుడే బ్రహ్మకు వేదాలను ఉపదేశించాడు. ఆ బ్రహ్మమే జగత్కారణమని భావము. అందుకే సత్యస్వరూపుడగు పరమాత్మ లేని దానికి కూడా ఉండే శక్తి ప్రసాదించగలడు పరమాత్మ సత్యము, సర్వజ్ఞుడు, ఏ మాయ అంటనివాడు. కావున 'నిరస్త కుహకం' తొలగిన కపటం కలవాడని చెప్పబడినది. అట్టి పరమాత్మను 'ధీమహి' ధ్యానించుచున్నాము అని అర్థము. ఇచట ధీమహి అనునది గాయత్రీ మంత్రార్థము. 'భర్గో దేవస్య ధీమహి' అని కదా గాయత్రీ మంత్రము. కావున గాయత్రీ బ్రహ్మ విద్యా రూప మంత్రార్థ ప్రకాశకము ఈ భాగవత పురాణమని చెప్పబడినది. ఈ విషయము మత్స్య పురాణమున పురాణాల ప్రస్తావనలో చెప్పబడినది. పద్మ పురాణములో అంబరీషుని గురించి "అంబరీష శుక ప్రోక్తం శృణు భాగవతం సదా" అని గౌతమ ముని మాట. అందుకే భాగవతమంటే ఏదో ఇతర ప్రోక్తమైనది కాదని శుక ప్రోక్తమేనని తేలి పోయినది.(1)

**2.శ్లో. ధర్మ ప్రోజ్ఝిత కైతవోఽత్ర పరమో నిర్మత్సరాణాం సతాం । వేద్యం వాస్తవమత్ర వస్తుశివదం తాపత్రయోన్మూలనమ్ ।శ్రీమద్భాగవతే మహామునికృతే కిం వా పరైరీశ్వరః । సద్యో హృద్య వరుద్ధ్యతేఽత్ర కృతిభిః శుశ్రూషుభిస్తత్ క్షణాత్ ॥**

టీ :- ఇదానీం శ్రోతృ ప్రవర్తనాయ శ్రీభాగవతస్య కాణ్డత్రయ విషయేభ్యః సర్వశాస్త్రేభ్యః శ్రైష్ఠ్యం దర్శయతి – ధర్మ ఇతి । అత్ర శ్రీమతి సుందరే ముముక్షూణామతిరమణీయ ఇత్యర్థః. భాగవతే పరమోధర్మః నిరూప్యతే. పరమత్వే హేతుః – ప్రకర్షేణోఝ్ఝితం కైతవం ఫలాభిసన్ధి లక్షణం కపటం యస్మిన్ సః. ప్ర శబ్దేన మోక్షాభిసన్ధిరపి నిరస్తః. కేవలమీశ్వరారాధన లక్షణో ధర్మో నిరూప్యత ఇత్యర్థః. అధికారితోఽపి ధర్మస్య పరమత్వమాహ – నిర్మత్సరాణాం పరోత్కర్షా సహనం మత్సరః, తద్రహితానామ్. సతాం భూతానుకంపినామ్. ఏవం కర్మకాండ విషయేభ్యః శాస్త్రేభ్యః శ్రైష్ఠ్యముక్తం. జ్ఞానకాండ విషయేభ్యోఽపి శ్రైష్ఠ్యమాహ – వేద్యమితి. వాస్తవం పరమార్థభూతం వస్తు వేద్యం న తు

వైశేషికాదివ ద్రవ్యగుణాదిరూపమ్. యద్వా వాస్తవ శబ్దేన వస్తునోऽంశో జీవః. వస్తునః శక్తిర్మాయా, వస్తునః కార్యం జగచ్చ, తత్సర్వం వస్త్వేవ న తతః పృథగితి వేదితవ్యం. వేద్యమ్. అయత్నేనైవ జ్ఞాతుం శక్యమిత్యర్థః. తతః కి మత ఆహ.శివదం పరమసుఖదమ్. కిం చ ఆధ్యాత్మికాది తాపత్రయోన్మూలనం చ అనేన జ్ఞానకాండ విషయేభ్యః శ్రైష్ఠ్యం దర్శితమ్. కర్తృతోऽపి శ్రైష్ఠ్యమాహ - మహామునిః శ్రీమన్నారాయణః తేన ప్రథమం సంక్షేపతః కృతే. దేవతాకాండతః శ్రైష్ఠ్యమాహ - కిం వేతి. పరైః శాస్త్రైస్తదుక్తసాధనైర్వా. ఈశ్వరః హృది కిం వా సద్య ఏవావరుధ్యతే స్థిరీ క్రియతే. వా శబ్దః కాపట్యలక్షణః కాక్వర్థః (కటాక్షే). కిం తు విలంబేన కథం చిదేవ. అత్ర తు శుశ్రూషుభిః శ్రోతుమిచ్ఛద్భిరేవ. తత్క్షణాదేవావరుధ్యతే. ఇదమేవ తర్హి కిమితి సర్వే న శృణ్వంతి ? తత్రాహ - కృతిభిరితి. శ్రవణేచ్ఛా తు పుణ్యైర్వినా నోత్పద్యత ఇత్యర్థః. తస్మాదత్ర కాండ త్రయార్థస్యాపి యథావత్ప్రతిపాదనాదిదమేవ సర్వశాస్త్రేభ్యః శ్రేష్ఠం, అతో నిత్యమిదమేవ శ్రోతవ్యమితి భావః. (2)

ఇపుడు ఈ శ్లోకమున, భాగవతము వినేవారికి వెంటనే భగవంతునియందు ఆసక్తి కలుగును అని చెప్పబడుచున్నది. శ్రీమద్భాగవతమునకు, వైదికమైన మూడు కాండలు అనగా కర్మోపాసన జ్ఞాన కాండల విషయము కంటే, శ్రేష్ఠత్వమును ప్రతిపాదించుచున్నారు. ఈ భాగవతమున పరమమగు ధర్మము నిరూపించబడుతున్నది. పరమైన ధర్మము అనడానికి హేతువును తెలుపుతున్నారు. 'ప్రోజ్ఝిత కైతవ' అని అనగా ఫలాభిసంధిలేని, ఏ కపటములేని నిష్కల్మషమైన ధర్మము. ప్రోజ్ఝిత అనుదానికి 'ప్ర' అను ఉపసర్గను వేయడం వలన మోక్షాభిసంధి కూడాలేని కేవలము ఈశ్వరారాధన రూపమైన ధర్మము (భక్తి) భాగవతమున ప్రతిపాదించబడునని తెలుసుకోవాలి. అధికారి నుండి కూడా ధర్మానికి పరమత్వం చెపుతున్నాడు.'నిర్మత్సరాణాం' అని. మాత్సర్యమనగా అసూయ. ఇతరుల ఉత్కర్షను గురించి అసూయపడని సజ్జనులకు, భూతదయ గలవారికి తెలిసికొనదగిన కర్మకాండ,శాస్త్రాల కంటే శ్రేష్ఠమైనదని చెప్పి, జ్ఞానకాండ కంటే కూడా శ్రేష్ఠత్వమును చెబుతున్నారు. వాస్తవము, పరమార్థభూతమగు వస్తువు పరబ్రహ్మ తెలిసికొనదగినది. అంటే వస్తువు యొక్క అనగా పరమాత్మ యొక్క అంశ జీవుడు. వస్తువు యొక్క శక్తి మాయ. వస్తువు యొక్క కార్యము జగత్తు. ఇవన్నియు ఆ బ్రహ్మ వస్తువే కాని ఇతరములు కావు, అని తెలిసికోవాలి. వేద్య శబ్దానికి అప్రయత్నముగానే తెలిసికొన శక్యమని భావము. దాని వలన ఏమి లాభము? అన్న ప్రశ్నకు ' శివదం' మిక్కిలి శుభాన్ని కలిగించునది అని అర్థము. అంతేకాక ఆధ్యాత్మికాధిదైవికాధిభౌతిక తాపత్రయములను నిర్మూలించునది భాగవతమని భావము.

ఆధ్యాత్మిక తాపములు - మానసిక బాధలు, శారీరక రోగాదులు. ఆధి దైవిక తాపములు - అతివృష్టి, అనావృష్టి, అశనిపాతాదులు. ఆధి భౌతిక తాపములు - సర్ప, వ్యాఘ్రాదుల వలన కలిగే బాధలు. ఇవన్నియు భగవదనుగ్రహము వలన పూర్తిగా తొలగును. ఇది ఇతర లౌకిక ఉపాయాలవలన నిర్మూలింపబడును కానీ వాటి వలన తప్పక తొలగునను నమ్మకము లేదు. తొలగినా తిరిగి రాకుండ ఉండవు. అనునది వాటికిలేదు జ్ఞానకాండ కంటే శ్రేష్ఠత్వమును భాగవతానికి తెలుపుతున్నారు, జ్ఞానము వలన మోక్షమే లభిస్తుంది కాని భక్తిరూప ధర్మము వలన ఐహిక ఫలముకూడ లభిస్తుంది. భుక్తి, ముక్తి కలుగుతుందని భావము.

కర్తకు కూడా శ్రేష్ఠత్వమును తెలుపుతున్నారు. 'మహాముని కృతే' అని. మహాముని అనగా నారాయణుడు. అతని చేత మొదట చెప్పబడినది. 'వ్యాసో నారాయణో హరి'. అని కూడా గుర్తించాలి. దేవతాకాండ విషయమును అందలి శ్రేష్ఠత్వమును చెబుతున్నారు. 'కింవా' అని ఇతర శాస్త్రములలో చెప్పబడిన సాధనముల చేతనేమి ప్రయోజనము? ఈ భాగవతము నందు ఈశ్వరుడు సద్యస్కాలమున అనగా వెంటనే శ్రవణమాత్రముననే మనస్సునందు దృఢపరచబడును. 'వా' శబ్దము కటాక్షమందు వర్తించును. అనగా భగవదనుగ్రహం చేతనే అని దానికి అర్థము. 'సద్యః' అనగా ఆలస్యంగా కష్టంగా కాదని భావము. మనము ఎంత కష్టపడినా భగవదనుగ్రహము లేనిది ఫలించదు. 'శుశ్రూషుభిః' వినే ఇచ్ఛగల వారి చేత తత్ క్షణముననే హృదయమందు భగవంతుడగు కృష్ణుడు నిరోధించబడును స్థిరముగ నిలుపబడును. ఐతే దీనిని అందరు ఎందుకు వినరు? అని శంకించి 'కృతిభిః' అన్నారు. పుణ్యాత్ములే భగవత్కథ వింటారు. పుణ్యం లేని వారికి భగవత్కథ వినే బుద్ధి కలగదు. కావున కాండత్రయార్థములు అనగా అన్ని కర్మోపాసనా జ్ఞాన కాండములు కూడా యథా తథంగా దీనిలో ప్రతిపాదింపబడినందున ఈ భాగవతమే అన్ని శాస్త్రాలకంటే శ్రేష్ఠము. కావున నిత్యము శ్రీమద్భాగవతము వినదగియున్నదని భావము.(2)

**3.శ్లో ॥ నిగమకల్పతరోర్గలితం ఫలమ్ । శుక ముఖాదమృత ద్రవ సంయుతమ్ ।**

**పిబత భాగవతం రసమాలయమ్ । ముహురహో రసికా భువి భావుకాః ॥**

టీ :- ఇదానీం తు న కేవలం సర్వశాస్త్రేభ్యః శ్రేష్ఠత్వాదస్య శ్రవణం విధీయతే. అపి తు సర్వశాస్త్రఫలరూపమిదం. అతః పరమాదరేణ

సేవ్యమిత్యాహ – నిగమేతి. నిగమో వేదః స ఏవ కల్పతరుః. సర్వపురుషార్థోపాయత్వాత్. తస్య ఫలం ఇదం భాగవతం నామ. తత్తు వైకుంఠగతం నారదేనానీయ మహ్యం దత్తం. మయా చ శుకస్య ముఖే నిహితం. తచ్చతన్ముఖాత్ భువి గలితమ్ శిష్యప్రశిష్యాదిరూప పల్లవ పరంపరయా శనైరఖండమేవావతీర్ణం. నతూచ్చనిపాతేన స్ఫుటితమిత్యర్థః. ఏతచ్చ భవిష్యదపి భూతవన్నిర్దిష్టం అనాగతాఖ్యానేనైవాస్య శాస్త్రస్య ప్రవృత్తేః. అతఏవామృతరూపేణ ద్రవేణ సంయుతం. లోకే హి శుకముఖస్పృష్టం ఫలం అమృతమిన స్వాదు భవతీతి ప్రసిద్ధమ్. అత్ర తు శుకో మునిః. అమృతం పరమానందః. స ఏవ ద్రవో రసః.శ్రు. 'రసో వై సః'. 'రసగ్‌హ్యేవాయం లబ్ధ్వాఽఽనందీ భవతి' ఇతి శ్రుతేః. అతః హేరసికాః రసజ్ఞాః. తత్రాపి భావుకాః. హే రస విశేషభావనాచతురాః. అహో భువి గళితమిత్యలభ్యలాభోక్తిః. ఇదం భాగవతం నామ ఫలం ముహుః పిబత. నను త్వగష్ట్యాదికం విహాయ ఫలాద్రసః పీయతే. కథం ఫలమేవ పాతవ్యం? తత్రాహ – రసం రసరూపం. అతస్త్వగాదేర్హేయాంశస్యాభావాత్ఫలమేవ కృత్స్నం పిబత. అత్ర చ రసతాదాత్మ్యవివక్షయా రసవత్త్వస్యావివక్షితత్వాద్గుణవచనేఽపి రసశబ్దే మతుపః ప్రాప్త్యభావాత్తేన వినైవ రసం ఫలమితి సామానాధికరణ్యం. తత్ర ఫలమిత్యుక్తే పానాసంభవో హేయాంశప్రసక్తిశ్చ భవేదితి తన్నివృత్త్యర్థం రసమిత్యుక్తం. రసమిత్యుక్తేఽపి గళితస్య రసస్య పాతుమశక్యత్వాత్ఫలమిత్యుక్తమితి ద్రష్టవ్యం. న చ భాగవతామృతపానం మోక్షేఽపి త్యాజ్యమిత్యాహ – ఆలయం. లయే మోక్షః అభివిధావాకారః. లయమభివ్యాప్య. న హీదం స్వర్గాది సుఖవన్ముక్తైరుపేక్ష్యతే. కిం తు సేవ్యత ఏవ వక్ష్యతి హి. శ్లో. "ఆత్మారామశ్చ మునయో నిర్గ్రంథా అప్యురుక్రమే। కుర్వన్త్యహైతుకీం భక్తిమిత్థం భూతగుణో హరిః" ఇతి.(3)

ఈ భాగవతము అన్ని శాస్త్రాల కంటే శ్రేష్ఠము వినదగినదే కాకుండా అన్ని శాస్త్రాలలో చెప్పిన ఫల స్వరూపమిది. కావున మిక్కిలి ఆదరణతో వినదగినది. వేదములనెడి కల్పవృక్షము నుండి జారిపడినది భాగవతమనెడి ఫలము. సర్వ పురుషార్థములను అనగా ధర్మార్థ కామ మోక్షాలను ఇచ్చేది. అది వైకుంఠమున ఉన్నది. నారదుని చేత తేబడి వ్యాసునికొసగబడినది. వ్యాసుని చేత శుకమహర్షికి బోధింపబడినది. అది ఆ శుకముఖము నుండి జారి భూమిమీదపడి అనేకమంది శిష్య ప్రశిష్యులకు పల్లవరూప పరంపరగా మెల్లగా అఖండితముగానే అవతరించినది. పైనుండి పడినందున పగలలేదని భావము. ఇది భవిష్యత్తైనా భూతకాలము చెప్పబడినది. ఇంకా భాగవతం రాకుండగానే అది చెప్పడంలో శ్రోతలకు భాగవత శాస్త్ర అధ్యయన ప్రవృత్తి కలుగును. కావున అమృతరసంతో కలిసి ఉన్నది అనడం వలన లోకంలో కూడా చిలుక కొరికిన పండు మిక్కిలి మధురముగా ఉండునని ప్రసిద్ధి కలదు. కావున ఇచట శుకుడు మహర్షి. అమృతం అనగా పరమానందము,

అదే రసము. పరమాత్మ రసస్వరూపుడు. 'రసోవై సః.....భవతి' అని శ్రుతి. అందువలన ఓ రసికులారా ! విశేషించి రసాస్వాదనా చతురులారా! ఈ భాగవత రసాన్ని మాటి మాటికి ఆస్వాదించండి. భువిగలితం అనడంతో, సులభంగా భూమిమీదపడి పొందలేని లాభము కలిగిందనడము. తొక్క, పీచు విడిచి రసాన్ని తాగుతారుకదా, ఫలమునే మొత్తము తినడమెలా? అని, రసమాలయం, రసస్వరూపము, అనగా తొక్కా, పీచు లేని రసైక స్వరూపమగునది. కావున ఈ ఫలాన్ని మొత్తం తాగండి అని అన్నారు. ఇక్కడ రసముతో తాదాత్మ్యము ఫలానికి చెప్పడం వలన రసము కలది అని చెప్పుచూ, రసము కలిగి ఉండడమే ముఖ్యముగా చెప్పబడినది. కావున గుణవచనమగు రసశబ్దమునందు అనకుండగనే ఫలం అని, సామానాధికరణ్యం చెప్పబడినది.( విశేషణము, విశేష్యములు ఏక విభక్తి వచనములు కలిగియుండుట సామానాధికరణ్యం అనబడును,) రసం ఫలం అంటే రసరూపమైన ఫలమని భావము. ఫలం అనడంతో దాన్ని తాగటం అసంభవం. అంతేకాక వదిలిపెట్టదగిన తొక్కా, పీచు ప్రసక్తిరాగలదు. కావున దాన్ని తొలగించుటకు రసం అని చెప్పబడినది. రసం అంటే కింద పడిపోయిన రసంకాదు అట్టి రసాన్ని తాగటం సాధ్యం కాదు. కావున ఫలం రసమని చెప్పబడినది. ఈ భాగవతామృత పానము మోక్షమునందు కూడా విడువతగినదికాదని 'ఆలయం' అని శ్లోకమున చెప్పబడినది. లయమనగా మోక్షము. ఆలయమనగా మోక్షమునందు కూడా అని భావము. ఆజ్ అను ఉపసర్గకు మర్యాదాభివిధులు రెండర్థాలు. ఇచట అభివిద్యర్థము. ఈ రసపానము స్వర్గాది సుఖాలవలె ముక్తులు వదులునది కాదు. ముక్తులు కూడా సేవింపదగినదని భావము.

ఈవిధముగా 'జన్మాద్యస్యాది' మూడు శ్లోకాలతో విశిష్టమగు ఇష్టదేవతా స్మరణ పూర్వకముగా, భాగవత శాస్త్రానికి విషయ ప్రయోజనాది అనుబంధములు చెప్పబడినవి. ఈ వైశిష్ట్యము చేత సుఖముగా ఇది సేవింపదగినది, కావున ఈ గ్రంథము ఆరంభించబడుచున్నది అని భావము. (3)

**4.శ్లో ॥ నైమిశేనిమిష క్షేత్రే ఋషయః శౌనకాదయః ।**

**సత్రం స్వర్గాయ లోకాయ సహస్ర సమమాసత ॥**

టీ :- తదేవమనేన శ్లోకత్రయేణ విశిష్టేష్టదేవతానుస్మరణపూర్వకం ప్రారిప్సితస్య శాస్త్రస్య విషయప్రయోజనాదివైశిష్ట్యేన సుఖసేవ్యత్వేన చ శ్రోతౄనభిముఖీకృత్యశాస్త్రమారభతే- నైమిశ ఇతి. బ్రహ్మణా విసృష్టస్య మనోమయస్య చక్రస్య నేమిః శీర్యతే కుంఠీభవతి యత్ర, తత్ నేమిశం, నేమిశమేవ నైమిశం. తథాచ వాయవీయే, శ్లో. 'ఏతన్మనోమయం చక్రం మయా యత్ర విసృజ్యతే, యత్రాస్య శీర్యతే నేమిః స దేశస్తపసశ్శుభః, ఇత్యుక్త్వా సూర్యసంకాశం చక్రం సృష్ట్వా మనోమయమ్. ప్రణిపత్య మహాదేవం విససర్జ పితామహః. తేఽపి హృష్టతమా విప్రాః ప్రణమ్య జగతాం ప్రభుమ్, ప్రయయుస్తస్య చక్రస్య యత్ర నేమిర్వ్యశీర్యత. తద్వనం తేన విఖ్యాతం నైమిశం మునిపూజితమ్'ఇతి. నైమిష ఇతి పాఠే వరాహపురాణోక్తం ద్రష్టవ్యం. తథాహి-గౌరముఖమృషిం ప్రతి భగవద్వాక్యం-శ్లో.'ఏవం కృత్వా తతో దేవో మునిం గౌరముఖం తథా, ఉవాచ నిమిషేణేదం నిహతం దానవం బలమ్". అరణ్యేఽస్మిం స్తతస్త్వేతన్నైమిషారణ్యసంజ్ఞితమ్. భవిష్యతి యథార్థం వై బ్రాహ్మణానాం విశేషకమ్' ఇతి అనిమిషః శ్రీవిష్ణుః. అలుప్తదృష్టిత్వాత్. తస్య క్షేత్రే. తథా చాస్మిన్నేవాధ్యాయే శౌనకాదివచనం-శ్లో.'క్షేత్రేఽస్మిన్ వైష్ణవే వయమ్' ఇతి. స్వః స్వర్గే గీయత ఇతి స్వర్గాయో హరిః, స ఏవ లోకః భక్తానాం నివాసస్థానం. తస్మై తత్ప్రాప్తయ ఇత్యర్థః.సహస్రం సమాః సంవత్సరాః అనుష్ఠానకాలో యస్య తత్ సత్రం సత్రసంజ్ఞికం. సత్రమాచ్ఛాదనే యజ్ఞే సదాదానే వనేఽపిచేత్యభిధానాత్. న. అసధాత్వర్థస్యావివక్షితత్వాత్. (4)

ఈ విధముగా మూడు శ్లోకాలతో విశిష్ట దేవతలను స్మరించి చెప్పబోవు భాగవత శాస్త్రమునకు విషయ ప్రయోజనాది అనుబంధములను తెలిపి ఇది, సుఖముగా వినదగినదని, శ్రోతలనభిముఖుల చేసి శాస్త్రాన్ని ఆరంభిస్తున్నారు. 'నైమిశే: నిమిశ క్షేత్రే' అని

( ప్రతి గ్రంథమునకు కూడా అనుబంధ చతుష్టయము చెప్పబడును అనగా విషయ, ప్రయోజన, సంబంధ, అధికారులు చెప్పబడుదురు ఇది సంప్రదాయము. ఈ భాగవతానికి భగవద్భక్తి, తద్ద్వారా జ్ఞాన, వైరాగ్యములను బోధించుట విషయము, చరమ పురుషార్థమైన మోక్షము ప్రయోజనము. ప్రతిపాద్య, ప్రతిపాదక భావము సంబంధము. మోక్షాన్ని పొందాలనుకున్న ముముక్షువు అధికారి. ) బ్రహ్మదేవునిచే విడువబడిన మనోమయ చక్రముయొక్క ఇనుపకమ్మి, ఇనుపపట్టా, ఎక్కడ ఊడిపడుతుందో ఆ స్థలము నిమిశము. నిమిశమే నైమిశం అవుతుంది. వ్యాకరణ రీత్యా స్వార్థమున 'అణ్' ప్రత్యయమని గుర్తించాలి. ద్వీతమ్ ఏవద్వైతమ్, వస్తుఏవ వాస్తవమ్ మనః ఏవ మానసమ్ అనునట్లు 'ఏతోన్మనోమయం చక్రం.... 'నైమిశ ఇతి పాఠే వరాహ పురాణోక్తం ద్రష్టవ్యం' అది ఎట్లనిన గౌరముఖ ఋషిని గురించి భగవద్వాక్యము. 'ఏవం కృత్వా తతో దేవో.......నిహతం దానవం బలం' అరణ్యేంస్తతః..... బ్రాహ్మణానాం విశేషకం' ' అనిమిశః శ్రీవిష్ణుః.... ' అనిమిశుడనగా విష్ణువు. ఆ క్షేత్రమునందు దృష్టి లోపించినవాడు. అట్టి పుణ్యక్షేత్రమున అని అర్థము. ఇచటనే శౌనకాది మునుల వచనము ప్రమాణము.

" క్షేత్రేస్మిన్వైష్ణవే......." "స్వః స్వర్గే గీయతే ఇతి " అతడి లోకము భక్తుల నివాస స్థానము దాని ప్రాప్తి కొరకని అర్థము. వేయి సంవత్సరాల కాలమానముగల సత్రము అను కర్మను ( యజ్ఞము) ఉద్దేశించి కూర్చొనిరి. లేదా 'ఆసత' అను దానికి చేసిరి అని అర్థము. ఆలభేత, నిర్వపతి, ఉపయన్తి అనువాటివలె ప్రత్యయోచ్చారణ మంత్రార్థముతో ఆస ధాత్వర్థము వివక్షితము కాదు. అనగా సత్రమునకు కూర్చొనిరి అనిగాక సత్రయాగము సంకల్పము చేసిరి అని చెప్పుకోవచ్చును. (4)

5. శ్లో ॥ త ఏకదా తు మునయః
ప్రాతర్హుత హుతాగ్నయః ।
సత్కృతం సూతమాసీనమ్
పప్రచ్ఛురిదమాదరాత్ ॥

టీ :- త ఇతి. ప్రాతః కాల్యే. హుతా ఏవ హుతాగ్నయో యైస్తే. అనేన నిత్యనైమిత్తికహోమసాకల్యం దర్శితమ్. ఇదం వక్ష్యమాణార్థం. ఆదరాత్పప్రచ్ఛుః. (5)

ఆ శౌనకాది మునులు, ఒక రోజు ప్రాతఃకాలమున, సాయంకాలమున కూడా అగ్నియందు హోమము గావించి, (హుతము అనగా దధి మొదలగు హోమద్రవ్యము. దానితో హోమము గావించిన అగ్నులును లేదా ప్రాతఃకాలమున హోమము గావించబడిన అగ్నులుగల మునులును నిత్య, నైమిత్తిక కర్మలను సంపూర్ణముగా ఆచరించి తమచే సత్కరింపబడి సుఖోపవిష్టుడగు సూత పౌరాణికుని గూర్చి ఆదరముగా ప్రశ్నించిరి. (5)

6. శ్లో ॥ త్వయా ఖలు పురాణాని
సేతిహాసాని చానఘ ।
ఆఖ్యాతాన్యప్యధీతాని
ధర్మశాస్త్రాణి యాన్యుత ॥

టీ :- వివిదిషితానర్థాన్ ప్రష్టుం సూతస్య సర్వశాస్త్రజ్ఞానాతిశయమాహుః త్వయేత్యాదిత్రిభిః శ్లోకైః. ఇతిహాసో మహాభారతాదిః పురాణాని. న కేవలమధీతాని అపితు. ఆఖ్యాతాని చ వ్యాఖ్యాతాని. ఉత అపిచ యాని ధర్మశాస్త్రాణి, తాన్యపి. (6)

తెలుసుకోదగిన విషయములను అడుగుటకు ముందు సూతపౌరాణికుడు సర్వశాస్త్ర జ్ఞానము కలవాడని ప్రశంసిస్తున్నారు. త్వయా అని మూడు శ్లోకములచేత. మీరు అనేక పురాణాలను, భారతేతిహాసమును అధ్యయనము చేయుటయేకాక వివరించి చెప్పితిరి. అంతేకాక ఎన్ని ధర్మశాస్త్రములు ఉన్నవో వాటినన్నిటిని కూడా చదివి ఇతరులకు వివరించితిరి. (6)

7. శ్లో ॥ యాని వేదవిదాం శ్రేష్ఠో
భగవాన్ బాదరాయణః ।
అన్యే చ మునయః సూత
పరావరవిదో విదుః ॥

టీ :- కించ, యానీత్యాది. విదాం విదుషాంమధ్యేశ్రేష్ఠః వ్యాసః,యాని వేద పరావరే. సగుణనిర్గుణే బ్రహ్మణీ. విదంతీతి తథా.(7)

అంతేకాకుండా ఓ సూతా ! విజ్ఞులలో శ్రేష్ఠుడగు వ్యాసముని ఏమి తెలుసుకున్నాడో, సగుణ నిర్గుణ పరబ్రహ్మను తెలుసుకొనిన ఇతరులగు మునులును ఏమి తెలుసుకున్నారో వాటన్నింటినీ మీరు తెలుసుకున్నారు.(7)

8. శ్లో ॥ వేత్థ త్వం సౌమ్య తత్సర్వం
తత్త్వ తస్తదనుగ్రహాత్ ।
బ్రూయుః స్నిగ్ధస్య శిష్యస్య
గురవో గుహ్యమప్యుత ॥

టీ :- వేత్థేతి. సౌమ్య హే సాధో. తేషామనుగ్రహాత్ తత్త్వతః వేత్థ. జానాసి. జ్ఞానే హేతుమాహ-బ్రూయురితి. స్నిగ్ధస్య ప్రేమవతః ఉత ఏవ. గుహ్యం రహస్యమపి బ్రూయురేవ. (8)

ఓ సూత, సాధూ ! వాటినన్నింటిని కూడ వ్యాసులవారి అనుగ్రహము వలన మీరు వివరముగా తెలుసుకున్నారు. గురువులు ప్రియ శిష్యునికి రహస్య విషయాలను కూడా వివరిస్తారు కదా ?(8)

9. శ్లో ॥ తత్ర తత్రాంజసాయుష్మన్
భవతా యద్వినిశ్చితమ్ ।
పుంసామేకాంతతః శ్రేయః
తన్నః శంసితుమర్హసి ॥

ఓ ఆయుష్మంతుడా ! ఆ గ్రంథాలను చక్కగా చూచి ఆ గ్రంథాలలో పురుషులకు జీవులకు కేవలము ఏది ముఖ్యముగా శ్రేయోదాయకమని మీరు నిశ్చయించితిరో దానిని మాకు చెప్పుటకు మీరే అర్హులు.(9)

టీ :- ఉతేతి అంజసా గ్రంథార్జవేన. ఏకాంతతః శ్రేయో౽వ్యభిచారి శ్రేయస్సాధనమ్. (9)

10.శ్లో ॥ ప్రాయేణాల్పాయుషః సౌమ్య
కలావస్మిన్ యుగే జనాః ।
మందాస్సుమందమతయో
మందభాగ్యా హ్యుపద్రుతాః ॥

టీ :- నను అన్యే౽పి భూయసా కాలేన బహుశాస్త్రశ్రవణాదిభిః వినిశ్చిన్వంతు. నేత్యాహుః - ప్రాయేణేతి. హే సభ్య సాధో, అస్మిన్ యుగేకలౌ అల్పాయుషో జనాః. తత్రాపి మందాః అలసాః. తత్రాపి, సుమందమతయః తత్రాపి, మందభాగ్యాః విఘ్నాకులాః. తత్రాప్యుపద్రుతాః రోగాదిభిః పీడితాః. (10)

11.శ్లో ॥ భూరీణి భూరి కర్మాణి
శ్రోతవ్యాని విభాగశః ।
అతః సాధో౽త్ర యత్సారమ్
సముద్ధృత్య మనీషయా ॥

ఇతరులు కూడా అనేక నాళ్ళు అనేక శాస్త్రములను విని, మానవులకు శ్రేయోదాయకమగు విషయాలను తెలుసుకోవచ్చు కదా అంటే సాధ్యంకాదు. ఓ సాధూ ! ఈ కలికాలమున జనులు అల్పాయుష్మంతులు, మందబుద్ధులు, జడులు. అంతేకాక దురదృష్టవంతులు, విఘ్నాలు, రోగబాధలచే పీడితులు.(10)

ఓ సాధూ ! అనేక శాస్త్రాలు విన్నంతనే ఫలసిద్ధి కలుగదు, అనేకములగు అనుష్ఠించవలసిన కర్మలుగల, వినదగిన, శాస్త్రములను విభజించి, బుద్ధిబలంతో వాటిలోని సారాన్నితీసి శ్రద్ధగల మాకు వినిపించినచో మా బుద్ధి ప్రసన్నమగును, చిత్తశుద్ధి కలుగును.(11)

టీ :- న చ బహుశాస్త్రశ్రవణేఽపి తావతీ ఫలసిద్ధిరిత్యాహ–భూరీణీతి సార్ధశ్లోకమేకం వాక్యం భూరీణి కర్మాణి అనుష్ఠేయాని యేషు తాని. సముద్ధృహ్య యథావదుద్ధృత్య.యేన ఉద్ధృతవిషయప్రవచనేన ఆత్మా బుద్ధిః సంప్రసీదతి సమ్యగుపశామ్యతి. (11)

12.శ్లో ॥ సూత జానాసి భద్రం తే
భగవాన్ సాత్త్వతాం పతిః ।
దేవక్యాం వసుదేవస్య
జాతో యస్య చికీర్షయా ॥

టీ :- ప్రశ్నాంతరం–సూత జానాసీతి పంచభిః. భద్రం త ఇత్యౌత్సుక్యేనాశీర్వాదః. (విస్తరేణాశీర్వాదవచనేన విష్ణుకథాభిఘాతో భవతీతి సంగ్రహేణోక్తం. తథాహి. శ్లో. 'సా హానిస్తన్మహచ్ఛిద్రం స మోహస్స విభ్రమః, యన్ముహూర్తం క్షణం వాపి వాసుదేవం న చింతయే' దితి వక్ష్యమాణత్వాత్.) భగవాన్, నిరతిశయైశ్వర్యాదిగుణయుక్తః. సాత్త్వతాం సచ్ఛబ్దేన స్వమూర్తిర్భగవాన్ అభిధీయతే. స ఉపాస్యతయా విద్యతే యేషామితి సత్త్వంతః భక్తాః స్వార్థేఽణ్. రాక్షసవాయసాది వత్.తస్యచాశ్రవణమార్షం. తదేవం సాత్త్వంత ఇతి భవతి.తేషాం పతిః పాలకః. యస్యార్థ విశేషస్య చికీర్షయా వసుదేవస్య భార్యాయాం దేవక్యాం జాతః (12)

శౌనకాది ఋషులు, తరువాతి ఐదు శ్లోకాలచేత సూతుడు చెప్పదగిన విషయాన్ని ప్రస్తావిస్తున్నారు. మీకు క్షేమము కలుగుగాక, మీరు బాగుందురుగాక, (అని ఉత్సుకతతో ఆశీర్వాదము పలికారు. ఆయన బాగుగా ఉంటేనే చెప్పగలడు కదా ! కావున సంగ్రహంగా ఆశీర్వాదం పలికారు. విస్తరించి పలికితే విష్ణుకథకు విఘాతం కలుగును. అది ఎట్లనిన మనుష్యుడు వాసుదేవుని చింతించని క్షణమే ఆతనికి హాని, అనర్థము, మోహము, భ్రాంతి కలుగును.) ఐశ్వర్యాది సమగ్ర గుణములు కలవాడు,భక్తపాలకుడగు భగవానుడు ఏ విశేషమైన పనులు చేయాలను ఇచ్ఛతో వసుదేవుని భార్యయగు దేవకియందు జన్మించెనో.

(ఇచట శ్రీధరులు సచ్ఛబ్దానికి సత్త్వమూర్తియగు భగవానుడు అనీ, అట్టివాడు ఉపాస్యుడుగా కలవారు సత్త్వంతులని. సత్త్వంతులే స్వార్థములో 'అణ్' ప్రత్యయము చేయగా రాక్షస వాయస శబ్దాలవలె సాత్త్వంతులని, భక్తులనే వారికి భగవానుడు పాలకుడని నిర్వచించారు.) (12)

13. శ్లో ॥ తన్నః శుశ్రూషమాణానా
మర్హస్యఙ్గానువర్ణితుమ్ ।
యస్యావతారో భూతానాం
క్షేమాయ చ భవాయ చ ॥

టీ :- అఙ్గ ! హే సూత తత్ నః అనువర్ణయితుమర్హసి, సామాన్య తస్తావత్. యస్యావతారో భూతానాం క్షేమాయ పాలనాయ. భవాయ సమృద్ధయే. (13)

ఓ సూతుడా ! ఏ కృష్ణుని యొక్క అవతారము సాధారణముగా ప్రాణులకు క్షేమము, సమృద్ధిని కలిగించునో అట్టిదానిని శ్రద్ధగా వినగోరు మాకు వర్ణించి చెప్పుటకు మీరే అర్హులు. (13)

14. శ్లో ॥ ఆపన్నః సంసృతిం ఘోరాం
యన్నామ వివశో గృణన్ ।
తతః సద్యో విముచ్యేత
యద్బిభేతి స్వయం భయమ్ ॥

టీ :- పునరపితత్ప్రభావమనువర్ణయంతః తద్యశః శ్రవణౌత్సుక్య మావిష్కుర్వంతి - ఆపన్న ఇతి. త్రిభిః. సంసృతిం ఆపన్నః ప్రాప్తః. వివశోఽపి భీతోఽపి గృణన్. తతః సంసృతేః. అత్ర హేతుః. యద్యతో నామ్నః. భయమపి స్వయమేవ బిభేతి. (14)

ఆ భగవంతుని ప్రభావాన్ని వర్ణిస్తూ అతని కీర్తిని విన్నవారికి ఇంకా వినవలెనని ఉత్సాహము కలుగునని, 'ఆపన్న' అని మొదలిడి మూడు శ్లోకాలతో శౌనకాదులు పలుకుచున్నారు. భయంకరమగు జనన మరణరూప సంసారాన్ని పొంది అవశులైకూడా జనులు ఎవరి నామాన్ని ఉచ్చరించితే వెంటనే ఆ సంసారం నుండి విడువబడుదురో, సంసారభయమే స్వయముగా ఎవరికి భయపడి తొలగిపోవునో, అతని చరితమును శౌనకాదులు చెప్పుమనుచున్నారు. పుట్టుటయే మానవునికి ఒక ఆపద "జన్మ దుఃఖం జరా దుఃఖం జాయా దుఃఖం పునః పునః" అందుకే మనుష్యుడు పుట్టగానే ఏడుస్తాడు. అట్టి జనన మరణరూప సంసారాన్ని తొలగించుటకు భగవన్నామమొక్కటే తరణోపాయము. నామస్మరణాదన్యోపాయం న హి పశ్యామో భవతరణే. అన్నారు కదా. (14)

15.శ్లో. యత్పాదసంశ్రయాస్సూత
మునయః ప్రశమాయనాః ।
సద్యః పునంత్యుపస్పృష్టా
స్వర్ధున్యాపోఽనుసేవయా ॥

టీ:- కించ యస్య పాదః సంశ్రయో యేషాంతే. అత ఏవ ప్రశమః అయనం వర్త్మ ఆశ్రయో వా యేషాం తే మునయః ఉపస్పృష్టాః సన్నిధిమాత్రేణ సేవితాః. సద్య పునంతి. స్వర్ధునీ గంగా తస్యా ఆపస్తు తత్పాదాన్నిస్సృతాః. న తు తత్రైవ తిష్ఠంతి. అతస్తత్సంబన్ధేన పునంత్యోఽపి అనుసేవయా పునంతి. న తు సద్య ఇతి మునీనా ముత్కర్షోక్తిః(15)

ఓ సూతమహర్షీ ! ఏ భగవంతుని పాదమును ఎల్లప్పుడు ఆశ్రయించినట్టి, మనోనిగ్రహము కలిగినట్టి, శాంతికి నిలయమైన మునులు, తమను స్పృశించిన వారిని, దగ్గర ఉండి సేవించిన వారిని కూడా వెంటనే పవిత్రులను చేయుదురు. ఆకాశ గంగోదకము విష్ణువు పాదముల నుండి వెలువడినదైనను మానవులు కొంతకాలము సేవించిననే పవిత్రులను చేయును. వెంటనే అనడంలో మునులు గంగకన్నా విశిష్టులని తెల్పబడినది. మునుముందు వ్యాసులవారు ఈ విషయాన్ని....

"న హ్యమ్మయాని తీర్థాని న దేవా మృచ్ఛిలామయాః
తే పునంత్యురుకాలేన దర్శనాదేవ సాధవః.

అని సాధువులను విశేషించి చెప్పుతారు. ఈ శ్లోకమున శ్లేష వ్యతిరేకాలంకారాల సంసృష్టి(15)

16.శ్లో ॥ కోవా భగవతస్తస్య
పుణ్యశ్లోకేద్యకర్మణః ।
శుద్ధికామో న శృణుయాద్
యశః కలిమలాపహమ్ ॥

టీ :- పుణ్యశ్లోకైరీడ్యానిస్తవ్యాని కర్మాణి యస్య తస్య.యశః కలిమలాపహం సంసారదుఃఖోపశమనమ్. (16)

మహాత్ములచేత స్తుతించబడు కర్మలుగల భగవంతుని కీర్తి, గాథలు విన్నవారి కలికాలపాపాన్ని తొలగించును. అనగా సంసార దుఃఖమును అణుచును. అట్టి వాటిని పవిత్రుడు కావాలని అనుకున్న వాడెవ్వడు వినకుండ ఉండగలడు? అనగా అందఱు విందురని భావము. (16)

17.శ్లో ॥ తస్య కర్మాణ్యుదారాణి
పరిగీతాని సూరిభిః ।
బ్రూహి నః శ్రద్ధధానానాం
లీలయా దధతః కలాః ॥

టీ :- ప్రశ్నాన్తరం – ఉదారాణి మహాంతి. విశ్వసృష్ట్యాదీని. సూరిభిః నారదాదిభిః. కలాః బ్రహ్మ రుద్రాదిమూర్తీః. (17)

మాయతో బ్రహ్మ, రుద్రుడు మొదలగు అవతారములను స్వీకరించు ఆ భగవంతుని సృష్టి మొదలగు గొప్పనైన కర్మలను, నారదాది విద్వాంసులచే ఎల్లప్పుడు గానము చేయబడు లీలాగాథలను గురించియు మిక్కిలి శ్రద్ధగల మాకు చెప్పుము.(17)

18.శ్లో ॥ అథాఽఽఖ్యాహి హరేర్ధీమన్
అవతార కథాః శుభాః ।
లీలా విదధతః స్వైర
మీశ్వరస్యాఽఽత్మమాయయా ॥

టీ :- అథేతి ప్రశ్నాంతరం–అవతారకథాః స్థిత్యర్థమేవ తత్తదవసరే యే మత్స్యాద్యవతారాః కృతాః తదాశ్రయాః కథాః. స్వైరం లీలాః కుర్వతః కృష్ణావతారప్రయోజనప్రశ్నేనైవ తచ్చరితప్రశ్నోఽపి జాత ఏవేతి జ్ఞాతవ్యమ్.(18).

। ఓ బుద్ధిమంతుడా ! భగవంతుని గొప్పనైన కర్మల గురించి వివరించిన తరువాత, తన మాయచే యథేచ్ఛగా అనేక లీలలను చేసే సర్వేశ్వరుడగు శ్రీమహావిష్ణువు యొక్క మిక్కిలి శుభకరమగు మత్స్య, కూర్మ, వరాహాది అవతార గాథలను చెప్పుము. శ్రీకృష్ణావతారముతో పాటు ఇతర గాథలను చెప్పుమని కూడా వారడిగిరని తెలుసుకొనవలెను.(18)

19. శ్లో. వయం తు న వితృప్యామః
ఉత్తమశ్లోకవిక్రమే ।
యచ్ఛృణ్వతాం రసజ్ఞానాం
స్వాదు స్వాదు పదే పదే ॥

టీ :- అత్సౌత్సుక్యేన పునరపి తచ్చరితాన్యేనశ్రోతుమిచ్ఛంతః స్తత్రాత్మనస్తృప్యభావమావేదయంతి-వయం త్వితి. యోగయాగాదిషు తృప్తాః స్మః. ఉద్గచ్ఛతి తమో యస్మాత్స ఉత్తమః. తథాభూతః శ్లోకో యశో యస్య తస్య విక్రమే తు విశేషేణ న వితృప్యామః అలమితి నమన్యామహే. తత్ర హేతుః యద్విక్రమం శృణ్వతాం యద్వా. అన్యేతృప్యంతు నామ, వయం తు నేతి తుశబ్దస్యాన్వయః. అయమర్థః , త్రేధాహ్యలం బుద్ధిర్భవతి. ఉదరాదిభరణేన వా, రసాజ్ఞానేన వా, స్వాదు విశేషాభావాద్వా. ఏతత్త్రయ ముత్తమశ్లోకే నాస్తీత్యాహ-తత్ర శృణ్వతా మిత్యనేన శ్రోత్రస్యాకాశత్వాన్న భరణమిత్యుక్తం. రసజ్ఞానా మిత్యనేన చ రసాజ్ఞానతః పశువత్తృప్తిర్నిరాకృతా. ఇక్షుభక్షణవద్ధ సాంతరాభావేన తృప్తిం నిరాకరోతి. పదేపదే ప్రతిక్షణం స్వాదునోఽపి స్వాదు. (19)

భగవంతుని పరాక్రమాది వైభవములను ప్రకటించు కథలను వానిలోని రసమును గ్రహించిన వారికి ప్రతి పదమునందును ఆనందమే ఏర్పడును. అటువంటి భగవంతుని వీర్యాతిశయములను ఎంత విన్నను మాకు చాలునని అనిపించుటలేదు. ఇక్కడ భగవత్కథలయందు ఔత్సుక్యము, వినుటయందు ఆసక్తికల మాకు తృప్తి లేదని ఋషులు పలుకుచున్నారు. యోగమునందు, యాగాదులయందు తృప్తి ఏర్పడెను కానీ, శ్రీకృష్ణ కథా శ్రవణము విషయంలో తృప్తి కలుగుటలేదు. ఆయన ఉత్తమశ్లోకుడు అనగా ఎవరి దర్శన, శ్రవణాదులచే తమోగుణము తొలగిపోవునో వారు ఉత్తములు. ఉత్తమమైన కీర్తికలవారు ఉత్తమశ్లోకులు. అనగా ఉత్తమశ్లోకుడు భగవానుడు. 'వయం తు' అనుచోట 'తు' శబ్దము ఋషులకు భగవత్కథా శ్రవణమున మిక్కిలి తృప్తి లేదని, ఇతరులకు తృప్తి కలిగితే కలగవచ్చు, మాకు మాత్రం తృప్తి కలుగలేదని భావము. సాధారణముగా 'చాలును' అను తృప్తి మూడు రకములుగా ఉండును. ఒకటి కడుపునిండినపుడు, రెండవది చెప్పినదానియందు రసానుభూతి కలుగకుండునపుడు, మూడవది మాధుర్యము తగ్గినపుడు. ఈ మూడును భగవంతుని విషయమున లేవు. చెవులు ఆకాశమునకు సంబంధించినవి కావున అవి నిండునను ప్రశ్నలేదు మేము రసజ్ఞులము కావున రసానుభూతి లేకపోవడమనునది లేదు. చెఱుకు

20. శ్లో ॥ కృతవాన్ కిల వీర్యాణి
సహ రామేణ కేశవః ।
అతిమర్త్యాని భగవాన్
గూఢః కపట మానుషః ॥

టీ :- అతః శ్రీకృష్ణచరితాని కథయేత్యాశయేనాహ - అతిమర్త్యాని మర్త్యానతి క్రాంతాని గోవర్ధనోద్ధరణాదీని మనుష్యేష్వసంభావితా నీత్యర్థః. (20)

21. శ్లో ॥ కలిమాగత మాజ్ఞాయ
క్షేత్రేఽస్మిన్ వైష్ణవే వయమ్ ।
ఆసీనా దీర్ఘసత్రేణ
కథాయాం సక్షణా హరేః ॥

టీ :- నను, యాజనాధ్యాపనాదివ్యగ్రాణాం కుత ఏతచ్ఛ్రవణావకాశః

రసమునందు వలె ఇతర రసానుభూతి లేకుండా వినువారికి మధుర రసానుభూతి మాత్రమే కలుగుచుండును. అని చెప్పబడినది. భగవత్కథలయందు మాధుర్యము తగ్గడమనునది కూడా లేదు. ప్రతి పదమునందు వినువారికి మధురాతి మధురమైన రుచి కలుగును. (19)

కపట మానవుడై రహస్యముగా ఉన్న మాధవుడు బలరామునితో సహా అమానుషమైన పరాక్రమ చర్యలను గావించెను. అట్టి వానిని మాకు వినిపించుము. ఇచట 'అతి మర్త్యాని' అనగా మానవ మాత్రులకు సాధ్యముగాని గోవర్ధనోద్ధారము మొదలైనవి. (20)

నిరంతరము హోమద్రవ్యములతో హోమము చేయుచు, వేదము పఠింపజేయుచు పనులలో నిమగ్నులైన వారికి భగవంతుని కథను విను అవకాశం ఎలా లభించును? అని ప్రశ్న వేసుకొని దీర్ఘసత్ర యాగము వలన ఆ అవకాశము లభించినదని ఋషులు తెలుపుచున్నారు. కలి యుగమునకు భయపడి మేము విష్ణుపదమును

స్యాదత్రాహ-కలిమితి. కలి మాగతం జ్ఞాత్వా తద్భియా విష్ణుపదం గంతుకామాః దీర్ఘసత్రేణ నిమిత్తేన అత్ర వైష్ణవే క్షేత్రే ఆసీనాః హరేః కథాయాం సక్షణాః లబ్ధావసరాః.(21)

22.శ్లో ॥ త్వం నస్సందర్శితో ధాత్రా
దుస్తరం నిస్తితీర్షతామ్ ।
కలిం సత్త్వహరం పుంసాం
కర్ణధార ఇవార్ణవమ్ ॥

టీ :- అస్మింశ్చ సమయే త్వద్దర్శనమీశ్వరేణైవ సంపాదితమిత్యభినందతి -త్వన్న ఇత్యాదినా. కలిం సంసారం నితరాం తరితుమిచ్ఛతాం. అర్ణవం తితీర్షతాం. కర్ణధారః. నావిక ఇవ. (22)

23.శ్లో ॥ బ్రూహి యోగేశ్వరే కృష్ణే
బ్రహ్మణ్యే ధర్మ వర్మణి ।
స్వాం కాష్ఠామధునోపేతే
ధర్మః కం శరణం గతః ॥

పొందగోరి వైష్ణవ క్షేత్రమునందు దీర్ఘసత్ర యాగము నిమిత్తము కూర్చొని ఉన్నాము. అందువలన భగవత్కథ వినే అవకాశము కలిగినది. శ్రద్ధాలువులమై ఉన్నాము అన్నారు మునులు.(21)

మానవులను శక్తిని, పవిత్రతను హరించు ఈ కలియుగ సమయమున దాటశక్యముగాని సంసారమనెడి దుఃఖసాగరమును నిశ్చయముగా దాటదలచిన మాకు సాక్షాత్తు ఆ భగవానుని యొక్క అనుగ్రహమున, సముద్రమును దాటదలచిన వానికి నావికుని లాగా మీ దర్శనము లభించినది. (22)

యోగములన్నింటికి ప్రభువు బ్రహ్మవేత్తలయందు ప్రీతికలవాడు ధర్మమును కవచమువలె కాపాడువాడునగు శ్రీకృష్ణుడు తన స్వ స్వరూపమును పొందిన తరువాత అనగా అవతారమును చాలించిన తరువాత ధర్మము ఎవరిని ఆశ్రయించెను? అని మరో ప్రశ్న ఇచట అడుగబడినది.(23)

టీ :- పునః ప్రశ్నాంతరం బ్రూహీతి. ధర్మస్య వర్మణి కవచవద్రక్షకే. స్వాం కాష్ఠాం మర్యాదాం స్వస్వరూపమిత్యర్థః. అస్య చోత్తరం. 'కృష్ణే స్వధామోపగతే ధర్మజ్ఞానాదిభిస్సహే'తి వక్ష్యమాణశ్లోకః.(23)

ఈ ప్రశ్నకు సమాధానము "కృష్ణే స్వధామోపగతే" అని మూడవ అధ్యాయము చివరలో 44వ శ్లోకంలో ఇవ్వబడినది.

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం సంహితాయాం ప్రథమేస్కంధే భావార్థదీపికాయాం ప్రథమోఽధ్యాయః**

**శ్రీమద్భాగవతము యొక్క ప్రథమస్కంధ ప్రథమాధ్యాయమునకు శ్రీధరీయవ్యాఖ్యానుసార ఆంధ్రానువాదము ముగిసినది.**

## ద్వితీయోధ్యాయః

**వ్యాస ఉవాచ.**

1. శ్లో. ఇతి సంప్రశ్నసంహృష్టో
విప్రాణాం రౌమహర్షణిః ।
ప్రతిపూజ్య వరస్తేషాం
ప్రవక్తుముపచక్రమే ॥

టీ :- శాస్త్రౌఘపారః శ్రీకృష్ణకృత్యం సృష్ట్యాదికేలయః, అవతారకథాః కృష్ణవృత్తయో ధర్మరక్షణమ్, తదేవం ప్రథమేఽధ్యాయే షట్ప్రశ్నా మునిభిః కృతాః. ద్వితీయేతూత్తరం సూతశ్చతుర్ణామాహతేష్వథ. ఇతీతి. విప్రాణాం ఇతిఏవంభూతైః. సమ్యక్ ప్రశ్నైః సమ్యక్తుష్టో రోమహర్షణస్య పుత్ర ఉగ్రశ్రవాః. సూతః తేషాం వచః ప్రతిపూజ్యసత్కృత్య. ప్రవక్తు ముపచక్రమే ఉపక్రాంతవాన్. (1)

**సూత ఉవాచ.**

2. శ్లో. యం ప్రవ్రజంతమనుపేతమపేతకృత్యమ్
ద్వైపాయనో విరహకాతర ఆజుహావ ।
పుత్రేతి తన్మయతయా తరవోఽభినేదుః
తం సర్వభూతహృదయం మునిమానతోఽస్మి ॥

## ద్వితీయాధ్యాయము.

**వ్యాసుడు చెప్పుచున్నాడు.**

ప్రథమాధ్యాయమున మహర్షులడిగిన ఆరు ప్రశ్నలలో నాలుగింటికి రెండవ అధ్యాయమున సమాధానములు చెప్పబడినవి. బ్రాహ్మణోత్తములగు శౌనకాది మహర్షులు అడిగిన మంచి ప్రశ్నలకు రోమహర్షణుని కుమారుడు ఉగ్రశ్రవసుడనే సూతుడు ఎంతయో సంతసించెను. వారి మాటలను అనగా అడిగిన ప్రశ్నలను అభినందించుచు సమాధానములు చెప్పుట ప్రారంభించుచున్నాడు. (1)

**సూతుడిట్లనెను.**

ప్రవచనమునకు ఉపక్రమించుటకు ముందు గురుదేవతా నమస్కారము చేయవలెను. గాన 'యం ప్రవ్రజంతం' అను మూడు శ్లోకములతో, గురు నమస్కారముతో ప్రారంభించుచున్నాడు. గురువు గారగు శుకమహర్షి యొక్క గొప్పదనమును ఆయన చరిత్ర చేతనే

టీ:- ప్రవచనస్యోపక్రమో నామ గురుదేవతయోర్నమస్కార ఇత్యభిప్రేత్యాహ - యమితిత్రిభిః. తత్రస్వగురోః శుకదేవస్యైశ్వర్యం తచ్చరితేనైవ ద్యోతయన్నాహ - యమితి. యం ప్రవ్రజంతం సర్వం సన్న్యస్య గచ్ఛంతం. అనుపేతం మాముపనయస్వేతి ఉపనయనార్థ మాచార్యసమీపమనుపపన్నం.(ఉపనయనకర్మణోఽప్యనర్హ వయస్కత్వా ద్విశేషతో బాల ఇత్యభిప్రాయః.) యద్వా, కేనాప్యనుపేతం అననుగతం ఏకాకినమిత్యర్థః. తత్ర హేతుః, అపేతకృత్యం కృత్యశూన్యం. నైష్ఠికత్వాత్ కర్మమార్గే అప్రవర్తమానమిత్యర్థః. ద్వైపాయనో వ్యాసః. విరహాత్కాతరో భీతస్సన్, పుత్రా ఇతి ప్లుతేనాజుహావ ఆహూతవాన్. దూరాదాహ్వానే (దూరాద్ధూతే చేతి సూత్రాత్ ) ప్లుతేన 'ప్లుతప్రగృహ్యా' ఇతి సూత్రేణ సంధ్యభావే ప్రాప్తే సంధిరార్షః. (యద్వా, పుత్రేతి ఆదిమగురువర్ణస్య, 'గురోరనృతోఽనం త్యస్యాప్యేకైకస్య ప్రాచా' మితి సూత్రేణ ప్లుత్వాంగీకారే నాత్ర సంధ్యభావశ్శంకనీయః.) తదా తన్మయతయా శుకరూపతయా. తరవోఽభినేదుఃప్రత్యుత్తరముక్తవంతః. పితుస్స్నేహాను బంధపరిహారాయ యో వృక్షరూపేణోత్తరం దత్తవానిత్యర్థః. తం మునిమానతోస్మి. తన్మయత్వోపపాదనాయ విశేషణం. సర్వభూత హృదయమితి సర్వభూతానాం హృత్ మనః. అయతే యోగబలేన ప్రవిశతీతి సర్వభూతహృదయః. తం. (2)

తెలియచేయుచున్నాడు. శుక మహర్షి ఆవిర్భవించినంతనే దృఢమగు వైరాగ్యం కలవాడై సమస్తమును వదలి వెడలుచుండెను. అట్టి శుకమహర్షి, ఉపనయనము గావింపుమని గురువును పొందలేదు ఎవని చేతను వెంబడింపబడకుండా ఒకే ఒక్కడుగా వెళ్ళుచుండెను శుకుని అట్టి ప్రవృత్తికి కారణము చెబుతున్నాడు అపేత కృత్యమని. అనగా నైష్ఠికుడు, జ్ఞాన నిష్ఠకలవాడు కాన చేయదగిన పని ఏదియును లేనట్టివాడు అట్టి శకుని అనగా కర్మమార్గమున ప్రవర్తింపని వానిని, తండ్రి ద్వైపాయనుడు వ్యాసుడు, కుమారుని యెడబాటు సహించలేక ఎలుగెత్తి పిలిచెను. దూరము నుండి పిలిచినప్పుడు ఆ శబ్దమునకు ప్లుతము వచ్చును. అచ్చునకు హ్రస్వ, దీర్ఘ , ప్లుతములని మూడు భేదములు. దీర్ఘమునకన్న ఒక మాత్ర ఎక్కువగలది ప్లుతము. ('దూరాద్ధూతే చ' అని పాణినీయ సూత్రము. పుత్రా+ ఇతి అనునపుడు గుణసంధి చేత పుత్రేతి యగును కాని ఇచట ప్లుతము గాన పుత్రా అనుదానికి గుణసంధి రాదు. 'ప్లుత ప్రగృహా అచినిత్యమ్' అని పాణినీయ సూత్రముచేత ప్రకృతి భావము వచ్చి పుత్రా ఇతి అనియే ఉండతగినది. కాని భాగవతము ఋషి ప్రోక్తము కావున సంధి ఆర్షము. అపుడు ఆ 'పుత్రా' అను శబ్దమును సర్వ వృక్షములలో ప్రతిధ్వనించినది. ఆ చెట్లే వ్యాసునికి జవాబు చెప్పెను. శుకుడు బ్రహ్మవేత్త, సర్వభూతమయుడు కావున అలా జరిగినది. ఇచట పితా - పుత్ర

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

3. శ్లో. యః స్వానుభావమఖిలశ్రుతిసారమేకమ్
అధ్యాత్మదీపమతితితీర్షతా తమోఽంధమ్ ।
సంసారిణాం కరుణయా హ పురాణగుహ్యం
తం వ్యాససూనుముపయామి గురుం మునీనామ్॥

టీ :- తత్కృపాళుతాం దర్శయన్నాహ - య ఇతి. అంధం గాఢం తమః సంసారాఖ్యం, అతితీర్షతాం అతితర్తుమిచ్ఛతాం. రేఫషకారయో ర్విశ్లేషణం ఛాందసం, పురాణానాం మధ్యే. గుహ్యకం గోప్యం. తత్ర హేతుత్వేన చత్వారి విశేషణాని - స్వః నిజః అసాధారణః. అనుభావః ప్రభావో యస్య తత్ స్వానుభావం. అఖిల శ్రుతీనాం సారం. ఏకమద్వితీయం అనుపమిత్యర్థః. ఆత్మానం కార్యకారణసంఘాత

సంబంధము వ్యాస - శుకులకు లేదని సూచించబడినది. అందుకే వృక్షరూపమున జ్ఞానియగు శుకుడు సమాధానము చెప్పెను. మాటాడలేదని తాత్పర్యము. దానికి కారణము తెలుపుచున్నాడు. సర్వభూత హృదయమని, ఈ విశేషణముతో శుకమహర్షి తన యోగబలముచేత అందరి మనస్సులను ప్రవేశించు శక్తిగలవాడని భావము. అట్టి శుకునికి నమస్కరించుచున్నానని సూతపౌరాణికుడు మొదట గురు నమస్కారము చేశాడు.(2)

జనన మరణరూప సంసారమను గొప్ప చీకటిని దాటగోరు సామాన్య మానవులకు దయతో శుకమహర్షి భాగవతమును చెప్పెను. ఇది చాలా గొప్పది. వేదసారముతో నిండియున్నది. దీనికి సాటి మరొకటి లేదు. మోక్ష సాధనమగు ఆత్మతత్త్వాన్ని చక్కగా వివరించునది. శుకుడు మహర్షులకే గురువు మరియు వ్యాససూనుడు అతనికి నమస్కరిస్తున్నానని శ్లోకార్థము. ఇచట శ్రీధరుడు ఈ శ్లోకమున శుకమహర్షి దయను వివరించుచున్నాడు. 'స్వానుభావమ్' అనగా తన యొక్క అసాధారణమైన ప్రభావమని అర్థము. 'అఖిల శ్రుతి సారమ్' అని రెండవ విశేషణము. ఏకమ్ అనగా 'అద్వితీయమ్' అనుట. అధ్యాత్మ దీపమనుట నాల్గవది. "ఆత్మానం కార్యకారణ సంఘాతమధికృత్య వర్తమానమధ్యాత్మమ్" కార్యకారణసంఘాతము

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

మధికృత్య వర్తమానం అధ్యాత్మం ఆత్మతత్త్వం తస్య దీపం సాక్షాత్ప్రకాశకం. ఉపయామి శరణం వ్రజామి. (3)

ఈ జగత్తు. దానిని ప్రకాశింప జేయునది ఆత్మ. కార్యమందు కారణమందునూ ఆత్మ ఉండుననునది అద్వైత ప్రక్రియ. ఆత్మవిభు పదార్థము బ్రహ్మయందు ప్రపంచమందునూ భాసించును. అట్టి ఆత్మను ప్రకాశింపచేయు దీపము భాగవతము. దానిని దయతో సంసారులకుపదేశించినాడు వ్యాసపుత్రుడు శుకుడు. 'తముపయామి' అట్టి వ్యాస భగవానుని కుమారుడు మునులకు గురువగు శుకుని శరణు పొందుచున్నాను, అని భావము.(3)

4. శ్లో. నారాయణం నమస్కృత్య
నరం చైవ నరోత్తమమ్ ।
దేవీం సరస్వతీం వ్యాసం
తతో జయముదీరయేత్ ॥

టీ :- ఏవం ద్వాభ్యాం గురుం నమస్కృత్య దేవం ప్రణమతి - నారాయణమితి. జయత్యనేన సంసారమితి జయో గ్రంథస్తం ఉదీరయేత్ ఇతి. స్వయం తథోదీరయన్నన్యాన్ పౌరాణికానుపశిక్షయతి (4)

నారాయణునకు నరోత్తముడైన నరునకు, లక్ష్మీదేవికి, వాగ్దేవియైన సరస్వతికి, వ్యాసునకు నమస్కరించి జయమను గ్రంథాన్ని ఆరంభిస్తున్నాను.'జయత్యనేన సంసారం' సంసారమును దీనిచే గెలువవచ్చును అను వ్యుత్పత్తిచేత భాగవతానికి జయమను పేరును ప్రతిపాదించాడు శ్రీధరుడు. ఉదీరయేత్' అనునది విధిలింజ్ ప్రథమైకవచన ప్రయోగము. తానేకాక పౌరాణికులందరూ ఇట్లు ప్రార్థించి పురాణారంభమును చేయవలెనని సూచించాడు.(4)

5. శ్లో. మునయః సాధు పృష్టోఽహం
భవద్భిర్లోకమంగలమ్ ।
యత్కృతః కృష్ణసంప్రశ్నో
యేనాత్మా సుప్రసీదతి ॥

టీ :- మునయ ఇతి. తేషాం వచః ప్రతిపూజ్యేతి యదుక్తం తత్ప్రతి పూజనం కరోతి. హే మునయః సాధు యథా భవతి తథా అహం పృష్టః. యతో లోకానాం మంగళమేతత్. యద్యతః, కృష్ణవిషయః సంప్రశ్నః కృతః సర్వశాస్త్రసారోద్ధారప్రశ్నస్యాపి కృష్ణే పర్యవసానాదేవ ముక్తమ్. (5)

మునుల ప్రశ్నను అభినందించినాడు సూతుడు, ఆ అభినందన ప్రకారము చెబుతున్నారు. ఓ మహామునులారా ! మీరు జగత్తునకు శుభప్రదమైన ప్రశ్నను అడిగితిరి. ఈ మీ ప్రశ్నతో నేను ధన్యుడను. మానవులకు శ్రేయస్సును సాధించు కృష్ణ చరితమును చెప్పుమన్నారు. ఈ ప్రశ్నతో మీరు నన్ను అనుగ్రహించారు. ఎందుకనగా కృష్ణకథ వినువారి, చెప్పేవారి మనస్సును ప్రసన్నము చేయును. ఇచట సమస్త శాస్త్రములకు సంబంధించిన ప్రశ్నలన్నియు కృష్ణపరమాత్మయందే పర్యవసానము నొందునని తెలుపబడినది.(5)

6. శ్లో. స వై పుంసాం పరో ధర్మో యతో భక్తిరధోక్షజే ।
అహైతుక్యప్రతిహతా యయాఽత్మా సుప్రసీదతి ॥

టీ :- తత్ర యత్ప్రథమం పృష్టం సర్వశాస్త్రసారమైకాంతికం శ్రేయోబ్రూహీతి తత్రోత్తరం. అయమర్థః. ధర్మో ద్వివిధః. ప్రవృత్తిలక్షణో నివృత్తి లక్షణశ్చేతి. తత్ర యః స్వర్గాద్యర్థః. ప్రవృత్తిలక్షణః సోఽపరః యతస్తు ధర్మాన్నివృత్తిలక్షణాచ్ఛ్రవణాదరాదిలక్షణా భక్తిర్భవతి స పరోధర్మః స ఏవైకాంతికం శ్రేయ ఇతి. కథంభూతా. అహైతుకీ హేతుః ఫలానుసంధానం తద్రహితా. అప్రతిహతా విఘ్నైరనభిభూతా. (6)

తదుపరి ధర్మాన్ని గురించి చెబుతున్నారు. ధర్మము రెండు రకాలు. ప్రవృత్తి ధర్మము, నివృత్తి ధర్మము. స్వర్గాదులను కోరునది ప్రవృత్తి ధర్మము. ఏ ధర్మముల చేత శ్రవణాదరాదుల వలన భక్తి కలుగునో అది పరమ ధర్మము. ఆ భక్తి నిర్హేతుకము, ఫలాభిసంధి లేనిది. అప్రతిహత విఘ్నాదులచే కొట్టబడనిది. కాన నివృత్తిరూప ధర్మము.(6)

7. శ్లో. వాసుదేవే భగవతి భక్తియోగః ప్రయోజితః ।
జనయత్యాశు వైరాగ్యమ్ జ్ఞానం చ యదహైతుకమ్ ॥

టీ :- నను, శ్రు.' తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి, యజ్ఞేన దానేన తపసాఽనాశకేన ' ఇత్యాది శ్రుతిభ్యో ధర్మస్య జ్ఞానాంగత్వం ప్రసిద్ధం. తత్కుతో భక్తిహేతుత్వముచ్యతే? సత్యం. తత్తు భక్తి ద్వారేణేత్యాహ - వాసుదేవ ఇతి. అహైతుకం శుష్కతర్కాద్యగోచరమౌపనిషదమిత్యర్థః. (7)

8. శ్లో. ధర్మః స్వనుష్ఠితః పుంసాం
విష్వక్సేన కథాసు యః ।
నోత్పాదయేద్యది రతిం
శ్రమ ఏవ హి కేవలమ్ ॥

టీ :- వ్యతిరేకమాహ - ధర్మ ఇతి. యో ధర్మ ఇతి ప్రసిద్ధః యది విష్వక్సేనకథాసు రతిం నోత్పాదయేత్, తర్హి స్వనిష్ఠితోఽపి సన్ అయం శ్రమో జ్ఞేయః. నను కథం మోక్షార్థస్యాపి ధర్మస్య శ్రమత్వమస్త్యేవ. అత ఆహ - కేవలం విఫలః శ్రమ ఇత్యర్థః. నన్వస్తి తత్రాపి స్వర్గాదిఫలమిత్యాశంక్య ఏవకారేణ నిరాకరోతి - క్షయిష్ణుత్వాన్న తత్ఫలమిత్యర్థః

'తమేవం వేదానువచనేన' అనుటతో యజ్ఞాదులచేత భగవంతుని తెలియవచ్చును కదా ధర్మము జ్ఞానాంగము కదా? మరి ధర్మము భక్తికి హేతువెట్లగును? అనుదానికి సమాధానము ధర్మము జ్ఞానాంగమనుట భక్తి ద్వారానే 'వాసుదేవే భగవతి' అను శ్లోకముతో ఈ విషయమునే చెప్పుచున్నారు. 'అహైతుకం జ్ఞానం?' అనగా శుష్కతర్కాదులకు గోచరము కానిది జ్ఞానమని అర్థము. 'నైషా తర్కేణ మతిరాపనేయా' అని కాఠకము. భగవంతునియందు భక్తి ఉంచినచో వైరాగ్యము, అహైతుక జ్ఞానమును కలుగును.(7)

ధర్మ ఇత్యాది శ్లోకమున వ్యతిరేకముఖముగా ధర్మ ప్రయోజనమును చెప్పుచున్నాడు. జ్ఞానము అనుదానికి వ్యతిరేక లక్షణముతో ఈ అర్థము నిరూపించుచున్నాడు. 'ధర్మఃస్వనుష్ఠితః' అని మోక్షార్థమైన ధర్మమున కూడా శ్రమయున్నది కదా ! అంటే నిజమే కాని భక్తిభిన్న ధర్మాచరణము కేవలము విఫలమై శ్రమ మాత్రమే అగును. భక్తితో స్వర్గాది ఫలాదులు రావచ్చును కదా ! అంటే అలా కాదని 'ఏవ' కారంతో తొలగిస్తున్నాడు. స్వర్గాదులు భక్తి ఫలాలు కావు. అవి నశించునవి. "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి" అని గీతా వచనము. దీనికి మరల బాధ కలదు. "అక్షయ్యగ్ం హ వై చాతుర్మాస్య యాజినః

నను. శ్రు. ' అక్షయగ్ హ వై చాతుర్మాస్యయాజినః సుకృతం భవతి' ఇత్యాది శ్రుతేర్న తత్ఫలస్య క్షయిష్ణుత్వమిత్యాశంక్య హి శబ్దేన సాధయతి. హి యస్మాత్. శ్రు. ' తద్యథేహ కర్మచితో లోకః క్షీయత ఏవమేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయత' ఇతి తర్కానుగృహీతయా శ్రుత్యా ఫలస్య క్షయిష్ణుత్వావగమాదితి హి శబ్దస్యార్థః. ఉక్తఫల ప్రతిపాదనాత్. (8)

9. శ్లో. ధర్మస్యహ్యాపవర్గ్యస్య
నార్థోర్థా౾యోపకల్పతే ।
నార్థస్య ధర్మైకాంతస్య
కామో లాభాయ హి స్మృతః ॥

టీ :- తదేవం హరిభక్తిద్వారా తదితరవైరాగ్యాత్మజ్ఞానపర్యంతః పరో ధర్మ ఇత్యుక్తం. అన్యే త్వేవం మన్యంతే. ధర్మస్య అర్థః ఫలం. తస్య చ కామః. తస్యచేంద్రియప్రీతిః. తత్ప్రీతేశ్చ పునరపి ధర్మార్థాది పరంపరేతి. యథాహుః. శ్లో. 'ధర్మాదర్థశ్చ కామశ్చ సకిమర్థం న సేవ్యత' ఇత్యాది. తన్నిరాకరోతి – ధర్మస్యేతి ద్వాభ్యాం. అపవర్గస్య ఉక్తన్యాయేనాపవర్గ పర్యంతస్య ధర్మస్య అర్థాయ ఫలత్వాయ. అర్థః నోపకల్పతే యోగ్యో న భవతీత్యర్థః. తథా ధర్మైకాన్తస్య ఏవం భూత ధర్మావ్యభిచారిణః. అర్థస్య కామో లాభాయ ఫలత్వాయ న హి స్మృతో మునిభిః.(9)

సుకృతం భవతి" అని. కాని అక్షయమంటే చిరస్థాయి మాత్రమే అని చెప్పాలి. లేనిచో "తద్యహ కర్మచితో లోకః క్షీయతే తథా; ముత్ర పుణ్యచితః స్వర్గః క్షీయతే" అను శ్రుతి నిరర్థకమగును.(8)

హరిభక్తితో విషయములందు విరక్తి కలుగును. అదియే పరమధర్మము. ఈ విషయమును మూడు శ్లోకాలతో వివరిస్తున్నాడు. కొందరన్నట్లు ధర్మమునకు ఫలము అర్థమని, అర్థమునకు ఫలము కామమని, కామఫలము ఇంద్రియ ప్రీతియని, ఇట్టి ఇంద్రియ ప్రీతికై మరల ధర్మము నాచరించుట పుట్టుట చచ్చుట జరుగును, అది కాదని తెల్పుతున్నాడు. "ధర్మాదర్థశ్చ కామశ్చ స కిమర్థం న సేవ్యతే" అని భారత సావిత్రి శ్లోకము కదా ! అంటే కాదని 'ధర్మస్య' అను రెండు శ్లోకాలచేత నిరాకరిస్తున్నాడు. ధర్మము వలన కలిగిన అర్థము అపవర్గఫలము వరకు ఉండదు, అది నశ్వరము. అర్థము క్షణికమైన ఇంద్రియ సుఖమును, కామమును కలిగించును. భోగావసానమున ఇంద్రియప్రీతి నశించును. కావున ఇవేవి శాశ్వతములు కావు. కావున భగవద్భక్తిరూప ధర్మానికి శాశ్వతానందరూపమగు అపవర్గమే ఫలము అదే మోక్షమని తాత్పర్యము. అట్లే అర్థమునకు ధర్మమే ముఖ్యఫలము కామముకాదు. (9)

10. శ్లో. కామస్య నేంద్రియ ప్రీతిః
లాభో జీవేత యావతా ।
జీవస్య తత్త్వజిజ్ఞాసా
నార్థో యశ్చేహ కర్మభిః ॥

టీ :- కామస్యేతి. కామస్య చ విషయభోగస్య ఇంద్రియ ప్రీతిర్లాభః ఫలం. న భవతి. కింతు యావతా జీవేత తావానేవ కామస్య లాభః ఫలం. న తు ఇంద్రియప్రీతిః. జీవనపర్యాప్త ఏవ కామః సేవ్య ఇత్యర్థః. జీవస్య జీవనస్య చ పునః కర్మానుష్ఠానద్వారా కర్మభిర్య ఇహ ప్రసిద్ధః సోఽర్థో న భవతి. కింతు తత్త్వజిజ్ఞాసైవేతి. (10)

విషయోపభోగమైన కామప్రయోజనము ఇంద్రియ ప్రీతి కాదు. ఇంద్రియములు కామోపభోగములతో తృప్తినొందవు. మరల మరల వానికై ప్రయత్నించును. "న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి." అని కదా ! కావున జీవించుటకావశ్యకమైన విషయోపభోగమే కామప్రయోజనము. జీవన ప్రయోజనము కర్మలాచరించి మరల మరల అర్థాదుల సంపాదించుట కాదు. దేనిని తెలుసుకొంటే మరల సంసార దుఃఖము కలుగదో ఆ పరతత్త్వము తెలియుటకు ఉపక్రమించెడు ప్రవృత్తి జీవన ప్రయోజనము.(10)

11. శ్లో. వదంతి తత్తత్త్వవిదః
తత్త్వం యద్ జ్ఞానమవ్యయమ్ ।
బ్రహ్మేతి పరమాత్మేతి ।
భగవానితి కథ్యతే ॥

టీ :- నను చ తత్త్వజిజ్ఞాసా నామ ధర్మజిజ్ఞాసైవ ధర్మఏవహి తత్త్వమితి కేచిత్. తత్రాహ వదంతీతి. తత్త్వవిదస్తు తదేవ తత్త్వం వదంతి. కిం తత్!యత్ జ్ఞానం నామ. అద్వయమితి. క్షణికవిజ్ఞానపక్షం వ్యావర్తయతి.

తత్త్వ జిజ్ఞాస అనగా ధర్మజిజ్ఞాసయే. ధర్మమును తెలియగోరుట అయితే ఆ ధర్మమే తత్త్వమని కొందరు అంటారుగదా? అనుదానికి చెపుతున్నాడు. తత్త్వవేత్తలు దానినే తత్త్వమంటారు, ఏమిటది? ఏది భేదరహితజ్ఞానమో అదే, అద్వయమని క్షణికవిజ్ఞానమాత్మ అను బౌద్ధమత పక్షాన్ని వారిస్తున్నాడు. అయితే తత్త్వవేత్తలు కూడా నింద్యవాక్కు కలవారే కదా అంటే కాదు. ఆ తత్త్వమునే మారుపేరుతో చెపుతారు. ఉపనిషద్వేత్తలు బ్రహ్మయని, హైరణ్యగర్భులు పరమాత్మయని, సాత్త్వతులు భగవానుడని అంటారు. (11)

నను తత్త్వవిదోఽపి విగీతవచనా ఏవ. మైవం. తస్యైవ తత్త్వస్య నామాంతరైరభిధానాదిత్యాహ – ఔపనిషద్రైర్బ్రహ్మేతి, హైరణ్యగర్భైః పరమాత్మేతి, సాత్వతైర్భగవానిత్యభిధీయతే.(11)

12.శ్లో. తత్ శ్రద్దధానా మునయో
జ్ఞానవైరాగ్యయుక్తయా ।
పశ్యంత్యాత్మని చాత్మానం
భక్త్యా శ్రుతగృహీతయా ॥

ఆ తత్త్వము సమగ్రమగు భక్తిచేత పొందబడునని చెపుతున్నాడు. 'తత్' అని. జ్ఞానము అనగా పరోక్షజ్ఞానము, దాని తత్త్వాన్ని క్షేత్రజ్ఞుడగు జీవునియందు చూడగలరు. దేనిని ? పరమాత్మను. వేదాంత శ్రవణముతో పొందిన భక్తిచేత అని భక్తికి పృథక్త్వము చెప్పబడినది. దృఢమైన జ్ఞానవైరాగ్యములుగల భక్తితో శ్రద్ధాలువులగు మునులు వేదాంత శ్రవణముతో జీవాత్మయందు పరమాత్మను చూస్తారు. 'తత్త్వమసి శ్వేతకేతో' అను మహావాక్యార్థము ఇచట ప్రతిపాదితము. జీవాత్మ పరమాత్మలకు అభేదము. (12)

టీ :- తచ్చ తత్త్వం సపరికరయా భక్త్యైవ ప్రాప్యత ఇత్యాహ – తదితి. తదిత్యవ్యయం. జ్ఞానవైరాగ్యయుక్తయేత్యత్ర, జ్ఞానం పరోక్షం తచ్చ తత్త్వమాత్మని క్షేత్రజ్ఞే పశ్యంతి. కిం తత్ ! ఆత్మానం పరమాత్మానం. శ్రుతేన వేదాంతాదిశ్రవణేన గృహీతయా ప్రాప్తయేతి భక్తేర్దార్ఢ్యముక్తం.(12)

13.శ్లో. అతః పుంభిర్ద్విజశ్రేష్ఠాః ।
వర్ణాశ్రమ విభాగశః ।
స్వనుష్ఠితస్య ధర్మస్య ।
సంసిద్ధిర్హరితోషణమ్ ॥

ధర్మానికి ఫలము భక్తియేకాని, అర్థకామాదులు కావని తెల్పి ముగించుచున్నాడు సూతుడు. కావున ఓ ఋషులారా ! వర్ణాశ్రమ వ్యవస్థానుసారముగా అనగా బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ యత్యాశ్రమాలు, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాది వర్ణాల యొక్క

టీ :- ధర్మస్య ఫలం భక్తిః నార్థకామాదికమితీమమర్థ ముపపాద్యో పసంహరతి – అత ఇతి. హే ద్విజశ్రేష్ఠాః హరితోషణం హరేరారాధనం. సంసిద్ధిః ఫలమ్. (13)

14. శ్లో. తస్మాదేకేన మనసా
భగవాన్ సాత్త్వతాం పతిః ।
శ్రోతవ్యః కీర్తితవ్యశ్చ
ధ్యేయః పూజ్యశ్చ నిత్యశః ॥

టీ :- యస్మాద్భక్తిహీనో ధర్మః కేవలం శ్రమ ఏవ. తస్మాత్ భక్తిప్రధాన ఏవ ధర్మః అనుష్ఠేయ ఇత్యాహ – తస్మాదితి, ఏకేన ఏకాగ్రేణ మనసా. (14)

15. శ్లో. యదనుధ్యాసినా యుక్తాః
కర్మగ్రంథినిబంధనమ్ ।
ఛిందంతి కోవిదాస్తస్య
కో న కుర్యాత్కథారతిమ్ ॥

టీ :- భక్తివిహీనో ధర్మః కేవలం శ్రమ ఏవేతి ప్రపంచితం. ఇదానీం తు భక్తేర్ముక్తిఫలత్వం ప్రపంచయతి – యదితి. యస్యానుధ్యా

వ్యవస్థను అనుసరించి ఏర్పడినవి. చక్కగా అనుష్ఠించబడిన ధర్మమునకు భగవానుని సంతోషపెట్టుట, ఆరాధించుటలే, సంసిద్ధి ఫలితములు. భక్తిహీనమగు ధర్మము, యాగాదులు కేవలం శ్రమతో కూడినవే కనుక భక్తి ప్రధానమగు ధర్మమే ఆచరణయోగ్యము. కావున ఏకాగ్రతతో శ్రీకృష్ణభగవానుని గురించి వినుట, కీర్తించుట, ధ్యానించుట, నిత్యము పూజించుట కర్తవ్యము. (13,14)

భక్తిహీనమగు ధర్మము కేవలము శ్రమయే యని చెప్పబడినది. ఇపుడు భక్తికి మోక్షఫలాన్ని తెలుపుతున్నాడు. వివేకవంతులగు విద్వాంసులు శ్రీకృష్ణుని ధ్యానమనెడి కత్తితో, కర్మయను తప్పుడు ముడిని కల్పించి గట్టిగా బంధించే అహంకారమును ఛేదించుచున్నారు. అట్టి స్థితిలో ఆయన కథలందు ఎవడు ప్రీతిని చేయకుండును? అందరూ ఆ భగవానుని సేవింతురని భావము. (15)

అనుధ్యానం. సైవ అసిః ఖడ్గః తేన యుక్తాః అప్రమత్తాః వివేకినః గ్రంథిమహంకారం నిబధ్నాతి యత్కర్మ తచ్ఛిందంతి. తస్య కథాయాం రతిం కో న కుర్యాత్. (15)

16. శ్లో. శుశ్రూషోః శ్రద్దధానస్య
వాసుదేవ కథారతిః ।
స్యాన్మహత్సేవయా విప్రాః
పుణ్యతీర్థనిషేవణాత్ ॥

భగవంతుని కథలయందాసక్తి కర్మలను నిర్మూలించునదే అయినా దాని యందు అభిలాష ఎందుకు కలుగుటలేదు? అనుదానికి 'శుశ్రూషోః' అని సమాధానం చెపుతున్నాడు. పవిత్రమగు తీర్థములను సేవించుటచే పాపములు తొలగును, పెద్దలను సేవించాలని ఇచ్ఛ కలుగును. దానితో ధర్మమునందు శ్రద్ధ, దానివలన భగవత్కథలను వినవలెనని కోరిక కలుగును. (16)

టీ :- నను, సత్యమేవం కర్మనిర్మూలినీ హరికథారతిః, తథాపి తస్యాం రుచిర్నోత్పద్యతే, కిం కుర్మస్తత్రాహ - శుశ్రూషోరితి. పుణ్యతీర్థనిషేవణాదిభిర్నిష్పాపస్య మహత్సేవా స్యాత్. తయా చ తద్ధర్మశ్రద్ధా, తతః శ్రవణేచ్ఛా, తతో రుచిస్స్యాదిత్యర్థః. (16)

17 శ్లో. శృణ్వతాం స్వకథాం కృష్ణః
పుణ్యశ్రవణకీర్తనః ।
హృద్యంతస్థో హ్యభద్రాణి
విధునోతి సుహృత్సతామ్ ॥

పవిత్రమగు భగవత్కథా శ్రవణము, కీర్తనముగల సజ్జనులకు హితముచేయు కృష్ణభగవానుడు తన కథలను వినువారి హృదయమున ఉన్న కామాది వాసనలను తొలగించును. అభద్రాణి అనగా కామాది వాసనలు. కామాది వాసనలు హృదయమున ఉన్నంత వరకు మోక్షము లభించదని సూచించారు. (17)

టీ :- తతశ్చ శృణ్వతామితి. పుణ్యే శ్రవణ కీర్తనే యస్య సః సతాం

సుహృత్ హితకారీ. హృది యాన్యచ్ఛిద్రాణి వాసనాః తాని. అంతస్థో హృదయస్థః సన్. విధునోతి (17)

18.శ్లో. నష్టప్రాయేష్వభద్రేషు
నిత్యం భాగవతసేవయా ।
భగవత్యుత్తమశ్లోకే
భక్తిర్భవతి నైష్ఠికీ ॥

టీ :- తతశ్చ నష్టేతి. సర్వాభద్రనాశస్య జ్ఞానోత్తరకాలీనత్వాత్ ప్రాయగ్రహణం. భాగవతానాం భాగవతశాస్త్రస్య వా సేవయా నైష్ఠికీ నిశ్చలా. విక్షేపకాభావాత్. (18)

భగవద్భక్తుల సేవవలన కామాది వాసనలు తొలుగగా ఆత్మజ్ఞానము, మోక్షహేతువుగా కలుగును. దానికి ముందు కామవాసనలు తొలగాలి, తరువాతనే జ్ఞానము లభించునని తెల్పుటకు ప్రాయః తరచుగా అను పదమును ప్రయోగించినారు వ్యాసులు. భాగవతసేవ అనుదానికి భక్తులను సేవించుట లేదా భాగవతమును వినుట అని, నైష్ఠికీ అనగా నిశ్చలమైన అని, నిత్యము భాగవతసేవ వలన అశుభవాసనలు ఇంచుమించు పూర్తిగా నశించగా పవిత్రమగు కీర్తిగల భగవానునియందు నిశ్చయముగా భక్తి కుదురునని భావము.(18)

19.శ్లో. తదా రజస్తమోభావాః
కామలోభాదయశ్చ యే ।
చేత ఏతైరనావిద్ధం
స్థితం సత్త్వే ప్రసీదతి ॥

టీ :- రజశ్చ తమశ్చ యేచ తత్ప్రభవా భావాః కామాదయః ఏతైరనావిద్ధం అనభిభూతం. ప్రసీదతి ఉపశ్యామతి(19)

అపుడు రజస్తమో గుణములచేత ఉదయించు కామక్రోధ లోభాదులచేత తిరస్కరించ బడిన మనస్సు సత్త్వగుణమునందే నిలిచి శమించును. భగవద్భక్తునికి రజస్తమో గుణాల భావాలు, కామక్రోధ లోభాదులు తొలగి కేవలము సత్త్వగుణమునందే మనస్సు నిలిచి ఇతరములు శమించునని భావము. (19)

20.శ్లో. ఏవం ప్రసన్నమనసో
భగవద్భక్తియోగతః ।
భగవత్తత్త్వవిజ్ఞానం
ముక్తసంగస్య జాయతే ॥

టీ :- ఏవమితి. భగవద్భక్తియోగతః ప్రసన్నమనసః అత ఏవ ముక్తసంగస్య. (20)

21.శ్లో. భిద్యతే హృదయగ్రంథిః
ఛిద్యంతే సర్వ సంశయాః ।
క్షీయంతే చాస్య కర్మాణి ।
దృష్ట ఏవాత్మనీశ్వరే ॥

టీ :- జ్ఞానేఫలమాహ - భిద్యత ఇతి. హృదయమేవ గ్రంథిః చిజ్జడ గ్రథనరూపోఽహంకారః. అత ఏవ సర్వే సంశయాః. అసంభావనాది రూపాః కర్మాణ్యనారబ్ధఫలాని. ఆత్మని స్వరూపభూతే ఈశ్వరే దృష్టే సాక్షాత్కృతే సతి. ఏవకారేణ జ్ఞానాంతరమేవేతి దర్శయతి. (21)

ఈ విధముగా భగవంతునియందు భక్తి కలిగియుండుట వలన మనస్సు నిర్మలమై సంగము దారా పుత్రాదుల లంపటము వదిలింపబడిన వానికి భగవంతుని తత్త్వవిజ్ఞానము కలుగును. మాలిన్యములేని అద్దమున ప్రతిబింబము స్వచ్ఛముగా కనిపించును, ఏ కోరికలు, వాని సాంగత్యము లేక నిర్మలమగు మనస్సున భగవత్తత్త్వము ప్రకాశించును. (20)

జ్ఞానానికి ఫలమేమనగా మనస్సున ఈశ్వరతత్త్వము, జ్ఞానము గోచరించగా నేను-నాది అను అహంకార- మమకారాలనే గ్రంథులు విడిపోవును. అన్ని సంశయాలు మోక్షము లభించునా లేదా అనే అనుమానాలు, సర్వకర్మలు, ఆగామి సంచితాలు అన్నియు నశించును. ఏవకారముచేత జ్ఞానము అభించిన వెంటనే అని అర్థము. (21)

22.శ్లో. అతో వై కవయో నిత్యం
భక్తిం పరమయా ముదా ।
వాసుదేవే భగవతి
కుర్వంత్యాత్మప్రసాదినీమ్ ॥

టీ :- అత్ర సదాచారం దర్శయన్నుపసంహరతి - అత ఇతి. ఆత్మనః ప్రసాదినీం మనశ్శోధినీం. వాసుదేవే భక్తిం కుర్వంతీతి భజనీయవిశేషో దర్శితః. (22)

కవులు, జ్ఞానులు కూడా పైన చెప్పబడిన కారణముచేతనే మహాసంతోషముతో భగవానుడగు వాసుదేవుని యందు మనస్సునుంచి ఆ మనస్సును శుభ్రపరచు భక్తిని కలిగి ఉందురు. (22)

23.శ్లో. సత్త్వం రజస్తమ ఇతి ప్రకృతేర్గుణాస్తైః ।
యుక్తః పరః పురుష ఏక ఇహాస్య ధత్తే ।
స్థిత్యాదయే హరివిరించి హరేతి సంజ్ఞాః
శ్రేయాంసి తత్ర ఖలు సత్త్వతనోర్నృణాం స్యుః ।

టీ :- తదేవోపపాదయితుం బ్రహ్మాదీనాం త్రయాణామేకాత్మకత్వేఽపి వాసుదేవస్యాఽధిక్యమాహ - సత్వమితి. ఇహ యద్యప్యేక ఏవ పరః పుమాన్. అస్య విశ్వస్య స్థిత్యాదయే స్థితిసృష్టిప్రలయార్థం హరివిరించి హరేతి సంజ్ఞాః కేవలం భిన్నా ధత్తే. హరివిరించిహరా ఇతి వక్తవ్యే సంధిరార్షః. తత్ర తేషాం మధ్యే శ్రేయాంసి శుభఫలాని సత్వతనోర్వాసుదేవాదేవ స్యుః. (23)

వాసుదేవుడే బ్రహ్మ విష్ణు మహేశ్వరులను పేర్లతో, సత్త్వరజస్తమో గుణాలతో సృష్టి, స్థితి, లయాదులను చేయును. ఆ ముగ్గురొకటేయైనను వాసుదేవునికి ఆధిక్యము. 'ఏకం సద్విప్రా బహుధా వదంతి' అని ఋగ్వేద శ్రుతి. కృష్ణభగవానుడు నిర్గుణుడు, పరబ్రహ్మ, అధికుడు. సత్త్వగుణ ప్రధానుడగు అట్టి వాసుదేవుని వలననే మానవులకు సర్వశ్రేయస్సులు, ఐహికాముష్మిక ఫలాలు చేకూరును. బ్రహ్మ సృష్టి చేస్తాడు, శంకరుడు లయం చేస్తాడు. కాని వాసుదేవుడు వారికి కావలసినవన్నీ ఇచ్చి పరిపాలిస్తాడు. 'హరివిరించిహరేతి' అనుచోట సంధి ఆర్షము.(23)

24.శ్లో. పార్థివాద్దారుణో ధూమః
తస్మాదగ్నిస్త్రయీమయః ।
తమసస్తు రజస్తస్మాత్
సత్త్వం యద్ బ్రహ్మదర్శనమ్ ॥

టీ :- ఉపాధివైశిష్ట్యేన ఫలవైశిష్ట్యం సదృష్టాంతమాహ - పార్థివాదితి. పార్థివాత్ స్వతః ప్రవృత్తిప్రకాశరహితాత్ దారుణః కాష్ఠాత్సకాశా ద్ధూమః. ప్రవృత్తిస్వభావః త్రయీమయః వేదోక్తకర్మ ప్రచురః ఈషత్కర్మ ప్రత్యాసత్తేః. తస్మాదప్యగ్నిస్త్రయీమయః సాక్షాత్కర్మసాధనత్వాత్. ఏవం లయాత్మకాత్ తమసస్సకాశాత్ రజః, తస్మాత్సత్త్వం బ్రహ్మదర్శనం బ్రహ్మప్రకాశకం. తు శబ్దేన లయాత్మకాత్త మసస్సకాశాద్రజసః సోపాధికజ్ఞానహేతుత్వేన కించిద్బ్రహ్మదర్శన ప్రత్యాసత్తి మాత్రముక్తం. నతు సర్వథా తత్ప్రకాశ కత్వం విక్షేపకత్వాత్. య యథోత్తరం వైశిష్ట్యమితి భావః.(24)

ఉపాధి యొక్క విశిష్టతను దృష్టాంతముతో తెల్పుతున్నాడు. మట్టి వికారమైన కఱ్ఱనుండి అనగా స్వయముగా ప్రకాశించే యోగ్యతలేనట్టి కఱ్ఱ నుండి ధూమము, ఆ తరువాత అగ్ని ఏర్పడును. ఇట్లే ముందు వేదోక్తములైన కర్మలు, కర్మల సంబంధముతో వాటిఫలము దాని వలననే వేదరూపమయినజ్ఞానము కలుగును, ఆ వేదము ప్రత్యక్షముగా కర్మలకు ఉపయోగించును. తమోగుణము వలన రజోగుణము ముందు ప్రకాశించును దానివలన సత్త్వము దానివలన బ్రహ్మ ప్రకాశించును. తు అను శబ్దమునకు ఐతే అని అర్థము లయాత్మకమగు తమస్సు వలన రజస్సు కలుగును. అది ఉపాధి సహిత జ్ఞానానికి కారణమైనందున కొంచెము సత్త్వరూప బ్రహ్మ దర్శనము కలుగునని మాత్రము చెప్పబడినది. విక్షేపశక్తి కూడా కలదైనందున తప్పకుండగా దానిని ప్రకాశింపచేయునని మాత్రము కాదు. ఏది సాక్షాత్తుగా బ్రహ్మ దర్శనమో అదియే సత్యము. శుద్ధసత్త్వము సగుణోపాధిగల బ్రహ్మాదులకు కూడా ఉత్తరోత్తర వైశిష్ట్యము చెప్పబడినది. తమోగుణ రూపమగు కఱ్ఱ వలన రజోగుణరూప ధూమము దాని వలన సత్త్వరూపమగు అగ్ని కలుగునట్లు తమోరజస్సహితమైన సత్త్వగుణము పరబ్రహ్మను క్రమముగా ప్రకాశింపచేయునని భావము. (24)

25.శ్లో. భేజిరే మునయోఽథాగ్రే
భగవంతమధోక్షజమ్ ।
సత్త్వం విశుద్ధం క్షేమాయ
కల్పంతే యేఽను తానిహ ॥

టీ :- వాసుదేవభక్తౌ పూర్వాచారం ప్రమాణయతి - భేజిర ఇతి. అథాతో హేతోః అగ్రే పురా విశుద్ధం సత్వం సత్వమూర్తిం భగవంతమధోక్షజం. అతో యే తాననువర్తంతే త ఇహ సంసారే క్షేమాయ కల్పంతే. (25)

వాసుదేవుని భక్తి విషయమున పూర్వాచారమును ప్రమాణముగా చూపుతున్నాడు' భేజిరే' అని. పూర్వము మహర్షులు శుద్ధసత్త్వ స్వరూపుడగు శ్రీమహావిష్ణువును సేవించిరి. ఎవరైతే వారిని అనుసరించెదరో వారుకూడా ఈ సంసారమున శుభాన్ని పొందెదరు.(25)

26.శ్లో. ముముక్షవో ఘోరరూపాన్
హిత్వా భూతపతీనథ ।
నారాయణకలాశ్శాంతాః
భజంతే హ్యనసూయవః ॥

టీ :- నన్వన్యానపి కేచిద్భజంతో దృశ్యంతే. సత్యం. ముముక్షవస్తు అన్యాన్ రాజసతామసాన్ నభజంతే కింతు సకామా ఏవేత్యాహ - ద్వాభ్యాం ముముక్షవ ఇతి. భూతపతీనితి పితృప్రజేశాదీనాముపలక్షణం అనసూయవః దేవతాంతరానిందకాస్సంతః.(26)

ఇతరులను కూడా కొందరు సేవించుచున్నారు కదా అంటే సత్యమే వారు మోక్షేచ్ఛగల వారుకారు. వారు ఐహిక భోగముల నాశించే వారే అని 'ముముక్షవ' అని మొదలిడి రెండు శ్లోకములతో వివరించుచున్నారు. 'భూతపతీన్' అను శబ్దముచే పితృ ప్రజేశాదులకు గ్రహణము. 'అనసూయవః' అనగా అసూయలేనివారు సత్త్వముగల మోక్షమును కోరువారు ఇతర దేవతా రూపములను నిందించక పోయినను భయంకరుల భూతనాథులను విడిచి శాంతముకలవారై నారాయణుని, ఆతని అంశావతారములను సేవింతురు. (26)

27.శ్లో. రజస్తమఃప్రకృతయః
సమశీలా భజంతి వై ।
పితృభూతప్రజేశాదీన్
శ్రియైశ్వర్యప్రజేప్సవః ॥

టీ :- రజస్తమసీ ప్రకృతిః స్వభావో యేషాంతే. అత ఏవ పితృ భూతాదిభిః సమం శీలం యేషాంతే. శ్రియా సహ ఐశ్వర్యం ప్రజాశ్చేప్సంతీతి తథాతే. (27)

రజస్తమ ప్రకృతి స్వభావము కలవారు పితృభూతాదులతో సమస్వభావము కలవారు, సంపదను, అధికారమును, సంతానమును కోరుచూ పితరులను, భూతములను, ప్రజాపతులను మొదలగు వారిని ఆదరించెదరు. (27)

28.శ్లో. వాసుదేవపరా వేదాః ।
వాసుదేవపరా మఖాః ।
వాసుదేవపరా యోగాః ।
వాసుదేవపరాః క్రియాః ॥

టీ :- అతో మోక్షప్రదత్వాద్వాసుదేవో భజనీయ ఇత్యుక్తం. సర్వశాస్త్ర తాత్పర్యగోచరత్వాదపీత్యాహ - ద్వాభ్యాం. వాసుదేవేతి. వాసుదేవ ఏవ పరః తాత్పర్యగోచరో యేషాం తే. నను వేదామఖపరా దృశ్యంత ఇత్యాశంక్య తేఽపి తదారాధనత్వాత్తత్పరా ఏవేత్యుక్తం. యోగాః యోగ శాస్త్రాణి. తేషామప్యాసన ప్రాణాయామాది క్రియాపరత్వమాశంక్య, తాసామపి తత్ప్రాప్త్యుపాయ త్వాత్తత్పరత్వముక్తమ్ (28)

ఎవరికైనా మోక్షాన్ని ఇచ్చేవాడు వాసుదేవుడు కావున అతడే భజించతగినవాడు. 'మోక్ష మిచ్ఛేజ్జనార్దనాత్' అని సూక్తి. సమస్త శాస్త్రములకు గోచరించువాడు వాసుదేవుడైనందున, అతడే సేవించ దగినవాడని పై రెండు శ్లోకాలతో చెపుతున్నారు సూతులవారు. సమస్త వేదములు వాసుదేవునే చెపుతున్నవి. సమస్త యజ్ఞములు వాసుదేవునికే చెందుచున్నవి. "యజ్ఞోవై విష్ణుః" అనికదా సమస్త యోగాలు వాసుదేవ పరములే, సమస్త క్రియలు అతనికి సంబంధించినవే.(28)

29.శ్లో. వాసుదేవపరం జ్ఞానమ్
వాసుదేవపరం తపః ।
వాసుదేవపరో ధర్మో
వాసుదేవపరా గతిః ॥

టీ :- వాసుదేవేతి. జ్ఞానం జ్ఞానశాస్త్రం. ననుచ తదపి జ్ఞానపరమేవేత్యాశంక్య జ్ఞానస్యాపి తత్పరత్వముక్తం. తపోఽత్ర జ్ఞానం. ధర్మో ధర్మశాస్త్రం. దానవ్రతాదివిషయం. నను తత్స్వర్గాదిఫలపర మిత్యాశంక్య గమ్యత ఇతి గతిః స్వర్గాదిఫలం. సాపి తదానందాంశ రూపత్వాత్తత్పరైవేత్యుక్తం.యద్వా వేదా ఇత్యనేనైవ తన్మూలత్వాత్సర్వాణ్యపి శాస్త్రాణి వాసుదేవపరాణీత్యుక్తం. అత్ర నను తేషాం మఖయోగక్రియానానర్థ పరత్వాన్న తదేకపరత్వమిత్యాశంక్య మఖాదీనామపి తత్పరత్వముక్తమితి ద్రష్టవ్యం. (29)

జ్ఞానశాస్త్రము జ్ఞానాన్ని చెప్పునుగదా భగవంతునేల చెప్పును, అంటారేమోనని జ్ఞానము కూడా భగవత్పరమేననుచున్నాడు. జ్ఞానం కలవారు కూడా భగంతుని ఆశ్రయించి మోక్షమునొందుదురు. తపస్సు వాసుదేవపరమే. దానవ్రతాదులను తెల్పు ధర్మశాస్త్రము భగవత్పరమే. ధర్మమనగా యాగాదులు స్వర్గపరములు కదా అంటే కాదు స్వర్గాది ఫలము గత్యర్థము, అది వాసుదేవపరమే, ఆయన ఆనందాంశమే. కావున ఆయన సేవే. లేదా వేదాః అనగానే అవి అన్నిటికి మూలములు కావున అన్నియును వాసుదేవ పరములే. వేదాలు యజ్ఞాది పరములే కదా అంటే ఆ యజ్ఞ యాగాది క్రియలన్నియును వాసుదేవపరములే అని వివరించారు.(29)

30.శ్లో. స ఏవేదం ససర్జాదౌ
భగవానాత్మమాయయా ।
సదసద్రూపయా చాసౌ
గుణమయ్యాఽగుణో విభుః ॥

జగత్తును సృష్టించుట, దానిలో ప్రవేశించుట, దాన్ని నియమించుట అను వానియందు శాస్త్రసమన్వయము కనిపించుచున్నది. అన్నీ వాసుదేవపరములెలా అవుతాయి? అంటే అవన్నీ చేసేది ఆ వాసుదేవుడే అని నాలుగు శ్లోకాలతో వివరిస్తున్నాడు. ఈ శ్లోకాలతోనే ఆయన 'ఉదార కర్మలను చెప్పండి' అని అడిగిన ఋషుల ప్రశ్నలకు

టీ :- నను జగత్సర్గతత్ప్రవేశనియమనాదిలీలాయుక్తే వస్తుని సర్వశాస్త్రసమన్వయో దృశ్యతే. కథం వాసుదేవపరత్వం సర్వశాస్త్రస్య? తత్రాహ - స ఏవేతి చతుర్భిః. ఏతైరేవ శ్లోకైః తస్య కర్మాణ్యుదారాణి బ్రూహీతి ప్రశ్నస్యోత్తరముక్తం. సదసద్రూపయా కార్మకారణాత్మికయా. అగుణశ్చేత్యన్వయః స్వతో నిర్గుణోఽపి సన్నిత్యర్థః. (30)

31.శ్లో. తథా విలసితేష్వేషు
గుణేషు గుణవానివ ।
అంతః ప్రవిష్ట ఆభాతి
విజ్ఞానేన విజృంభితః ॥

టీ :- భగవతో జగత్కారణ త్వముక్తం. అనుప్రవేశనియమనలక్షణాం లీలామాహ - తయేతి. విలసితేషు ఉద్భూతేషు. గుణేషు ఆకాశాదిషు. అంతః ప్రవిష్టస్సన్ గుణవానివ మదధీనా ఏతే గుణా ఇత్యభిమానవానివ. న తు వస్తుతస్తథా. యతో విజ్ఞానేన చిచ్ఛక్త్యా విజృంభితోత్యూర్జితః (31)

ఉత్తరము కూడా చెప్పబడుచున్నది. భగవంతుడు కార్యకారణ రూపమగు తన మాయచేతనే త్రిగుణాత్మకతచేతనే, ప్రభుతచేతనే నిర్గుణుడయ్యును ఈ ప్రపంచాన్ని సృష్టించెను.(30)

ఈ జగత్తునకు భగవానుడే కారణమని చెప్పబడినది. ప్రవేశనియమలక్షణ భగవల్లీలను 'విలసితేషు' అని చెపుతున్నాడు. ఉద్భవించిన ఆకాశాది గుణములందు తాను ప్రవేశించి గుణవంతుని లాగ, ఈ గుణాలు తన అధీనములేనను అభిమానివలెను, యథార్థముగా కావనియు వస్తుతః జ్ఞానశక్తిచే విజృంభించిన భగవానుడు ఆ విధముగా కనిపించుచున్నాడని అర్థము. (31)

32. శ్లో. యథా వ్యవహితో వహ్నిః
దారుష్వేకః స్వయోనిషు ।
నానేవ భాతి విశ్వాత్మా
భూతేషు చ తథా పుమాన్ ॥

టీ :- బహురూపత్వలీలామాహ - యథేతి. స్వయోనిషు స్వాభివ్యంజకేషు. అవహితః. విశ్వాత్మా పుమాన్. పరమేశ్వరః. భూతేషు ప్రాణిషు అంతర్యామిణోఽపి ప్రతియోనినానాత్వేన నానాత్వమివోచ్యతే. క్షేత్రజ్ఞరూపేణ వా. (32)

33. శ్లో. అసౌ గుణమయైర్భావైః
భూతసూక్ష్మేంద్రియాత్మభిః ।
స్వనిర్మితేషు నిర్విష్టో
భుఙ్క్తే భూతేషు తద్గుణాన్ ॥

టీ :- భోగరూపాం లీలామాహ - అసావితి. అసౌ హరిః భూతసూక్ష్మాణి చ ఇంద్రియాణి చ ఆత్మా మనశ్చ తైః స్వయం నిర్మితేషు భూతేషు చతుర్విధేష్వితి భోగే స్వాతంత్ర్యం ద్యోత్యతే. తద్గుణాన్ తత్తదనురూపాన్విషయాన్ ఇచ్ఛయా భుఙ్క్తే. భోజయతీతి ణిచో లోపో జ్ఞేయః. పాలయతీతి వా. తదా త్వాత్మనేపదమార్షం. భుజోఽనవన ఇతి స్మరణాత్. (33)

అనేక రూపములగు లీలలను చెపుతున్నాడు. 'యథా' అని. తనకు కారణమైన అనగా తనను ప్రకాశింపచేయు కట్టెలయందు వేరువేరుగా కనిపించినట్లు సర్వాంతర్యామియగు పరమాత్మ సమస్తభూతములందును అంతర్యామిగా నొకడేయైనను వేరువేరుగా కనిపించును. అంతర్యామిగా నొక్కడేయైనను ప్రతివానియందు వేరువేరుగా భాసించి అనేకులుగా కనిపించినట్లు పరమాత్మకు నానాత్వము క్షేత్రజ్ఞరూపంలో జీవాత్మగా ఉండుట ఇచట చెప్పబడినది. (32)

భోగమును అనగా అనుభవరూప లీలను 'అసౌ' అని మొదలిడి చెపుతున్నాడు. ఈ మహావిష్ణువు భూతసూక్ష్మములు, ఆకాశాదులు, ఇంద్రియాదులు,(చక్షురాదులు) మనస్సు అను వాటియందు, స్వయముగా నిర్మించిన చతుర్విధములైన స్వేదజోద్భిజ్జాండజ జరాయుజాలయందు ప్రవేశించి ఆయా గుణాలను శబ్ద స్పర్శాది విషయాలను అనుభవిస్తున్నాడు. ఇచట 'భుంక్తే ' అను ఆత్మనే పద ధాతువు ప్రయోగింపబడుట ఆర్షము.(33)

34. శ్లో. భావయత్యేష సత్త్వేన
లోకాన్ వై లోకభావనః ।
లీలావతారానురతో ।
దేవతిర్యఙ్నరాదిషు ॥

టీ :- ఇదానీం తు సూత జానాసీతి ప్రశ్నస్యోత్తరమాహ- భావయతీతి. భావయతి పాలయతి. ఏతత్తు సర్వావతారసాధారణం ప్రయోజనం. విశేషతః కృష్ణావతారస్య కుంతీస్తుతౌ వక్ష్యతే. లోకభావనః లోకకర్తా. దేవాదిషు యే లీలావతారాస్తేష్వనురతః అనురక్తః. (34)

ఇపుడు 'సూత జానాసి' అను ప్రశ్నకు సమాధానము చెపుతున్నాడు. అన్ని భగవదవతారాలకు పరిపాలించుట అనునది సాధారణము. ముఖ్యముగా కృష్ణావతారమునకు శిష్టరక్షణమే కర్తవ్యమయ్యున్నది. ఈ విషయము కుంతీ స్తుతియందు స్పష్టమగును. లోకకర్తయగు కృష్ణుడు దేవతలు, తిర్యగ్ జంతువులు, మానవులు మొదలగు వానియందు లీలావతారాలను ధరించి సత్త్వ గుణముతో లోకాలను కాపాడుచున్నాడు. (34)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం సంహితాయాం ప్రథమేస్కంధే భావార్థదీపికాయాం ద్వితీయోధ్యాయః**

**శ్రీమద్భాగవతము యొక్క ప్రథమస్కంధ ద్వితీయాధ్యాయమునకు శ్రీధరీయవ్యాఖ్యానుసార ఆంధ్రానువాదము ముగిసినది.**

## తృతీయోఽధ్యాయః

**సూత ఉవాచ.**

1. శ్లో. జగృహే పౌరుషం రూపం
భగవాన్మహదాదిభిః ।
సంభూతం షోడశకల
మాదౌ లోకసిసృక్షయా ॥

టీ :- శ్లో. అవతార కథా ప్రశ్నే తృతీయే తూత్తరాభిధా
పురుషాద్యవతారోక్త్యా తత్తచ్చారిత్రవర్ణనైః ॥

యదుక్తం 'అథాఖ్యాహి హరేర్ధీమన్నవతారకథాశ్శుభా' ఇతి. తదుత్తరత్వేన నానావతార కథా మనుక్రమిష్యన్ ప్రథమం పురుషావతారమాహ – జగృహ ఇతి పంచభిః. మహదాదిభిః మహదహంకార పంచతన్మాత్రైః. సంభూతం సునిష్పన్నం. ఏకాదశేంద్రియాణి పంచమహాభూతానీతి షోడశకలా అంశా యస్మిన్ తత్. యద్యపి భగవద్విగ్రహో నైవంభూతః, తథాపి విరాట్ దేహాంతర్యామిణో భగవతో విరాడ్రూపేణోపాసనార్థమేవముక్తమితి ద్రష్టవ్యం. (1)

## తృతీయాధ్యాయము

**సూతుడు చెపుతున్నాడు.**

భగవంతుని అవతార కథలను చెప్పుమని అడిగిన ఋషుల ప్రశ్నకు 'జగృహే పౌరుషం రూపం' అని ప్రారంభించి ఐదు శ్లోకములతో సమాధానము చెప్పబడుచున్నది. లోకాలను సృష్టించే ఇచ్ఛ చేత భగవంతుడు మొదట మహత్తత్త్వాదులచే ఏర్పడిన షోడశ కలాత్మకమైన పురుషరూపమును, గైకొనినాడు. మొదట పురుషావతారము, ఇది మహత్తత్త్వ, అహంకార, శబ్ద, స్పర్శ, రూప,రస, గంధ పంచతన్మాత్రల కలయికల వలన ఏర్పడినది. ఏకాదశేంద్రియాలు, త్వక్చక్షుశ్రోత్ర జిహ్వాఘ్రాణ వాక్పాణి పాద పాయూపస్థలు, మనస్సు మరియు పంచమహాభూతములు కలిసిన షోడశ కలల పూర్ణపురుష రూపము. అంశరూపము మహదహంకార పంచతన్మాత్రలచే ఏర్పడినది. భగవంతుని విగ్రహము ఇలాంటిది కాకున్నను విరాట్పురుషాంతర్యామి యగు భగవంతుని ఉపాసించుటకు అటువంటి విరాట్పురుష రూపధారి భగవానుడని చెప్పబడినది. (1)

2. శ్లో. యస్యాంభసి శయానస్య
యోగనిద్రాం వితన్వతః ।
నాభిహ్రదంబుజాదాసీత్
బ్రహ్మా విశ్వ సృజాం పతిః ॥

టీ :- కోఽసౌ భగవానిత్యపేక్షాయాం తం విశినష్టి - యస్యేతి. యస్య అంభస్యేకార్ణవే శయానస్య విశ్రాంతస్య. తత్ర చ యోగః సమాధిః తద్రూపాం నిద్రాం విస్తారయతః. నాభిరేవ హ్రదః తస్మిన్ యదంబుజం తస్మాత్సకాశాత్ బ్రహ్మాసీత్ అభూత్ పాద్మే కల్పే. స పౌరుషం రూపం జగృహే. (2)

మొదట ఒకే ఒక ఏ సముద్రముండెనో దాని నీటియందు యోగనిద్రను సమాధిని పొందియున్న భగవంతుని నాభియను సరస్సున పుట్టిన కమలము నుండి లోకాలను సృజించు ప్రజాపతులకు అధిపతియగు బ్రహ్మ ఆవిర్భవించెను. ఇది పాద్మకల్పమున ఏర్పడిన రూపము. (2)

3. శ్లో. యస్యావయవ సంస్థానైః
కల్పితో లోకవిస్తరః ।
తద్వై భగవతో రూపం
విశుద్ధం సత్త్వమూర్జితమ్ ॥

టీ :- కీదృశం రూపం తదాహ - యస్యేతి. నను కీదృశో విగ్రహః తస్య ? యోంభసి శేతే స్మ తదేవాహ - తత్తస్య భగవతో రూపం తు విశుద్ధం రజాద్యసంభిన్నం అతఏవోర్జితం నిరతిశయం సత్త్వమ్. (3)

సముద్రోదకమున శయనించియున్న భగవానుని రూపము ఎట్టిదనిన, శుద్ధమైనది, రజోగుణాదులు లేనిది. గొప్పనైనది. సత్త్వగుణ ప్రధానమైనది, నిరుపమానమైనది. అతని అవయవములందే లోకములన్ని కల్పించబడినవి.. అదే భగవంతుని విరాడ్ రూపము. (3)

4. శ్లో. పశ్యంత్యదో రూపమదభ్రచక్షుషా
సహస్రపాదోరుభుజాననాద్భుతమ్ ।
సహస్రమూర్ధశ్రవణాక్షినాసికం
సహస్రమౌల్యంబర కుండలోల్లసత్ ॥

టీ :- ఏతచ్చయోగినాం ప్రత్యక్షమిత్యాహ-పశ్యంతీతి. అదభ్రం అనల్పం జ్ఞానాత్మకం యచ్చక్షుః తేన. సహస్రం అపరిమితాని యాని పాదాదీని తైరరద్భుతం. సహస్రం మూర్ధాదయో యస్మిన్ తత్; సహస్రం యాని మౌళ్యాదీని తైరుల్లసత్ శోభమానమ్.(4)

ఈ రూపము వేయి సంఖ్యగల పాదములు, ఊరువులు, భుజములు, ముఖములు, తలలు, చెవులు, ముక్కులు, కిరీటాలు, పీతాంబరాలు, కుండలాలతో ప్రకాశించు గొప్ప అద్భుత రూపము. దానిని జ్ఞాన దృష్టితో యోగులు మాత్రమే చూడగలరు. (4)

5. శ్లో. ఏతన్నానావతారాణాం
నిధానం బీజమవ్యయమ్ ।
యస్యాంశాంశేన సృజ్యంతే
దేవతిర్యఙ్నరాదయః ॥

టీ :- ఏతత్తు కూటస్థం నత్వన్యావతారవదావిర్భావతిరోభావవదిత్యాహ ఏతదితి. ఏతదాదినారాయణరూపం నిధీయతేఽస్మిన్నితి నిధానం. కార్యావసానే ప్రవేశస్థానమిత్యర్థః. బీజముద్గమస్థానం. బీజత్వేఽపి నాన్యబీజతుల్యం, కిన్త్వవ్యయం. న కేవలమవతారాణామేవ బీజం

ఈ విరాడ్రూప అవతారము అనేక అవతారాలకు మూలము. దాని అంశాంశాల చేతనే దేవ, తిర్యక్, నరాది సృష్టి జరుగుచున్నది. ఈ అవతారము కూటస్థము. ఇది ఇతర అవతారాలవలె ఆవిర్భవించి, అస్తమించునది కాదు. ఇది ఆది నారాయణ రూపము, మొదటిది. దీనియందే ఇతర అవతారాలు లీనమై ఉండును. ఆయాఅవతారముల కార్యావసానమందు ప్రవేశించే స్థానమని భావము. బీజమనగా అవతారాలు రావడానికి కారణము. పుట్టుక స్థానము బీజమైనను ఇతర బీజములవలె కాదు, అవ్యయము. ఇది కేవలము అవతారాలకే బీజము కాదు, సమస్త ప్రాణులకు కూడా బీజము. ఈ అవతారము యొక్క అంశయే బ్రహ్మ, అతని అంశయే మరీచ్యాదులని భావము.(5)

కింతుం సర్వప్రాణి నామపీత్యాహ–యస్యేతి. యస్యాంశో బ్రహ్మా. తస్యాంశో మరీచ్యాదాః తేన.(5)

6.శ్లో. స ఏవ ప్రథమం దేవః
కౌమారం సర్గమాస్థితః ।
చచార దుశ్చర్యం బ్రహ్మా
బ్రహ్మచర్యమఖండితమ్ ॥

టీ :– సనత్కుమారాద్యవతారం తచ్చరిత్రం చాహ–స ఏవేతి. కౌమారః ఆర్షః ప్రాజాపత్యో మానవ ఇత్యాదీని సర్గవిశేషనామాని. యః పౌరుషం రూపం జగృహే, స ఏవ దేవః కౌమారాఖ్యం సర్గమాస్థితస్సన్ బ్రహ్మా బ్రాహ్మణోభూత్వా బ్రహ్మచర్యం చచార.సః ప్రథమోఽవతారః. ప్రథమద్వితీయాదిశబ్దాః నిర్దేశమాత్రాపేక్షయా. ప్రయుక్తాః. (6)

ఆ విరాడ్రూపుడైన భగవానుడు మొదట కౌమారావస్థగల సృష్టిని పొంది బ్రహ్మచర్య వ్రత నియమాన్ని పాటిస్తూ గొప్ప తపస్సు గావించెను. అనగా సనక సనందన సనాతన సనత్కుమారావతారములను పొందెను. అప్పుడు కౌమారావస్థలోనే ఐదు సంవత్సరాల బ్రాహ్మణుల పిల్లలుగా అవతరించెను. ఇది మొదటిది. ఇచట ప్రథమ ద్వితీయ శబ్దాలకు నిర్దేశార్థము మాత్రమే అనగా ప్రథమత్వ, ద్వితీయత్వాది వివక్ష లేదు. ఆ పదములు నిర్దేశ మాత్రములే అని గమనించవలెను.(6)

7.శ్లో. ద్వితీయం తు భవాయాస్య
రసాతలగతాం మహీమ్ ।
ఉద్ధరిష్యన్నుపాదత్త
యజ్ఞేశం సౌకరం వపుః ॥

రెండవ అవతారము వరాహావతారము. ఈ ప్రపంచము సృష్టించుటకు, పాతాల లోకమునకు కొనిపోబడిన భూమిని పునరుద్ధరించుటకై అడవిపంది రూపమున యజ్ఞవరాహమూర్తిగా అవతరించెను. ఇట్లు అన్నింటిలోను ఆయా అవతారములలో, ఆ అవతారములతో చేసిన పనులు వర్ణింపబడుచున్నవి. (7)

టీ :- వరాహావతారమాహ - ద్వితీయమితి. అస్య విశ్వస్య భవాయ ఉద్భవాయ. మహీముద్ధరిష్యన్నితి కర్మోక్తిః. ఏవం సర్వత్రావతార స్తత్కర్మ చోక్తమిత్యనుసంధేయమ్. (7)

8. శ్లో. తృతీయమృషిసర్గం చ
దేవర్షిత్వముపేత్య సః ।
తంత్రం సాత్త్వతమాచష్ట
నైష్కర్మ్యం కర్మణాం యతః ॥

టీ :- నారదావతారమాహ-తృతీయమితి. ఋషిసర్గముపేత్య. తత్ర చ దేవర్షిత్వముపేత్యేత్యర్థః. సాత్వతం వైష్ణవం. తంత్రం పాంచరాత్రాగమం. ఆచష్ట ఉక్తవాన్. యతస్తం త్రాత్ నిర్గతం కర్మ కర్మత్వం బంధుహేతుత్వం యేభ్యస్తాని నిష్కర్మాణి తేషాం భావో నైష్కర్మ్యం కర్మణాం మోచకత్వం యతో భవతి తదాచష్టేత్యర్థః. (8)

మూడవ అవతారము నారదావతారము. ఆయన దేవర్షిగా అవతరించాడు. సత్త్వగుణ ప్రధానమగు సాత్త్వతతంత్రమును, భక్తిశాస్త్రమును పాంచరాత్రాగమమును వివరించాడు. దేనివలన నైష్కర్మ్యసిద్ధి కలుగునో అది సాత్త్వతతంత్రము భక్తిశాస్త్రము లేక పాంచరాత్రాగమము. అన్ని కర్మ సంబంధములను విడగొట్టునట్టి ఆ శాస్త్రమును నారదుడు రచించెను. (8)

9. శ్లో. తుర్యేధర్మకలాసర్గే
నరనారాయణావృషీ ।
భూత్వాత్మోపశమోపేతమ్ ।
అకరోద్దుశ్చరం తపః ॥

నాల్గవ అవతారమునందు ధర్ముని పత్నియగు మూర్తి యందు నర, నారాయణులనే ఋషుల రూపములతో అవతరించి సంపూర్ణ నిగ్రహముతో, ఎంతో కష్టముతో చేయదగిన తపస్సును చేసెను. ఇచట కలా అనుదానికి అంశము( సగము ) భార్య అని అర్థములు.

టీ :- నరనారాయణావతారమాహ - తుర్య ఇతి. తుర్యే చతుర్థే. అవతారే. ధర్మస్య యమస్య. కలా అంశః. భార్యేఽర్ధః. శ్రు.'అర్ధో వా ఏష ఆత్మనో యత్పత్నీ' ఇతి శ్రుతేః. తస్సాస్సర్గే ఋషిర్భూత్వే త్యేకావతారతాం దర్శయతి.(9)

'అర్ధావయేచ' అను స్మృతిని అనుసరించి భార్య పురుషునిలో సగము. దాని సర్గమందు 'ఋషీ భూత్వా ' అని నర నారాయణులకు ఏకావతారత్వము సూచించబడినది.(9)

10.శ్లో. పంచమః కపిలో నామ
సిద్ధేశః కాలవిప్లుతమ్ ।
ప్రోవాచాసురయే సాంఖ్యం
తత్త్వజ్ఞానవినిర్ణయమ్ ॥

భగవానుడు సిద్ధేశ్వరుడైన కపిలుడుగా ఐదవ అవతారాన్ని ధరించెను. తత్త్వాన్ని బోధించు సాంఖ్యశాస్త్రాన్ని అతడు బోధించెను. బ్రాహ్మణుడైన ఆసురి అను పేరుగల వానికి కపిలమహర్షి చెప్పినది సాంఖ్యము. ఇది తత్త్వముల సంఖ్యమీద ఆధారపడు శాస్త్రము.(10)

టీ :- కపిలావతారమాహ-పంచమ ఇతి. ఆసురయే తన్నామ్నే బ్రాహ్మణాయ. తత్త్వానాం గ్రామస్య సంఘస్య వినిర్ణయో యస్మిన్ శాస్త్రే తత్సాంఖ్యమ్.(10)

11.శ్లో. షష్ఠమత్రేరపత్యత్వం
వృతః ప్రాప్తోఽనసూయయా ।
ఆన్వీక్షికీమలార్కాయ
ప్రహ్లాదాదిభ్య ఊచివాన్ ॥

దత్తాత్రేయావతారమును చెపుతున్నారు. అత్రిమహాముని చేత కోరబడి అతని సంతానముగా భగవానుడు జన్మించినాడు. భగవానుడు సంతానముగా జన్మించవలెనని కోరి తపస్సుచేసిన అత్రిమహాముని తపస్సుకు మెచ్చి ఆ భగవానుడు వరమునిచ్చెను. "అత్రేరపత్యమభి కాంక్షత అహంతుష్టః" అని ముందు చెప్పబడును. ఏ భావము చేత

టీ :- దత్తాత్రేయావతారమాహ-షష్ఠమితి. అత్రేరపత్యత్వం. తేనైవ వృతస్సన్ ప్రాప్తః శ్లో.'అత్రేరపత్యమభికాంక్షత ఆహ తుష్ట' ఇతి వక్ష్యమాణ త్వాత్. కథం ప్రాప్తః? అనసూయయా మత్సదృశాపత్యమిషేణ మమే వాపత్యం వృతవానితి దోషదృష్టిమకుర్వన్నే వాత్రేరపత్యత్వం ప్రాప్త ఇత్యర్థః. అన్వీక్షికీమాత్మవిద్యాం. అలర్కాయ రాజ్ఞే. ప్రహ్లాదాదిభ్యశ్చ. ఆది పదాద్యదుహైహయాద్యా గృహ్యన్తే.(11)

12. శ్లో. తతస్సప్తమ ఆకూత్యాం
రుచేర్యజ్ఞోఽ భ్యజాయత ।
స యామాద్యైః సురగణైః
అపాత్ స్వాయంభువాంతరమ్ ॥

టీ :- యజ్ఞావతారమాహ - తత ఇతి . స యజ్ఞః. యామాద్యైః స్వస్యైవ పుత్రాః యామా నామ దేవాః తదాద్యైస్సహ స్వాయంభువం మనన్వంతరం. అపాత్ పాలితవాన్. తదా స్వయమింద్రోఽ భూదిత్యర్థః (12)

భగవానుడు జన్మించెను? నీలాంటి కుమారుడు కావలెనని, ఒక వ్యాజంతో ఆ భగవంతుడినే కుమారుడుగా కోరాడని భావము. అందుచేత అసూయ లేకుండగా, తప్పుపట్టకుండగా జన్మించెను. అనసూయకు కుమారుడుగా ప్రాప్తుడయ్యెను. 'ఆన్వీక్షికీం' అనగా జీవాత్మ పరమాత్మల లక్షణమును తెల్పు తర్కశాస్త్రవిద్య ఆత్మవిద్య. దానిని ఆ భగవానుడు అలర్క ప్రహ్లాదాదులకు బోధించెను. అలర్క ప్రహ్లాదాది.. అనుచోట ఆదిపదముతో యదుహైహయాదులు సూచితులు.(11)

'తతస్సప్తమ' అను శ్లోకంతో యజ్ఞావతారమును చెపుతున్నాడు. ఆకూతియందు రుచి వలన భగవానుడు యజ్ఞుడుగా ఉదయించెను. ఇది సప్తమావతారము. ఆ యజ్ఞుడు యామముడు మొదలైప దేవతాగణములతో కలిసి స్వాయంభువ మన్వంతరమున భూమిని పాలించెను. అపుడు యజ్ఞుడు స్వయముగానే ఇంద్రుడాయెను. (12)

13.శ్లో. అష్టమే మేరు దేవ్యాం తు
నాభేర్జాత ఉరుక్రమః ।
దర్శయన్ వర్త్మ ధీరాణాం
సర్వాశ్రమ నమస్కృతమ్ ॥

టీ :- ఋషభావతారమహ - అష్టమ ఇతి . సర్వాశ్రమనమస్కృతం అత్యాశ్రమం. పారమహంస్యం వర్త్మ ధీరాణాం దర్శయన్ ఆగ్నీధ్ర పుత్రాత్ నాభేః ఋషభోజాతః. (13)

ఎనిమిదవ అవతారమును చెప్పుతున్నాడు. నాభియను అగ్నీధ్రుని పుత్రునికి మేరుదేవి యందు గొప్ప పరాక్రమము గలవాడై భగవానుడు జన్మించి, అన్ని ఆశ్రమములవారు నమస్కరించదగిన, పరమహంసలకు సంబంధించిన చివరి సన్యాసాశ్రమ మార్గమును ధీరులకు తెలియపరచెను.(13)

14.శ్లో. ఋషిభిర్యాచితో భేజే
నవమం పార్థివం వపుః ।
దుగ్ధేమామౌషధీర్విప్రాః
తేనాయం స ఉశత్తమః ॥

టీ :- పృథోరవతారమాహ-ఋషిభిరితి. పార్థివం వపుః. రాజదేహం పృథురూపం. పాఠాంతరే పృథోరిదం పార్థివం. ఓషధీరిత్యుపలక్షణం. ఇమాం పృథివీం. సర్వాణి వస్తూని. దుగ్ధ అదుగ్ధ. అడాగమాభావస్త్వార్షః హే విప్రాః తేన పృథివీదోహనేన సోऽయమవతారః. ఉశత్తమః కమనీయతమః వశకాంతవిత్యస్మాద్ధాతోర్నిష్పన్నో యం శబ్దః.(14)

ఓ విప్రులారా ! భగవానుడు ఋషీశ్వరులచేత యాచించబడి పృథుచక్రవర్తికి సంబంధించిన రాజదేహమును పొందెను. ఈ భూమండలమున ఓషధులను (మొక్కలను) అనగా సమస్తవస్తువులను పితికెను.పృథ్విని పితుకుటచేత ఈ అవతారము ఉశత్తమము.'వశ కాన్తే' అను ధాతువు శత్రంతరూపము.ఉశత్ అను శబ్దము ఇచ్చట 'వ' అనుదానికి 'ఉ' అనునది సంప్రసారణము.(14)

15.శ్లో. రూపం స జగృహే మాత్స్యం
చాక్షుషోదధి సంప్లవే ।
నావ్యారోప్య మహీమయ్యామ్
అపాద్వైవస్వతం మనుమ్ ॥

టీ :- మత్స్యావతారమాహ - రూపమితి. చాక్షుషమన్వంతరే య ఉదధిసంప్లవః సంశ్లేషః తస్మిన్. యద్యపి మన్వంతరావసానే ప్రళయోనాస్తి. తథాపి కేనచిత్కౌతుకేన సత్యవ్రతాయ మాయా ప్రదర్శితా. యథా అకాండే మార్కండేయాయేతి ద్రష్టవ్యం. మహీమయ్యాం నావి నౌకారూపాయాం మహ్యామిత్యర్థః. అపాత్ రక్షితవాన్. వైవస్వతమితి భావినీ సంజ్ఞా.(15)

భగవానుని మత్స్యావతారమును వివరిస్తున్నాడు. మత్స్య రూపమును ధరించి చాక్షుష మన్వంతరమున సముద్రములు కలిసి జలప్లావ (ప్రలయ) ము వచ్చిన సమయమున వైవస్వతమనువను సత్యవ్రతనాముని భక్తుని, భూరూపమైన నావయందు ఎక్కించి కాపాడెను. మన్వంతరము చివర ప్రలయము ఉండదు. అయినప్పటికిని ఏదో ఒక వేడుకతో సత్యవ్రతుని కొరకు మాయ ప్రదర్శించబడినది. ఇతడే కాబోయే మనువు. అక్కడే మార్కండేయాయ అనుదానిని చూడవలెను.(15)

16.శ్లో. సురాసురాణాముదధిం
మథ్నతాం మంధరాచలమ్ ।
దధ్రే కమఠరూపేణ
పృష్ఠే ఏకాదశే విభుః ॥

టీ :- కూర్మావతారమాహ-సురేతి. కమఠః కూర్మః తద్రూపేణ. ఏకాదశేఽవతారే విభుర్దధ్రే దధార. (16)

దేవదానవులు సముద్రమును మథించు సమయమున ఏకాదశావతారమైన తాబేటి రూపమున భగవానుడు మంధర పర్వతమును ధరించెను.(16)

17. శ్లో. ధాన్వంతరం ద్వాదశమం
త్రయోదశమమేవ చ ।
అపాయయత్సురానన్యాన్
మోహిన్యా మోహయన్ స్త్రియా ॥

టీ :- ధన్వంతర్యవతారమాహ - ధాన్వంతరమితి. ధాన్వంతరం ధన్వంతరీరూపం. ద్వాదశమమితి మట్ప్రయోగస్త్వార్షః. త్రయోదశమేవేత్యాదినా తచ్చరితేవ సహ దర్శయతి. అత్రాప్యార్ష ఏవ మట్. అపాయయదిత్యత్ర సుధామిత్యధ్యాహారః. మోహిన్యాస్త్రియా మోహిన్యాఖ్య స్త్రీరూపేణ. అన్యానసురాదీన్ మోహయన్ ధన్వంతరి రూపేణ అమృతమానీయ. మోహిన్యా అపాయయదిత్యార్థః(17)

పన్నెండవదగు భగవంతుని ధన్వంతర్యవతారమును ఈ శ్లోకమున చెప్పినారు. ద్వాదశం అనక ద్వాదశమమని మకార ప్రయోగము ఆర్షము. ఇటులనే త్రయోదశమం ఇక ఈ శ్లోకముననే పదమూడవ అవతార చరిత్రను తెల్పుతున్నాడు. మోహినియను స్త్రీరూపము ధరించి ఇతరులను (రాక్షసులను) మోహింపచేసి భగవానుడు దేవతలకు అమృతమును త్రాగించెను. ఇచట అమృతమను పదము శ్లోకమున లేకున్ననూ ముఖ్యకర్మ అగు అమృతమును సూచించు పదమును పెట్టుకొనవలెనని సూచించబడినది. ( అధ్యాహారముగా ) ధన్వంతరిరూపముతో అమృతమును తెచ్చి మోహిని రూపముతో దేవతలకు త్రాగించెనని భావము. (17)

18. శ్లో. చతుర్దశం నారసింహం
బిభ్రద్దైత్యేంద్రమూర్జితమ్ ।
దదార కరజైర్వక్ష
స్యేరకాన్ కటకృద్యథా ॥

టీ :- నృసింహావతారమాహ–చతుర్దశమితి. నారసింహం రూపం స బిభ్రత్ ఏరకాన్. నిర్గ్రంథితృణవిశేషాన్.(18)

భగవానుడు పదునాల్గవదగు నరసింహావతారమును ధరించి రాక్షస శ్రేష్ఠుడు, బలవంతుడగు హిరణ్యకశిపుని వక్షఃస్థలమును, చాపలల్లెడివాడు అంబుగడ్డిని (తుంగను) రెండుగా చీల్చినట్లు తన గోళ్ళతో చీల్చి చంపెను.(18)

19. శ్లో. పంచదశం వామనకం
కృత్వాగా౽దధ్వరం బలేః ।
పదత్రయం యాచమానః
ప్రత్యాదిత్సుస్త్రివిష్టపమ్ ॥

టీ :- వామనావతారమాహ - పంచదశమితి. దుష్టానాం మదం వామనయతీతి వామనకం రూపం. హ్రస్వం వా. ప్రత్యాదిత్సు స్తస్మాదాచ్ఛిద్య గృహీతుమిచ్ఛుః.(19)

పదిహేనవదగు అవతారమున భగవానుడు వామనుడై అనగా పొట్టిరూపమును ధరించి బలి చక్రవర్తి యజ్ఞవాటికకు వెళ్ళెను. స్వర్గమును లాగుకొను ఇచ్ఛచే మూడడుగుల నేలను యాచించుచు స్వర్గమును కైవసము చేసికొనెను. ఇచట వామన శబ్దమునకు దుర్మార్గుల మదమును హరించునట్టిది లేదా హ్రస్వమని అర్థము. (19)

20. శ్లో. అవతారే షోడశమే
పశ్యన్ ధర్మద్రుహో నృపాన్ ।
త్రిస్సప్తకృత్వః కుపితో
నిఃక్షత్రామకరోన్మహీమ్ ॥

టీ :- పరశురామావతారమహ-అవతార ఇతి. త్రిః త్రిగుణం యథా భవతి తథా సప్తకృత్వః. సప్తవారాన్ ఏకవింశతివారానిత్యర్థః(20)

పదునారవదగు పరశురామావతారమును చెపుతున్నాడు. బ్రాహ్మణద్వేషులగు రాజులను చూచి కోపించినవాడై ఇరువదియొక్క పర్యాయములు ఈ భూమిపై క్షత్రియులైన రాజులు లేకుండా చేసెను.(20)

21. శ్లో. తతః సప్తదశే జాతః
సత్యవత్యాం పరాశరాత్ ।
చక్రే వేదతరోః శాఖాః
దృష్ట్వా పుంసోఽల్ప మేధసః ॥

టీ :- వ్యాసావతారమాహ తత ఇతి. అల్పమేధసః. అల్పప్రజ్ఞాన్ పుంసోదృష్ట్వా తదనుగ్రహార్థం శాఖాశ్చక్రే. (21)

వ్యాసావతారమును చెపుతున్నాడు. పదునేడవ అవతారమున సత్యవతి యందు పరాశరుని వలన వేదవ్యాసుడు జనించెను. అట్టి వ్యాసుడు అల్పబుద్ధిగల మానవులనుచూచి వారిని అనుగ్రహించుటకు వేదవృక్షమునకు శాఖలనేర్పరచెను. రాశీభూతముగానున్న వేదమును ఋగ్యజుస్సామాథర్వ వేదములుగా విభజించి శాఖల నేర్పరచెను. అందుకే వేదవ్యాసుడని పేరు వ్యాసునికి కలిగెను. (21)

22. శ్లో. నరదేవత్వమాపన్నః
సురకార్యచికీర్షయా ।
సముద్రనిగ్రహాదీని ।
చక్రే వీర్యాణ్యతః పరమ్ ॥

టీ :- రామావతారమాహ-నరేతి. నరదేవత్వం రాఘవరూపేణ ప్రాప్తస్సన్. అతః పరమష్టాదశే. (22)

రామావతారమును చెపుతున్నాడు నరేతి అని. దేవతలకు క్షేమము చేయుటకు అవతరించి సముద్రమును నిగ్రహించి సేతువు నిర్మాణము మొదలగు పరాక్రమ చర్యలు అనేకములను రామావతారమున గావించెను. (22)

23. శ్లో. ఏకోనవింశే వింశతిమే
వృష్టిషు ప్రాప్య జన్మనీ ।
రామకృష్ణావితి భువో
భగవానహరద్భరమ్ ॥

ఏకోన అను శ్లోకముతో రామకృష్ణావతారములను చెపుతున్నాడు. పంతొమ్మిది, ఇరువదవ అవతారములలో బలరామ శ్రీకృష్ణ నామములతో ప్రఖ్యాతిగాంచిన భగవానుడు భూభారమును తొలగించెను అనగా దుష్టసంహారమును చేసెను. (23)

టీ :- రామకృష్ణావతారమాహ-ఏకేతి వింశతితమ ఇతివక్తవ్యే తకారలోపశ్ఛాందసః. (వర్ణాధిక్యం తు ఛాందసత్వాదేవేతి జ్ఞేయం. నైతత్కేనాపి వ్యాఖ్యత్రాస్పష్టీకృతం. అత్ర వింశే చేతి పాఠే న కాప్యనుపపత్తిరితి మంతవ్యం.) రామకృష్ణావిత్యేవ నామజన్మనీ ప్రాప్య.(23)

24.శ్లో. తతః కలౌ సంప్రవృత్తే
సంమోహాయ సురద్విషామ్ ।
బుద్ధోనామ్నా జినసుతః ।
కీకటేషు భవిష్యతి ॥

టీ :- బుద్ధావతారమాహ-తత ఇతి అజినస్య సుతః. జినసుత ఇతి పాఠే జినోఽపి స ఏవ. కీకటేషు మధ్యే గయప్రదేశే.(24)

బుద్ధావతారమును చెపుతున్నాడు తతః అని. కలియుగము ప్రాప్తించగా రాక్షసులను మోహింపజేయుటకు అజినసుతుడై భగవానుడు బుద్ధుడను పేరుతో కీకటములందు,మధ్యగయా అను ప్రదేశమున అవతరించగలడు.అజినసుతః అనుదానికి జినసుతః అని పాఠాంతరము కలదని జినుడుగూడా అతడే అజినుడే.(24)

25.శ్లో. అథాసౌ యుగసంధ్యాయామ్
దస్యు ప్రాయేషు రాజసు ।
జనితా విష్ణుయశసో ।
నామ్నా కల్కిర్జగద్గురుః ॥

టీ :- కల్క్యవతారమాహ-అథేతి. యుగసంధ్యాయాం కలేరంతే. విష్ణుయశషో బ్రాహ్మణాత్సకాశాత్. జనితా జనిష్యతే.(25)

కల్కిఅవతారమును చెపుతున్నాడు అథాసౌ అని. యుగసంధిలో అనగా కలియుగాంతమున విష్ణుయశసుడనే బ్రాహ్మణుడికి జగత్పతి యగు భగవానుడు కల్కిమూర్తిగా అవతరించి దొంగలుగా మెలగుచున్న రాజులను శిక్షించగలడు.(25)

26.శ్లో. అవతారా హ్యసంఖ్యేయాః
హరేః సత్త్వనిధేర్ద్విజాః ।
యథాఽవిదాసినః కుల్యాః ।
సరసః స్యుః సహస్రశః ॥

టీ :- అనుక్తసర్వసంగ్రహార్థమాహ-అవతారా ఇతి అసంఖ్యేయత్వే దృష్టాంతః. యథేతి. అవిదాసినః. అపక్షయశూన్యాత్. దసు ఉపక్షయ ఇత్యస్మాన్నిష్పన్నః. సరసస్సకాశాత్ కుల్యాః క్షుద్రప్రవాహాః (26)

ఇంకా చెప్పని ఎన్నో అవతారాలు భగవంతునివి ఉన్నవని అన్నింటిని సంగ్రహించి చెపుతున్నాడు అవతారా ఇత్యాది శ్లోకమున. ఓ శౌనకాది ఋషులారా సత్త్వమూర్తియగు శ్రీమహావిష్ణువు యొక్క అవతారాలు లెక్కకు మించి ఎన్నో ఉన్నాయి. ఎలాగంటే దృష్టాంతము చెపుతున్నాడు. ఏవిధముగా క్షయము లేని సరస్సు ప్రవాహము నుండి చిన్న చిన్న పిల్ల కాలువలెన్నో బయలుదేరినట్లు శ్రీమహావిష్ణువు నుండి అనేక అవతారాలు వచ్చినవని భావము. అవిదాసినః అను పదము దసు ఉపక్షయే అనుధాతువు నుండి వచ్చినదని చెప్పబడినది.(26)

27.శ్లో. ఋషయో మునయో దేవాః
మనుపుత్రా మహౌజసః ।
కలాః సర్వే హరేరేవ
సప్రజాపతయః స్తథా ॥

టీ :- విభూతీరాహ-ఋషయ ఇతి. (27)

భగవద్విభూతులను అంశలను చెపుతున్నాడు ఋషయ అని. ఋషులు వ్యాసాదులు మనువులు,( స్వాయంభువాదులు) దేవతలు, (ఇంద్రాదులు) మనువుల పుత్రులు, ప్రజాపతులు గొప్పనైన ప్రభావము గలవారెందరో కలరు. వారందరును శ్రీమహావిష్ణువు యొక్క విభూతులే.(27)

28.శ్లో. ఏతే చాంశకలాః పుంసః
కృష్ణస్తు భగవాంత్స్వయమ్ ।
ఇంద్రారివ్యాకులం లోకం
మృడయంతి యుగేయుగే ॥

టీ :- తత్ర విశేషమాహ-ఏత ఇతి. పుంసః పరమేశ్వరస్య కేచిందంశాః కేచిత్కలాః. విభూతయశ్చ మత్స్యాదీనామవతారత్వేన సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వే అపి యథోపయోగమేవ జ్ఞానక్రియా శక్త్యావిష్కరణం కుమారనారదాదిష్వాధికారికేషు యథోపయోగమంశ కలావేశః. తత్ర కుమారాదిషు జ్ఞానావేశః. పృథ్వాదిషు శక్త్యావేశః, కృష్ణస్తు భగవాన్ సాక్షాన్నారాయణ ఏవ ఆవిష్కృతసర్వశక్తిత్వాత్. సర్వేషాం ప్రయోజనమాహ-ఇంద్రాదయో దైత్యాః తైర్వ్యాకులం ఉపద్రుతం మృడయంతి సుఖినం కుర్వన్తి.(28)

అచటి విశేషమును చెపుతున్నాడు ఏతే అని. సర్వశక్తి సమన్వితుడగు పరమేశ్వరుని యొక్క అంశభూతములు కొంతమంది కలాస్వరూపులు, కొంతమంది అంశాంశరూపులు,సర్వజ్ఞత్వ సర్వశక్తిమత్త్వాలున్నను, మత్స్యాద్యవతారములలో వాటిఉపయోగము ప్రదర్శింపబడలేదు కేవలము క్రియాశక్తియే ఒకచోట కుమారాదుల యందు జ్ఞానశక్తిగా ఆవిష్కారమైనది. ఈ శక్త్యావేశము పృథుచక్రవర్తి మున్నగు వారియందు పరాక్రమము. ఒక్కొక్కచోట ఒక విశేషమేకాని శ్రీకృష్ణావతారము మాత్రము అలాకాదు. సాక్షాత్తుగా నారాయణుడే, తనకున్న అతీంద్రియ దివ్యశక్తులన్నింటిని కృష్ణునిగా ప్రకటించినాడు. దానివలన లాభము తెలుపుతున్నాడు. ఇంద్రుని శత్రువులు రాక్షసులు,వారిచేత బాధించబడు లోకాలను సుఖవంతము చేయడము, ధర్మసంస్థాపన, దుష్టశిక్షణ, శిష్టరక్షణయే కృష్ణావతార ధ్యేయము.(28)

29.శ్లో. జన్మ గుహ్యం భగవతో
య ఏతత్ప్రయతో నరః ।
సాయం ప్రాతర్గృణన్ భక్త్యా
దుఃఖగ్రామాద్విముచ్యతే ॥

ఈ భగవదవతారములను స్మరించినందున ఫలితము చెపుతున్నాడు. భగవంతుని యొక్క రహస్యమగు జన్మలు అవతారములను శుచిష్మంతుడయి యే మానవుడు భక్తితో సాయం ప్రాతఃకాలములందు స్మరించునో అట్టివాడు సాంసారిక సకల దుఃఖముల నుండి విడువడును. రోగ,శోక,జరా,మరణాదులు లేని మోక్షాన్ని పొంది సుఖించునని భావము.(29)

టీ :- ఏతత్కీర్తన ఫలమాహ-జన్మేతి. గుహ్యం అతిరహస్యం జన్మ. ప్రయతః శుచిః సన్. దుఖగ్రామాత్సంసారాత్, విముచ్యత ఇత్యుక్తం. (29)

30. శ్లో. ఏతద్రూపం భగవతో
హ్యరూపస్య చిదాత్మనః ।
మాయాగుణైర్విరచితం
మహదాదిభిరాత్మని ॥

టీ :- తత్ర కథం దేహద్వయసంబంధే సతి తద్విముక్తిరిత్యాశంక్య, దేహసంబంధస్య భగవన్మాయోత్థా విద్యావిసితత్వాదేతచ్ఛ్రవణాది జనిత విద్యయా తన్నివృత్తిరుపపద్యత ఇత్యాశయేనాహ-ఏతదితి పంచభిః. అరూపస్య చిదేకరసస్య. ఆత్మనో జీవస్య. ఏతత్ స్థూలం రూపం శరీరం భగవతో యా మాయా. తస్యాః గుణైః మహదాదిరూపైఃవిరచితం కృతం. క్వ? ఆత్మని ఆత్మస్థానే శరీరం కృతమిత్యర్థః. (30)

31. శ్లో. యథా నభసి మేఘౌఘో
రేణుర్వా పార్థివోఽనిలే ।
ఏవం ద్రష్టరి దృశ్యత్వమ్
ఆరోపితమబుద్ధిభిః ॥

భాగవత శ్రవణము, స్మరణము మోక్షదాయకమని చెప్పబడినదికదా స్థూల సూక్ష్మ దేహద్వయ సంబంధముండగా ముక్తి ఎలా వస్తుంది? అను దానికి ఊహించి సమాధానము చెపుతున్నాడు. ఈ స్థూల సూక్ష్మ దేహముల సంబంధము భగవన్మాయచే ఏర్పడిన అజ్ఞానముతో కలుగును. ఈ అజ్ఞానము భాగవత శ్రవణము వలన కలిగిన జ్ఞానముచే నశించును. వెలుతురు వచ్చినచో చీకటి ఉండజాలదుకదా ఈ విషయమునే ఐదు శ్లోకములతో వివరిస్తున్నాడు. రూపము లేని జ్ఞానస్వరూపుడైన జీవాత్మకు ఈ స్థూలశరీరరూపము భగవంతుని మాయచేత దాని గుణములగు మహత్తత్త్వాహంకార పంచభూతాల చేత విరచితము ఆత్మయందారోపింపబడినది. (30)

ఆత్మయందు శరీరారోపణము ఎట్లనగా తన స్వరూపము తెలియనందున అదే అనగా ఆ శరీరమే తాననుకొనుట సంభవము. దానిని దృష్టాంతముతో వివరించుచున్నాడు. ఏ విధముగా శూన్యమగు ఆకాశమునందు మేఘములు వాయువు నాశ్రయించినవో, అంతేకాక

టీ :- కథమిత్య పేక్షాయాం స్వరూపావరణేన తదధ్యాస ఇతి సదృష్టాంతమాహ - యథేతి. యథా వాయ్వాశ్రితో మేఘౌఘో నభసి ఆకాశే. అబుద్ధిభిరజ్ఞైరారోపితః. యథా వా పార్థివో రేణుస్తద్గతం ధూసరత్వాది అనిలే, ఏవం ద్రష్టరి దృశ్యత్వం దృశ్యత్వాదిధర్మకం శరీరమారోపితమిత్యర్థః.(31)

ఏ విధముగా పృథ్వీ రేణువులు ధూసరవర్ణమును వాయువునందు ఆరోపించుచున్నవో అదే విధముగా సాక్షీభూతుడగు ఆత్మయందు దృశ్యత్వము (శరీరభావము) ఆరోపింపబడుచున్నది. ఈ శరీరమే నేను అను భ్రాంతి కలుగుచున్నదని భావము. శరీరగుణాలు స్థూలత్వ కృశత్వ జనన మరణాదులు ఆత్మయందు ఆరోపితములేకాని వాస్తవాలుకావు. ఆత్మ ద్రష్ట మాత్రమే అనగా ఆకాశము కదలుచున్నది గాలి ఎఱ్ఱగా ఉన్నది అను వ్యవహారాల వలె అని అర్థము. (31)

32.శ్లో. అతః పరంయదవ్యక్తమ్
అప్యూఢగుణబృంహితమ్ ।
అదృష్టాశ్రుతవస్తుత్వాత్
స జీవో యత్పునర్భవః ॥

టీ :- కించ అతః స్థూలాద్రూపాత్పరం అన్యదపి రూపమారోపిత మిత్యనుషంగః. కథంభూతం తత్? యదవ్యక్తం సూక్ష్మం. తత్రహేతుః వ్యూహః కరచరణాదిపరిణామః. అవ్యూఢాః అపరిణతాః గుణాః కరచరణాదయః తైర్గుణైర్బృంహితం రచితం. ఆకారవిశేషరహిత త్వాదవ్యక్తమిత్యర్థః. ఏతదేవ కుస్త్రాహ-అదృష్టేతి. అదృష్టాశ్రుత వస్తుత్వాత్ యచ్చాకారవిశేషపద్వస్తు, తదస్మదాది వద్దృశ్యతే. శ్రూయతే

అంతేకాక ఈ స్థూల శరీరరూపముకన్న వేరైన మరోరూపము జీవునియందారోపితమై ఉన్నది. అదికూడ మాయాకల్పితము, నశించును. అది ఎట్టిదనిన, కనిపించనిది సూక్ష్మము, కర చరణాద్యవయవములు లేనిది పరిపక్వముగాని గుణములచేత ఊహించబడునది, అది కని,విని ఎరుగబడనిది. మన శరీరంవలె కనిపించనిది, ఇంద్రాదులవలె కనిపించనిది. అయితే అట్టి సూక్ష్మశరీరము లింగ శరీరము ఉన్నదనడములో ప్రమాణము ఏదో చెపుతున్నాడు అది సజీవము జీవోపాధి.'జీవోజీవేన నిర్ముక్తో జీవోజీవం విహాయ' అనువాటియందు జీవునికి ఉపాధియగు లింగశరీరమునందు జీవశబ్ద ప్రయోగముండుటచే అది కలదనుకోవాలి. భోగాలను అనుభవించే ఈ స్థూలశరీరమే జీవోపాధి అనుకోవచ్చునుగదా మరో

వా ఇంద్రాదివత్. ఇదం తు న తథా. తర్హి తస్య సత్త్వే కిం ప్రమాణం తత్రాహ-సజీవః జీవోపాధిః. లింగశరీరం. శ్లో. 'జీవేన జీవో నిర్ముక్తో జీవో జీవం విహాయ చ' ఇత్యాదౌ జీవోపాధౌ లింగశరీరే జీవశబ్ద ప్రయోగః ఉపచారాజ్జీవోపాధితయా కల్పిత ఇత్యర్థః.నను స్థూలమేవ భోగాయతనసత్వాత్ జీవోపాధిరస్తు. కిమన్యకల్పనయేత్యత ఆహ-యదృస్మాత్స్మాక్ష్మాత్పునర్భవః పునర్జన్మ భవతీతి. జీవస్య ఉత్క్రాంతిగత్యాగతీనాం తే వినా అసంభవాదితి భావః (32)

33.శ్లో. యత్ర మే సదసద్రూపే
ప్రతిషిద్ధే స్వసంవిదా ।
అవిద్యయాऽऽత్మని కృతే
ఇతితద్బ్రహ్మ దర్శనమ్ ॥

టీ :- తదేవముపాధిద్వయముక్త్వా తదపవాదేన జీవస్య బ్రహ్మతా మాహ-యత్రేతి. యత్ర యదా ఇమే సదసతీ కార్యకారణరూపే స్థూలసూక్ష్మరూపే స్వసంవిదా శ్రవనమననాదిభక్త్యా స్వరూపసమ్యక్ జ్ఞానేన ప్రతిషిద్ధే భవతః. జ్ఞానేన ప్రతిషేధార్హత్వే తమేవ హేతుమాహ-అవిద్యయా ఆత్మని కృతే కల్పితే ఇతి హేతోః సద్బ్రహ్మ సదా జీవో బ్రహ్మైవ భవతీత్యర్థః కథంభూతం దర్శనం జ్ఞానైక స్వరూపం.(33)

శరీరకల్పనము జీవునకెందుకు? అనగా ఈ సూక్ష్మశరీరముంటేనే పునర్జన్మ సిద్ధాంతము కుదురును. జీవుడు వాసనలతో సహా ఈ శరీరము నుండి వెడలి మరో శరీరమును దాల్చుట సంభవించును. లేనిచో అది అసంభవము సూక్ష్మశరీరమనగా జ్ఞానేంద్రియ ప్రాణ విషయ మనో బుద్ధులు అని చెప్పబడినది.(32)

జీవునికి రెండు ఉపాధులు స్థూల సూక్ష్మ శరీరాలు అని చెప్పినదానికి అపవాదముగా బాధకంగా జీవుడు బ్రహ్మ స్వరూపుడని చెపుతున్నాడు. ఈ రెండు శరీరాలు శ్రవణ మననాదులచే భక్తి చేత ఆత్మ నిజ స్వరూపము తెలిసిన పిమ్మట బాధించబడును. దానికి హేతువును చెపుతున్నాడు. జ్ఞానంచేత ఆ శరీరాలు తొలగి బ్రహ్మ భాసించును. జీవుడు బ్రహ్మమేయగును. బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి అని శ్రుతి. అపుడు కేవల జ్ఞాన స్వరూపమగు ఆత్మ దర్శనము కలుగును.(33)

34.శ్లో. యద్యేషోపరతా దేవీ
మాయా వైశారదీ మతిః ।
సంపన్న ఏవేతి విదుః
మహిమ్ని స్వే మహీయతే ॥

టీ :- తథాపి భవన్మాయాయాస్సంసృతికారణభూతాయా విద్యమానత్వాత్ కథం బ్రహ్మతా తత్రాహ - యదీత్యసందేహే సందేహవచనం. యదీతి. యది వేదాః ప్రమాణం స్యుః ఇతివత్, వైశారదీ విశారదః సర్వజ్ఞ ఈశ్వరః. తదీయా దేవీ సంసారచక్రేణ క్రీడంతీ ఏషా మాయా. యద్యుపరతా భవతి. కిమిత్యుపరతా భవేత్తత్రాహ - మతిర్విద్యా. అయం భావః. యావదేషాऽవిద్యాత్మనా ఆవరణ విక్షేపౌ కరోతి తావన్నోపరమతి. యదా తు సైవ విద్యారూపేణ పరిణతా, తదా సదసద్రూపం జీవోపాధిం దగ్ధ్వా నిరింధనాగ్నివత్ స్వయమేవోపరమేదితి. తదా సంపన్నః బ్రహ్మ స్వరూపం ప్రాప్తఏవేతి విదుస్తత్త్వజ్ఞాః. కిమతః పరం. యద్యేవం స్వే మహిమ్ని పరమానంద రూపే మహీయతే పూజ్యతే. విరాజత ఇత్యర్థః. (34)

సంసారమునకు కారణభూతమగు ఈశ్వరుని మాయ ఉన్నందున జీవుడు బ్రహ్మ ఎట్లగును? అనుదానికి 'యది అని' చెపుతున్నాడు. యది ఒకవేళ, అయితే, అని సందేహములేని దాని యందు సందేహవచనము. యది వేదాః ప్రమాణం స్యుః. అన్నట్లు ఒకవేళ వేదములు ప్రమాణములైతే అన్నట్లు. సర్వజ్ఞుడగు పరమాత్మ యొక్క మాయ ( సంసారచక్రముతో నుండునది ) విరమించినచో, అవిద్య, విద్యగామారును. మతి అనగా విద్య ఏల విరమించును? అవిద్య అనగా ఎంతవరకు ఆవరణ, విక్షేపములు బ్రహ్మను కప్పిపుచ్చి ప్రపంచాన్ని కల్పించునో, అంతవరకు మాయ తొలగదు. అది విద్యగా మారినచో సదసద్రూప జీవోపాధులను దహించి కట్టెలేని అగ్ని వలె స్వయముగా విరమించును. అపుడు బ్రహ్మ స్వరూపాన్ని జీవుడు పొందును.(34)

35.శ్లో. ఏవం జన్మాని కర్మాణి
హ్యకర్తురజనస్య చ ।
వర్ణయంతి స్మ కవయో
వేదగుహ్యాని హృత్పతేః ॥

టీ :- యథా జీవస్య జన్మాది మాయా ఏవమీశ్వరస్యాపి జన్మకర్మాది మాయేత్యాహ - ఏవమితి. అకర్తుః కర్మాణి అజనస్య జన్మాని. హృత్పతేః అంతర్యామినః. (35)

36.శ్లో. స వా ఇదం విశ్వమమోఘలీలః
సృజత్యవత్యత్తి న సజ్జతేఽస్మిన్ ।
భూతేషు చాంతర్హిత ఆత్మతంత్రః
షాడ్వర్గికం జిఘ్రతి షడ్గుణేశః ॥

టీ :- తర్హి జీవాదీశ్వరస్య కో విశేషః? స్వాతంత్ర్యమేవ విశేష ఇత్యాహ - స ఇతి. షాడ్వర్గికం ఇంద్రియషడ్వర్గవిషయం జిఘ్రతి దూరాదేవ గంధవద్గృహ్ణాతి. నతు సజ్జత ఇత్యర్థః. కుతః. షడ్గుణేశః షడింద్రియ నియంతా. (36)

సర్వాంతర్యామియగు భగవంతునికి, జన్మలేని వానికి, పనిచేయని వానికి అనేక జన్మలు, కర్మలు మాయ వలన కలుగుచున్నవి. ఏవిధముగా జీవునికి మాయ వలన కలుగుచున్నవో అదేవిధంగా పరమేశ్వరునికిని మాయ వలన జన్మ అవతారాదులు కర్మ, దుష్టశిక్షణ, శిష్టరక్షణాదులు కలుగుచున్నవి. ఇచట ఒక విశేషము. జీవేశ్వరు లిరువురును మాయోపాధులే. కాని జీవుడు మాయాధీనుడు ఈశ్వరుడు మాయాతీతుడు ఇదితేడా. ఇదే ముందు శ్లోకమున తెలుపబడుచున్నది. వేద రహస్యములగు ఆయన అవతార కర్మలను విజ్ఞులు వర్ణిస్తారు.(35)

అయితే జీవుని కంటే ఈశ్వరునికి భేదమేమి? స్వాతంత్ర్యమే విశేషమని తెలుపుతున్నాడు సవా అని. ఈశ్వరుడు గొప్పనైన తన లీలలు కలవాడు ఈ ప్రపంచాన్ని సృష్టిస్తూ సంహరిస్తుంటాడు, కాని ఆ ప్రపంచమందు తగులుకొనడు,తామరాకు నీటినంటనట్టుగా దాన్ని అంటడు. ఆత్మారాముడై సర్వభూతములందు ఉన్నవాడై ఆరు ఇంద్రియములకు విషయములైన అనగా పంచేంద్రియములు మనస్సు నకు సంబంధించిన విషయాలను శబ్దాదులను, దూరము నుండియే మనము గంధమును గ్రహించినట్లు గ్రహించును కాని దాని యందు తగులుకొనడు ఏలయన ఆయన ఆరు ఇంద్రియములకు నియంత. (36)

37.శ్లో. న చాస్య కశ్చిన్నిపుణేన ధాతుః
అవైతి జంతుః కుమనీష ఊతీః ।
నామాని రూపాణి మనోవచోభిః
సంతన్వతో నటచర్యామివాజ్ఞః ॥

టీ :- నను కిమీశ్వరస్య సృష్ట్యాదికర్మభిః విషయభోగైర్వా తత్రాహ - నచేతి. ధాతుః జగద్విధాతురీశ్వరస్య. ఊతీః లీలాః కుమనీషః కుబుద్ధిః నిపుణేన తర్కాదికౌశలేన నావైతి న జానాతి. మనసా రూపాణి వచసా నామాని సంతన్వతః సమ్యక్ విస్తారయతః వచోభిరితి బహుత్వం వృత్త్యభిప్రాయేణ.(శ్రుత్యభిప్రాయేణ) మనోవాచోభిస్సహేతి వా. (37)

అయితే ఈశ్వరునికి సృష్టిమున్నగు పనులతో విషయభోగములతో పనియేమి? అనుదానికి జగత్కర్తయగు ఈశ్వరుని యొక్క లీలలను బుద్ధిగలవారు నైపుణ్యముచేత అనగా తర్కాది కుశలతతో తెలిసికొనలేరు. మనస్సుతో రూపములను, వాక్కుతో పేర్లను బాగా విస్తరించి చెప్పునట్టి భగవల్లీలలను తెలివిలేనివాడు నటుని చర్యలను గుర్తించనట్లు గుర్తించడు. వచోభిః అని బహువచనం శ్రుతులని అభిప్రాయము. (37)

38.శ్లో. స వేద ధాతుః పదవీం పరస్య
దురంతవీర్యస్య రథాంగపాణేః ।
యోఽమాయయా సంతతయాఽనువృత్త్యా
భజేత తత్పాదసరోజగంధమ్ ॥

టీ :- భక్తస్తు కథం చిజ్జానాతీత్యాహ - స ఇతి. అమాయయా అకుటిలభావేన, సంతతయా నిరంతరయా. అనువృత్త్యా ఆనుకూల్యేన. భజేత. (38)

భగవల్లీలలను భక్తుడు తెలిసికొంటాడు. ఏ కపటములేని నిరంతరమైన ఆనుకూల్యముచేత అనగా సంతత భగవద్భక్తిచేత అప్రమేయ పరాక్రమముగల ఉత్కృష్టుడగు చక్రపాణి శ్రీహరి లీలలను ఆయన పాదకమలముల సువాసనను ఆఘ్రాణించుచూ సేవించే భక్తుడు మాత్రమే తెలిసికొన గలడు.(38)

39.శ్లో. అథేహ ధన్యా భగవంత ఇత్థం
యద్వాసుదేవేఽఖిల లోకనాథే ।
కుర్వంతి సర్వాత్మకమాత్మభావమ్
న యత్ర భూయః పరివర్త ఉగ్రః ॥

టీ :– భక్తిమార్గే ప్రవృత్తానృషీనభినందతి – అథేతి. యద్యతః భక్త్యా ఏవ భగవతత్త్వం జానంతి. అథ అథకిం కారణాత్ భగవంతః సర్వజ్ఞాః భవన్తః ధన్యాః కృతార్థాః. కుతః యద్యస్మాదిత్థం ప్రశ్నైర్వాసుదేవే. ఆత్మభావం మనోవృత్తిం కుర్వంతి. సర్వాత్మకం ఐకాంతికం యత్ర యస్మిన్ భావే సతి భూయః. ఉగ్రః గర్భవాసాదిదుఃఖస్వరూపః పరివర్తో జన్మమరణాద్యావర్తో న భవతి. (39)

40.శ్లో. ఇదం భాగవతం నామ
పురాణం బ్రహ్మ సమ్మితమ్ ।
ఉత్తమ శ్లోకచరితం
చకార భగవానృషిః ॥

టీ :– హే! సూత కిమేతచ్ఛాస్త్రమపూర్వం కథయసి తత్రాహ. ఇదమితి. బ్రహ్మసమ్మితం సర్వవేదతుల్యం. ఉత్తమశ్లోకస్య చరితం యస్మిన్ తత్. ఋషిః వ్యాసః. (40)

భక్తి మార్గమున ప్రవర్తించు ఋషులను అభినందిస్తూన్నాడు 'అథ'యని. భక్తుడే భగవత్తత్త్వాన్ని తెలిసికొంటాడు. కావున సర్వజ్ఞులైన ఓ ఋషులారా ! మీరు ధన్యులు. ఏలయన ఇటువంటి భగవద్విషయ కములైన ప్రశ్నలచేత షడ్గుణైశ్వర్య సంపన్నుడగు వాసుదేవుని యందు మనస్సును నిల్పుచున్నారు. కేవలము సర్వము భగవంతుడేనని భజించువారికి మరల భయంకరమగు జనన మరణాదులుగల మాతృగర్భవాసాది కష్టములు కలుగవు పునర్జన్మ పరివర్తనము కలుగదు. (39)

ఓ సూతుడా ఇదియేమిటి ! అపూర్వమగు శాస్త్రమును చెపుతున్నారు! అనుదానికి చెపుతున్నాడు. సర్వవేద తుల్యమగునట్టిది పుణ్యశ్లోకుడగు భగవంతుని చరితమును భాగవత పురాణాన్ని వ్యాసమహర్షి రచించినాడు. (40)

41.శ్లో. నిశ్శ్రేయసాయ లోకస్య
ధన్యం స్వస్త్యయనం మహత్ ।
తదిదం గ్రాహయామాస
సుతమాత్మవిదాం వరమ్ ॥

భాగవతము ఎలా ప్రవృత్తమైనదో ఆ సంప్రదాయాన్ని 'తదిదమని' వివరిస్తున్నాడు. లోకులకు మోక్షప్రాప్తి కలుగుటకు ధన్యమైన క్షేమకరమైన ఈ మహాభాగవతాన్ని బ్రహ్మజ్ఞానులలో శ్రేష్ఠుడగు తన కుమారుడు శుకునికి వ్యాసమహర్షి బోధించెను.(41)

42.శ్లో. సర్వ వేదేతిహాసానాం
సారం సారం సముద్ధృతమ్ ।
స తు సంశ్రావయామాస
మహారాజం పరీక్షితమ్ ॥

సర్వ వేదేతిహాసాలనుండి సారము తీసికొని సమస్త వేదములు ఇతిహాసముల యొక్క సారభూతమగు ఈ భాగవతాన్ని పరీక్షిన్మహారాజుకు శుకయోగీంద్రుడు వినిపించెను.(42)

టీ :- తత్సంప్రదాయప్రవృత్తిమాహ - నిశ్శ్రేయసాయేతి. సుతం శుకం. (41,42)

43.శ్లో. ప్రాయోపవిష్టం గంగాయాం
పరీతం పరమర్షిభిః ।
కృష్ణే స్వధామోపగతే
ధర్మజ్ఞానాదిభిః సహ ॥

గంగానది ఒడ్డున ప్రాయోపవిష్టుడై మహర్షులతో చుట్టుముట్టబడిన పరీక్షిత్తునకు ధర్మ, జ్ఞానాదులతో సహా కృష్ణుడు తన ధామమైన వైకుంఠమును పొందిన కొంతకాలమునకు శుకుడు బోధించెను. ప్రాయోపవిష్టమను పదానికి మరణ పర్యంతము అన్నము తినక కూర్చొని ఉన్న అని అర్థము. అట్టి పరీక్షిత్తు పరమ వైరాగ్యముగలవాడు అని భావము.(43)

టీ :- ప్రాయేణేతి. ప్రాయేణ మృత్యుపర్యంతానశనేనోపవిష్టమితి పరమవైరాగ్యోక్తిః.(43)

44. శ్లో. కలౌ నష్టదృశామేషః
పురాణార్కోఽధునోదితః ।
తత్ర కీర్తయతో విప్రాః ।
విప్రర్షేర్భూరితేజసః ॥

టీ :- హే విప్రాః విప్రర్షేస్సకాశాత్. (44)

ఓ ఋషులారా ! కలికాలములో అజ్ఞానాంధకారమున మునిగిన జనుల యొక్క ఉద్ధారమునకు ఇపుడు ఈ భాగవత పురాణమను సూర్యుడు ఉదయించినాడు. అచట గొప్ప బ్రహ్మవర్చస్సుగల విప్రర్షి అయిన శుకమహర్షి పరీక్షిత్తుకు బోధించగా నేనచటికి వెళ్ళి దాన్ని తెలిసికొన్నానని సూతుడు వచించెను. ఈ శ్లోకమునకు ముందు శ్లోకముతో అన్వయము. (44)

45. శ్లో. అహం చాధ్యగమం తత్ర
నివిష్టస్తదనుగ్రహాత్ ।
సోఽహం వః శ్రావయిష్యామి
యథాధీతం యథామతి ॥

టీ :- అధ్యగమం జ్ఞాతవానస్మి. తత్ర కీర్తయతః తత్ర నివిష్ట ఇతిచాన్వయభేదాత్తత్రపదావృత్తిరదోషః. యథా ధీతం. న తు స్వమతివిలసితం. తత్రాపి యథామతి స్వమత్యనుసారేణ. సంక్షేపతః కథితం విస్తరతః శ్రావయిష్యామి. (45)

అచట శుక పరీక్షిత్సంవాద స్థలమున కూర్చొని ఆ శుకమహర్షి అనుగ్రహమున ఈభాగవతపురాణమును నేను తెలిసికొంటిని అన్నాడు సూతుడు. ఈ శ్లోకాలలో 'తత్ర' అను పదము రెండుసార్లు వచ్చి పునరావృతమైనది పునరుక్తము దోషము కదా అంటే కాదని శ్రీధరులు అక్కడ చెపుతుండగా అక్కడ కూర్చొని అన్వయం వేరుగా చెప్పుకొంటే తత్ర పద పునరుక్త దోషం ఉండదని వివరించారు. నేను చదివినట్లుగా అంటే నా బుద్ధికి తోచినట్లుగా కాదని అందులో నా బుద్ధికి అందినట్లు సంక్షేపముగా విన్నదానిని విస్తరించి చెపుతానని సూతుడు శౌనకాది మహర్షులతో అనెను. (45)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం సంహితాయాం ప్రథమేస్కంధే భావార్థదీపికాయాం తృతీయోఽధ్యాయః**

**శ్రీమద్భాగవతము యొక్క ప్రథమస్కంధ తృతీయాధ్యాయమునకు శ్రీధరీయవ్యాఖ్యానుసార ఆంధ్రానువాదము ముగిసినది.**

## చతుర్థోஉధ్యాయః

**వ్యాస ఉవాచ.**

1.శ్లో. ఇతి బ్రువాణం సంస్తూయ
మునీనాం దీర్ఘసత్రిణామ్ ।
వృద్ధః కులపతిః సూతం
బహ్వృచః శౌనకోஉబ్రవీత్ ॥

టీ :- శ్లో.తుర్యే భాగవతారంభకారణత్వేన వర్ణ్యతే, వ్యాసస్యాపరితోషస్తు తపః ప్రవచనాదిభిః. ఇతీతి. ఇత్యేవం ప్రసన్నవాచా శ్రావయిష్యామీతి బ్రువాణం బహూనాం మునీనాం మధ్యే ఏకేన వక్తవ్యే యో వృద్ధః. వృద్ధేష్వపి బహుషు యః. కులపతిః గణముఖ్యఃతేష్వపి బహుషు యో బహ్వృచః ఋగ్వేదీ తేన వక్తవ్యం. అత ఏవం భూతత్వాచ్ఛౌనకోஉబ్రవీత్. (1)

## నాలుగవ అధ్యాయము

**వ్యాసులవారు చెపుతున్నారు**

నాలుగవ అధ్యాయమున భాగవతారంభకారణమును చెపుతున్నాడు. ఈ విధముగా శ్రీశుకుల వారివలన భాగవతము విన్నానని సూతుడు చెప్పి దానిని మీకు నెమ్మదిగా వినిపించగలననడంతోనే ఆతనిని స్తుతించి, దీర్ఘసత్రయాగముననున్న మునులలో వృద్ధుడు, కులపతి, ఋగ్వేదియగు శౌనకుడు ఇట్లు పలికెను. వ్యాసులవారికి తపస్సు వలన భారతాది పురాణ ప్రవచనాల వలన సంతోషము,మనశ్శాంతి కలుగలేదు. ఆతని మనశ్శాంతికై భాగవత రచన జరిగినది.(1)

**శౌనక ఉవాచ .**

2.శ్లో. సూత సూత మహాభాగ
వద నో వదతాం వర ।
కథాం భాగవతీం పుణ్యాం
యదాహ భగవాన్ శుకః ॥

టీ :- సూతేతి. యత్ యాం కథామాహ. (2)

**శౌనకుడిట్లడిగెను.**

వక్తలలో శ్రేష్ఠుడవగు ఓ మహాత్మా ! సూత పౌరాణికుడా! భగవత్ స్వరూపుడగు శ్రీశుకమహర్షి పుణ్యమైన భాగవత కథను ఎట్టిదానిని చెప్పెనో దానిని మాకు వినిపించండి. అని శౌనకుడు సూతుని అత్యాదరముతో ప్రశ్నించెను. సూత సూత అని ద్విరుక్తి ఆదరార్థము.(2)

3. శ్లో. కస్మిన్ యుగే ప్రవృత్తేయం
స్థానే వా కేన హేతునా ।
కుతః సంచోదితః కృష్ణః
కృతవాంత్సంహితాం మునిః ॥

టీ :- కస్మిన్నితి. కస్మిన్ యుగే కస్మిన్వా స్థానే కేన హేతునేతి మహాభారతాది సర్వశాస్త్రాణి కృతవతః పునరేతత్సంహితాకరణే కిం కారణమిత్యర్థః. కుత ఇతి సార్వవిభక్తికస్తసిః. కేన ప్రవర్తిత ఇత్యర్థః కృష్ణో వ్యాసః. (3)

4. శ్లో. తస్య పుత్రో మహాయోగీ
సమదృఙ్నిర్వికల్పకః ।
ఏకాంతమతిరున్నిద్రో
గూఢో మూఢ ఇవేయతే ॥.

టీ :- యదుక్తం స తు సంశ్రావయామాసేతి తత్ర శుకస్య వ్యాఖ్యానాదికం కథం ఘటితమితి ప్రష్టుం తస్యాసంగోదాసీనతామాహ - ద్వాభ్యాం. తస్యేతి. సమదృక్ సమం బ్రహ్మ పశ్యతీతి. అతో నిర్వికల్పకః స్వార్థే కః. నిరస్తభేదః. కించ ఏకస్మిన్నేవ అంతస్సమాప్తి ర్యస్యాస్సా తథాభూతా మతిర్యస్య సః యత ఉన్నిద్రః మాయాశయనా

ఈ భాగవత కథ ఏ యగమున జరిగినది, ఎచ్చట జరిగినది, ఏ కారణంగా జరిగినది. కృష్ణద్వైపాయనుడగు వ్యాసమునీంద్రుడు ఎవరి వలన ప్రేరేపింపబడి ఈ భాగవతసంహితను రచించెను అని శౌనక ప్రశ్న . మహాభారతాది సంహితలను రచించినట్టి వ్యాసుడు ఈ భాగవత సంహితను రచించుటకు కారణమేమి? అని ఇచట 'కుతః' అనునది సార్వ విభక్తి కార్థక తసిల్ ప్రత్యయము. కృష్ణుడనగా కృష్ణద్వైపాయనుడు, వ్యాసుడని వివరణ. (3)

ఆ వేదవ్యాసమహర్షి కుమారుడగు శుకుని గురించి వివరిస్తున్నాడు. పరీక్షిత్తునకు శుకుడు భాగవతసంహితను వినిపించెనని పూర్వము చెప్పినాడుకదా సూతుడు. అట్టి శుకయోగీంద్రుడు ఈ భాగవతమును వివరించుట యెట్లు ఘటించెనని ప్రశ్నించుకుని, ఆయన సంగరహితుడు ప్రాపంచిక విషయములందు ఉదాసీనుడని చెపుతున్నాడు. శ్రీశుకుడు గొప్ప యోగీశ్వరుడు, సమదృష్టి కలవాడు, అంతటను పరబ్రహ్మను దర్శించువాడు,అందువలన నిర్వికల్పుడు. ఎలాంటి వికారాలు లేనివాడు. నిర్వికల్పకః అనుచోట కప్రత్యయము 'స్వార్థమున వచ్చినదని స్వార్థేకః అను వ్యాకరణాంశము. ఒకే బ్రహ్మమునందు పర్యవసానమునొందిన బుద్ధిగలవాడు, భేదరహితుడు, జాగరూకుడు, మాయనుండి మేల్కొన్నవాడు అందువల్ల రెండు

దుర్బుద్ధిః. నిద్రా మాయా. శ్లో. ' యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ'తి స్మృతేః. అత ఏవ గూఢః అప్రకటః. మూఢ ఇవ ప్రతీయతే. నిర్వికల్పకః – విరుద్ధః కల్పో వికల్పః పరస్పర విరుద్ధపక్షద్వయం. తద్గోచరం. సంశయాత్మకం జ్ఞానం నాస్యేతి నిర్వికల్పకః. నిశ్చయాత్మకజ్ఞానవత్త్వాత్ సంశయచ్ఛేత్తేతి ఫలితోర్థః. ఏకాంతమతిః నిర్జనదేశనివాసరసికః. గూఢః సర్వజ్ఞత్వేఽపి స్వసామర్థ్య ప్రకటనరహితః మహాయోగీ నిరంతరయోగతత్పరః(4)

5. శ్లో. దృష్ట్వాఽనుయాంతమృషిమాత్మజమప్యనగ్నం
దేవ్యో హ్రియా పరిదధుర్న సుతస్య చిత్రమ్ ।
తద్వీక్ష్య పృచ్ఛతి మునౌ జగదుస్తవాస్తి
స్త్రీపుంభిదా న తు సుతస్య వివిక్తదృష్టేః ॥

టీ :- నిర్వికల్పత్వం ప్రపంచయతి – దృష్ట్వేతి. ఆత్మజం శుకం ప్రవ్రజన్తం సర్వం సన్న్యస్య గచ్ఛంతం అనుయాంతం అనుగచ్ఛంతం ఋషిం వ్యాసం అనగ్నమపి దృష్ట్వా జలే క్రీడంత్యో దేవ్యః అప్సరసః హ్రియా లజ్జయా వస్త్రపరిధానం కృతవత్యః. అనగ్నమపీత్యనేన అర్థాత్ తత్సుతో నగ్న ఇత్యుక్తం భవతి. నగ్నస్య పురతో గచ్ఛతస్సుతస్య తు హ్రియా న పరిదధుః. తచ్చరిత్రం వీక్ష్య. ఇయం స్త్రీ అయం పుమానితి భిదా భేదః తవాస్తి. వివిక్తా పూతా దృష్టిర్యస్య.(5)

శ్లోకాలతో తస్య అని రహస్యంగా తన విషయం ఇతరులకు తెలియనీక, చూపరులకు మూఢునివలె అజ్ఞానివలె తోచువాడు అని శుక ప్రశంస ఆయన యోగి కనుక ప్రాపంచిక విషయాల జోలికిబోక, సర్వ ప్రాణులు అద్వితీయ పరబ్రహ్మ విషయమును తెలియక నిద్రించుచుండగా ఆ విషయమున ఆయన మెలుకువగా ఉండి పరబ్రహ్మ దర్శనము చేయునని భావము. ఈ విషయమున భగవద్గీత స్మృతిని యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ అని ఉదాహరణీయము.(4)

శుకుని వికారరాహిత్యాన్ని నిర్వికల్పత్వాన్ని తెలుపుతున్నాడు. తన కుమారుని శుకుని పుత్రా ! పుత్రా ! అని వెంబడిబడి పిలుస్తూ వస్తున్న, దుస్తులతో ఉన్న వ్యాసుని చూచి అప్సరసలు తమ వస్త్రాలు ధరించారు. నగ్నంగా ముందు వస్తున్న శుకుని చూచి దిగంబరంగానే ఉన్నారు. ఆ స్త్రీలు సిగ్గు పడలేదు ! ఇది ఏమి చిత్రము ! అని వ్యాసులు ఆ స్త్రీలను అడుగగా 'నీకు ఆడా మగ భేదముకలదు పవిత్రమగు దృష్టికల నీ కుమారునికి అట్టి భేదదృష్టిలే'దని ఆ స్త్రీలు తెలిపారు. ఇచట వ్యాసుడు అనగ్నుడుగా చెప్పబడగా శుకుడు నగ్నుడని పరిశేషన్యాయముతో గుర్తించాలి.(5)

6. శ్లో. కథమాలక్షితః పౌరైః
సంప్రాప్తః కురుజాంగలాన్ ।
ఉన్మత్తమూకజడవద్
విచరన్ గజసాహ్వయే ॥

టీ :- కథమితి. ఏవంభూతోఽసౌ కథమాలక్షితః జ్ఞాతః? కురవో జాంగలాశ్చ దేశవిశేషాః తాన్ సంప్రాప్తః ప్రథమం తతో గజసాహ్వయే విచరన్ గజేన సహితః ఆహ్వయో నామ యస్య తస్మిన్. హస్తినాపురే హస్తీ నామ రాజా తేన నిర్మితత్వాత్.(6)

ఇలాంటి శుకుడు జ్ఞానియని ఎవరు గుర్తించక ముందే కురుజాంగల దేశాలను పొంది తరువాత హస్తినాపురము చేరెను. గజము ఏనుగు దాని పేరుగల పురము హస్తినాపురము గజ, హస్తి పర్యాయ పదాలు. ఒక విశేషము చెప్పబడినది, హస్తి అనునది ఒక రాజు పేరు ఆ రాజుచేత నిర్మించడినది కనుక ఆ పట్టణానికి హస్తిపురమని పేరు వచ్చెనట శుకమహర్షి దేశాలన్ని పిచ్చివాని వలె, మూగవలె, జడునివలె, స్తబ్ధునివలె ప్రజలతో చూడబడుతూ తిరుగుతూ హస్తిపురము చేరెను. ప్రజలు శుకుని వెఱ్ఱివానిలా చూచారు. (6)

7. శ్లో. కథం వా పాండవేయస్య
రాజర్షేర్మునినా సహ ।
సంవాదః సమభూత్తాత
యత్రైషా సాత్త్వతీ శ్రుతిః ॥

టీ :- కథమితి. ఏవంభూతేన మునినా సహ. యత్ర సంవాదే ఏషా సాత్వతీ భాగవతీ శ్రుతిః భాగవతసంహితా. (7)

సూతా ! పాండవవంశీయుడగు రాజర్షి పరీక్షిన్మహారాజుకు శుకమహర్షితో కలయిక , సంవాదము ఎట్లు జరిగెనో ఏ సంవాదమున సత్త్వ గుణప్రధానమగు భాగవతసంహిత, భగవత్కథ ఎట్లు ఆవిర్భవించెనో తెలుపుమని శౌనక ప్రశ్న.(7)

8.శ్లో. స గోదోహనమాత్రం హి
గృహేషు గృహమేధినామ్
అవేక్షతే మహాభాగః
తీర్థీకుర్వంస్తదాశ్రమమ్ ॥

టీ :- ఏతద్వ్యాఖ్యానం బహుకాలావస్థానాపేక్షం. తస్య త్వేకత్రావస్థానం దుర్లభమిత్యాహ - స ఇతి. గోదోహనమాత్రం కాలం ప్రతీక్షతే. తదపి న భిక్షార్థం. తేషాం ఆశ్రమం గృహం తీర్థీకుర్వన్ పవిత్రీకుర్వన్ తస్మాదేవంభూతో వక్తేత్యాశ్చర్యం. (8)

ఆ శుకమహర్షి ఆవుపాలు పితికినంత కాలంకూడ గృహస్థుల ఇండ్లలో ఉండడు. మహాశయుడు భిక్ష కొఱకు గృహస్థుల ఇండ్లకు వెళ్ళడు. ఆ గృహస్థుల ఆశ్రమాన్ని పునీతంచేయుటకే తిరుగుతుంటాడు. ఇట్టి మహనీయుడు ఇచట వక్త . ఏడు రోజులు నివసించి శుకుడు పరీక్షిత్తుకు భాగవతాన్ని బోధించుట చిత్రము ! (8)

9.శ్లో. అభిమన్యుసుతం సూత
ప్రాహుర్భాగవతోత్తమమ్ ।
తస్య జన్మ మహాశ్చర్యం
కర్మాణి చ గృణీహి నః ॥

టీ :- శ్రోతుశ్చరితమతీవాశ్చర్యం యతః, అతః కథయేత్యాహ - పంచభిః. అభిమన్యుసుతమితి, గృణీహి కథయ. (9)

భాగవత వక్త శుకమహర్షి విశిష్టతను తెలిపి శ్రోతయగు పరీక్షిన్మహారాజు చరిత్రకూడ గొప్ప ఆశ్చర్యజనకము అంటాడు శౌనకుడు. అభిమన్యుని కుమారుడగు పరీక్షిత్తు పరమభాగవతోత్తముడు భగవద్భక్తుడు. ఓ సూత ఆతని ఆశ్చర్యకరమగు జననాన్ని ఆతని పనులను కూడ మాకు వినిపించండి అని శౌనకమహర్షి ప్రశ్నించాడు .(9)

10.శ్లో. స సమ్రాట్ కస్య వా హేతోః
పాండూనాం మానవర్ధనః
ప్రాయోపవిష్టో గంగాయామ్
అనాదృత్యాధిరాట్శ్రియమ్ ॥

టీ :- స ఇతి. స సమ్రాట్ చక్రవర్తీ. వేతి వితర్కే. కస్య వా హేతోః కస్మాత్కారణాత్. అధికారాట్ఛ్రియం అధిరాజాం శ్రియం సంపదమనాహృత్య. (10)

పాండవ వంశానికే కీర్తితెచ్చు చక్రవర్తియగు పరీక్షిన్మహారాజు ఏ కారణంగా రాజ్యసంపదను వదలి గంగా తీరమున ప్రాయోపవిష్టుడాయెనో తెలుపండి.(10)

11.శ్లో. నమంతి యత్పాదనికేతమాత్మనః
శివాయ హానీయ ధనాని శత్రవః ।
కథం స వీరః శ్రియమంగదుస్త్యజాం
యువైషతోత్స్రష్టుమహో సహాసుభిః ॥

టీ :- నమంతీతి. యస్య పాదనికేతనం చరణపీఠం. ధనాన్యానీయ శత్రవో నమంతి. అంగ హే సూత. యువా తరుణ ఏవ ఐషత ఐచ్ఛత్. ఆత్మనేపదమార్షం. అసుభిః ప్రాణైః సహ. (11)

ఓ సూతా ! ఏ పరీక్షిన్మహారాజు యొక్క పాదపీఠికను వారి క్షేమము కొఱకు ఆయన శత్రువులు ధన ధాన్యరాసులను తెచ్చి సమర్పించుచు నమస్కరింతురో అట్టి మహావీరుడు పరీక్షిత్తు. యువకుడు విడుచుటకు వీలులేని గొప్ప ఐశ్వర్యమును ప్రాణములతో సహా విడిచిపెట్టుటకు ఎందుకు సిద్ధపడెను? ఇచట 'ఇష ఇచ్ఛాయాం' అనే ధాతువు పరస్మైపదము శేషాత్కర్తరి పరస్మైపదము అని సూత్రము. కాని ఐషత అని ఆత్మనేపదంగా ప్రయోగింపబడినది ఈ ప్రయోగము ఆర్షము.(11)

12. శ్లో. శివాయ లోకస్య భవాయ భూతయే
య ఉత్తమశ్లోకపరాయణా జనాః ।
జీవంతి నాత్మార్థమసౌ పరాశ్రయం
ముమోచ నిర్విద్య కుతః కలేబరమ్ ॥

టీ :- నను విరక్తస్య కిం ధనాదిభిరీతి చేత్తత్రాహ - శివాయేతి. లోకస్య శివాయ సుఖాయ భవాయ సమృద్ధయే భూతయే ఐశ్వర్యాయ చ తే జీవంతి. న త్వాత్మార్థం. ఏవం సతి అసౌ రాజా నిర్విద్య విరజ్యాపి, పరేషామాశ్రయం కళేబరం కుతో హేతోః ముమోచ? న హి పరోపజీవనం స్వయం త్యక్తుముచితమిత్యర్థః. (12)

విరక్తుడగు పరీక్షిత్తుకు ధనాదులతో ఏమి ప్రయోజనము? అనుదానికి చెపుచున్నాడు భగవద్భక్తులగు జనులు లోక క్షేమము కొఱకు అభివృద్ధికొఱకు అదే విధంగా లోకుల ఐశ్వర్యము కొఱకు కేవలము పరోపకారము కొఱకే జీవింతురు కాని వారి స్వార్థము కొఱకు కాదు. ఇట్లుండగా భగవద్భక్తుడగు పరీక్షిత్తు విష్ణురాతుడు వైరాగ్యాన్ని పొంది ఇతరులకు ఉపకరించే తన శరీరాన్ని ఎందుకు విడిచిపెట్టాడు ? తనకోసం కాకున్నను ఇతరుల జీవనానికి ఆధారమైన శరీరాన్ని స్వయముగా వదలుట ఉచితము కాదు కదా? అని ఋషుల ప్రశ్న.(12)

13. శ్లో. తత్సర్వం నః సమాచక్ష్వ
పృష్టో యదిహ కించన ।
మన్యే త్వాం విషయే వాచాం
స్నాతమన్యత్ర ఛాందసాత్ ॥

టీ :- తదితి. యత్కించన పృష్టోఽసి తత్సర్వం నోఽస్మభ్యం సమాచక్ష్వ. యత్ యస్మాత్ వాచాం విషయే గిరాం గోచరే అర్థే స్నాతం పారం గతం త్వాం మన్యే. ఛాందసాదన్యత్ర వైదికవ్యతిరేకేణ అత్రైవర్ణికత్వాత్ (13)

ఓ సూతమహామునీ ! మాచే కోరబడిన ఈ చిన్న అంశాన్ని మాకు చెప్పవలసినది. ఎందుకనగా మీరు వేదవాక్కులందు తప్ప మిగతా వాక్కులలో నిష్ణాతులు అని మేము భావించుచున్నాము అని శౌనకుడు ప్రశ్నించెను. వేదమునందు తప్ప అనుటచే సూతుడు త్రైవర్ణికుడుకాడని తెలియుచున్నది.(13)

**సూత ఉవాచ.**

14. శ్లో. ద్వాపరే సమనుప్రాప్తే
తృతీయే యుగపర్యయే ।
జాతః పరాశరాద్యోగీ
వాసవ్యాం కలయా హరేః ॥

టీ :- కస్మిన్ యుగ ఇత్యాది ప్రశ్నానాం వ్యాసజన్మకథనపూర్వక ముత్తరమాహ - ద్వాపర ఇతి. ద్వాపరే సమనుప్రాప్తే. కదేత్య పేక్షాయామాహ–తృతీయే యుగస్య పర్యయే పరివర్తే చరమభాగ ఇత్యర్థః వాసవ్యాముపరిచరస్య వసోర్వీర్యాజ్జాతాయాం సత్యవతాం యోగీ జ్ఞానీ వ్యాసో జాతః. (14)

**సూతుడు చెపుచున్నాడు.**

ఏ యుగమందు ఈ కథ జరిగెను అను ప్రశ్నలకు వ్యాసమహర్షి జన్మవృత్తాంతముతో ఆరంభించి సమాధానము చెపుచున్నాడు. ద్వాపరయుగము మూడవ పర్యాయమునందు ఉపరిచరవసువు వీర్యము వలన జన్మించిన సత్యవతియందు పరాశరమహాముని వలన యోగీశ్వరుడు మహాజ్ఞానియగు వ్యాసమహర్షి జన్మించెను. (14)

15. శ్లో. స కదాచిత్ సరస్వత్యా
ఉపస్పృశ్య జలం శుచిః ।
వివిక్త ఏక ఆసీనః
ఉదితే రవిమండలే ॥

టీ :- స ఇతి. జలముపస్పృశ్య జలే స్నానాదికం కృత్వేత్యర్థః. ఆసీనో బభూవేతి శేషః. వివిక్తేప్రదేశ ఇత్యాది చిత్తైకాగ్ర్యార్థముక్తం. అనేనైవ బదరికాశ్రమస్థానం సూచితం. (15)

ఆ వ్యాసమహర్షి ఒకానొకప్పుడు సరస్వతీ నదిలో స్నానముచేసి ఆచమనంచేసి శుచియై కూర్చొనెను. ఏకాంతస్థలమున అనడంతో చిత్తముయొక్క ఏకాగ్రతకు మూలమైన ప్రశాంతమగు బదరికాశ్రమ స్థలమున అని సూచించబడినది. సూర్యోదయ సమయమున ఒకడే కూర్చొని వ్యాసుడు ఆలోచించసాగెను. (15)

16.శ్లో. పరావరజ్ఞః స ఋషిః
కాలేనావ్యక్తరంహసా ।
యుగధర్మవ్యతికరం
ప్రాప్తం భువి యుగే యుగే ॥

టీ :- పరావరజ్ఞఇతి. తత్ర చ ఋషిః యుగధర్మవ్యతికరాదికం వీక్ష్య సర్వవర్ణాశ్రమాణాం యద్ధితం తద్దధ్యావితి తృతీయశ్లోకే నాన్వయః. పరావరజ్ఞః అతీతానాగతవిత్. అవ్యక్తం రంహో వేగో యస్య తేన కాలేన. యుగధర్మాణాం వ్యతికరం సంకరం ప్రాప్తం వీక్ష్య. తథా భువి యుగే యుగే. (16)

అతీతానాగతములనెరిగిన ఆ మహర్షి వ్యాసుడు అచట గుర్తింపదగని వేగముగల కాలమున ప్రతియుగమున భూలోకమున కలుగు యుగధర్మముల సాంకర్యాన్ని చూచి అన్ని వర్ణాలవారికి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులకు ఏది హితమో దానిని ఆలోచించెను (16)

17.శ్లో. భౌతికానాం చ భావానాం
శక్తిహ్రాసం చ తత్కృతమ్ ।
అశ్రద్దధానాన్ నిఃసత్త్వాన్
దుర్మేధాన్ హ్రసితాయుషః ॥

18.శ్లో. దుర్భలాంశ్చ జనాన్వీక్ష్య
మునిర్దివ్యేన చక్షుషా ।
సర్వవర్ణాశ్రమాణాం యత్
దధ్యౌ హితమమోఘదృక్ ॥

వ్యాసమహర్షి కాలము యొక్క మహిమ వలన శరీరధారులలో శక్తి తగ్గుట మనుష్యులు శ్రద్ధలేని వారగుట, వారి మేధాశక్తి పెడదారిపట్టుట, బలహీనులు, ధైర్యములేనివారగుట అల్పాయుష్మంతులగుట వీటిని దివ్య దృష్టితో చూచెనని ముందటి శ్లోకముతో అన్వయము.(17)

అమోఘమైన చూపుగల వ్యాసమహర్షి దౌర్భాగ్యులగు మానవులను,వారి బలహీనతను దివ్యచక్షుస్సుతో చూచి అన్ని వర్ణాలవారికి బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియ, శూద్రులకు అన్ని ఆశ్రమాల

టీ :- భౌతికానామితి. భౌతికానాం శరీరాదీనాం తత్కృతం కాలకృతం. నిఃసత్త్వాన్ ధైర్యశూన్యాన్. దుర్మేధాన్మందమతీన్. తతశ్చ. (17,18)

వారికి అనగా బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, యత్యాశ్రమాల వారికి ఏది హితమగునని ఆలోచించెను. (18)

19. శ్లో. చాతుర్హోత్రం కర్మ శుద్ధం
ప్రజానాం వీక్ష్య వైదికమ్ ।
వ్యదధాద్యజ్ఞసంతత్యై
వేదమేకం చతుర్విధమ్ ॥

టీ :- చాతుర్హోత్రమితి. హోత్రోపలక్షితాశ్చత్వార ఋత్విజ చతుర్హోతారః తైరనుష్ఠేయం కర్మ. శుద్ధం విశుద్ధికరం కర్మయజ్ఞ సంతత్యై యజ్ఞానామవిచ్ఛేదాయ. (19)

వ్యాసమహర్షి నలుగురు ఋత్విక్కులు అనగా హోత మున్నగువారు (హోత, ఉద్గాత, అధ్వర్యుడు, బ్రహ్మ అనువారు) నిర్వహించునట్టి, పరిశుద్ధమైన ప్రజల యొక్క వైదిక కర్మ, యజ్ఞములు అవిచ్ఛిన్నముగా కొనసాగుటకు ఒకచోట రాశిగా ఉన్న వేదాన్ని నాలుగు విధములుగా ఋగ్యజుస్సామాథర్వాలుగా విభజించెను. అందుకే ఆయనకు వేదవ్యాసుడని పేరు కలిగెను. ప్రజలు సుభిక్షము కలిగి సుఖముగా ఉండుటకు యజ్ఞములు అవసరము కావున ఒక్కటిగా ఉన్న వేదాన్ని నాలుగుగా విభజించెను. యజ్ఞపురుషుని యజ్ఞము లందు ఋక్కులతో స్తుతించుట, యజుస్సులతో హోమముగావించుట, సామవేద మంత్రాలతో గానం చేయుట ప్రసిద్ధి. ఋగ్భిస్తువన్తి యజుర్భిర్యజన్తి సామభిర్గాయన్తి అని కలదు.(19)

20. శ్లో. ఋగ్యజుస్సామాథర్వాఖ్యాః
వేదాశ్చత్వార ఉద్ధృతాః ।
ఇతిహాస పురాణం చ
పంచమో వేద ఉచ్యతే ॥

టీ :- చాతుర్విధ్యమేవాహ - ఋగితి. ఉద్ధృతాః పృథక్కృతాః(20)

ఋగ్యజుస్సామాథర్వములను పేర్లు గలవిగా నాలుగు వేదాలను వ్యాసులు వేరుపరచిరి. భారతేతిహాసము, పురాణములు పంచమ వేదముగా చెప్పబడుచున్నవి. వాటిని కూడా వ్యాసమహర్షి విరచించెను.(20)

21. శ్లో. తత్రర్గ్వేదధరః పైలః
సామగో జైమినిః కవిః ।
వైశంపాయన ఏవైకో
నిష్ణాతో యజుషాం గణే ॥

టీ :- తత్రేతి. కవిః పూర్వమీమాంసాకృత్త్వాత్ జైమినిః. (21)

22. శ్లో. అథర్వాంగిరసామాసీత్
సుమంతుర్దారుణో మునిః ।
ఇతిహాస పురాణానాం
పితా మే రోమహర్షణః ॥

టీ :- అథర్వేతి. దారుణః అథర్వోక్తాభిచారాదేరత్ర ప్రవృత్తేః. (22)

23. శ్లో. త ఏవ ఋషయో వేదం
స్వం స్వం వ్యస్యన్ననేకధా ।
శిష్యైః ప్రశిష్యైస్తచ్ఛిష్యైః
వేదాస్తే శాఖినోఽభవన్ ॥

టీ :- త ఇతి. వ్యస్యన్ విభాగం కృతవంతః. (23)

ఆ వ్యాసమహర్షి తన శిష్యులగు నలుగురికి నాలుగు వేదాలను బోధించెను. వాటిలో పైలుడు ఋగ్వేదమున, జైమిని పండితుడు సామవేదమున, వైశంపాయనుడు ముఖ్యముగా యజుర్వేదమున నిష్ణాతులై ధరించిరి. (21)

భయంకరుడైన (క్రూరుడైన) సుమంతుడు, అథర్వవేదాన్ని నేర్చుకొని అభిచారిక ప్రయోగాది క్రియలందు ఆరితేరెను. అందుకే దారుణుడను విశేషణము ఆయనకు వేయబడినది. ఇతిహాస పురాణాలను మా నాన్నగారు రోమహర్షణుడు అధ్యయనంచేసెను. అని సూతుడు శౌనకాదులకు వివరించాడు. (22)

ఆయా ఋషులందరు తమ తమ వేదాలను అనేక విధాలుగా విభజించి, అనేకమంది శిష్యులకు బోధించిరి. ఈ శిష్యులు వారి శిష్యులకు ప్రశిష్యులకు వారు వారి శిష్యులకు అనూచానంగా బోధిస్తూవచ్చారు. దానివలన వేదాలలో అనేక శాఖలు ఏర్పడినవి. (23)

24. శ్లో. త ఏవ వేదా దుర్మేధైః
ధ్యారంతే పురుషైర్యథా ।
ఏవం చకార భగవాన్
వ్యాసః కృపణవత్సలః ॥

టీ :- వేదవిభాగ ప్రయోజనమాహ - త ఇతి. యే పూర్వమతిమేధా విభిర్ధార్యంతే. తఏవేతి. (24)

అట్టి వేదవిభాగ ప్రయోజనము త ఏవ అని చెపుతున్నాడు. పూర్వము అతి మేధావంతులు వేదాన్ని ధరించినట్లు అందరు ధరించలేరని, ఆ వేదాలనే మేధాశక్తి లేనివారు మానవులు ఎట్లు ధరించగలుగుతారు? అని ఆలోచించి, వేదాలను తన శిష్యుల ద్వారా శాఖోపశాఖలుగా వ్యాసులవారు విస్తరింపజేసినారు. అందుకే దీనులయందు దయగలవాడు పూజ్యుడు అని ఆయనకు విశేషణము వేయబడినది.(24)

25. శ్లో. స్త్రీశూద్రద్విజబంధూనాం
త్రయీ న శ్రుతిగోచరా
కర్మశ్రేయసి మూఢానాం
శ్రేయ ఏవం భవేదిహ ।
ఇతి భారతమాఖ్యానం
కృపయా మునినా కృతమ్ ॥

టీ :- కించ - స్త్రీతి. ద్విజబంధవః త్రైవర్ణికేష్వధమాః. తేషాం కర్మరూపే శ్రేయసి శ్రేయస్సాధనే. ఏవం భవేత్ అనేన ప్రకారేణ భవతుఇతి. తేషాం కృపయా భారతమాఖ్యానం మునినా కృతమ్. (25)

అంతేకాకుండా స్త్రీలు, శూద్రులు, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులనే మూడు వర్ణాలవారిలో కూడా భ్రష్టులు, అధములు అందరూ వేదము చదివే అధికారమున్నవారుకారని, అలాంటివారి చెవిలో వేదం పడరాదని, అట్టి కర్మరహిత మూఢులకు కర్మరూప శ్రేయస్సు ఈవిధంగా కలుగాలని దీనవత్సలుడగు వ్యాసముని దయతో భారతమను ఇతిహాసాన్ని రచించెను. వేదాధికారములేనివారు భారతమును చదివి విని తరించాలని భావము.(25)

26.శ్లో. ఏవం ప్రవృత్తస్య సదా
భూతానాం శ్రేయసి ద్విజాః ।
సర్వాత్మకేనాపి యదా
నాతుష్యద్ధృదయం తతః ॥

టీ :- ఏవమనేన ప్రకారేణ భూతానాం శ్రేయసి హితే. సర్వాత్మకేనాపి కర్మణా. (26)

ఓ ఋషులారా ! ఈ విధముగా సమస్తప్రాణులకు శ్రేయస్సు ఎల్లప్పుడు కలుగాలని పాటుపడిన సర్వాత్మకుడైన సమదృష్టిగల వ్యాసమహర్షి మనస్సు సంతోషంగా, ప్రసన్నంగా లేని సమయంలో విచారంతో ఈ విధంగా అనుకున్నాడు.( తదుపరి శ్లోకంతో అన్వయము.) (26)

27.శ్లో. నాతిప్రసీదద్ధృదయః
సరస్వత్యాస్తటే శుచౌ ।
వితర్కయన్వివిక్తస్థే
ఇదం ప్రోవాచధర్మవిత్ ॥

టీ :- నాతిప్రసీదత్ హృదయం యస్య సః. చిత్తస్యాప్రసన్నత్వే హేతుం వితర్కయన్. ఇదమువాచ చ స్వగతమ్. (27)

మిక్కిలి ప్రసన్నముగా లేని మనస్సుకల ఆ వ్యాసముని పరిశుద్ధమైన సరస్వతీనదీ తీరమున ఏకాంతముగా ఆలోచిస్తూ తనకు మనశ్శాంతి ఎందుకు కలుగలేదని విచారిస్తూ తనలోతాను ఈవిధంగా అనుకొనెను.(27)

28.శ్లో. ధృతవ్రతేన హి మయా
ఛందాంసి గురవోఽగ్నయః ।
మానితా నిర్వ్యలీకేన
గృహీతం చానుశాసనమ్ ॥

టీ :- నిర్వ్యలీకేన నిష్కపటబుద్ధ్యా మానితాః పూజితాః. (28)

వ్రతనిష్ఠుడనై నియమబద్ధుడనగు నాచేత, వేదములు, అగ్నిహోత్రాలు, గురువులు అందరు నిష్కపటమగు గుణబుద్ధితో మన్నింపబడినారు. అనగా పూజింపబడినారని అభిప్రాయము. ఆ వేదాలలో ఉన్న ధార్మికశాసనాన్ని నేను గౌరవించాను. అయినా నాకెందుకు మనశ్శాంతి కలుగుటలేదు? అని వ్యాసముని అనుకుంటున్నాడు. (28)

29. శ్లో. భారతవ్యపదేశేన
హ్యామ్నాయార్థః ప్రదర్శితః ।
దృశ్యతే యత్ర ధర్మాది
స్త్రీశూద్రాదిభిరప్యుత ॥

30. శ్లో. తథాఽపి బత మే దైహ్యో
హ్యాత్మా చైవాత్మనా విభుః ।
అసంపన్న ఇవాభాతి
బ్రహ్మవర్చస్యసత్తమః ॥

టీ :- దైహ్యో దేహేభవ ఆత్మా జీవో వస్తుతో విభుః పరిపూర్ణ ఏవ ఆత్మనా స్వేన రూపేణ అసంపన్నః తాదాత్మ్యమప్రాప్త ఏవాభాతి. 'బ్రహ్మవర్చసః వేదశ్రవణాధ్యాపనోత్కర్షజం తేజః తత్ర సాధవో బ్రహ్మవర్చస్యాః. తేషు సత్తమః అతిశ్రేష్ఠోఽపి. యద్వా. న కేవల మసంపన్న ఇవాభాతి, ప్రత్యుత బ్రహ్మవర్చస్వీ బ్రహ్మవర్చస వానపి. ఉశత్తమ ఇతి పాఠాంతరే కమనీయతమోఽపి. (29,30)

భారతమను పేరు పెట్టి ఆ వ్యాజంతో దానిలో వేదార్థము చూపాను. అనగా విస్తారములగు వేదాలలోనున్న ధర్మాలన్నీ విస్తృతమగు లక్షశ్లోకాత్మక భారతమున వ్యాసముని వివరించెను. ఈ భారతమునందు ధర్మార్థకామమోక్షములు, అనేకధర్మములు, స్త్రీలచేత, శూద్రులచేత ద్విజబంధువులచేత అనగా వేదాధికారములేని వారిచేత కూడ చూడబడుచున్నవి. గ్రహించబడుతున్నవని అర్థము.(29)

అయ్యో ! అయినను నాదేహముననున్న జీవాత్మ వాస్తవానికి పరిపూర్ణుడు. విభువు. అంతటనున్నవాడే. అయినను స్వస్వరూపముతో అసంపన్నుడై తాదాత్మ్యమును పొందనట్లుగానే తోచుచున్నది, ఆనందస్వరూపుడైన ఆత్మకు ఆనందము, మనశ్శాంతి వ్యాసునకు కలుగుటలేదని భావము. ఆత్మకిచట బ్రహ్మవర్చస్యసత్తమః అను విశేషణము వేయబడినది బ్రహ్మవర్చసమనగా వేదము వినుట, చెప్పుట వలన ఏర్పడిన తేజస్సు, దానియందు సాధువులు, బ్రహ్మవర్చస్యులు. వారియందు శ్రేష్ఠుడు, మిక్కిలి ప్రశస్తుడు అసంపన్నుడుగా ఉన్నట్లు తోచుటచేకాదు. లేదా బ్రహ్మవర్చసి బ్రహ్మతేజము ఉన్నను శ్రేష్ఠుడుకానివానివలె కనిపించుచున్నాను.(ఈ శ్లోకమున కమనీయతమోతీతి అను పాఠాంతరము కలదు.) (30)

31శ్లో. కిం వా భాగవతా ధర్మాః
న ప్రాయేణ నిరూపితాః ।
ప్రియాః పరమహంసానాం
త ఏవ హ్యచ్యుతప్రియాః ॥

టీ :- అసంపత్తౌ హేతుం స్వయమేవాశంకతే - కింవేతి. ప్రాయేణ భూయస్త్వేనే. హి యస్మాత్త ఏవ ధర్మాః అచ్యుతస్య ప్రియాః. (31)

32.శ్లో. తస్యైవం ఖిలమాత్మానం
మన్యమానస్య ఖిద్యతః ।
కృష్ణస్య నారదోఽభ్యాగాద్ ।
ఆశ్రమం ప్రాగుదాహృతమ్ ॥

టీ :- ఖిలం న్యూనం ఖిద్యతః ఖేదం ప్రాప్నువతః కృష్ణస్య వ్యాసస్య ప్రాగుదాహృతం సరస్వతీతీరస్థం. (32)

వ్యాసుడు కింవా అని తన ఆత్మ అసంతృప్తిగా ఉండుటకు హేతువును తానే ఊహిస్తున్నాడు . నేను భగవంతునికి సంబంధించిన ధర్మాలను, గుణాలను, కథలను ఇంకా ఎక్కువగా ( కింవా వింకా ఇంకా అని మారి ఉండవచ్చును) నిరూపించలేదేమో ఎందుకనగా ఆధర్మాలే అనగా భగవద్గుణగణానువర్ణన రూపాలే యోగీశ్వరులకు స్వాములకు ఇష్టమైనవేమో, అవియే విష్ణుప్రియములు కదా? (31)

ఈ విధముగా తనలో ఏదో లోపమున్నదని బాధపడుచున్న వ్యాసముని యొక్క, సరస్వతీతీరమునగల ఆశ్రమమునకు నారదమహర్షి వచ్చెను. (32)

33. శ్లో. తమభిజ్ఞాయ సహసా
ప్రత్యుత్థాయాగతం మునిః ।
పూజయామాస విధివత్
నారదం సురపూజితమ్ ॥

టీ :- తం నారదమాగతమభిజ్ఞాయ సహసా ప్రత్యుత్థాయ విధవత్ పూజయామాస. సురపూజితమితి బ్రహ్మలోకాదాగతమిత్యర్థః. (33)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం సంహితాయాం ప్రథమేస్కంధే భావార్థదీపికాయాం చతుర్థోధ్యాయః**

వ్యాసమహర్షి దేవతలచే పూజింపబడిన ఆ నారదముని రాకను గుర్తించి వెంటనే లేచి శాస్త్రోక్త విధానముగా అతనిని పూజించెను. సురపూజితమనుటలో నారదుడు దేవలోకమునుండి వచ్చెనని తెలియును. (33)

**శ్రీమద్భాగవతము యొక్క ప్రథమస్కంధ చతుర్థాధ్యాయమునకు శ్రీధరీయవ్యాఖ్యానుసార ఆంధ్రానువాదము ముగిసినది.**

## పంచమోఽధ్యాయః

**సూత ఉవాచ.**

1శ్లో. అథ తం సుఖమాసీనమ్
ఉపాసీనం బృహచ్ఛ్రవాః ।
దేవర్షిః ప్రాహ విప్రర్షిం
వీణాపాణిః స్మయన్నివ ॥

టీ :- పంచమే సర్వధర్మేభ్యో హరికీర్తనగౌరవమ్, వ్యాసచిత్త ప్రసాదాయ నారదేనోపదిశ్యతే. అథేతి. ఉప సమీపే ఆసీనం విప్రర్షిం వ్యాసం బృహచ్ఛ్రవాః మహాయశాః. స్మయన్ ఈషద్ధసన్నివేత్యనేన ముఖప్రసత్తిర్ద్యోత్యతే. యద్వా, ఇవేత్యధికాశ్చర్యే. అహో! మహానపి ముహ్యతీతిస్మయమానః. (1)

**నారద ఉవాచ.**

2.శ్లో. పారాశర్య మహాభాగ
భవతః కచ్చిదాత్మనా ।
పరితుష్యతి శారీరః
ఆత్మా మానస ఏవ వా ॥

టీ :- శరీరాభిమాన్యాత్మాత్మనానేన శరీరేణ కచ్చిత్ కిం పరితుష్యతి. మానస ఆత్మామనోఽభిమానీ తేన మనసా పరితుష్యతి కచ్చిన్నోవా? (2)

## అయిదవ అధ్యాయము.

అయిదవ అధ్యాయమున అన్ని ధర్మాలకన్న హరినామ కీర్తనం గొప్పదని వ్యాసమహర్షి చిత్తశాంతి కొఱకు, నారదమహర్షి చేత ఉపదేశింపబడుచున్నది. సూతుడు చెపుతున్నాడు. తరువాత సమీపమున సుఖముగా కూర్చొనియున్న విప్రర్షి వ్యాసమహాముని తో వీణను చేతిలో ధరించిన, గొప్పకీర్తిగల దేవర్షి నారదమహాముని చిరునగవు చిందిస్తూ ఇట్లు పలికెను. ఇచట స్మయన్నివ చిరునగవుతో నున్నవాడు అని అనుటచేత నారదమహర్షి ఆనందముతో ఉన్నాడని అర్థము. ఇవ అనడంతో వ్యాసులవారికే జ్ఞానాధికారం లేనట్లు అని, స్మయన్నివ - నవ్వుచున్నట్టివాడై అనుటలో అంతగొప్పవాడు వ్యాసుడు కూడా మోహమును పొందుట ఆశ్చర్యము అని గ్రహించవలెను.(1)

**నారదుడు పలుకుచున్నాడు.**

మహాభాగ్యశాలివైన, పరాశర మహాముని కుమారుడవైన ఓ వ్యాసమహర్షీ ! నీ శరీరాభిమాని, అగు జీవాత్మ మనస్సుతో సంతోషముగా ఉన్నదా లేదా? అని కుశల ప్రశ్న నా శరీరము నా మనస్సు అని వాటిపై మనకు, జీవాత్మగా అభిమానముండుట లోకసహజము. అదే ఇచట వ్యాసుని విషయమున ప్రస్తావించబడినది. (2)

3. శ్లో. జిజ్ఞాసితం సుసంపన్నమ్
అపి తే మహదద్భుతమ్ ।
కృతవాన్ భారతం యస్త్వం
సర్వార్థపరిబృంహితమ్ ॥

టీ :- తే జిజ్ఞాసితం జ్ఞాతుమిష్టం. ధర్మాది యత్ తత్సర్వం సుసంపన్నం సమ్యక్ జ్ఞాతం గత్యర్థధాతోః జ్ఞానార్థకత్వాత్. అపిశబ్దాదనుష్ఠితం చేత్యర్థః అయీతి పాఠే సంబోధనం సుసంపన్నత్వే హేతుః మహదద్భుత మిత్యాది. సర్వైరర్థైర్ధర్మాదిభిః పరిబృంహితం పరిపూర్ణమ్. (3)

ఓ వ్యాసమహర్షీ! నీవు తెలిసికొనవలెననుకున్న దానినంతయు ధర్మార్థకామాదులను బాగాతెలిసికొన్నావు. అంతేకాక అపి అనడం వలన ధర్మాదులను అనుష్ఠించితివని కూడ అర్థము. ఇచట అపి అను మూలానికి బదులు అయి అని పాఠాంతరము ఉన్నది అప్పుడు అది సంబోధనార్థకము. ఇచట సుసంపన్నం అని అనుటకు బాగా తెలియదనుదానికి హేతువు, అది గొప్ప ఆశ్చర్యకరమైనది. సర్వార్థములతో ధర్మాదులతో పరిపూర్ణమైన భారతమును రచించితివి గదా! అంతకుమించి ఏమి కావలెనని భావము. "యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్ క్వచిత్" అని కదా భారత వైశిష్ట్యము అయినా నీకు తెలియలేదేమి అని భావము. (3)

4. శ్లో. జిజ్ఞాసితమధీతం చ
బ్రహ్మ యత్తత్సనాతనమ్ ।
తథాపి శోచస్యాత్మానమ్
అకృతార్థ ఇవ ప్రభో ॥

టీ :- కించ యత్సనాతనం నిత్యం పరబ్రహ్మ తచ్చ త్వయా జిజ్ఞాసితం విచారితం అధీతం చ అధిగతం ప్రాప్తం చేత్యర్థః, అథాపి శోచసి తత్కిమర్థమితి శేషః. (4)

అంతే కాకుండా ఓ మహర్షీ! సనాతనమగు పరబ్రహ్మతత్త్వాన్ని మీరు అధ్యయనం చేసి, తెలిసికొని, వివరించితిరి. ఉపనిషత్ప్రతిపాదిత సచ్చిదానంద స్వరూప బ్రహ్మను బ్రహ్మసూత్ర రచనచే పొందారుకదా అని భావము. అయినప్పటికిని ఎందుకు బాధపడుతున్నావు? అని అంటారు నారదులు. (4)

**వ్యాస ఉవాచ.**

5.శ్లో. అస్త్యేవ మే సర్వమిదం త్వయోక్తమ్ ।
తథాపి నాత్మా పరితుష్యతే మే ।
తన్మూలమవ్యక్తమగాధబోధమ్ ।
పృచ్ఛామహే త్వాత్మభవాత్మభూతమ్ ॥

టీ :- ఆత్మా శారీరో మానసశ్చ, తన్మూలం తస్యాపరితోషస్య కారణం. అవ్యక్తమస్ఫుటం. హే నారద త్వా త్వాం పృచ్ఛామః. ఆత్మభవో బ్రహ్మా తస్యాత్మనో దేహాదుద్భూతం. అత ఏవ అగాధో గంభీరో బోధో యస్య తం త్వామ్. (5)

**వ్యాసుడు ఇట్లనెను.**

ఓ నారదా ! నీవు అన్నదంతయు నిజమే, సందేహము లేదు. కాని నా మనశ్శరీర సంబంధమైన జీవాత్మ సంతోషపడుట లేదు. ఓ మునీ ! నీవు బ్రహ్మ మానస పుత్రుడవు. గంభీరజ్ఞానము కలవాడవు. నా మనోవైకల్యమునకు కారణము కనిపించుటలేదు. ఎంత యోచించినను తెలియుటలేదు నిన్ను అడుగుతున్నాను. దానికి కారణము ఏమైయుండునో నీవైనను చెప్పుము.(5)

6.శ్లో. స వై భవాన్ వేద సమస్త గుహ్యమ్ ।
ఉపాసితో యత్పురుషః పురాణః ।
పరావరేశో మనసైవ విశ్వం
సృజత్యవత్యత్తి గుణైరసంగః. ॥

టీ :- అగాధబోధతాం ప్రపంచయన్నాహ - ద్వాభ్యాం. స ఇతి. సర్వగుహ్యజ్ఞానే హేతుః - యద్యస్మాత్పురాణః అనాదిసిద్ధః పురుషః ఉపాసితస్త్వయా. కథంభూతః పరావరేశః కార్యకారణనియంతా. మనసైవ సంకల్పమాత్రేణ గుణైః కృత్వా విశ్వం సృజతీత్యాది. (6)

తనకు తెలియరాకుండుటకు కారణమును 'సవై' అను రెండు శ్లోకాలచేత తెలుపుచున్నాడు. ఓ నారదా ! నీవు సమస్త రహస్యాలు తెలిసినవాడవు ఏలయన పురాణపురుషుడగు శ్రీహరి నీ చేత ఉపాసింపబడినాడు. ఆయన కార్యకారణ నియంత తన సంకల్ప మాత్రము చేతనే గుణములచేత సత్త్వ, రజస్తమోగుణ రూపమగు వాటి చేత ఈ ప్రపంచాన్ని సృష్టిస్తున్నాడు, రక్షిస్తున్నాడు, సంహరిస్తున్నాడు. (6)

7. శ్లో. త్వం పర్యటన్నర్క ఇవ త్రిలోకీమ్ ।
అంతశ్చరో వాయురివాత్మసాక్షీ ।
పరావరే బ్రహ్మణి ధర్మతో వ్రతైః ।
స్నాతస్య మే న్యూనమలం విచక్ష్వ ॥

టీ :- కించ. త్వమితి. త్రిలోకీం పర్యటన్నర్క ఇవ సర్వదర్శీ. యోగబలేన ప్రాణవాయురివ సర్వప్రాణినామంతశ్చరన్. ఆత్మసాక్షీ బుద్ధివృత్తిజ్ఞః. అతః పరే బ్రహ్మణి ధర్మతః యోగేన నిష్ణాతస్య. తదుక్తం యాజ్ఞవల్క్యేన-శ్లో. ' ఇజ్యాచారదమాహింసాదానస్వాధ్యాయకర్మణాం అయం తు పరమో ధర్మో యద్యోగేనాత్మదర్శన' మితి. అపరే చ బ్రహ్మణి వేదాఖ్యే వ్రతైః స్వాధ్యాయనియమైః నిష్ణాతస్య, మే అలమత్యర్థం. యన్న్యూనం తద్విచక్ష్వ వితర్కయ. (7)

అంతేగాక నీవు మూడు లోకాలను తిరుగు సూర్యునివలె అన్నింటిని చూచేవాడవు. యోగబలంచేత సమస్త ప్రాణుల లోపల సంచరించు ప్రాణవాయువువలె ఆత్మ సాక్షివి. బుద్ధి అనగా చిత్తవృత్తులను, మనో బుద్ధి చిత్తాహంకారాలను తెలిసినవాడవు. కనుకనే పరావర బ్రహ్మయందు ధర్మము వలన వ్రతాదుల వలన నిష్ణాతుడనైన, ( దీనినే యాజ్ఞవల్క్యస్మృతి యత్యాచారమని అనగా ఇంద్రియనిగ్రహము, ఆచారము, అహింస, దానము, స్వాధ్యాయము కర్మల యొక్క ముఖ్యధర్మము యోగబలంతో ఆత్మను దర్శించుట మరియు వ్రత స్వాధ్యాయనియమముల చేత అపరవర బ్రహ్మ వేదమునందు నిష్ణాతుడగుట అని తెల్పుచున్నది. ) నాకు ఏదో తగినట్లు కనిపించుచున్నది. దానిని స్పష్టముగా తెల్పుము అని అడుగుచున్నాడు. (7)

**నారద ఉవాచ.**

8. శ్లో. భవతాఽనుదితప్రాయం
యశో భగవతోఽమలమ్ ।
యేనైవాసౌ న తుష్యేత ।
మన్యే తద్దర్శనం ఖిలమ్ ॥

**నారదుడు చెప్పుచున్నాడు.**

ఓ వ్యాసమహర్షీ ! నీవు భారతమున భగవంతుని స్వచ్ఛమైన కీర్తిని వర్ణింపలేదు. ధర్మాదులను చెప్పినా భగవత్కీర్తి వర్ణింపనట్లేయైనది. భగవద్గుణాను వర్ణనలేని ధర్మాదుల చేత భగవంతుడు తృప్తినొందదు. అట్టి జ్ఞానము అల్పమైనదని నేను తలచుచున్నాను. (8)

టీ :- అనుదితప్రాయం అనుక్తప్రాయం. విమలం భగవద్యశో వినా యేనైవ ధర్మాదిజ్ఞానేనాసౌ భగవాన్న తు ష్వేత్. తత్తదేతద్దర్శనం జ్ఞానం ఖిలం న్యూనం శూన్యం మన్యేహం. (8)

9. శ్లో. యథా ధర్మాదయశ్చార్థాః
మునివర్యానుకీర్తితాః ।
న తథా వాసుదేవస్య
మహిమా హ్యనువర్ణితః ॥

టీ :- నను భగవద్యశ ఏవ తత్ర తత్రానువర్ణితం. తత్రాహ - యథేతి. చశబ్దాద్ధర్మాదిసాధనాని చ. తథా ధర్మాదివత్ ప్రాధాన్యేన వాసుదేవస్య మహిమా నోక్త ఇత్యర్థః. (9)

10. శ్లో. న యద్వచశ్చిత్రపదం హరేర్యశో
జగత్పవిత్రం ప్రగృణీత కర్హిచిత్ ।
తద్వాయసం తీర్థముశంతి మానసాః
న యత్ర హంసా నిరమంత్యుశిక్క్షయాః ॥

టీ :- వాసుదేవవ్యతిరిక్తాన్య విషయజ్ఞానవదేవాస్య విషయం

ఓ మునివర్యా ! మీరు భారతములో ధర్మాదులను వర్ణించినట్లు వాసుదేవుని మహిమను విస్తారముగా వర్ణించలేదు భగంతుని కీర్తినే అచట వర్ణించానుగదా అంటారేమో కాని ధర్మాదులను (చ శబ్దము వలన) వాటి సాధనాలను ముఖ్యముగా వర్ణించినట్లు భగవానుని మహిమను చెప్పలేదు ముఖ్యముగా చెప్పలేదని భావము.(9)

భగవంతుని కీర్తిని వర్ణించడానికి వ్యతిరిక్తమైన విషయాలను ఎంత పదచాతుర్యంతో అనుప్రాసాద్యలంకారాలతో వర్ణించినను అది కాకులవంటి భోగలాలసులకు ఆనందాన్ని కలిగించేదిగా తలచబడును. అది వ్యర్థమే అదికాక ఆ తీర్థము కాకులు నీళ్లు తాగే జలము కలది ఏలయన సత్త్వగుణ ప్రధానులగు యతీశ్వరులు ఎప్పుడు దాని యందు ఆనందాన్ని పొందరు. మనోహరమగు బ్రహ్మయందు నివసించు అనగా బ్రహ్మ ధ్యానాసక్తులగు యతులు, పరమహంసలు తదితరమును కోరరని భావము. యతీశ్వరులలో ఉత్తములగు వారికి పరమహంసలని వ్యవహారము మానససరోవరమున పద్మములందు నివసించు హంసలు

వాక్చాతుర్యం చ ఖిలమేవేత్యాహ – నేతి. చిత్రపదమపి యద్వచో హరేర్యశో న ప్రగృణీత. తద్వాయసం తీర్థం కాకతుల్యానాం కామినాం రతిస్థానం ఉశంతి మన్యంతే. కుతః మానసాః సత్త్వప్రధానే మనసి వర్తమానాః హంసాః యతయః యత్ర న విరమంతి కర్హిచిదపి నితరాం న రమంతే. ఉశిక్షయాః ఉశిక్కమనీయం బ్రహ్మ క్షయో నివాసో యేషాం తే. యధా ప్రసిద్ధాః హంసాః మానససరసి చరంతః కమనీయాబ్జ షండాని విహాయ వాయసా ఇవ పరిత్యక్తోచ్ఛిష్ట వివిధ చిత్రాన్నయుక్తేఽ పృచ్ఛిష్టగర్తే కాః క్రీడాస్థానే న రమంత ఇతి శ్లేషః(10)

చిత్రవిచిత్రాన్నమును పడవేసిన ఎంగిలి గుంటలందు కాకులవలె విహరించరని శ్లేష అలంకారము. హంసలు పాలను నీటిని వేరుచేసి పాలను మాత్రమే ఆస్వాదించునట్లు యతులు ప్రపంచము బ్రహ్మను వివేకంతో తెలిసికొని బ్రహ్మయందే రమింతురని భావము అందుకే యతులకు పరమహంసలను పేరు సార్థకమైనది.(10)

11.శ్లో. తద్వాగ్విసర్గో జనతాఘవిప్లవో
యస్మిన్ ప్రతిశ్లోకమబద్ధవత్యపి ।
నామాన్యనంతస్య యశోఽంకితాని యత్
శృణ్వన్తి గాయన్తి గృణన్తి సాధవః ॥

టీ :– వినాపి తు పదచాతుర్యం భగవద్యశః ప్రధానం వచః పవిత్రమిత్యాహ – తదితి. స చాసౌ వాగ్విసర్గశ్చ వాచః. ప్రయోగః జనానాం సమూహో జనతా తస్యాః అఘం విప్లావయతి నాశయతీతి తథా. యస్మిన్వాగ్విసర్గేఽపి. ప్రతిశ్లోకమనంతస్య యశోంకితాని నామాని భవంతి. తత్రహేతుః – యద్యాని నామాని. సాధవో మహాంత.

పదచాతుర్య అలంకారపూర్వక వర్ణనంలేకున్నను భగవంతుని కీర్తిని కొనియాడే వాక్కు ప్రధానమని తద్ అను శ్లోకమున చెపుతున్నాడు. అపశబ్దములతో కూడినదైనను జనుల యొక్క పాపమును నశింపచేయునట్టిదియు ప్రతి శ్లోకమునందును, స్తుతియందును అనంతుడగు విష్ణువు కీర్తితో నిండిన నామములను కలిగియుండు వాక్ప్రయోగము అయినచో సత్పురుషులు దానిని వింటారు. గానం చేస్తారు. పలుకుచుందురు అనగా ఇతరులు మహాత్ములు చెపితే భగవత్కథలు వింటారు, విని పాడుతారు. వానిని మరల ఇతరులకు చెపుతారు ఇది భగవత్కథా వైశిష్ట్యము హరిర్హరతి పాపాని దుష్టచిత్తైరపిస్మృతః అనిచ్ఛయాః పి సంస్పృష్టో దహత్యేవ హి

వక్తరి సతి శృణ్వంతి. శ్రోతరి సతి గృణంతి. అన్యథా తు స్వయమేవ గాయంతి కీర్తయంతి. (11)

12.శ్లో. నైష్కర్మ్యమప్యచ్యుతభావవర్జితం
న శోభతే జ్ఞానమలం నిరంజనమ్ ।
కుతః పునశ్శశ్వదభద్రమీశ్వరే
న చార్పితం కర్మ యదప్యకారణమ్ ॥

టీ :- భక్తిహీనం జ్ఞానం కర్మ చ న్యూనమేవేతి కైముత్తికన్యాయేన దర్శయతి, నైష్కర్మ్యమితి. నైష్కర్మ్యం నిష్కర్మ బ్రహ్మ తదేకాకారత్వా న్నిష్కర్మరూపం నైష్కర్మ్యం. అజ్యతే అనేనేత్యంజనం ఉపాధిసన్నివర్తకం నిరంజనం. ఏవంభూతమపి జ్ఞానం. అచ్యుతే భావో భక్తిః తద్వర్జితం చేత్ అలమిత్యర్థం శోభతే సమ్యగపరోక్షాయ న కల్పత ఇత్యర్థః. శశ్వత్సదా సాధనకాలే చ ఫలకాలే చ అభద్రం దుఃఖరూపం యత్కామ్యకర్మ యదప్యకారణమకామ్యం తచ్చేతి చకార స్యాన్వయః తదపి కర్మ ఈశ్వరేణార్పితం చేత్కుతశ్శోభతే? బహిర్ముఖత్వేన సత్త్వశోధకత్వాభావాత్. (12)

పావకః. ఇచ్ఛతోగాక పొరపాటున తొక్కినను నిప్పు కాలునట్లు భగవన్నామము ఎవరితో ఏవిధముగా పలుకబడినను పాపమును తొలగించును. అబద్ధము, అపశబ్దము పలికినను భగవానుడు సుశబ్దముగానే గ్రహించును. తెలియని వారు విష్ణాయ నమః అంటారు పండితుడు విష్ణవే నమః అనును అయినను ఫలితము సమానమే భావగ్రాహీ జనార్దనః అన్నట్లు. (11)

భక్తిలేని కర్మ వ్యర్థమేనని కైముత్తిక న్యాయంతో తెలుపుతున్నాడు. జీవన్ముక్తి సాధనమగు నిర్మలమగు జ్ఞానముకూడా భగవద్భక్తిలేనిచో శోభించదు అది జనన మరణరూప సంసారహేతువగుచున్నది. ఇక ఈశ్వరునికి అర్పించని నిత్యకర్మ గురించికానీ, కామ్యకర్మల గురించి కానీ ఏమి చెప్పవలెను? అవి వ్యర్థములని భావము. జ్ఞానులు కూడా భగవద్భక్తి కలిగియే అపరోక్ష బ్రహ్మానుభూతి పొందుదురని భావము. భక్తి వలన జ్ఞాన, వైరాగ్యాలు కలుగునని భాగవతము బోధించును. (12)

13. శ్లో. అథో మహాభాగ భవానమోఘదృక్
శుచిశ్రవాః సత్యరతో ధృతవ్రతః ।
ఉరుక్రమస్యాఖిలబంధముక్తయే
సమాధినాఽనుస్మర యద్విచేష్టితమ్ ।

టీ :- తదేవం భక్తిశూన్యాని జ్ఞానవాక్చాతుర్యకర్మకౌశలాని వ్యర్థాన్యేవ యతః, అతో హరేశ్చరితమేవానువర్ణయేత్యాహ - అత ఇతి. అతః అతః కారణాత్ అమోఘా యథార్థా దృక్ ధీర్యస్య. శుచి శుద్ధం శ్రవో యశోయస్య. సత్యే రతః. ధృతాని వ్రతాని యేన సః. భవానేవం మహాగుణస్తావత్. అతః ఉరుక్రమస్య వివిధం చేష్టితం లీలావైచిత్ర్యం సమాధినా చిత్తైకాగ్ర్యేణ అఖిలస్య బంధముక్తయే త్వమనుస్వర స్మృత్వా వర్ణయేత్యర్థః. ఏతచ్చ వాక్యాంతరమితి మధ్యమపురుషప్రయోగో నానుపపన్నః. (13)

14. శ్లో. తతోఽన్యథా కించన యద్వివక్షతః
పృథగ్దృశ స్తత్కృతరూప నామభిః ।
న కుత్రచిత్క్వాపి చ దుఃస్థితా మతిః
లభేత వాతాహతనౌరివాస్పదమ్ ॥

భక్తిలేని జ్ఞానము, వాక్చాతుర్యము కర్మలు అన్నియు శూన్యములే. కావున శ్రీహరి చరితమును వర్ణించుమని నారదుడు వ్యాసునకు చెపుతున్నాడు. ఓ మహానుభావా! మీరు యథార్థమగు దృష్టిగలవారు, శుద్ధమగు కీర్తిగలవారు, సత్య మందే ఆసక్తిగలవారు, వ్రతాలనాచరించినవారు ! ఇన్ని గొప్ప గుణాలుగలవారు కావున క్రమముగ భగవంతుని వివిధ చేష్టలను లీలలను మనస్సున ఏకాగ్రతతో ఆలోచించి సమస్త బంధములు తొలగుటకు వర్ణించుడు. ఇచట విష్ణుచరితమును స్మరించి వర్ణించుమనునది ప్రత్యేక వాక్యము. పూర్వార్థముననున్న భవచ్ఛబ్దముతో సంబంధించినదికాదు. కావున మధ్యమ పురుష 'స్మర' అను ధాతు ప్రయోగముసరియైనదే. వ్యాకరణాన్ని బట్టి భవాన్ అని ఉన్నచోట శేషే ప్రథమః అని ప్రథమ పురుష స్మరతు అని ఉండవలసి ఉండును. పూర్వవాక్యము ఉత్తరవాక్యము వేరు కావున స్మర అని మధ్యమపురుష సరియైనదే. (13)

అటులగానిచో మరో దోషము వచ్చునంటారు 'తత అని' నారదులు. గొప్ప పరాక్రమముగల భగవంతుని లీలకన్న భిన్నమగు చూపుగలిగి, మరోవిధంగా యేదో ఒక విషయాంతరాన్ని చెప్పాలను కొనుచున్న వారికి, ఏదో తోచిన రూపముచేతగాని నామముచేతగాని, అస్థిరమగు బుద్ధి ఏ విషయములోను స్థిరత్వమును బొందదు. అది

టీ :- విపక్షే దోషాంతరమాహ - తత ఇతి. తత ఉరుక్రమ చేష్టితాత్పృథగ్దృశః. అత ఏవాన్యథా ప్రకారాంతరేణ యత్కించి దర్థాంతరం వివక్షతః. తయా వివక్షయా కృతైః స్ఫురితైః రూపైః నామభిః వక్తవ్యత్వేనోపస్థితైః దుఃస్థితా అనవస్థితా సతీ మతిః కదాచిత్ క్వాపి విషయే ఆస్పదం స్థానం న లభేత. బాలేనాహతా ఆఘూర్ణితానౌరివ. తదుక్తం గీతాసు. శ్లో.'వ్యవసాయాత్మికా బుద్ధిరేకేహ కురునందన, బహుశాఖాహ్యనంతాశ్చ బుద్ధయోఽ వ్యవసాయినా' మిత్యాది. (14)

గాలి చేత కొట్టబడిన నౌకవలె అటుఇటు పరుగెత్తుచుండును.(14)

15.శ్లో. జుగుప్సితం ధర్మకృతేఽనుశాసతః
స్వభావరక్తస్య మహాన్ వ్యతిక్రమః ।
యద్వాక్యతో ధర్మ ఇతీతరః స్థితో
న మన్యతే తస్య నివారణం జనః ॥

టీ :- తదేవం హరియశో వినా భారతాదిషు కృతం ధర్మాదివర్ణన మకించిత్కరమిత్యుక్తం. ప్రత్యుత విరుద్ధమేవ జాతమిత్యాహ - జుగుప్సితమితి. జుగుప్సితం నింద్యం కామ్యకర్మాది. స్వభావత ఏవ రక్తస్య తత్రారాగిణః పురుషస్య ధర్మకృతే ధర్మార్థమనుశాసత స్తవ మహానయం వ్యతిక్రమః అన్యాయః. శాస్త్రోల్లంఘనమిత్యర్థః. కుత ఇత్యత ఆహ - యస్య తవ వాక్యతః అయమేవ ముఖ్యో ధర్మ ఇతి

ఈ విధముగా భగవత్కీర్తిని వదలి భారతాదులయందు చేయబడిన ధర్మాదుల వర్ణనము లాభములేనిదే. అంతేకాక ప్రకృతి విరుద్ధముకూడా ! అని అంటాడు నారదుడు జుగుప్సితమని. నింద్యమగు కామ్యకర్మలయందు స్వభావముతోనే అనురక్తుడగు వానిని ధర్మము కొఱకు శాసించు నీకు అనగా అది ధర్మమని చెప్పిన నీకు గొప్ప శాస్త్రాతిక్రమము, న్యాయ విరోధము సంభవించును. ఏలయన నీవు చెప్పినను భోగలాలసులగు ప్రాకృత జనులు ఆ కామ్యకర్మలనే ధర్మముగా భావింతురు. వాటి వలన అశాశ్వత స్వర్గాదులే వచ్చునని తలపరు. తత్త్వజ్ఞులు కాదన్నను వారి మాట వినరు.నీవు చెప్పినను వినరు. 'న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్త్వ మానశు' అను శ్రుతి యథార్థమని త్యాగము చేయవలెనని కూడా తలపరు.

స్థితః. ఇతరః ప్రాకృతః జనః. తస్య కామ్యకర్మాదేః. అన్యేన తత్త్వజ్ఞేన క్రియమాణం నివారణం స్వయమేవ వా నివారణం త్వయా అగ్రే క్రియమాణం. యద్వా. శ్రు. ' న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్త్వమానశు' రిత్యాది శ్రుత్యా క్రియమాణం నివారణం. యథార్థమేతదితి న మన్యతే. కింతు ప్రవృత్తిమార్గానధికృతవిషయ మేతదితి కల్పయతి. తదుక్తం. మతాంతరోపన్యాసే భట్టైః. శ్లో. 'తత్రైవం శక్యతే వక్తుం యేఽంధపంగ్వాదయో నరాః, గృహస్థత్వం న శక్ష్యంతి కర్తుం తేషామయం విధిః. నైష్ఠికబ్రహ్మచర్యం వా పరివ్రాజకతాపి వా, తైరవశ్యం గృహీతవ్యం తేనాదావేతదుచ్యతే' ఇత్యాది. (15)

16.శ్లో. విచక్షణః కోఽర్హతి వేదితుం విభోః
అనంతపారస్య నివృత్తితః సుఖమ్ ।
ప్రవర్తమానస్య గుణైరనాత్మనః
తతో భవాన్ దర్శయ చేష్టితం విభోః. ॥

టీ :- నను యద్యేవం ప్రవృత్తిమార్గో నిందత్యే, తర్హి నివృత్తిమార్గే సర్వక్రియాత్యాగేనైవ పారమేశ్వరసుఖస్వరూపానుభూతేః కిం తద్యశః కథనే నా పి తత్రాహ - విచక్షణః నిపుణః కశ్చిదేవ. నివృత్తితః సర్వక్రియానివృత్త్యా అస్య విభోస్సుఖం నిర్వికల్పకసుఖాత్మకం రూపం

దానిని ప్రవృత్తి మార్గానర్హుల కొఱకు చెప్పిన దానిగా అర్థాంతరము కల్పింతురు. అది మతాంతరులగు భాట్టులచే ఈ విధముగా చెప్పబడినది. తత్రైవం శక్యతే వక్తుమ్. అని వారందురు. అనగా గుడ్డివారు, కుంటివారు, గృహస్థాశ్రమం తీసికొని జీవించజాలరు కావున వారు బ్రహ్మచారులుగానో యతులుగానో ఉండుట శ్రేయోదాయకమని త్యాగము వారికే విధించబడినదని అయథార్థ కల్పన గావింతురని భావము.(15)

ప్రవృత్తి మార్గము, గృహస్థాశ్రమము, యజ్ఞయాగాదులు నిందించబడుచున్నవి గదా ! అన్ని పనులను వదిలిపెట్టిననే పరమేశ్వర సుఖస్వరూపానుభూతి కలుగును గదా! మఱి అతని కీర్తిని గానము చేయుట ఎందుకు? అనుదానికి చెపుతున్నాడు. 'విచక్షణః' అని. నిపుణుడే సమస్తములైన పనుల నుండి నివృత్తుడై ఆత్మసుఖమును, నిర్వికల్ప సుఖాత్మక స్వరూపమును తెలిసికొనగలడు, కాని అవిచక్షణుడు పొందజాలడు. కావున సత్త్వాది గుణములచేత ప్రవర్తిల్లు దేహాభిమానులగు వారల కొఱకు, అపారమైన ఆ భగవానుని చేష్టలను వర్ణించి చెప్పుము.(16)

వేదితుం జ్ఞాతుం అర్హతి. న పునరవిచక్షణః ప్రవృత్తిస్వభావః. విభుత్వే హేతుః – అనంతః నా స్త్యంతః కాలతః పారం చ దేశతో యస్య తస్య విభోశ్చేష్టితం. తతః కారణాత్ విభోః అనాత్మనః దేహాద్యభిమానినః. అత ఏవ గుణైస్సత్త్వాదిభిః ప్రవర్తమానస్య జనస్య దర్శయ. భవానితి త్వమిత్యర్థః. పాఠాంతరే హే భగవన్నితి సంబోధనం. (16)

17.శ్లో. త్యక్త్వా స్వధర్మం చరణాంబుజం హరేః
భజన్నపక్వోఽథ పతేత్తతో యది ।
యత్ర క్వ వా భద్రమాభూదముష్య కిం
కో వాఽర్థ ఆప్తోఽభజతాం స్వధర్మతః ॥

టీ:– ఏవం తావత్కామ్యకర్మాదేరనర్థహేతుత్వాత్తద్విహాయ హరేర్లీలైవ వర్ణనీయేత్యుక్తం. ఇదానీం తు నిత్యనైమిత్తిక స్వధర్మనిష్ఠామప్యనాదృత్య కేవలం హరిభక్తిరేవోపదేష్టవ్యేత్యాహ త్యక్త్వేతి. నను స్వధర్మత్యాగేన భక్తిపరిపాకేన యది కృతార్థో భవేత్తదా న కాచిచ్చింతా. యది పునరపక్వఏవమ్రియేత తతో భ్రశ్యేద్వా. తద స్వధర్మత్యాగ నిమిత్తోఽనర్థస్స్యాదిత్యాశంక్యాహ తతో భజనాత్ పతేత్ కథంచిద్భ్రశ్యేత్. మ్రియేత వా. యది తథాపి భక్తిరసికస్య కర్మానధికారాన్నానర్థక్యమంగీకృత్యాహ వాశబ్దః కటాక్షేయత్ర క్వ వా నీచయోనావపి అముష్య భక్తిరసికస్య

ఈ విధముగా కామ్యములైన ధర్మాదులు అనర్థహేతువులు కాన వాటిని వదలి భగవల్లీలలనే భక్తితో వర్ణించాలి. అని చెప్పి, ఇపుడు నిత్యనైమిత్తిక స్వధర్మాలను (సంధ్యాదులను) కూడా ఆచరించక కేవలము విష్ణు భక్తియే ఉపదేశింతచాలి అను ఆశయంతో చెపుతున్నాడు త్యక్త్వా అని. భక్తి పరిపాకంతో భజిస్తూ స్వధర్మత్యాగం చేసినా కృతార్థుడైతే చింతలేదు. కాని భక్తి పరిపాకంకాక ముందే చేస్తే లేదా భ్రష్టుడైతే అపుడు స్వధర్మ త్యాగముతో అనర్థము వాటిల్లును కదా. అంటే కాదు, అలా అయినా భక్తి రసికునికి కర్మాధికారము లేదు కావున అనర్థము జరుగదు. ఏదైనా నీచ యోని యందు పుట్టినా భక్తి వాసన ఉండును. కావున భజించక స్వధర్మాచరణ చేస్తే ఏమి ప్రయోజనము పొందును? నిత్య నైమిత్తిక కర్మాచరణలో ఫలము లేదని మీమాంసా శాస్త్రం అంటుంది. అభజతాం అనుచోట షష్ఠీ కేవల సంబంధార్థము. భగవద్భజనలేని వానికి స్వధర్మము కడా రక్షకము కాదని భావము. (17)

అభద్రమభూత్కిం ? నాభూదేవేత్యర్థః. భక్తివాసనాసద్భావాదితి భావః. అభజద్భిస్తు కేవలస్వధర్మతః కో వా అర్థః ఆప్తః ప్రాప్తః అభజతామితి షష్ఠీ తు సంబంధమాత్రవివక్షయా. (17)

18.శ్లో. తస్యైవ హేతోః ప్రయతేత కోవిదో
న లభ్యతే యద్భ్రమతాముపర్యధః ।
తల్లభ్యతే దుఃఖవదన్యతస్సుఖమ్
కాలేన సర్వత్ర గభీరరంహసః ॥

టీ:- నను స్వధర్మమాత్రాదపి. శ్రు. 'కర్మణా పితృ లోక' ఇతి శ్రుతేః పితృలోకప్రాప్తిః ఫలమస్త్యేవేతి తత్రాహ తస్యేతి. తస్యైవహేతోః తదర్థం యత్నం కుర్యాత్. యదుపరి బ్రహ్మపర్యంతం అధఃస్థావరపర్యంతం చ భ్రమద్భిః జీవైః న లభ్యతే. షష్ఠీ తు పూర్వవత్.తత్తు విషయసుఖం అన్యత ఏవ ప్రాచీనకర్మణా సర్వత్ర నరకాదావతిలభ్యతే. దుఃఖవత్. యథా దుఃఖం ప్రయత్నం వినాపి లభ్యతే. తదుక్తం శ్లో. అప్రార్థితాని దుఃఖాని యథైవాయాంతిదేహినామ్, సుఖాన్యపి తథా మన్యే దైన్యమత్రాతిరిచ్యత ఇతి. (18)

అయితే స్వకర్మాచరణముతో కూడా పితృలోక ప్రాప్తి కలుగునుకదా 'శ్రుతి కర్మణా పితృలోకః అన్నందున కర్మకు ఫలము చెప్పబడినది కదా అంటే, 'తస్యైవ' అని సమాధానము. ధర్మము కారణంగానైనా భక్తికై ప్రయత్నించాలి. బ్రహ్మ మొదలు నేల ప్రాణి వఱకు భ్రమించు వారికి లభించని విషయసుఖము కర్మ ఫలితంగా నరకాదులలో కూడా లభించును.దుఃఖమువలె అనగా ఏవిధముగా దుఃఖము కోరకున్నా ప్రయత్నించకున్నా లభించునో, సుఖముగూడా అలాగే లభించును అని అర్థము. "అప్రార్థితాని దుఃఖాని" అను శ్లోకము ద్వారా కేవల దానవత్వంతో దుఃఖము వద్దని సుఖం కావాలని కోరడం జరుగుతుంది. పూర్వజన్మ పుణ్యవశము వలననే స్వర్గము, మరల భూలోకజన్మ, మానవులకు లభించును. దానికి ప్రయత్నము అవసరము లేదు. కుశలుడు సుఖసాధనకై అనుష్ఠానము చేయవలసిన పనిలేదు మోక్షము ప్రాచీన పుణ్యంతో లభించేది కాదు. కావున దాని కొఱకు ప్రయత్నించాలని భావము. (18)

19. శ్లో. న వై జనో జాతు కథంచనావ్రజేత్
ముకుంద సేవ్యన్యవదంగ సంసృతిమ్ ।
స్మరన్ ముకుందాంఘ్ర్యుపగూహనం పునః
విహాతుమిచ్ఛేన్న రసగ్రహో యతః ॥

టీ:- యదుక్తం యత్రక్వవాభద్రమభూదితి తదుపపాదయతి స ఇతి. ముకుందసేవీ జనః జాతు కదాచిత్ కథంచనకుయోనిగతోఽపి సంసృతిం నావ్రజేత్ నావిశేత్. అంగ అహో అన్యవత్. కేవలకర్మనిష్ఠవదితివై ధర్మ్యదృష్టాంతః కుత ఇత్యత అహ ముకుందాంఘ్ర్యోరుపగూహనమాలింగనం పునః స్మరన్ విహాతుంనేచ్ఛేత్. యతోఽయం జనోరసగ్రహః రసేన రసనీయేన గృహ్యతే వశీక్రియతే. యద్వా రసే రసనీయే గ్రహః ఆగ్రహో యస్య. తదుక్తం భగవతా. శ్లో. 'యతతే చ తతో భూయస్సం సిద్ధౌ కురునందన. పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి స' ఇతి. (19)

భగవద్భక్తునికి ఎపుడును అభద్రము నష్టము వాటిల్లదని చెప్పబడినది. దానిని సమర్థిస్తున్నాడు. భగవంతుని కృష్ణుని సేవించు మానవుడు తిర్యగ్జంతు జన్మ మెత్తినా మరల సంసారమున ప్రవేశించడు. జననమొందడని భావము. కేవలము కర్మనిష్ఠులకే అలా జరుగుతుంది. భక్తుడు ముకుంద పాదపద్మ సేవవలన, జన్మాంతర సంస్కారముచేత, భగవంతుని స్మరించును. ఆయనను వదలడు. ఏలయన భగవంతుని స్మరణమాధుర్యానికి అలవాటు పడినవాడు. కావున దానికే వశుడై ఉండును. రసము యొక్క ఆస్వాదమునందు అభినివేశము కలవాడై భగవద్భక్తి రసానుభూతిని వదలడు. ఏ జన్మనందైనా భగవానుని స్మరించును. (19)

20. శ్లో. ఇదం చ విశ్వం భగవానివేతరో ।
యతో జగత్స్థాననిరోధసంభవాః ।
తద్ధి స్వయం వేద భవాం స్తథాఽపి మే
ప్రాదేశమాత్రం భవతః ప్రదర్శితమ్ ॥

భగవల్లీలలను ముఖ్యముగా వర్ణించుమని చెప్పబడినది కదా! ఆ భగవానుడు ఎవరు ? అతని లీలలెట్టివి ? అనగా ఇదం విశ్వం అను శ్లోకముతో తెల్పుచున్నాడు. ఈ ప్రపంచమంతా భగవంతుడే. వేరుకాదు. భగవానుడు మాత్రము ప్రపంచముకన్నా భిన్నుడు.

టీ:- తదేవం భగవల్లీలాం ప్రాధాన్యేనానువర్ణయేత్యుక్తం. తత్రకో భగవాన్ కాశ్చ తస్య లీలాః ఇత్యపేక్షాయామాహ ఇదమితి. ఇదం హి విశ్వం భవానేవ న తస్మాదితరః ఈశ్వరాత్ప్రపంచో న పృథక్. ఈశ్వరస్తు ప్రపంచాత్పృథగిత్యర్థః. తత్ర హేతుః. యతో హేతోః జగతః స్థిత్యాదయో భవంతి అనేనైవ లీలా అపి దర్శితాః. యద్వా. ఇదం విశ్వం భగవాన్ ఇతర ఇవ యస్స జీవో భగవానేవ చేతనాచేతన ప్రపంచః తద్వ్యతిరేకేణ నాస్తి. స ఏవైక స్తత్త్వమిత్యర్థః. హిశబ్దేన.శ్రు 'సర్వం ఖల్విదంబ్రహ్మ' ఇత్యాది ప్రమాణం సూచితం. తద్ధిస్వయమేవ భగవాన్. వేద ప్రాదేశమాత్రం. శ్రు.'ఆచార్యవాన్ పురుషో వేదే'త్యాది శ్రుత్యర్థ సంపాదనాయ మే మయా ప్రదర్శితం. (20)

దానికి కారణము ఆ భగవంతుని వలననే సృష్టి, స్థితి, లయములు జరుగుచున్నవి. దానివలన ఇదంతా ఆయన లీలే అని చెప్పినట్లైనది. లేదా ఈ విశ్వమే భగవానుడు ఇతరుడుగా కనిపించును కాని వేరుకాదు. చేతనాచేతన అనగా స్థావర జంగమాత్మక ప్రపంచమంతా భగవంతుడే కాని దానికన్న ఇతరుడు కాదు. అతడొకడే యథార్థమని భావము. మీ ఆనందమునకై సర్వం ఖల్విదం బ్రహ్మ ఇత్యాది ప్రమాణాలు కొద్దిగా సూచించబడినవి. నిజమునకు ఆ విశ్వమును నీవేయెరుగుదువు వ్యాసమునీ ! 'ఆచార్యవ్యాన్ పురుషో వేద' అను శ్రుతిననుసరించి కొద్ది మాత్రమే నీకు సూచించినాను.(20)

21.శ్లో. త్వమాత్మనాత్మానమవేహ్యమోఘదృక్  
పరస్య పుంసః పరమాత్మనః కలామ్ ।  
అజం ప్రజాతం జగతశ్శివాయ తత్  
మహానుభావాభ్యుదయోఽధిగణ్యతామ్ ॥

టీ:- న చ తవాచార్యాపేక్ష్యాఽపీశ్వరావతారత్వాదిత్యాహ త్వమితి. హే అమోఘదృక్ త్వమాత్మనా స్వయం ఆత్మానం. అజమేవ సంతతం జగతశ్శివాయ ప్రజాతమవేహి. కుతః ? పరస్య పుంసః కలాం అంశభూతం తత్తస్మాన్మహానుభావస్య హరేరభ్యుదయః పరాక్రమః అధి అధికం. గణ్యతాం నిరూప్యతాం. (21)

నీవు ఈశ్వరుని అవతారము కావున నీకు ఆచార్యుని అవసరంలేదు. సరియైన, వ్యర్థముకానిదృష్టిగల ఓ మహర్షీ ! నీవు స్వయముగా ఆత్మలలో ఆత్మవై, పుట్టుక లేని వాడవుగా ఉండి, లోక కల్యాణమునకై పుట్టిన వాడవని తెలిసికొనుము. ఎందుకనగా పరమపురుషుని అంశావతారము నీవు. కావున ఆ మహానుభావుడగు హరి యొక్క పరాక్రమమును ఎక్కువగా వివరింపుము.(21)

22.శ్లో. ఇదం హి పుంసస్తపసః శ్రుతస్య వా
స్విష్టస్య పూర్తస్య చసూక్తదత్తయోః ।
సవాచ్యుతోర్థః కవిభిర్నిరూపితో
యదుత్తమశ్లోక గుణానువర్ణనమ్ ॥

టీ:- అనేనైవ తపఆది సర్వం తపసః ఫలం స్యాదిత్యాహ ఇదమితి. శ్రుతాదయో భావేనిష్ఠా. ఇదమేవహి తపశ్శ్రవణాదేరవిచ్యుతో నిత్యోఽర్థః ఫలం. కిం తత్ ? ఉత్తమశ్లోకగుణానువర్ణనమితి యత్. (22)

దీనివలన నీ తపస్సు అంతయును సఫలమని 'ఇదం హి పుంసః' అని చెపుతున్నాడు. వినినట్టి భగవంతుని యెడ నిష్ఠ కలిగి ఉండటమే తపస్సు. శ్రవణాదుల వలన నిత్యమైన తపఃఫలము కలుగును. 'కింతత్' అది ఏది అనగా, పుణ్యశ్లోకుడగు భగవంతుని గుణానువర్ణనమే. దానిని గావింపుమని నారదుడు వ్యాసునికి బోధించాడు. భగవంతుని గుణ వర్ణనము మానవునికి అగ్నిష్టోమాది యజ్ఞముల కంటే ఉత్తమమైన ధర్మాదుల కంటే ఎక్కువదిగా, నిత్యమైన ఫలముగా కవులతో నిరూపించబడినది.(22)

23.శ్లో. అహం పురాఽతీతభవేఽభవం సుతో
దాస్యాస్తు కస్యాశ్చన వేదవాదినామ్ ।
నిరూపితో బాలక ఏవ యోగినాం
శుశ్రూషణే ప్రావృషి నిర్వివిక్షతామ్ ॥

టీ:- సత్సంగతో హరికథాశ్రవణాది ఫలం స్వవృత్తాంతేన ప్రపంచయతి. అహమతి అహం పురా పూర్వకల్పే అతీతభవే పూర్వ జన్మని. వేదవాదినాం దాస్యాస్సకాశాదభవం జాతోఽస్మి. నిరూపితః నియుక్తః. యోగినాం సన్న్యాసినాం శుశ్రూషణే ప్రావృషి వర్షోపలక్షితే చాతుర్మాస్యే. నిర్వివక్షతాం నిర్వేశమేకత్ర వాసం కర్తుమిచ్ఛతాం.(23)

సత్సంగతితో భగవత్కథలను వినుఫలమును తన వృత్తాంతముచే అహమను శ్లోకంతో వివరించుచున్నాడు. నేను పూర్వజన్మలో ఒకానొక వేదవాదుల దాసి యొక్క పుత్రుడను వర్షాకాలమున చాతుర్మాస్య వ్రతమునకై ఒకచోట నివసించు ఉద్దేశ్యముగలిగి వచ్చిన యోగులకు సేవచేయుటకు బాలకుడనైన నేను నియోగింపబడినాను.(23)

24. శ్లో. తే మయ్యపేతాఖిలచాపలేఽర్భకే
దాంతే ధృతక్రీడనకేఽనువర్తిని ।
చక్రుః కృపాం యద్యపి తుల్యదర్శనాః
శుశ్రూషమాణే మునయోఽల్పభాషిణి ॥

టీ:- త ఇతి. అపేతాని గతాని అఖిలాని చాపలాని యస్మాత్తస్మిన్ని యతేంద్రియే అధృత క్రీడనకేత్యక్త క్రీడాసాధనే. అనువర్తిని అనుకూలే. (24)

ఆ మునీశ్వరులు సమదర్శనులు కావున, పిల్లవాడినైనా ఏ బాల్య చాపల్యము లేనట్టి వాడనై, ఇంద్రియ నిగ్రహముకలిగి ఆటలయందిష్టము లేక, వారికి అనుకూలుడనై, మితభాషుడనై, వినయంతో వారిని సేవించుచున్నందున నాపై దయదలచిరి.(24)

25. శ్లో. ఉచ్ఛిష్టలేపాననుమోదితో ద్విజైః
సకృత్స్మ భుంజే తదపాస్తకిల్బిషః ।
ఏవం ప్రవృద్ధస్య విశుద్ధచేతసః
తద్ధర్మ ఏవాత్మరుచిః ప్రజాయతే ॥

టీ:- ఉచ్ఛిష్టేతి. ఉచ్ఛిష్టస్య లేపాన్ పాత్రలగ్నాన్ తైః ద్విజైఃఅనుజ్ఞాతః సన్. భుంక్ష్వేత్యనుశిష్టస్సన్ .భుంజేస్మ. తేన భోజనేనాపాస్తకిల్బిషో జాతోఽస్మి. తేషాం ధర్మే పరమేశ్వరభజన ఏవ ఆత్మనో మనసః రుచిః ప్రజాయతే స్మేత్యనుషంగః. (25)

నేను వారి అనుమతితో వారి ఎంగిలిని భుజించితిని. దాని వలన నా పాపము మొత్తము నశించెను. మనస్సు నిర్మలమాయెను. ఇటుల ఉండగా వారు బోధించు మంచి ధర్మముల యందు పరమేశ్వర భజనయందు నా మనస్సు లగ్నమాయెను. వారిని సేవించుచు వారు బోధించు తత్త్వమును శ్రద్ధగా వినుచుంటినని నారదుడు వ్యాసునితో తన వృత్తాంతమును చెప్పెను.(25)

26. శ్లో. తత్రాన్వహం కృష్ణకథాః ప్రగాయతామ్ ।
అనుగ్రహేణాశృణవం మనోహరాః ।
తాఃశ్రద్ధయా మేఽనుపదం విశృణ్వతః ।
ప్రియశ్రవస్యంగ మమాభవద్రతిః ॥

టీ:- తత్రేతి. అశృణవం శ్రుతవానస్మి. మే శ్రద్ధయామమైవ స్వత్వన్యేన బలాజ్జనితయా. అతో మమేత్యస్యాపౌనరుక్త్యం. (26)

ఓ మహర్షీ ! అచట మనోహరములగు కృష్ణ కథలను ప్రతిదినము కీర్తించుచున్న మునీశ్వరుల అనుగ్రహముతో నేనును వాటిని వింటిని. అట్లు ఇతరుల బలాత్కారము లేక స్వయముగా కలిగిన శ్రద్ధతో ఆ భగవత్కథలను నిత్యము వినుచున్న నాకు ఇష్టమైన, కీర్తి గల శ్రీకృష్ణ భగవానుని యందు భక్తి ఏర్పడినది.(26)

27. శ్లో. తస్మింస్తథా లబ్ధరుచేర్మహామతే
ప్రియశ్రవస్యస్ఖలితా మతిర్మమ ।
యయా మమైతత్సదసత్స్వమాయయా
పశ్యే మయి బ్రహ్మణి కల్పితం పరే ॥

టీ:- తస్మిన్నితి. ప్రియంశ్రవో యస్యతస్మిన్ భగవతి లబ్ధరుచేర్మమ. అస్ఖలితా అప్రతిహతా మతిరభవదిత్యనుషంగః. యయా మత్యా పరే ప్రపంచాతీతే బ్రహ్మరూపే మయి సదసత్ స్థూలం సూక్ష్మంచ ఏతచ్ఛరీరం స్వమాయయా స్వావిద్యయా. కల్పితం న తు వస్తుతోఽ స్తి. ఏతత్క్షణ మేవ పశ్యామీతి.(27)

ఓ మహామునీ! ఆ విధముగా ప్రియమైన కీర్తిగల ఆ భగవంతుని యందు నాకు అభిరుచి కలిగినది. నా మతి భగవద్ధ్యానము నుండి విరమించలేదు. అట్టి బుద్ధిచేత ప్రపంచాతీతుడైన పరబ్రహ్మరూపుడనగు నా యందు స్థూల, సూక్ష్మ శరీరములు అజ్ఞానంతో కల్పించబడినవే, కాని వస్తుతః సత్యమైనవి కావని, ఆ క్షణముననే చూడగలిగాను. రాగ, ద్వేషాదులు దూరమై నిత్య సత్య పరమాత్మను నాయందు దర్శించగలిగాను.(27)

28. శ్లో. ఇత్థం శరత్ప్రావృషికావృతూ హరేః
విశృణ్వతో మే౽నుసవం యశో౽మలమ్ ।
సంకీర్త్యమానం మునిభిర్మహాత్మభిః
భక్తిః ప్రవృత్తా౽౽త్మరజస్తమో౽పహా ॥

టీ:- ఏవంశుదేత్వంపదార్థే జ్ఞాతే దేహాదికృతవిక్షేప నివృత్తేస్తత్కారణభూతరజస్తమోనివర్తికా దృఢా భక్తిర్జాతేత్యాహ ఇత్థమితి. హరేర్యశః అనుసవం త్రికాలమ్. (28)

ఈవిధముగా మునుల వలన శరత్కాల, వర్షాకాలములో ప్రతిదినము మూడు కాలములందు గానము చేయుచున్న శ్రీహరి యొక్క పవిత్రమైన యశస్సును వినుచున్న నాకు రజస్తమో గుణములను హరించునట్టి రాగద్వేషాలను తొలగించే భగవద్భక్తి ఏర్పడినది. (28)

29. శ్లో. తస్యైవం మే౽నురక్తస్య
ప్రశ్రితస్య హతైనసః ।
శ్రద్దధానస్య బాలస్య
దాంతస్యానుచరస్య చ ॥

టీ:- తస్యేతి. తస్య జ్ఞాతశుద్ధత్వంపదార్థస్య దృఢభక్తిమతః మే ప్రశ్రితస్య వినీతస్య. (29)

ఈ విధముగా జ్ఞానముచే శుద్ధమగు 'త్వం' పదార్థము కలిగి భగవంతునియందు అనురక్తి, భక్తి కలవాడనై వినీతుడను, శ్రద్ధ కలవాడను, తొలగిన పాపము కలవాడను, ఇంద్రియ నిగ్రహము కలవాడను, అనుచరుడనునైన నాకు ఆ మునులు వెళ్ళేటపుడు భాగవత శాస్త్రమును ఉపదేశించారు (తరువాత శ్లోకముతో అన్వయము.) (29)

30. శ్లో. జ్ఞానం గుహ్యతమం యత్తత్
సాక్షాద్భగవతోదితమ్ ।
అన్వవోచన్ గమిష్యంతః
కృపయా దీనవత్సలాః ॥

టీ:- జ్ఞానమితి. గుహ్యతమమితి సాధనభూతధర్మతత్త్వజ్ఞానం గుహ్యం. తత్సాధ్యం దేహద్వయవివికాత్మజ్ఞానం గుహ్యతరం. తత్ప్రాప్యేశ్వరతత్త్వజ్ఞానం గుహ్యతమం. భగవతోదితం భాగవతం శాస్త్రం అన్వవోచన్ ఉపదిష్టవంతః. (30)

దీనవత్సలులగు ఆ మునీశ్వరులు వెళ్ళుతూ, అతి రహస్యమైన, ప్రత్యక్షముగా భగవానునితో వివరించబడిన, అనగా భగవద్గీతాదులలో వివరింపబడిన ధర్మ, తత్త్వజ్ఞానమును దయతో నాకు ఉపదేశించిరి. ఆత్మజ్ఞానము కలుగుటకు సాధనమైన తత్త్వజ్ఞానము రహస్యము. దానిచేత సాధించబడు ఏకాంతమైన ఆత్మజ్ఞానమును రహస్యతరము దానితో పొందబడు ఈశ్వరజ్ఞానము రహస్యతమము. (30)

31. శ్లో. యేనైవాహం భగవతో
వాసుదేవస్య వేధసః ।
మాయానుభావమవిదం
యేన గచ్ఛంతి తత్పదమ్ ॥

టీ:- తదేవ జ్ఞానం పూర్వోక్తత్వంపదార్థజ్ఞానాత్ వివేకేన దర్శయతి. (31)

నారదుడు వ్యాసమునితో ఇంకను ఇలా చెపుతున్నాడు. ఏ పరమాత్మ జ్ఞానముచేత జగన్నియామకుడైన భగవంతుని మాయానుభూతిని పొందానో అనగా దేనితోనైతే ఆ భగవంతుని స్థానాన్ని - మోక్షాన్ని పొందుతారో అట్టి దానిని పొందినానని భావము. ఇంతకు ముందు త్వం పదార్థ జ్ఞానము ఇపుడు తత్పదార్థ జ్ఞానము ఆ విధముగా నారదునికి తత్త్వమసి మహావాక్య జ్ఞానము కలిగిందని భావము. (31)

32.శ్లో. ఏతత్సంసూచితం బ్రహ్మం
స్తాపత్రయ చికిత్సతమ్ ।
యదీశ్వరే భగవతి
కర్మ బ్రహ్మణి భావితమ్ ॥

టీ:- తత్సాధనధర్మరహస్యం చ సూచితమిత్యాహ ఏతదితి. తాపత్రయస్యాధ్యాత్మికాదేశ్చికిత్సితంభేషజం నివర్తకం సత్త్వశోధక మితి యావత్. కిం తద్భవతి భావితం సమర్పితం యత్కర్మ తత్ కథంభూతే? భగవతి ఈశ్వరే సర్వ నియంతరి. ఏవమపి బ్రహ్మణి అప్రచ్యుతపూర్ణ రూపే. (32)

ఓ మహామునీ ! సర్వజగన్నియామకుడు, పరిపూర్ణుడు. బ్రహ్మస్వరూపుడగు భగవంతుని యందు కర్మను సమర్పించినచో, అది ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతికాది తాపములను పోగొట్టును, చిత్తము శుద్ధమగును. తాపములకు, రోగములకు అదియే మందు అని ఆ పరమహంసలచేత సూచించబడినది.(32)

33.శ్లో. ఆమయో యశ్చ భూతానాం
జ్ఞాయతే యేన సువ్రత ।
తదేవ హ్యామయద్రవ్యం
న పునాతి చికిత్సితమ్ ॥

టీ:- నను సంసారహేతోః కర్మణః కథం ? తాపత్రయనివర్తకత్వం సామగ్రీభేదేన ఘటత ఇతి సదృష్టాంతమాహ ద్వాభ్యాం. ఆమయఇతి. ఆమయోరోగః యేన ఘృతాదినా జాయతే. తదేవ కేవలమామయ

అయితే సంసారమునకు (జనన మరణ రూపమునకు) కారణమగు కర్మ తాపత్రయములనెట్లు తొలగించును? అనుదానికి చెపుతున్నాడు. నెయ్యి మొదలగు అపథ్య వస్తువులతో ఏర్పడిన రోగము ఆ నెయ్యితో ఏమాత్రము తొలుగదు, కాని ఇతర ద్రవ్యములతో కలసిన ఆ నెయ్యి ఔషధమయమై రోగాన్ని తొలగించును కదా (33)

కారణభూతం ద్రవ్యం. తమామ యం న పునాతి న నివర్తయతీత్యర్థః కింతు చికిత్సితం ద్రవ్యాంతరైర్భావితం సత్పునాత్యేవ యథా. (33)

34. శ్లో. ఏవం నృణాం క్రియాయోగాః
పరే సంసృతిహేతవః ।
త ఏవాత్మ వినాశాయ
కల్పంతే కల్పితాః పరే ॥

టీ:- ఏవమితి. తథాత్మవినాశాయ కర్మనివృత్తయే కల్పంతే సమర్థా భవంతి. పరే కల్పితాః సమర్పితాస్సంతః అత్ర చ ప్రథమం మహత్సేవా తతస్తత్కృపా. తతస్తద్ధర్మశ్రద్ధా. తతో భగవత్కథా శ్రవణం. అతో భగవతి రతిః. తయా చ దేహద్వయవివిక్తాత్మజ్ఞానం. తతో దృఢా భక్తిః. తతో భగవత్తత్త్వవిజ్ఞానం. తతస్తత్కృపయా సర్వజ్ఞత్వాది భగవద్గుణావిర్భావః ఇతి క్రమో దర్శితః. (34)

ఈ విధముగా మానవులకు భగవంతునికి అర్పించిన కర్మలు నశించి వైరాగ్యమును జనింపజేయును. ఇచట మొదట పెద్దల సేవ దాని వలన వారి దయ, తదుపరి ఆ ధర్మములను ఆచరించు శ్రద్ధ, దానిచేత భగవంతుని కథలను విను ఆసక్తి దానితో భగవంతుడు హృదయమున స్థిరపడుట తదుపరి స్థూలసూక్ష్మ దేహముల వివేక జ్ఞానము, దానిచేత దృఢమైన భక్తి దాని వలన భగవత్తత్త్వజ్ఞానము తదుపరి దయ, సర్వజ్ఞత్వము భగవద్గుణముల భావన అని క్రమము చూపబడినది. (34)

35. శ్లో. యదత్ర క్రియతే కర్మ
భగవత్పరితోషణమ్ ।
జ్ఞానం యత్తదధీనం హి
భక్తియోగసమన్వితమ్ ॥

జ్ఞానము చేత, అజ్ఞానము వలన చేసిన కర్మలు నశించును. అట్టి జ్ఞానము భగవద్భక్తి వలన కలుగును కాని భక్తి వలన లభించిన జ్ఞానము కర్మలనెట్లు నశింపజేయును? అనుదానికి యదత్ర అని చెపుతున్నాడు. భగవత్ప్రీతి కొఱకు ఇచట చేయబడిన కర్మ భక్తియోగముతో కూడినదగును అట్టి భక్తి జ్ఞాన సాధనమైనది అనగా

టీ:- నను చ జ్ఞానేనాజ్ఞానప్రాప్తకర్మనాశః. తచ్చజ్ఞానం భక్తియోగాద్భవతి. కథం కర్మణా కర్మనాశస్స్యాత్? తత్రాహ యదితి. (35)

36. శ్లో. కుర్వాణా యత్ర కర్మాణి
భగవచ్ఛిక్షయాఽసకృత్ ।
గృణంతి గుణనామాని
కృష్ణస్యానుస్మరంతి చ ॥

టీ:- భగవదర్పణేన క్రియమాణం కర్మ భక్తియోగం జనయతీతి. తచ్చసదాచారేణ దర్శయతి కుర్వాణా ఇతి. యత్రయదా భగవతః శిక్షయా కర్మాణి కుర్వాణా భవంతి, తదా కృష్ణస్య గుణనామాని గృణంతి అనుస్మరంతి చ కృష్ణమిత్యర్థః. ఇయం చ భగవచ్ఛిక్షా శ్లో. "యత్కరోషి య దశ్నాసి యజ్జుహోషి దదాసి యత్, యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వమదర్పణ"మితి. (36)

37. శ్లో. నమో భగవతే తుభ్యం
వాసుదేవాయ ధీమహి ।
ప్రద్యుమ్నాయానిరుద్ధాయ ।
నమస్సంకర్షణాయ చ ॥

భక్తి జ్ఞానమును కలిగించునది అని భావము. దానితో కర్మలు నశించును.(35)

భగవదాజ్ఞననుసరించి అన్ని కర్మలును భగవదర్పితముగా చేస్తూ, శ్రీకృష్ణపరమాత్మ యొక్క గుణములను నామములను కీర్తిస్తూ భగవంతుని యెల్లప్పుడు భక్తులు స్మరిస్తారని భావము.(36)

కీర్తన స్మరణ రూప భక్తి హేతువును 'నమో భగవతే' అను రెండు శ్లోకములచేత చెపుతున్నాడు. వాసుదేవుడగు భగవంతునికి నీకు నమస్కారము ప్రద్యుమ్న, అనిరుద్ధ, సంకర్షణ నామములుగల ఓ భగవంతుడా! నిన్ను మనస్సు చేత నమస్కరించి అనుసంధానము చేస్తున్నాము అని భావము. (37)

టీ:- కీర్తనస్మరణరూపయోర్భక్తిహేతుత్వముక్తం. జ్ఞానహేతుత్వ మాహ ద్వాభ్యాం. నమ ఇతి. నమో ధీమహి మనసా నమనం కుర్వీమహి. (37)

38.శ్లో. ఇతి మూర్త్యభిధానేన ।
మంత్రమూర్తిమమూర్తికమ్ ।
యజతే యజ్ఞపురుషం
స సమ్యగ్దర్శనః పుమాన్ ॥

టీ:- ఇతీతి. అమునా మంత్రేణ అమునా మంత్రోక్తవ్యతిరిక్త మూర్తిశూన్యం యజతే పూజయతి స పుమాన్ సమ్యగ్దర్శనః . (38)

ఈ విధముగా మంత్రంకంటే భిన్నమైన ఆకారములేని భగవంతుని, మంత్రస్వరూపుని వాసుదేవాది నామములతో యజ్ఞపురుషుడగు ఆ పరమాత్ముని ఎవడు పూజించునో అతడే మంచి దర్శనము కలవాడు. అతడే తరించును. చతుర్వ్యూహాత్మకుడగు భగవంతుని ఆ నామములచే అర్చించిన మంత్ర స్వాహాకారములతో యజించిన భగవానుడు ప్రసన్నుడగునని భావము.(38)

39.శ్లో. ఇమం స్వనిగమం బ్రహ్మన్
అవేత్య మదనుష్ఠితమ్ ।
అదాన్మే జ్ఞానమైశ్వర్యం
స్వస్మిన్ భావం చ కేశవః ॥

టీ:- ఏవం కృతవతి మయి హరిః స్వసదృశం జ్ఞానాదికం దత్తవానిత్యాహ ఇమమితి. ఇమం స్వనిగమం సోపదేశం మయానుష్ఠితం అవేత్య జ్ఞాత్వా భావం ప్రీతిం. (39)

ఓ మహర్షీ ! ఈ విధముగా తన నిర్ణయమును నేను చేసిన శరణాగతిని తన యందలి దృఢానురాగమును గుర్తించి భగవంతుడు నాకు జ్ఞానైశ్వర్యములను భక్తిని కూడ ప్రసాదించెను.(39)

40. శ్లో. త్వమప్యదభ్రశ్రుతవిశ్రుతం విభోః
సమాప్యతే యేన విదాం బుభుత్సితమ్ ।
ప్రఖ్యాహి దుఃఖైర్ముహురర్దితాత్మనాం
సంక్లేశనిర్వాణముశంతి నాన్యథా ॥

టీ:- అతస్త్వమప్యేవం కుర్విత్యాహత్వమితి. అదభ్రం అనల్పం శ్రుతం యస్య హే అదభ్రశ్రుత విభోః విశ్రుతం యశః ప్రఖ్యాహి కథయ. యేన విశ్రుతేన బుద్ధేన విదాం విదుషాం బుభుత్సితం బోద్ధుమిచ్ఛా సమాప్యతే సమ్యక్ప్రాప్యతే. యత్ యతః దుఃఖైః పీడితానాం క్లేశశాంతిం ప్రకారాంతరేణ న మన్యంతే. (40)

ఓ మహర్షి ! నీవు కూడా ఇలాగే చేయుమని నారదుడు వ్యాసునికి త్వమపి అని తెల్పుతున్నాడు. అధికమైన వేదశాస్త్రజ్ఞానము గల ఓ మహర్షి ! నీవుకూడా ఆ భగవంతుని కీర్తిని వెల్లడింపుము. దానిచేత విద్వాంసులకు మరియొకటి తెలిసికొన వలసినది ఉండదు. అనగా అన్ని తెలియునని భావము. 'యస్మిన్ విజ్ఞాతే సర్వం విజ్ఞాతం భవతి' అంతేకాదు అనేక కష్టాలు పొందువారికి కష్టములు తొలగి మనశ్శాంతి కలుగును. ఇతరమైన వాటితో కలుగదు.(40)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం సంహితాయాం ప్రథమేస్కంధే భావార్థదీపికాయాం పంచమోऽధ్యాయః**

**శ్రీమద్భాగవతము యొక్క ప్రథమస్కంధ పంచమాధ్యాయమునకు శ్రీధరీయవ్యాఖ్యానుసార ఆంధ్రానువాదము ముగిసినది.**

**షష్ఠోఽధ్యాయః**

**శ్రీసూత ఉవాచ.**

1. శ్లో. ఏవం నిశమ్య భగవాన్
దేవర్షేర్జన్మ కర్మ చ ।
భూయః పప్రచ్ఛ తం బ్రహ్మన్
వ్యాసస్సత్యవతీసుతః ॥

టీ:- శ్లో.వ్యాసస్య ప్రత్యయార్థం హి షష్ఠే ప్రాగ్జన్మసంభవమ్, స్వభాగ్యంనారదః ప్రాహకృష్ణ సంకీర్తనోద్భవమ్. (1)

**వ్యాస ఉవాచ.**

2. శ్లో. భిక్షుభిర్విప్రవసితే
విజ్ఞానాదేష్టృభిస్తవ ।
వర్తమానో వయస్యాఽఽద్యే
తతః కిమకరోద్భవాన్ ॥

టీ:- స్వయమపి చికీర్షుర్గురూపదేశాంతరభావి తచ్చరితం -పృచ్ఛతి భిక్షుభిరితి. విప్రవసితే దూరదేశగమనేకృతే సతి విజ్ఞానస్యోపదేష్టృభి బ్రహ్మతత్త్వోపదేశం కృతవద్భిః. (2)

**ఆరవ అధ్యాయము**

**సూతుడిట్లనెను.**

వ్యాసమహర్షికి నమ్మకం కలగడానికి ఈ ఆరవ అధ్యాయంలో నారదుడు పూర్వజన్మలో కృష్ణపరమాత్మ సంకథనం వలన తనకు కలిగిన అదృష్టమును చెప్పుతున్నాడు. వ్యాసభగవానుడు నారదమహర్షి యొక్క జన్మ వృత్తాంతమును, ఆయన చేసిన పనులను విని, ఓ బ్రాహ్మణోత్తమా ! అని సత్యవతీ కుమారుడగు వ్యాసమహర్షి మరల ప్రశ్నించెను. (1)

స్వయముగానే కథలను రచించదలచి, గురూపదేశానంతరము ఏమి జరిగినదని ఆ చరిత్రను భిక్షుభిరితి అని అడుగుతున్నాడు వ్యాసుడు. విజ్ఞానమును ఉపదేశించుచూ ఆ యతీశ్వరులు దూరము వెళ్ళిపోగా ఓ నారదమహర్షీ! మొదటి వయస్సులో అనగా బాల్యదశలో ఉన్న నీవు తదుపరి ఏమి చేసితివి.(2)

3. శ్లో. స్వాయంభువ ! కయా వృత్త్యా
వర్తితం తే పరం వయః ।
కథం చేదముదస్రాక్షీః
కాలే ప్రాప్తే కలేబరమ్ ॥

టీ:- స్వాయంభువేతి. పరం పయః ఉత్తరం ఆయుః తేత్వయా కథం వర్తితం నీతం. ఇదమితి దాసీపుత్రభూతం కళేబరం ఉదస్రాక్షీః ఉత్సృష్టవానసి.(3)

4. శ్లో. ప్రాక్కల్పవిషయామేతాం
స్మృతిం తే సురసత్తమ ।
న హ్యేవ వ్యవధాత్కాలః
ఏష సర్వ నిరాకృతిః ॥

టీ:- ప్రాగితి. ఏషకల్పాంతరలక్షణః బాలః తే స్మృతిం కథం న వ్యవదాత్ న ఖండితవాన్. అడాగమభావస్త్వార్షః. యత ఏష సర్వస్య నిరాకృతిః ప్రలోపోయస్మాత్సః(4)

ఓ నారదమహర్షీ! స్వయంభూకుమారుడవైన నీవు ఏ వృత్తిచేత తరువాత వయస్సును గడిపితివి? మృత్యువురాగా ఆ నీ దాసీపుత్ర శరీరాన్ని ఎట్లు వదిలితివి.(3)

ఓ మహర్షీ ! పూర్వ కల్పమున జరిగిన స్మృతిని, జ్ఞానమును, అన్నింటిని మరిపించు ఈ కాలము నీ స్మృతిని ఏల ఖడించలేదు? మరిపించలేదు అని అడిగారు వ్యాసులు.(4)

**నారద ఉవాచ.**

5. శ్లో. భిక్షుభిర్విప్రవసితే
విజ్ఞానాదేష్టృభిర్మమ ।
వర్తమానో వయస్యాద్యే ।
తత ఏతదకారషమ్ ॥

టీ:- భిక్షుభరితి. అకారిషం కృతవానహం రేఫషకాయోర్విశ్లేషః ఛందోనురోధేనేత్యవగంతవ్యం.(5)

నాకు విజ్ఞానాన్ని ఉపదేశించిన భిక్షుకులు, యతీశ్వరులు దూరం వెళ్లిపోగా (మొదటి వయసులో) బాల్యముననున్న నేను ఆ తరువాత ఈ పనిని చేశాను. అని నారదుడు చెప్పనారంభించెను. ఇచట రేఫ షకారములు ఛందస్సు కొఱకు విడదీయబడినవి.(5)

6. శ్లో. ఏకాత్మజా మే జననీ
యోషిన్మూఢా చ కింకరీ ।
మయ్యాత్మజేఽనన్యగతౌ
చక్రే స్నేహానుబంధనమ్ ॥

టీ:- తతస్తావత్కంచిత్కాలం తత్రైవ మాతృస్నేహయంత్రితో న్యవసమిత్యాహ-త్రిభిః ఏకేతి.ఏక ఏవ అహమాత్మజో యస్యాస్సా యోషేతి మూఢేతి ఛ స్నేహనుబంధహేతుః.(6)

అక్కడే మా తల్లిగారి వద్ద, ఆమె యందలి ప్రేమచేత కొంత కాలము ఉంటినని మూడు శ్లోకములతో చెప్పుచున్నాడు నారదమహర్షి వ్యాసమునితో. నేనొక్కడనే కుమారునిగా కలిగిన మా తల్లి ఆడమనిషి, అజ్ఞురాలు. దాసీగా పనిచేయుచున్న మాతల్లి వేరేదిక్కులేని కుమారుడనగు నా యందు మిక్కిలి ప్రేమానుబంధము కలిగి యుండెను. ఈ స్నేహానుబంధానికి ఆమె ఆడమనిషి , ఎక్కువ తెలిసిన జ్ఞాని కాకుండుట కారణము.(6)

7. శ్లో. సాఽస్వతంత్రా న కల్పాసీత్
యోగక్షేమం మమేచ్ఛతీ ।
ఈశస్య హి వశే లోకో
యోషా దారుమయీ యథా ॥

టీ:- కింకరీత్యస్యార్థం ప్రపంచయతి. సేతి. అస్వతంత్రా అతో న కల్యా యోగ క్షేమవిధానే న సమర్థా ఆసీత్.దారుమయీ యోషేత్యపి పారవశ్యే దృష్టాంతః (7)

8. శ్లో. అహం చ తద్బ్రహ్మకులే
ఊషివాం స్తదపేక్షయా ।
దిగ్దేశకాలావ్యుత్పన్నో ।
బాలకః పంచహాయనః ॥

టీ:- తదేవం సా స్నేహం చక్రే. అహం చ దిగాదిష్వనభిజ్ఞః.అతస్తత్రైవ న్యవసమిత్యాహ- అహమితి. అహంచ తద్బ్రహ్మకులే. తస్యా మాతుః స్నేహాను బంధస్యా పేక్షయా కదా విరమేదితి. ప్రతీక్షయేత్యర్థః. ఉషివాన్ వాసం కృతవాన్. పంచహాయనః పంచవర్షః(8)

'కింకరీ' అని పైశ్లోకమున చెప్పిన దాని అర్థాన్ని వివరిస్తున్నాడు 'సా' అను శ్లోకముతో. అస్వతంత్రురాలగు మాతల్లి నా యోగక్షేమమును వహించుటలో ఇచ్ఛకలిగి కూడా నన్ను సంరక్షించుటకు సమర్థురాలు కాలేకపోయెను. ఆమె అధికారియైన ఈశ్వరుని ఆజ్ఞలోనుండి ఆడించినట్లు ఆడే ఆడ కట్టెబొమ్మ వలె ఉండెను. "దారుమయీ యోషా" కఱ్ఱతో నిర్మించిన స్త్రీ వలె అని చెప్పడంతో మిక్కిలి పరవశురాలని దృష్టాంతం చూపాడు నారదుడు తల్లి విషయంలో.(7)

అది ఈ విధంగా జరిగినది. ఆమె నాపై మిక్కిలి ప్రేమ పెట్టుకున్నది. నేను కూడా దిక్కు, దేశము, కాలమునే ఎరుగని ఐదు సంవత్సరాల పిల్లవాడిని. ఆ బ్రాహ్మణ కుటుంబమునందు మా తల్లి స్నేహానుబంధాన్ని పురస్కరించుకొని ఆమె కోసము అచటనే నివసించియుంటిని.(8)

9. శ్లో. ఏకదా నిర్గతాం గేహాత్
దుహంతీం నిశి గాం పథి ।
సర్పో౽దశత్పదా స్పృష్టః
కృపణాం కాలచోదితః ॥

టీ:- ఏకదేతి. గేహాన్నిర్గతాం. గాం దుహంతీం. హేతౌ శతృ ప్రత్యయః దోగ్ధుం నిర్గతామిత్యర్థః. పదా పాదేన ఆస్పృష్టః ఈషదాక్రాంతః అదశత్ అఖాదత్.(9)

ఒక రోజు రాత్రి మా తల్లి ఆవు పాలను పితుకుటకు ఇంటి నుండి బయలుదేరి వెళుతుండగా మార్గమున కాలచోదితమై ఒక పాము ఆమె కాలుతో స్పృశింపబడి కరచెను. ఇచట దుహంతం అను పదమునందలి శతృ ప్రత్యయము హేత్వర్థకము.'లటః శతృశానచావప్రథమాసమానాధికరణే అను వ్యాకరణ సూత్రము చేత దుహంతీ అనుదానికి పితుకుచున్నది అని అర్థము వచ్చును. వర్తమానమున అర్థము ఇచట సరిపోదు. కావున పితుకడానికి వెళుతున్న అని హేత్వర్థముగా చెప్పవలెను. ఇటులనే పదా పాదేన స్పృష్టః అనగా కాలుతో కొంచెము తాకినది అని, అదశత్ అనగా అఖాదత్ అని అర్థము. అఖాదత్ = పాముతినెను. అనగా ఆమె చనిపోయినదని స్పష్టమగును. (9)

10. శ్లో. తదా తదహమీశస్య
భక్తానాం శమభీప్సతః ।
అనుగ్రహం మన్యమానః
ప్రాతిష్ఠం దిశముత్తరామ్ ॥

టీ :- తదేతి. తన్మాతుర్మరణం భక్తానాం శం కల్యాణం అభీప్సతః ఈశాస్యానుగ్రహం మన్యమానః ప్రాతిష్ఠం ప్రస్థితో౽స్మి(10)

అపుడు నేను మా తల్లి మరణాన్ని చూచి ఆమె యొక్క ఊర్ధ్వదేహ విధులనొనర్చి ఇదంతయు భక్తుల క్షేమముకోరు భగవంతుని అనుగ్రహముగా భావించి ఉత్తరదిక్కు ప్రయాణించితిని.(10)

11. శ్లో. స్ఫీతాన్ జనపదాం స్తత్ర
పురగ్రామవ్రజాకరాన్ ।
ఖేటాన్ ఖర్వటవాటీశ్చ
వనాన్యుపవనాని చ ॥

టీ :– స్ఫీతానితి. స్ఫీతాన్ జనపదాన్. అతియాతస్సన్. మహద్విపినమద్రాక్షమితి చతుర్థేనాన్వయః జనపదాదిషు నానాగుణ దోషయుక్తేషు సమదృష్టిస్సన్. గతోఽహమితి తాత్పర్యార్థః. స్ఫీతాన్ సమృద్ధాన్ జనపదాన్ దేశాన్. తత్ర తస్యాం దిశి. పురాగ్రామ వ్రజాకరాన్. తత్ర పురాణీ రాజధాన్యః. గ్రామాః భృగ్వాదిప్రోక్తాఃశ్లో 'విప్రాశ్చ విప్రభృత్యాశ్చ యత్రచైవ వసన్తి హి, స తు గ్రామ ఇతి ప్రోక్తశ్శూద్రాణాం వాస ఏవవే' తి.శ్లో. శూద్రాశ్చ శూద్రభృత్యాశ్చ యత్ర సర్వే వసంతి హి, సతుగ్రామ ఇతి ప్రోక్తో ద్విజానాం వాస ఏవవే'తి. వ్రజాగోకులాని. ఆకరాః రత్నాద్యుత్పత్తి స్థానాని. తాన్. ఖేటాఃకర్షక గ్రామాః ఖర్వటాః గిరితటగ్రామాః భృగూక్తా వా. శ్లో.' ఏకతో యత్ర తు గ్రామో నగరం చైకతః స్థితం. మిశ్రం తత్ఖర్వటం నామ నదీగిరి సమాశ్రయమ్' ఇతి. వాట్యః పూగపుష్పోద్యానాని తాః స్వతస్సిద్ధ వృక్షాణాం సమూహ వనాని. ఉపవనాని ఆరోపితవృక్షాణాం సమూహాః తాని చ.(11)

సమృద్ధములైన దేశములను దాటి ఒక మహారణ్యమును చూచితినని పదునాలుగవ శ్లోకముతో అన్వయము. అనేక గుణదోషాలు కల జనపదాదులయందు సమదృష్టి కలవాడనై వెళ్లితినని తాత్పర్యము. ఆ ఉత్తర దిక్కున పుర,గ్రామ, వ్రజాకరములను చూచితిని అన్నాడు నారదుడు. పురములనగా రాజధానులని, గ్రామములు అనగా భృగువు చెప్పినట్లుగా ఒక దిక్కు నగరాలు కల గ్రామాలని వ్రజములనగా గొల్లపల్లెలని, ఖేటములనగా కొండలమీది ఊళ్ళని, ఖర్వటములనగా కొండదిగువ పల్లెలని నదులు గిరులతో కలిసినవని, వాటికలనగా పోకలు, పువ్వుల తోటలు కలవని, వనములనగా స్వయముగానే మొలచిన వృక్ష సమూహమని, ఉపవనములనగా ఊరిదగ్గఱి తోటలని ఆకరములు, గనులు, ఖేటములు, కర్షకులు నివసించు స్థలాలు, ఖర్వటములు కొండల కింది పల్లెలు, వ్రజములు (గొల్ల పల్లెలు ఇవన్నీ చూస్తూ వెళ్ళాను.(11)

12. శ్లో. చిత్రధాతు విచిత్రాద్రీన్
ఇభభగ్నభుజద్రుమాన్ ।
జలాశయాన్ శివజలాన్
నలినీస్సురసేవితాః ॥

టీ:- చిత్రేతి. చిత్రైర్ధాతుభిః స్వర్ణరజతాద్యైర్విచిత్రాన్నద్రీంశ్చ ఇభైర్భగ్నాః భుజాశ్శాఖాః యేషాం తే ద్రుమాః యేషు తాన్. శివాని భద్రాణి జలాని యేషు తాన్ జలాశయాన్. పరైస్సేవితాః నళినీస్సరసీః (12)

చిత్రములైన స్వర్ణ రజతాది ధాతువులచేత, విచిత్రములైన పర్వతములను, ఏనుగుల చేత విరువబడిన కొమ్మలుగల చెట్లను, మంచి నీరుకల జలాశయములను, దేవతలచేత సేవించబడు సరస్సులను చూస్తూ వెళ్లాను. (12)

13. శ్లో. చిత్రస్వనైః పత్రరథైః
విభ్రమద్భ్రమరశ్రియః ।
నలవేణుశరస్తంబ
కుశకీచకగహ్వరమ్ ॥

టీ:- చిత్రేతి. చిత్రాః స్వనాః యేషాం తైః పత్రరథైః పక్షిభిః తన్నాదప్రతిబుద్ధైరిత్యర్థః విభ్రమద్భిః భ్రమరైః శ్రీశ్శోభా యాసాం తాః నళినీః. ఇతి అతియాతః అతిక్రమ్య గతస్సన్ మహద్విపినం అద్రాక్షం. కీదృశం? నలవేణుశరాణాం స్తంభైః కుశైః కీచకైశ్చ గహ్వరం దుర్గమం తత్ర నలానితృణవిశేషాః సూక్ష్మరంధ్రాః వేణవః వేణుజాతయ ఏవ విపులాంతరాళగర్భాః సచ్ఛిద్రాః కీచకాః(13)

చిత్రవిచిత్ర ధ్వనులుగల పక్షులచేత, వాటి ధ్వనులచేత మేలుకొని విహరించుచున్న తుమ్మెదల శోభకలిగిన సరస్సులను చూస్తూ వాటిని దాటి వెళ్ళుతున్న వాడనై ఆ మహారణ్యమును చూచితిని. ఆ అరణ్యము దట్టముగా అల్లుకొన్న గడ్డి, వెదురుచెట్లు, రెల్లుగడ్డి గుంటలు, దర్భలు, నడుమ గాలినిండి ధ్వనించుచున్న వెదురు బొంగులు, మున్నగువాని చేత భయంకరమైనది. (13)

14. శ్లో. ఏక ఏవాతియాతోఽహమ్
అద్రాక్షం విపినం మహత్ ।
ఘోరం ప్రతిభయాకారం
వ్యాలోలూకశివాజిరమ్ ॥

టీ:- శరాః దర్భవిశేషాః స్తంబాః తృణాదిగుచ్ఛవిశేషాః తైర్గహ్వారం దుర్గమ ప్రదేశం. ఘోరదుస్సహం. ప్రతిభయాకారం భయంకరరూపం. వ్యాళాదీనాం. అజిరం క్రీడాస్థానం.(14)

నేను ఒక్కడనే వెళుతూ సహించరానట్టి, అడుగడుగున భయంకరమైనట్టి అరణ్యమును చేరుకొంటిని. పెద్ద సర్పములు, పెద్దపిట్టలు, ఆడునక్కలకు స్థావరమైన భయంకరమైన అడవిని చూచితిని. (14)

15. శ్లో. పరిశ్రాంతేంద్రియాత్మాఽహం
తృట్పరీతో బుభుక్షితః
స్నాత్వా పీత్వా హ్రదే నద్యాః
ఉపస్పృష్టో గతశ్రమః ॥

టీ:- పరిశ్రాంతేతి పరిశ్రాంతాని ఇంద్రియాణి చక్షురాదీని. ఆత్మాదేహశ్చ యస్య తృషాపరీతో వ్యాప్తస్సన్ ఉపస్పృష్టః ఆచాంతః (15)

అలసిపోయిన ఇంద్రియాలు, దేహము కల నేను ఆకలి దప్పులతో అలమటించి అచటి ఒక హ్రదములో స్నానము చేసి, నీరుత్రాగి శ్రమను తొలగించుకొని, ఆచమించి కూర్చొంటిని.(15)

16. శ్లో. తస్మిన్నిర్మనుజేஉరణ్యే
పిప్పలోపస్థ ఆశ్రితః ।
ఆత్మనాత్మానమాత్మస్థం
యథాశ్రుతమచింతయమ్ ॥

టీ:- తస్మిన్నితి. పిప్పలోపపస్థే ఆశ్వత్థమూలే. ఆశ్రితః ఉపవిష్టః ఆత్మనా బుధ్యా మనసా వా. ఆత్మస్థం హృదిస్థం. ఆత్మానాం పరమాత్మానమ్.(16)

ఆ నిర్మానుష్యమైన అరణ్యమున ఓ రాగిచెట్టు కింద కూర్చొని నా ఆత్మలోనున్న పరమాత్మను నా బుద్ధి లేదా మనస్సుచేత నేను విన్నట్లుగా ధ్యానించితిని.(16)

17. శ్లో. ధ్యాయతశ్చరణాంభోజం
భావనిర్జిత చేతసా ।
ఔత్కంఠ్యాశ్రుకలాక్షస్య
హృద్యాసీన్మే శనైర్హరిః ॥

టీ:- ధ్యానఫలమాహ - ధ్యాయత ఇతి. భావేన భక్త్యా నిర్జితం వశీకృతం. యచ్చేతః తేన ఔత్కంఠ్యేన అశ్రుకళాయుక్తే అక్షిణీ యస్య.(17)

భక్తిచేత వశింపచేసికొన్న మనస్సుతో భగవంతుని పాదకమలములను ధ్యానించుచు ఉత్కంఠచేత కన్నీళ్ళు కమ్మగా నా మనస్సున మెల్లగా శ్రీహరి గోచరించెను.(17)

18. శ్లో. ప్రేమాతిభరనిర్భిన్న
పులకాంగోఽతినిర్వృతః ।
ఆనందసంప్లవే లీనో
నాఽపశ్యముభయం మునే ॥

టీ:- ప్రేమేతి. ప్రేమ్ణోఽతిభరేణ నిర్భిన్నపులకాన్యంగాని యస్య. ఆనందానాం సంప్లవే మహాపూరే పరమానందే ఉభయమాత్మానం పరం చ.(18)

ఓ వ్యాసమునీ ! భక్తిచేత పులకితగాత్రుడనై మిక్కిలి తృప్తిబొంది ఆనంద ప్రవాహమున మునిగియున్న నేను ఆత్మను, పరమాత్మను (విడిగా) రెండింటిని గుర్తించని స్థితిలో ఉంటిని.(18)

19. శ్లో. రూపం భగవతో యత్తత్
మనఃకాంతం శుభావహమ్
అపశ్యన్ సహసోత్తస్థౌ
వైక్లవ్యాద్దుర్మనా ఇవ ॥

టీ:- రూపమితి. మనసః కాంతం అభీష్టం. శుచా. శోకః తామపహంతీతి తథాతత్. ఉత్తస్థౌ ఉత్థితోఽస్మి.(19)

మనోహరమగు ఇట్టి దుఃఖాన్ని తొలగించునట్టిదియు అగు భగవంతుని రూపాన్ని చూడలేక వెంటనే మనోవికలత్వమును పొంది ఏదో బాధపడుతున్న వానివలె లేచి నిలిచితిని.(19)

20. శ్లో. దిదృక్షుస్తదహం భూయః
ప్రణిధాయ మనో హృది ।
వీక్షమాణోఽపి నాపశ్యమ్
అవితృప్త ఇవాతురః ॥

టీ:- దిదృక్షురితి. హృది మనః ప్రణిధాయ స్థిరీకృత్య అవితృప్తోఽహం. ఆతుర ఇవాభవమితి శేషః. (20)

నేను నా మనస్సును ఏకాగ్రము చేసి మాటిమాటికి ఆ భగవంతునిరూపాన్ని చూడదలచి, చూచుచూ కూడ తృప్తి చెందక బాధపడుతూ చూడనివాడనే అయితిని.(20)

21. శ్లో. ఏవం యతంతం విపినే
మామాహాగోచరో గిరామ్ ।
గంభీరశ్లక్ష్ణయా వాచా
శుచః ప్రశమయన్నివ ॥

టీ:- ఏవమితి. గిరామగోచరః వేదవచసామప్యవిషయః స ఈశ్వరః (21)

ఇట్లు జనరహితమైన ఆ వనప్రదేశమున ఆతనిని చూచుటకు నేను యత్నము గావించుచుండగా వాక్కులకు గోచరముగాని, తెలియశక్యముగాని ఆ పరమాత్మ గంభీరము మరియు సుస్పష్టమగు వాక్కుతో నా దుఃఖము తొలగించుచున్న వానివలె నాతో ఇట్లు పలికెను.(21)

22. శ్లో. హంతాస్మిన్ జన్మని భవాన్
మా మాం ద్రష్టుమిహార్హతి ।
అవిపక్వ కషాయాణాం
దుర్దర్శోఽహం కుయోగినామ్ ॥

అయ్యో ! అని దయతో కూడిన సంబోధనము కావించి ఆ పరమాత్మ నాతో ఇట్లనెను ఓరీ ! నీవు ఈ జన్మలో నన్ను చూచుటకు అర్హుడవు కావు. పరిపక్వముగాని దశలో మలినమైన కామక్రోధాధులు కల కుయోగులకు, యోగసాధన పరిపూర్ణముకాని వారికి నేను కానరాను.(22)

టీ:- హంతేతి. హంతేతి సానుకంపసంభోదనే. మా మాం ద్రష్టుం మార్హతి నార్హతి. యతః అవిపక్వాః అదగ్ధాః కషాయాః మలాః కామాదయో యేషాం తేషాం కుయోగినాం అనిష్పన్నయోగినాం.(22)

23. శ్లో. సకృద్యద్దర్శితం రూపమ్
ఏతత్కామాయ తేఽనఘ ।
మత్కామశ్శనకైస్సాధు
సర్వాన్ ముంచతి హృచ్ఛయాన్ ॥

టీ:- కుతస్తర్హి దృష్టోఽసి? తత్రాహ-సకృదితి. సకృద్దర్శితం. మయేతి యత్ ఏతత్కామాయ మయ్యనురాగాయ. త్వత్కామేన కిమిత్యత ఆహ- మత్కామః పుమాన్.హృచ్ఛయాన్ కామాన్.(23)

అయితే ఏల కనిపించితివి అందువేమో అని ఆ భగవానుడిట్లనెను. ఓ పాపరహితుడవైన నారదా! నా యందు అనురాగము కలిగిన వాడవు కనుక నీకు ఈ రూపమును ఒకసారి మాత్రము చూపించితిని. ఎందుకనగా నన్ను పొందగోరిన పురుషుడు మెల్లగా, లెస్సగా హృదయగతమైన కోరికలన్నింటిని క్రమముగా విడువగలడు.(23)

24.శ్లో. సత్సేవయా దీర్ఘయా తే
జాతా మయి దృఢా మతిః ।
హిత్వాఽవద్యమిమం లోకం
గంతా మజ్జనతామసి ॥

టీ:- సదితి అదీర్ఘయాపి సతాం సేవయా. ఆవద్యం నింద్యం. దోషసంపాదకమితి యావత్ ఇమం లోకం దేహం దాసీపుత్రకళేబరం, మజ్జనతాం మత్పార్షదతాం గంతాసి.(24)

నీవు చిరకాలము సజ్జనసేవ గావించినందున నీకు నాయందు దృఢమైన బుద్ధి భక్తి కలిగినది. ఇకపై నింద్యమైన దేహాన్ని వదలి బ్రహ్మ మానసపుత్రుడవై నా పార్షదుడవు, భక్తుడవు అగుదువు.(24)

25. శ్లో. మతిర్మయి నిబద్ధేఽయం
న విపద్యేత కర్హిచిత్ ।
ప్రజాసర్గ నిరోధేఽపి
స్మృతిశ్చ యదనుగ్రహాత్ ॥

టీ:- మతిరితి. ప్రజానాం సర్గే సృష్టౌ నిరోధే సంహారేఽపి. ప్రజాసర్గస్య నిరోధ. ఇతి వా.(25)

నా యందు దృఢముగా ఉంచబడిన నీ ఈ బుద్ధి ఎప్పుడు మారదు, నశించదు. నా అనుగ్రహము వలన ప్రజాసర్గ నిరోధమున కూడా అనగా ప్రలయ కాలమున కూడ మరల సృష్టి జరిగినా కూడా నా స్మరణము నిన్ను వదలదు. అప్పుడు కూడా నీవు నన్ను తలతువు అని భగవానుడు నారదుని అనుగ్రహించెను.(25)

26. శ్లో. ఏతావదుక్త్వోపరరామ తన్మహద్
భూతం నభోలింగమలింగమైశ్వరమ్
అహం చ తస్మై మహతాం మహీయసే
శీర్ష్ణాఽవనామం విదధేఽనుకంపితః ॥

టీ:- ఏతావదితి. తత్ప్రసిద్ధం మహద్భూతం. శ్రు.'ఏతస్య వా అక్షరస్య మహతో భూతస్య నిశ్వసితమేతదృగ్వేద' ఇత్యాదిశ్రుతేః కీదృశం? ఈశ్వరం. సర్వనియన్తృ నభసి లింగం మూర్తిర్యస్య తత్. నభోలింగం. శ్రు. 'ఆకాశశరీరం బ్రహ్మ' ఇతి శ్రుతేః సన్నిహిత మపి న లింగ్యత ఇత్యలింగం. తస్మై అదృష్టాయ. అవనామం ప్రణామం. విదధే కృతవానహమ్ తేన అను కంపితస్సన్.(26).

ఆకాశమను ఆకారము కలిగి దగ్గర ఉన్నను చూడశక్యముగాని సర్వనియంత ఆ గొప్ప భూతము 'అస్య మహతో భూతస్య నిఃశ్వసిత మేతదృదృగ్వేద' అని మొదలైన వేదము చేత తెల్పబడిన పరమాత్మ ఈవిధముగా పలికి విరమించెను. ఆ పరమాత్మ దయతో అనుగ్రహింపబడిన నేను గొప్పవారిలో గొప్పదైన, కనిపించని ఆ మహాభూతమునకు శిరస్సు వంచి నమస్కారము చేసితిని.(26)

27.శ్లో. నామాన్యంతస్య గతత్రపః పఠన్
గుహ్యాని భద్రాణి కృతాని చ స్మరన్ ।
గాం పర్యటంస్తుష్టమనా గతస్పృహః
కాలం ప్రతీక్షన్ విమదో విమత్సరః ॥

టీ:- నామానీతి. హతత్రపః త్యక్తలజ్జః విమత్సరో జాతోఽస్మీతి శేషః (27)

మద, మాత్సర్యములు లేని నేను సిగ్గువీడి ఆ అనంతుని, భగవానుని రహస్యములైన, శుభప్రదములుగా, వర్ణింపబడిన పేర్లను స్మరించుచూ, భగవన్నామ సంకీర్తనము చేయుచూ సంతోషముతో భూమండలమున తిరుగుతూ, కాలానికి ఎదురుచూస్తూ తెలివిలేని వాడనైపోతిని. నన్ను నేను మరచితిని. (27)

28. శ్లో. ఏవం కృష్ణమతేః బ్రహ్మన్
ఆసక్తస్యామలాత్మనః ।
కాలః ప్రాదురభూత్కాలే
తటిత్సౌదామనీ యథా ॥

టీ:- ఏవమితి కాలే స్వావసరే కాలో మృత్యుః ప్రాదురభూత్ ఆవిర్బభూవ. అకస్మాత్ ప్రాదుర్భావే దృష్టాంతః - తటిదితి. సౌదామనీతి విశేషణం స్ఫుటత్వ ప్రదర్శనార్థం సుదామా మాలా. తత్ర భవా సౌదామనీ మాలాకారేత్యర్థః యద్వా సుదామనామా కశ్చిత్ స్ఫటిక పర్వతః 'తేనైకదిక్' ఇతి సూత్రేణాణ్. స్ఫటికాదిమయ పర్వత ప్రాంతభవా హి విద్యుత్ అతి స్ఫుటా భవతి తద్వదిత్యర్థః యద్వా. తటితి అంతిక ఇత్యర్థః 'తటిదిత్యంతికవధయో' రితి నైరుక్తస్మరణాత్. (28)

ఓ వ్యాసమునీ ! ఈ విధముగా భగవంతుడగు కృష్ణునియందే బుద్ధినిల్పి ఇతరములందు అనాసక్తుడనై శుద్ధుడనైయున్న నాకు హఠాత్తుగా కాలము గడచి మృత్యువు ప్రాప్తించెను. ఈ విషయమున వర్షాకాలమున విద్యుత్తు మెరుపువలెనని ఉపమానము తెల్పాడు నారదుడు. ఇచట తటిత్ అన్నా సౌదామనీ అన్నా ఒకటే కాని స్పష్టార్థము సౌదామనియను విశేషణము. సుదామ అనగా ఒక మాల. అచట ఆవిర్భవించిన సౌదామని మాలాకారముగా ఉన్నది సుదామ అనగా ఒక స్ఫటిక పర్వతము. స్ఫటిక పర్వత ప్రాంతాన పుట్టినది సౌదామని విద్యుత్తు, దానివలె అని అర్థము. నారదుని ఆకస్మిక మృత్యు సంభవము ఆ విధముగానున్నదని అర్థము. పునరుక్త దోష నివారణకు, తడిదనగా దగ్గరయని మరొక విధంగా అర్థాన్ని చెప్పవచ్చును. 'తడిదిత్యంతిక వధయోః' అని నిరుక్తమున కలదు. అపుడు దగ్గరనే ఉన్న మెరుపులాగ నాకు మృత్యువు వచ్చినాదని అర్థము.(28)

29. శ్లో. ప్రయుజ్యమానే మయి తాం
శుద్ధాం భాగవతీం తనుమ్
ప్రారబ్ధకర్మనిర్వాణో
న్యపతత్ పాంచభౌతికః ॥

టీ:- ప్రయుజ్యమాన ఇతి. శ్లో.' హిత్వావద్యమియం లోకం గంతా మజ్జన తామసి'ఇతి. యా భాగవతీ భగవత్పార్షదరూపా శూద్ధాసత్వ మయీా తనుః ప్రతిశ్రుతా. తాం ప్రతి భగవతా మయి ప్రయుజ్యమానే నీయమానే సతి. ప్రారబ్ధం కర్మయత్ తన్నిర్వాణం సమాప్తిః యస్య కర్మణః నిర్వాణ ఏవ నిర్వాణో యస్యేతి వా. పాంచభౌతికః పంచభూతాత్మకో దేహః న్యపతత్. అనేక పార్షదత నూనాం అకర్మా రబ్ధత్వం శుద్ధత్వం నిత్యత్వామిత్యాది సూచికం భవతి.(29)

ప్రయుజ్యమానే మయి తామను దాని అర్థము హిత్వావద్య మిమం లోకం గంతా మజ్జనతామసి అని, భగవంతుడు ఆదేశించిన విధముగా భగవత్పార్షద రూపమైన స్వచ్ఛ శరీరము కలుగునని చెప్పిన ఆ మాటను నిజము చేయుటకు నా ప్రారబ్ధ కర్మము నశించి పంచ భూతాత్మకమగు దేహము నశించెను . దానిచేత భగవద్భక్తుల శరీరాలకు కూడా ప్రారబ్ధకర్మ, శుద్ధత్వము నిత్యత్వము ఉండునని సూచింపబడినది. (29)

30. శ్లో. కల్పాంత ఇదమాదాయ
శయానేఽంభస్యుదన్వతః
అనుప్రాణం శిశయిషోః
వివిశేఽంతరహం విభోః ॥

ప్రళయకాలమున ఈ మూడు లోకాలు కలిపి ఏక సముద్రముగా నున్న నీటి యందు పడుకొనియున్న శ్రీమన్నారాయణుని హృదయమున పడుకొను ఇచ్ఛగల బ్రహ్మ హృదయ మధ్య భాగములోకి ప్రాణముతో నిఃశ్వాసతో కలిసి ప్రవేశించితిని. ఇచట 'తతోఽవతీర్య విశ్వాత్మా దేహమావిశ్య చక్రిణః అవాప వైష్ణవీం నిద్రాం ఏకీభూయాఽథ

టీ:- కల్పాంత ఇతి ఇదం త్రైలోక్యమాదాయోపసంహృత్య ఉదన్వతః

ఏకార్ణవస్యాంభసి శయానే శ్రీనారాయనే శిశయిషోః శయనం కర్తుమిచ్ఛోః విభోః బ్రహ్మణః అంతః మధ్యం అనుప్రాణం నిశ్వాసేన సహ. వివిశే ప్రవిష్టోఽహం. శ్లో.తతోఽవతీర్య విశ్వాత్మా దేహమావిశ్య చక్రిణః ఆవాస వైష్ణవీం నిద్రామేకీభూయాథ విష్ణునా ఇతి కూర్మోక్తేః స్వాయనేంఽభసీతి పాఠే.-స్వాయనే స్వస్య అయానే అంభసి శిశయిషోః బ్రహ్మణ ఇతి శ్రీనారాయణేనాభేదవివక్ష యోక్తమిత్యవ గంతవ్యం(30)

31.శ్లో. సహస్రయుగ పర్యంత
ఉత్థాయేదం సిసృక్షతః ।
మరీచిమిశ్రా ఋషయః
ప్రాణేభ్యోఽహం చ జజ్ఞిరే ॥

టీ:- సహస్రేతి. ప్రాణేభ్యః ఇంద్రియేభ్యః. అహం మరీచిమిశ్రాః తనుఖ్యాః. ఋషయశ్చ జజ్ఞిరే.(31)

32. శ్లో. అంతర్బహిశ్చ లోకాంస్త్రీన్
పర్యేమ్యస్కందితవ్రతః ।
అనుగ్రహాన్మహావిష్ణోః
అవ్యాహతగతిః క్వచిత్ ॥

విష్ణునా'అని కూర్మ పురాణమున చెప్పిన విధముగా "స్వాయనే అంభసి" అను పాఠమున ("స్వస్యాయన ఆశ్రయేఽంభసి శిశయిషోర్బ్రహ్మణః శ్రీనారాయణేనాభేద ఇతి ఉక్తమవగంతవ్యమ్ ") తనకు ఆశ్రయమైన నీటి యందు పడుకునే ఇచ్ఛగల బ్రహ్మ యొక్క అను అర్ధము చెప్పుటచే నారాయణునికి బ్రహ్మకు అభేదము అని గ్రహించాలి.(30)

సహస్రయుగము వరకు నిద్రించి, ఈ ప్రపంచాన్ని సృష్టించాలన్న పరమేశ్వరుని ప్రాణము, ఇంద్రియాల నుండి మరీచి మొదలగు ఋషులు ఉద్భవించిరి, నేను కూడ ఉద్భవించితిని. 'ఉత్థయేదం సిసృక్షతః' అన్నందున 'తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి' అను శ్రుతి అనుసంధేయము.(31)

బ్రహ్మచర్యమున ఉన్న నేను మూడు లోకాల బయట, లోపల కూడ సంచరిస్తూ, మహావిష్ణువు అనుగ్రహమున ఎక్కడకూడ నిరోధించబడని గమనము కలవాడనై సంచరించితిని. కర్మలు చేసినవారు మూడు లోకాల బయటకురారు. తపస్సు చేసిన వారు

టీ:- అంతరితి. యే చ కర్మిణస్తే బహిర్నయాంతి యే చ తప ఆదిభిర్బ్రహ్మలోకం గతాః తేతు అంతర్నయాంతి అహం తు మహావిష్ణోరనుగ్రహాత్ అస్కందితవ్రతః అఖండిత బ్రహ్మచర్య వ్రతస్సన్. అంతర్బహిశ్చ పర్యేమి పర్యటామి. క్వచిదప్యవిఘాతా అప్రతాహతా గతిర్యస్య సః(32)

బ్రహ్మలోకం వెళ్ళి మూడులోకాలలో ఉండరు. కాని నేను అంతటా సంచరింతును అది మహావిష్ణువు అనుగ్రహము. ఇలా చెప్పడంలో నారదుడు భగవదవతారమని మూడవ అధ్యాయమున చెప్పినది స్పష్టమైనది. 'అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థిత' అని కదా శ్రుతి.(32)

33. శ్లో. దేవదత్తా మిమాం వీణాం
స్వరబ్రహ్మ విభూషితామ్।
మూర్ఛయిత్వా హరికథాం
గాయమానశ్చరామ్యహమ్ ॥

టీ:- నను కిమితి? పర్యటనం ఈశ్వరాజ్ఞయా లోకమంగళార్థ మిత్యాహ - చతుర్భిః దేవదత్తామితి. దేవేన ఈశ్వరేణ దత్తాం. స్వరాః నిషాదర్ష భగాంధారషడ్జ మధ్యమ దైవత పంచమాః ఇతి సప్త. త ఏవ బ్రహ్మ. బ్రహ్మాభివ్యంజకత్వాత్. తేన విభూషితాం స్వతస్సిద్ధ సప్తస్వరా మిత్యర్థః మూర్ఛయితా మూర్ఛనాలాపవతీం కృత్వా.(33)

దేవదత్తమయిన అనగా బ్రహ్మచేనొసగబడిన మహతి అను వీణను పలికించుచూ, ఆరోహణ అవరోహణ క్రమమున ధ్వనింప చేయుచూ, భగవత్కథాగానము చేయుచు తిరుగుతున్నాను. ఎందుకు తిరుగుతున్నావు అను దానికి సమాధానంగా ఈశ్వరేచ్ఛ చేత లోకకల్యాణము కొరకే నా పర్యటనమని నాలుగు శ్లోకములతో తెలుపుతున్నాడు. దేవదత్తమనగా ఈశ్వరదత్తమని స్వరబ్రహ్మ విభూషితమనగా నిషాద, ఋషభ, గాంధార, షడ్జ, మధ్యమ, దైవత, పంచమములను సప్తస్వరాలచే భూషింపపబడిన వీణ అని అర్థము. ఆ స్వరాలు బ్రహ్మ చేతనే ప్రకటించబడినవి. స్వతస్సిద్ధములగు సప్తస్వరాలుగలది నారద వీణ. మూర్ఛన అనగా రాగాలాపము. మూర్ఛయిత్వా అంటే దానిని కలదిగాచేసి అని విశేషార్థము.(33)

34. శ్లో. ప్రగాయతస్స్వవీర్యాణి
తీర్థపాదః ప్రియశ్రవాః ।
ఆహూత ఇవ మే శీఘ్రమ్ ।
దర్శనం యాతి చేతసి ॥

టీ:- స్వప్రయోజనమాహ - ప్రగాయత ఇతి.(34)

35. శ్లో. ఏతద్ధ్యాతుర చిత్తానాం
మాత్రాస్పర్శేచ్ఛయా ముహుః
భవసింధుప్లవో దృష్టో
హరిచర్యానువర్ణనమ్ ॥

టీ:- ఏతదితి. మాత్రాః విషయాః తేషాం స్పర్శాః భోగాః తేషామిచ్ఛయా. ఆతురాణి చిత్తాని యేషాం తేషాం. హరిచర్యానువర్ణనమితి యత్ ఏతదేవ భవసింధోః ప్లవః పోతః, న కేవలం శ్రుతిప్రామాణ్యేన, కింత్వన్వయవ్యతిరేకాభ్యాం దృష్ట ఏవేత్యర్థః(35)

వీణావాదనం చేస్తూ భగవత్కథా గానం చేయడం వలన కలుగు ప్రయోజనాన్ని వివరిస్తున్నాడు ప్రగాయత అను శ్లోకంతో. ఆ భగవంతుని గుణగణాలను పరాక్రమాన్ని గానం చేస్తున్న నా మనస్సున తీర్థపాదుడు, నామసంకీర్తన ప్రియుడు అగు శ్రీహరి పిలువబడ్డ వానివలె త్వరగా దర్శనమును అనుగ్రహిస్తాడు.(34)

హరిసంకీర్తనమునకుగల ప్రధాన ప్రయోజనమును తెల్పుతున్నాడు ఏతదని. మాటిమాటికి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను మాత్రలను విషయములను అనుభవించాలనే ఇచ్ఛచే సంసారసాగరమును దాటలేక బాధ పడుతున్న వారికి ఈ భగవానుని కథానువర్ణనము నౌకగా ఉపయోగపడును. ఇచట అన్వయ వ్యతిరేక దృష్టాంతములతో ఈ విషయము తెలియచేయబడుచున్నది. భగవత్సేవ చేసినవారు సంసార సాగరమును దాటగలరు అనునది అన్వయము అట్టి భగవత్సేవ చేయని వారు సంసార సాగరమున కొట్టుమిట్టాడుతు ఉందురనునది వ్యతిరేకము.(35)

36. శ్లో. యమాదిభిర్యోగపథైః
కామలోభహతో ముహుః ।
ముకుందసేవయా యద్వత్
తథాஉஉత్మాஉద్ధా న శామ్యతి ॥

టీ:- ఏతదేవేత్యుక్తమవధారణమనుభవేన దృఢయతి-యమేతి. యమాదిభిస్తథా న శామ్యతి. యద్వన్ముకుంద సేవయా. అద్ధాసాక్షాత్ ఆత్మామనః శామ్యతి కథంచిన్ముకుందసేవామాత్రేణ శామ్యతి. కింపున సద్గుణవర్ణ నేనేతి భావః(36)

37. శ్లో. సర్వం తదిదమాఖ్యాతం
యత్పృష్టోஉహం త్వయానఘ
జన్మ కర్మ రహస్యం మే
భవతశ్చాஉஉత్మతోషణమ్ ॥

టీ:- సర్వమితి భవతో మనసః పరితోషకరం చాఖ్యాతం సప్రపంచ ముపపాదితం(37)

'ఏతదేవ' అని చెప్పిన అంశమునే మరల నిశ్చయంగా చెపుతున్నాడు. మాటమాటికి కామ, క్రోధాదులతో నిండిన మనస్సుకు యమ, నియమాసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధుల చేత యోగ మార్గమున శాంతి కలుగదు. విష్ణువు సేవ వలననే అది లభించును. భగవత్ సేవామాత్రము చేతనే మానవులకు మనశ్శాంతి లభించగా, అతని గుణగణాల వర్ణనచే లభించునని ప్రత్యేకముగా చెప్పవలసిన పనిలేదు. భగవదారాధనతో తప్పక మనశ్శాంతి లభించును.(36)

నేను నీవడిగిన నా చరిత్రమునంతయు నీకు వివరించితిని. ఓ వ్యాసమహర్షీ! ఇది నీ మనస్సును సంతోషింపచేయునని భావించుచున్నాను. నా జన్మ, కర్మ రహస్యాలు నీ మనస్సునకు కూడా శాంతిని ప్రసాదించును.(37)

**శ్రీ సూత ఉవాచ.**

38 .శ్లో. ఏవం సంభాష్య భగవాన్
నారదో వాసవీసుతమ్ ।
ఆమంత్ర్య వీణాం రణయన్
యయౌ యాదృచ్ఛికో మునిః ॥

టీ:- ఏవమితి. ఆమంత్ర్య అనుజ్ఞాప్య యాదృచ్ఛికః స్వప్రయోజన సంకల్పశూన్యః. (38)

సూతుడు శౌనకాదులకు చెపుతున్నాడు. ఈ విధముగా నారదభగవానుడు వ్యాసమహర్షితో సంభాషించి సెలవు తీసికొని వీణానాదం చేస్తూ యాదృచ్ఛికంగా వెడలిపోయెను. యాదృచ్ఛికంగా అనుదానికి నారదుని పర్యటనమునకు ప్రయోజనముగాని, సంకల్పముగాని లేదని, ఆయన పర్యటనము లోకకల్యాణము కొరకేనని గుర్తించాలి.(38)

39. శ్లో. అహో దేవర్షి ర్ధిన్యోఽయం
యః కీర్తిం శార్ఙ్గధన్వనః
గాయన్మాద్యన్నిరా తంత్ర్యా
రమయత్యాతురం జగత్ ॥

టీ:- హరికథాగాయకనారద భాగ్యం శ్లాఘతే. అహో ఇతి. మాద్యన్ హృష్యన్ తంత్ర్యా వీణయా. (39)

హరికథను హరిగుణగానాన్ని గానం చేస్తున్న నారదముని అదృష్టాన్ని సూతుడు ప్రశంసిస్తున్నాడు అహో ! అని. దేవర్షి అగు నారదుడు ధన్యుడు. ఎందుకనగా శార్ఙ్గమను ధనుస్సును ధరించిన విష్ణుమూర్తి కీర్తిని వీణతో గానం చేస్తూ మహా సంతోషాన్ని పొందుతూ సంసార బాధలతో సతమతమగు జగత్తును ఆనందపరచుచున్నాడు. 39)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం సంహితాయాం ప్రథమేస్కంధే భావార్థదీపికాయాం షష్ఠోధ్యాయః**

**శ్రీమద్భాగవతము యొక్క ప్రథమస్కంధ షష్ఠాధ్యాయమునకు శ్రీధరీయవ్యాఖ్యానుసార ఆంధ్రానువాదము ముగిసినది.**

## సప్తమోఽధ్యాయః

**శౌనక ఉవాచ.**

1.శ్లో. నిర్గతే నారదే సూత
భగవాన్ బాదరాయణః ।
శ్రుతవాంస్తదభిప్రేతం
తతః కిమకరోద్విభుః ॥

టీ:- శ్లో. అథ భాగవతశ్రోతుర్జన్మ వక్తుం పరీక్షితఃసుప్తబాలవధా ద్ద్రౌణేర్దండస్సప్తమ ఉచ్యతే. నిర్గత ఇతి. విభుః సమర్థః తస్య నారదస్యా భిప్రేతం తత్తాత్పర్యవిషయార్థం శ్రుతవాన్ సన్. (1)

## సప్తమాధ్యాయము.

**శౌనకులిట్లడుగుచున్నారు.**

ఓ సూతమహర్షీ ! బాదరాయణమహర్షి వ్యాసుడు నారదుని అభిప్రాయాన్ని విన్న తరువాత సమర్థుడైన ఆ మహర్షి ఏమి చేసెను.(1)

**సూత ఉవాచ.**

2. శ్లో. బ్రహ్మనద్యాస్సరస్వత్యాః
ఆశ్రమః పశ్చిమే తటే ।
శమ్యాప్రాస ఇతిఖ్యాత
ఋషీణాం సత్రవర్ధనః ॥

టీ:- బ్రహ్మేతి. బ్రహ్మనద్యాః బ్రహ్మదైవత్యాయాః బ్రాహ్మణైరన్వి తాయా వా. సత్రం కర్మ వర్ధయతీతి తథా(2)

**సూతులవారు చెపుతున్నారు.**

బ్రాహ్మణులతో ఆశ్రయించబడిన, బ్రహ్మదేవతకు సంబంధించిన సరస్వతీనదీతీరము పడమర భాగమున ఋషీశ్వరులు సత్రయాగము నిర్వర్తించునట్టి చోట శమ్యాప్రాసము అను పేరుగలది. అది ఒక విశిష్టమైన ఆశ్రమము.(2)

3. శ్లో. తస్మిన్ స్వ ఆశ్రమే వ్యాసో
బదరీషండమండితే ।
ఆసీనో௨ప ఉపస్పృశ్య
ప్రణిదధ్యౌ మనః స్వయమ్ ॥

టీ:- తస్మిన్నితి. బదరీణాం షండేన సమూహేన. మండితే. ఆశ్రమే స్వీయాశ్రమే. మనః ప్రాణిదధ్యౌ స్థిరీచకార. సమాధినాను స్మరేతి నారదోపదిష్టం ధ్యానం కృతవానిత్యర్థః(3)

వ్యాసులవారు రేగుచెట్ల గుంపుతో అలంకరింపబడిన ఆ శమ్యాప్రాస ఆశ్రమమందు కూర్చున్నవాడై నీటిని స్పృశించి స్వయముగా తన మనస్సును ఏకాగ్రపరచి ధ్యాననిమగ్నుడాయెను. ఏకాగ్రతతో భగవంతుని కృత్యములను స్మరించుము అని నారదునిచే ఉపదేశింపబడిన విషయమునే ఆలోచింపసాగెను.(3)

4. శ్లో. భక్తియోగేన మనసి
సమ్యక్ప్రణిహతే௨మలే ।
అపశ్యత్పురుషం పూర్వం
మాయాం చ తదుపాశ్రయామ్ ॥

టీ:- భక్తీతి. ప్రణిహితే నిశ్చలే. అత్ర హేతుః-భక్తియోగేన నిర్మలే పూర్వం ప్రథమం పురుషమీశ్వరమపశ్యత్. పూర్ణమితి వా పాఠః తదుపాశ్రయాం ఈశ్వరాశ్రయాం. తదధీనాం మాయాం చాపశ్యత్(4)

వ్యాసులవారు భక్తియోగముచేత నిర్మలమై, చక్కగా ఏకాగ్రపరచబడిన తన మనస్సు నందు ఆదిపురుషుడగు పరమాత్మను అతనిని ఆశ్రయించిన మాయను కూడ దర్శించెను. పూర్వం అని మూలముననున్న పదమునకు పూర్ణం అని పాఠాంతరము కలదు. భగవంతుడు పురాణపురుషుడు, పూర్ణకాముడు . ఆ కావున అర్థము కూడా సరిపోవును.(4)

5. శ్లో. యయా సమ్మోహితో జీవః
ఆత్మానం త్రిగుణాత్మకమ్ ।
పరోఽపి మనుతేఽనర్థం
తత్కృతం చాభిపద్యతే ॥

టీ :- ఈశమాయాకృతాం చ జీవానాం సంసృతిమపశ్యదిత్యాహ- యయేతి. యయాసమ్మోహితః స్వరూపావరణేన విక్షిప్తః పరోఽపి గుణత్రయాద్వ్య తిరిక్తోఽపి. తత్కృతం త్రిగుణ త్వాభిమానకృతం అనర్థం చ కర్తృత్వాదికం ప్రాప్నోతి.(5)

జీవుడు పరమాత్మ స్వరూపుడైనను, మాయచే మోహితుడై తనను త్రిగుణాత్ముడుగా సత్త్వ రజస్తమోగుణ సహితునిగా భావించుచూ, ఆ మూడు గుణముల చేత ఏర్పడుతున్నట్టి అనర్థములను కర్తృత్వ, భోక్తృత్వములను ఆరోపించుకొనుచున్నాడు.(5)

6. శ్లో. అనర్థోపశమం సాక్షాద్
భక్తియోగమధోక్షజే ।
లోకస్యాజానతో విద్వాన్
చక్రే సాత్త్వత సంహితామ్ ॥

టీ:- అనర్థేతి అనర్థముపశమయతి. యోఽధోక్షజే సాక్షాద్భక్తి యోగస్తం చాపశ్యాత్ ఏతత్పరం స్వయం దృష్ట్వా ఏవమజానతో లోక స్యార్థే సాత్వతసంహితాం శ్రీభాగవతం చక్రే. తదనేన శ్లోకేన భాగవతార్థః సంక్షేపితో దర్శితః తదుక్తం భవతి. విద్యా శక్తిః మాయా నియంతా.

విద్వాంసుడగు వ్యాసమహర్షి , సర్వానర్థాలను శమింపచేయునట్టి విష్ణుభగవాను యందలి భక్తియోగాన్ని ధ్యాననిష్ఠలో సాక్షాత్కరించుకొని, దానిని ఎరుగని లోకము యొక్క క్షేమము, ప్రయోజనము కొఱకు సత్త్వగుణ ప్రధానమగు భాగవతసంహితను రచించెను. ఈ మూడు శ్లోకాలతో శ్రీమద్భాగవత పరమార్థము సూచితము. విద్యాశక్తిచేత మాయను నియమించువాడు, ఆనందస్వరూపుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తి సమన్వితుడగు భగవంతుడు మాయాతీతుడు. ఆ మాయచేత మోహితుడై తనస్వరూపాన్ని తెలుసుకోనివాడు జీవుడు. ఆతనికి ఈశ్వరభక్తిచే జ్ఞానము కలిగి దానిచే

నిత్యావిర్భూత పరమానందస్వరూపః సర్వజ్ఞః సర్వశక్తిరీశ్వరః తన్మాయయా సమ్మోహితః తిరోభూత స్వరూపః తద్విపరీతధర్మాజీవః. తస్యచేశ్వర భక్త్యా లబ్ధజ్ఞానేన మోక్ష ఇతి. తదుక్తం విష్ణుస్వామినా శ్లో.'హ్లాదిన్యా సంవిదాశ్లిష్టః సచ్చిదానంద ఈశ్వరః, స్వావిద్యాసంవృతో జీవః సక్లేశనికరాకరః.' తథా–'స ఈశో యద్వశే మాయా స జీవో యస్తయార్దితః, స్వావిర్భూత పరానందః స్వావిర్భూత సుదుఃఖభూః, స్వాదృగుత్థవిపర్యా సభవభేదజభీశుచ, యన్మాయయా జుషన్నాస్తే తమిమం నృహరిం నుమః' ఇత్యాది సంహితాయాం.(6)

మోక్షము లభించును. ఆ విషయమునే విష్ణుస్వామి వివరించాడు. 'హ్లాదిన్యా సంవిదా శ్లిష్టః' అను శ్లోకముననుసరించి మాయను స్వాధీన పరచుకొన్నవాడు, ఆనందస్వరూపుడు, ఈశ్వరుడు. మాయాధీనుడు, దుఃఖానుభవం కలవాడు జీవుడు. భగవదనుగ్రహం కలిగితే మాయ తొలగి, జ్ఞానియై జీవుడు ముక్తి బొందుతాడు. అది శ్రీమద్భాగవతము వలన లభించును.(6)

7. శ్లో. యస్యాం వై శ్రూయమాణాయాం
కృష్ణే పరమపూరుషే ।
భక్తిరుత్పద్యతే పుంసః
శోకమోహభయాపహా ॥

టీ:– అనర్థోపశమకత్వం దర్శయతి–యస్యామితి. యస్యాం వై శ్రూయమాణాయామేవ. కిం పునః శ్రుతాయామిత్యర్థః.(7)

భాగవతకథను వింటుండగనే సద్యస్కాలమున అనగా పూర్తిగా వినక ముందే పరాత్పరుడగు కృష్ణునియందు, నిష్ఠ , శోకమోహ భయాలను తొలగించు భక్తి మానవునికి కలుగును అట్టి భాగవతమును వ్యాసుడు రచించెను అని భావము.(7)

8. శ్లో. స సంహితాం భాగవతీమ్
కృత్వాఽనుక్రమ్య చాత్మజమ్ ।
శుకమధ్యాపయామాస
నివృత్తినిరతం మునిమ్ ॥

టీ:- స ఇతి. అనుక్రమ్య శోధయిత్వా.(8)

అట్టి భాగవత సంహితను రచించిన వ్యాసమహర్షి దానిని నివృత్తిమార్గంలో ఉన్న తన కుమారుడగు శుకమహర్షికి నేర్పెను. నివృత్తి మార్గమున ఉన్నవాడే భాగవత శ్రవణానికి ఉత్తమాధికారి అని శుకుని విశేషణముతో తెలియును.(8)

**శ్రీ శౌనక ఉవాచ.**

9. శ్లో. స వై నివృత్తినిరతః
సర్వత్రోపేక్షకో మునిః ।
కస్య వా బృహతీమేతామ్
ఆత్మారామస్సమభ్యసత్ ॥

టీ:- స ఇతి కస్య వా హేతోః. బృహతీం వితతామ్.(9)

**శ్రీ శౌనకుడు అడుగుతున్నాడు.**

ఇంత విస్తారమైన భాగవతసంహితను, నివృత్తి మార్గమున ఉన్నట్టి, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదుల విషయమున ఆసక్తిలేక, ఉపేక్షగల ఆత్మారాముడైన తనలోనే తాను బ్రహ్మానుసంధానంతో ఆనందించు శుకమహర్షి ఏ ప్రయోజనాన్ని ఆశించి అభ్యసించినాడు.(9)

**శ్రీ సూత ఉవాచ.**

10. శ్లో. ఆత్మారామాశ్చ మునయో
నిర్గ్రంథా అప్యురుక్రమే ।
కుర్వంత్యహైతుకీం భక్తిమ్
ఇత్థం భూతగుణో హరిః ॥

**శ్రీ సూతులవారు చెపుతున్నారు.**

ఆత్మానందమును అనుభవించువారు, కరుడు కట్టిన క్రోధాహంకారాది గ్రంథులను వదిలించుకున్న మునులు కూడ సర్వవ్యాపకుడైన భగవానునియందు నిష్కారణమైన భక్తిని ఏ కోరికలు లేకుండగనే భక్తిని కలిగి ఉంటారు. ఆ భగవానుడు భక్తులను,

టీ:- ఆత్మేతి. నిర్గ్రంథాః గ్రంథేభ్యో నిర్గతాః తదుక్తం గీతాసు. శ్లో. 'యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి, తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ' ఇతి. యద్వా గ్రంథిరేవ గ్రంథః నివృత్త హృదయగ్రంథయ ఇత్యర్థః. నను ముక్తానాం కిం భక్త్యేత్యాది సర్వాక్షేప పరిహారార్థమాహ-ఇత్థంభూతగుణ ఇతి.(10)

11.శ్లో. హరేర్గుణాక్షిప్తమతిః
భగవాన్ బాదరాయణిః ।
అధ్యగాన్మహదాఖ్యానం
నిత్యం విష్ణుజనప్రియః ॥

టీ:- నను భక్తిం కుర్వంతు నామ ఏతచ్ఛాస్త్రాభ్యాసే శుకస్య కిం కారణమిత్యత ఆహ-హరేరితి. అధ్యగాత్ అధీతవాన్. విష్ణుజనాః

ముక్తులను కూడ ఆకర్షించు మహావిశిష్టములైన దయ, దాక్షిణ్యాది గుణాలు కలవాడు. ఆత్మానందాన్ని పొందు మునులు ఆనంద స్వరూపుడగు భగవానుని కథలను ఏ ఫలాపేక్ష లేకుండనే భక్తితో చదివి,విని, ఆనంద రసానుభూతిని పొందుతారు. ముక్తులకు భక్తితో పనియేమి అను ఆక్షేపణలకన్నిటికి సమాధానం భగవద్గుణాలు.'యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య, శ్రుతస్య చ'. అర్జునా ఎప్పుడు నీ బుద్ధి మోహ పంకమును దాటగలదో అప్పుడు వినదగిన దాని యందు,విన్న దాని యందును నిర్వేదమును పొందగలవు బుద్ధి అజ్ఞానము నుండి బయటపడినచో విన్నదానియందు వినదగినదానియందుకూడ వైరాగ్యము కలుగునని పై భగవద్గీతా శ్లోకము ఇచట ఉదాహరించబడినది.(10)

శ్రీశుకునికి భగవద్భక్తి యందుకాక, ఈ భాగవతాన్ని అభ్యసించడం వలన ఏమి ప్రయోజనము అనుదానికి సమాధానము చెపుతున్నాడు. భగవద్భక్తులంటే ఎల్లప్పుడు భగవత్కథలను ప్రవచించుటచే సత్సాంగత్యము కోరువారు. శుకుడు భగవంతుని గుణగణములచే ఆకర్షింపబడి ఈ గొప్ప భగవత్కథను అధ్యయనము చేసెను. ఆ వ్యాసమహర్షి కుమారుడు యోగీశ్వరుడగు శుకునికి భగవత్కథలను చెప్పాలని కోరిక ఎలా కలిగింది అనుదానికి కూడా

ప్రియాః యస్యేతి. ఏతద్వ్యాఖ్యానాది ప్రసంగేన తత్సంగాభి కామ ఇతి భావః. ఏతేన 'తస్య పుత్రో మహాయోగీ' ఇత్యాదినా శుకస్య వ్యాఖ్యానే ప్రవృతిః కథమితి యత్పృష్టం తస్యోత్తర ముక్తం.(11)

12. శ్లో. పరీక్షితోఽథ రాజర్షేః
జన్మ కర్మ విలాపనమ్ ।
సంస్థానం పాండు పుత్రాణాం
వక్ష్యే కృష్ణ కథోదయమ్ ॥

టీ:- యదన్యత్పృష్టం పరీక్షితః ప్రాయోపవేశేన శ్రవణం కథమితి 'తస్య జన్మ మహాశ్చర్య' మిత్యాదినా తస్యోత్తరం వక్తుమాహ-పరీక్షిత ఇతి. విలాయనం ముక్తిం మృత్యుం వా. సంస్థానం మహాప్రస్థానం కృష్ణకథానాముదయో యథా భవతి తథా.(12)

13. శ్లో. యదా మృధే కౌరవ సృంజయానాం
వీరేష్వథో వీరగతిం గతేషు ।
వృకోదరావిద్ధగదాభిమర్శ
భగ్నోరుదండే ధృతరాష్ట్రపుత్రే ॥

ఇచట సమాధానము చెప్పబడినది.(11)

ప్రాయోపవిష్టుడగు పరీక్షిత్తు భాగవత శ్రవణము ఎలా చేశాడు అనుదానికి సమాధానముగా ఆతని జన్మ మహాశ్చర్యము కలదని చెపుతున్నాడు. రాజర్షియగు పరీక్షిత్తు యొక్క జననము, కర్మ, మోక్షములను పాండవుల మహాప్రస్థానమును, కూడా శ్రీకృష్ణుని కథలకు ప్రారంభముగా చెపుతాను వినుము.(12)

పరీక్షిన్మహారాజు జననాన్ని గురించి వివరించదలచి మొదట గర్భస్థుడుగా ఉన్నపుడు అశ్వత్థామ వేసిన బ్రహ్మాస్త్రము నుండి ఆతనిని కృష్ణుడు రక్షించెనని చెప్పుటకు కథను ప్రారంభిస్తున్నాడు శుకుడు 'యదా' అని. ఎప్పుడైతే అశ్వత్థామ ద్రౌపది కుమారుల తలలను తెగనరికెనో అప్పుడు వారి తల్లి ఏడ్చెను. ఆమెను ఓదారుస్తూ అర్జునుడు పలుకుచున్నాడని మూడవ శ్లోకంతో అన్వయము. ఎందుకు ఆ పిల్లల

టీ:- తత్ర పరీక్షితో జన్మ నిరూపయిష్యన్ ఆదౌ తావద్గర్భస్థ ఏవాశ్వత్థామ్నో బ్రహ్మాస్త్రాచ్ఛీకృష్ణేన రక్షిత ఇత వక్తుం కథాం ప్రస్తౌతి-యదేత్యాదిత్రిభిః. యదా ద్రౌణిరశ్వత్థామా. కృష్ణాసుతానాం ద్రౌపదీపుత్రాణాం శిరాంసి అపాహరత్, తదా తన్మాతాఽరుదత్ తాం చ సాంత్వయన్ కిరీటమాలీ అర్జునః ఆహేతి తృతీయేనాన్వయఃకిమితి బాలానాం శిరాంస్యానీతవానీత్యపేక్షాయామాహ- మృథేయుద్ధే యద్యపి పాండవా అపి కౌరవా ఏవ. తథాపి సృంజయవంశజో ధృష్టద్యుమ్నః పాండవానాం సేనాపతి రితి సృంజయానామిత్యుక్తం వీరగతిం స్వర్గం. అథో అనంతరం వృకోదరేణావిద్ధాయాః క్షిప్తాయః గదాయాః అభిమర్శేన అభిఘాతేన భగ్నౌ ఊరుదండౌ యస్య తథాభూతే ధృతరాష్ట్రపుత్రే దుర్యోధనే సతి.(13)

14\. శ్లో. భర్తుః ప్రియం ద్రౌణిరితి స్మ పశ్యన్
కృష్ణాసుతానాం స్వపతాం శిరాంసి ।
అపాహరద్విప్రియమేవ తస్య తద్
జుగుప్సితం కర్మ విగర్హయంతి ॥

టీ:- భర్తురితి. భర్తుర్దుర్యోధనస్య. స్మేతి వితర్కే. ఇతి ఏవం స్యాదితి పశ్యన్. తస్య తద్విప్రియమేవేతి వాక్యాంతరం. విప్రియత్వే హేతుః జుగుప్సితం అత్యంతజుగుప్సావిశిష్టమితి.(14)

(ఉపపాండవుల) తలలను నరికాడనడానికి చెపుతున్నాడు 'మృథే' అని. ఎప్పుడైతే యుద్ధమున కౌరవ, పాండవులు తలపడిరో అప్పుడు పాండవులు కూడా కౌరవులే అయినా వారినిచట సృంజయులన్నారు. సృంజయ వంశీయుడగు ధృష్టద్యుమ్నుడు పాండవ సేనాపతి కావున ఇక్కడ అలా ప్రయోగించటము జరిగింది. అప్పుడు వీరులు చావగా, భీముడు గదతో దుర్యోధనుని తొడలను విరగగొట్టెను ఆ తరువాత......(13)

ప్రభువగు దుర్యోధనునికి ప్రియమని భావించి, ఈ విధంగా చేస్తే దుర్యోధనుడు సంతోషిస్తాడని అనుకొని అశ్వత్థామ పరుండియున్న ద్రౌపది కుమారుల తలలను తెగగొట్టెను. నలుగురు దానిని ఏవగించుకొని, చెడ్డపని అని నిందిస్తారని, అది ఆతనికి అయిష్టమే. అయినా దుర్యోధన ప్రీతికై అలా చేసి ఉండవచ్చును. ఇచట స్మ అను అవ్యయానికి అర్థము ఊహ అని అర్థము. తు హి చ స్మ హ వై పాదపూరణే అన్నట్లు పాదపూరణార్థముగాదని గ్రహించాలి.(14)

15. శ్లో. మాతా శిశూనాం నిధనం సుతానాం
నిశమ్య ఘోరం పరితప్యమానా ।
తదాஉరుదద్బాష్పకలాకులాక్షీ ।
తాం సాంత్వయన్నాహ కిరీటమాలీ ॥

టీ:- మాతేతి ఘోరందుస్సహం యథా భవతి తథా. బాష్పస్య కళాభిర్బిందుభిః ఆకులే అక్షిణీ యస్యాః సా కిరీటస్యైకత్వేஉపి తదగ్రాణాం బాహుళ్యాత్కిరీటమాలీత్యుక్తం(15)

అప్పుడు ఆ పిల్లల తల్లియగు ద్రౌపది శిశువులు, తన కుమారుల భరింపరాని ఘోరమైన చావును విని బాగా తపించుచు, వ్యాకులతచెంది కన్నీరుమున్నీరుగా దుఃఖించెను. ఆమెను ఓదారుస్తూ అర్జునుడు ఈ విధముగా పలికెను. అర్జునకు కిరీటము ఒకటేయైనను దాని కొసలు చాలా ఉండును కనుక కిరీటమాలి అని ఇచ్చట ప్రయోగించబడినది. (15)

16. శ్లో. తదా శుచస్తే ప్రమృజామి భద్రే ।
యద్బ్రహ్మబన్ధోః శిర ఆతతాయినః ।
గాండీవముక్తైర్విశిఖైరుపాహరే
త్వాక్రమ్య యత్ స్థాస్యసి దగ్ధపుత్రా ॥

టీ:- తదేతి. శుచః శోకాశ్రూణి విమృజామి పరిమార్జయామి. యత్ యదా బ్రహ్మబంధోర్బ్రాహ్మణాధమస్య. ఆతతాయిన ఇతి. శ్లో. 'అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణిర్ధనాపహః, క్షేత్రదారహరశ్చైవ షడేతే హాత్య తాయిన' ఇతి స్మరణాత్. అత్ర ఆతతాయీశస్త్రపాణిః తేన చ పుత్రహంతృత్యం లక్ష్యతే. గాండీవాద్ధనుషః ముక్తైర్విశిఖైర్బాణైః ఉపాహరే త్వత్సమీప

శుభప్రదురాలా ఓ ద్రౌపదీ ! బ్రాహ్మణాధముడైన ఆ అశ్వత్థామ శిరస్సును నా గాండీవ ధనస్సు నుండి వెలువడిన తీవ్రములైన బాణములతో త్రుంచి నీ సమీపమునకు తెచ్చి అప్పుడు నీ కన్నీళ్ళు తుడిచెదను. అప్పుడు నీవు ఆ శిరస్సును కాళ్ళ కింద వేసికొని పిల్లలను దహించి నందులకు ప్రతీకారముతో స్నానము చేయగలవు అని అర్జునుడు ద్రౌపదినోదారుస్తూ ప్రతిజ్ఞ చేసెను. ఆతతాయి అను శబ్దానికి కొంపలు తగలపెట్టేవాడు, విషంపెట్టేవాడు, శస్త్రంతో చంపేవాడు, ధనము హరించేవాడు, క్షేత్రాలను, భార్యలను చంపేవాడు అని అర్థములున్నాయి ఇచట శస్త్రం పట్టేవాడు పుత్రుల హంత అని అర్థము చెప్పాలి.(16)

మానయామి. యచ్ఛిర ఆక్రమ్య ఆసనం విధాయ దగ్ధపుత్రా స్థాస్యపి. స్నాస్యతీతి పాఠాంతరం(16).

17. శ్లో. ఇతి ప్రియాం వల్గువిచిత్రజల్పైః
స సాంత్వయిత్వాఽచ్యుతమిత్ర సూతః ।
అన్వాద్రవద్దంశిత ఉగ్రధన్వా
కపిధ్వజో గురుపుత్రం రథేన ॥

టీ:- ఇతీతి. వల్గవోరమ్యాః విచిత్రాః జల్పాః భాషణాని తైః సోఽర్జునః అచ్యుత ఏవమిత్రం సూతశ్చ యస్య సః దంశితో బద్ధకవచః ఉగ్రం ధనుశ్చాపం యస్య కపిర్హమామాన్ధ్వజే యస్య సః గురోః పుత్రం రథేనాన్వాద్రవత్ అన్వధావత్.(17)

ఈ విధముగా ప్రియురాలగు ద్రౌపదిని మనోహరమైన, విచిత్రములైన మాటలతో ఓదార్చి శ్రీకృష్ణుడు మిత్రుడుగాను, సారథిగానుకల, ఆంజనేయుడు ధ్వజముపైకల అర్జునుడు కవచధారియై భయంకరమగు గాండీవ ధనుస్సును ధరించి, గురుపుత్రుడగు అశ్వత్థామను రథముతో వెంబడించెను.(17)

18. శ్లో. తమాపతంతం స విలక్ష్య దూరాత్
కుమారహోద్విగ్నమనా రథేన ।
పరాద్రవత్ప్రాణపరీప్సురుర్వ్యాం
యావద్గమం రుద్రభయాద్యథాకః ॥

టీ:- తమితి. ఆపతంతం ఆధావంతం సః ద్రౌణిః కుమారహా బాలఘాతీ ఉద్విగ్నమనాః కంపితహృదయః ప్రాణపరీప్సుః ప్రాణాన్

ఉపపాండవులను చంపిన అశ్వత్థామ రథముపై కూర్చొని వచ్చుచున్న అర్జునిని దూరము నుండే చూచి హృదయము కంపించగా ప్రాణాలను కాపాడుకోవాలని అపకీర్తికికూడ భయపడక శక్తి ఉన్నంతవరకు పరుగిడెను. బ్రహ్మ తన కూతురును చూచి కామించి రుద్రుని భయము వలన పరుగెత్తినట్లు పరుగిడెను. కః అనికాక అర్కః అను పాఠము కూడ కలదు. అపుడు వామన పురాణ గాథను

లబ్దు మిచ్ఛుః న తు కీర్తిం యావద్గమం యావద్గంతుం శక్యం తావదుర్వ్యాం పరాద్రవత్ పలాయతః కః బ్రహ్మ మృగో భూత్వా సుతాం యబ్ధుముద్యతః సన్ . రుద్రస్య భయాద్యథా పలాయతేస్మ. ఆర్క ఇతి పాఠే వామనపురాణకథాసూచితా. తథాహి విద్యున్మాలీ నామ కశ్చిద్రాక్షసోఽ భూత్. తస్మై రుద్రేణ సౌవర్ణం విమానం దత్తం. తతోఽ సౌ అర్కస్య పృష్ఠతో భ్రామ్యన్ విమాన దీప్యా రాత్రిం విలోపితవాన్,తతోఽ ర్కేణ నిజతేజోభిః ద్రావయిత్వా తద్విమానం పాతితం. తచ్ఛ్రుత్వాకుపితే రుద్రే భయాదర్కః పరాద్రవత్ తతో రుద్రస్య క్రూరయా దృష్ట్యా దందహ్యా మానః పతన్ వారాణస్యాం లోలార్కనామ్నా భువి విఖ్యాతో జాత ఇతి.(18)

19. శ్లో. యదాఽ శరణమాత్మానమ్
అవైక్షచ్ఛ్రాంతవాజినమ్ ।
అస్త్రం బ్రహ్మశిరో మేనే
హ్యాత్మత్రాణం ద్విజాత్మజః ॥

టీ:- యదేతి. అశరణం రక్షకరహితం. నను పలాయనమేవ రక్షకమస్తి? న; తస్యాపి కుంఠితత్వాదిత్యాహ-శ్రాంతాః వాజినో యస్య తం. బ్రహ్మశిరోఽ స్త్రం బ్రహ్మాస్త్రం. ద్విజాత్మజ ఇత్యదీర్ఘ దర్శితామాహ. (19)

గుర్తుచేసుకోవాలి. విద్యున్మాలి అను రాక్షసునికి మహేశ్వరుడు బంగారు విమానాన్ని ఇచ్చాడు. అతడు సూర్యుని వెనుక తిరుగుతూ విమానకాంతితో రాత్రి లేకుండా చేశాడు. సూర్యుడు తన దివ్య తేజస్సును రథం చుట్టు తిప్పి ఆ విమానాన్ని పడగొట్టినాడు. తన భక్తుని అవమానించినందులకు కోపించిన రుద్రుడు వెంబడించగా భయంతో సూర్యుడు పరుగెత్తినాడు.కాని రుద్రుని క్రూరదృష్టికి భయపడి దహింపబడుతూ కాశీలో తల దాచుకొన్నాడు కావుననే అచట ఉన్న సూర్యునికి లోలార్కుడని విఖ్యాతి కలిగినది.(18)

బ్రాహ్మణ సూనుడగు అశ్వత్థామ తనకు రక్షణ లేదని, పలాయనం కూడ రక్షించజాలదని, గుఱ్ఱాలు కూడ అలసిపోయినవని గమనించి చివరకు తనకు బ్రహ్మశిరోనామక అస్త్రమే రక్షయని భావించినాడు.(19)

20. శ్లో. అథోపస్పృశ్య సలిలం
సందధే౽స్త్రం సమాహితః ।
అజానన్నుపసంహారం
ప్రాణకృచ్ఛ్ర ఉపస్థితే ॥

టీ:- అథేతి. తద్బ్రహ్మాస్త్రం సమాహితః కృతధ్యానః ఉపసంహార మజానతో౽పి సంధానే హేతుః. ప్రాణకృచ్ఛ్ర ఇతి. (20)

ప్రాణాపాయం ఏర్పడగా అశ్వత్థామ నీటిని స్పృశించి సమాహిత మనస్కుడై ఉపసంహారము తెలియకున్నను బ్రహ్మాస్త్రమును ప్రయోగించెను. (20)

21. శ్లో. తతః ప్రాదుష్కృతం తేజః
ప్రచండం సర్వతోదిశమ్ ।
ప్రాణాపదమభిప్రేక్ష్య
విష్ణుం జిష్ణు రువాచ హ ॥

టీ:- తత ఇతి. తతః అస్త్రాత్. సర్వతోదిశమ్ ప్రాదుష్కృతం ప్రకటీభూతం. తేజో౽భీప్రేక్ష్య తతః ప్రాణాపదం చాభిప్రేక్ష్య. (21)

ఆ అస్త్రము నుండి ప్రకటీకరింపజేయబడిన దుఃసహ తేజస్సు అన్ని దిక్కులను వ్యాపించగా ప్రాణాపాయాన్ని గుర్తించి అర్జునుడు విష్ణువగు శ్రీకృష్ణునితో ఇట్లు పలికెను. (21)

**అర్జున ఉవాచ.**

22. శ్లో. కృష్ణ కృష్ణ మహాబాహో
భక్తానామభయంకర ।
త్వమేకో దహ్యమానానామ్
అపవర్గోఽసి సంసృతేః ॥

టీ:- ప్రస్తుతం విజ్ఞాపయితుం ప్రథమం స్తౌతి-చతుర్భిః కృష్ణేతి. సంసృతేర్హేతోః దహ్యమానానాం తస్యా అపవర్గః ఆపవర్జయితా నాశక ఇత్యర్థః.(22)

**అర్జునుడు పలికెను.**

ఓ కృష్ణా ! మహాబాహో ! భక్తులకు అభయమొసంగువాడా ! సాంసారిక దుఃఖము కారణముగా దహింపబడు వారికి నీవు ఒక్కడవే మోక్షమును అనుగ్రహించు వాడవు.(22)

23. శ్లో. త్వమాద్య పురుషః సాక్షాద్
ఈశ్వరః ప్రకృతేః పరః ।
మాయాం వ్యుదస్య చిచ్ఛక్త్యా
కేవలే స్థిత ఆత్మని ॥

టీ:- త్వమితి. యత స్త్వమీశ్వరః సాక్షాత్.కుతః? యతః ప్రకృతేః పరః పురుషః. తత్కుతః? యతః ఆద్యః కారణం కారణత్వే త్వవికారితామాహ-మాయాం వ్యుదస్య అభిభూయ. కైవల్యరూపే ఆత్మన్యేవస్థిత ఇతి.(23)

నీవు సాక్షాత్తుగా ఈశ్వరుడవు, ఆది పురుషుడవు, ప్రకృతికంటే వేరైనవాడవు, సృష్టికి కారణభూతుడవు. అయినా ఏ వికారము లేని వాడవు ఇది ఎలా సంభవమంటే, నీవు జ్ఞానశక్తి చేత మాయను ఛేదించి కైవల్యరూపమగు ఆత్మ యందే స్థిరముగా ఉండువాడవు.(23)

24. శ్లో. స ఏవ జీవలోకస్య
మాయామోహిత చేతసః ।
విధత్సే స్వేన వీర్యేణ
శ్రేయో ధర్మాది లక్షణమ్ ॥

టీ:- త్రివర్గదాతాऽపిత్వమేవేత్యాహ-స ఇతి. యస్త్వం మాయాభిభూతస్య జనస్య ధర్మాదిఫలం ఉపాసితః సన్ విధత్సే. స్వేన వీర్యేణ ప్రభావేన. (24)

త్రివర్గమనగా ధర్మార్థకామాలు. వాటిని ఇచ్చేవాడవు కూడ నీవేనని పలుకుచున్నాడు 'స ఏవ' అని. మాయ చేత తిరస్కృతుడగు జీవునికి, మాయాతీతుడవగు నీవే ఆరాధింపదగినవాడవై, నీ ప్రభావము చేత ధర్మాది లక్షణమైన శ్రేయస్సును కలుగచేయుచున్నావు. (24)

25. శ్లో. తథాऽయం చావతారస్తే
భువో భారజిహీర్షయా ।
స్వానాం చానన్యభావానామ్
అనుధ్యానాయ చాసకృత్ ॥

టీ:- తథాచ, అనేనావతారేణ తవ సాధు పక్షపాతో లక్షిత ఇత్యాహ-తథేతి. కిం భూభారభరణం మదిచ్ఛామాత్రేణ న భవతి తత్రాహ-స్వానాం జ్ఞాతీనాం అనుధ్యానాయ చ తథాచానన్యభావానాం ఏకాంత భక్తానాం చ. (25)

ఓ భగవానుడా ! ఈ విధముగా నీవు భూ భారహరణ కొరకు అవతరించినావు. నీకు సాధుజనులయందు పక్షపాతము ఉన్నట్లు కనిపించుచున్నది. అయితే భూ భారహరణము అవతారములేకనే భగవదిచ్ఛతోనే జరుగదా అనుదానికి సమాధానము చెపుతున్నాడు. జ్ఞానులు మరియు ఇతరముఎరుగని ఏకాంత భక్తులు ధ్యానించుటకు, వారిననుగ్రహించుటకును నీయవతారము వచ్చినది. (25)

26. శ్లో. కిమిదం స్విత్కుతో వేతి
దేవదేవ న వేద్మ్యహమ్ ।
సర్వతోముఖమాయాతి
తేజః పరమదారుణమ్ ॥

టీ:- ఏవం స్తుత్వా ప్రస్తుతం విజ్ఞాపయతి కిమితి కిమాత్మకమిదం? కుతో వా ఆయాతీతి. స్విద్వితర్కే .(26)

అర్జునుడు ఈ విధముగా కృష్ణుని స్తుతించి ప్రస్తుత విషయాన్ని విన్నవించుచున్నాడు. ఓ దేవదేవ ! భయంకరమైన ఈ తేజస్సు ఏమిటి? అన్ని దిక్కులనుండి వచ్చుచున్నది. ఇది ఎక్కడి నుండి వచ్చుచున్నదో నాకు తెలియుట లేదు. స్విత్ అను అవ్యయానికి వితర్కము, అనుమానము అని అర్థము.(26)

**శ్రీ భగవానువాచ.**

27. శ్లో. వేత్థేదం ద్రోణపుత్రస్య ।
బ్రాహ్మమస్త్రం ప్రదర్శితమ్ ।
నైవాసౌ వేద సంహారమ్
ప్రాణబాధ ఉపస్థితే ॥

టీ:- వేత్థేతి. ఇదం ద్రోణపుత్రస్యబ్రాహ్మమస్త్రం. తేచ ప్రాణవ్యథాయాం ప్రాప్తాయాం ప్రదర్శితం కేవలం. నతుతత్ప్రయోగే కుశల ఇత్యర్థః యతఃఅసౌ ఉపసంహారం న వేద. ఏతచ్చ త్వం వేత్థ జానాసి.(27)

**శ్రీ భగవానుడు చెపుతున్నాడు**

ద్రోణాచార్యుని కుమారుడగు అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రమిది. అర్జునా ప్రాణ సంకటమేర్పడగా ఆ అశ్వత్థామ ఉపసంహారము తెలియకున్నను ఈ బ్రహ్మాస్త్రమును ప్రయోగించాడు. (27)

28. శ్లో. న హ్యస్యాన్యతమం కించిద్
అస్త్రం ప్రత్యవకర్శనమ్ ।
జహ్యస్త్రతేజ ఉన్నద్ధమ్
అస్త్రజ్ఞోఽహ్యస్త్ర తేజసా ॥

టీ:- నహీతి. ప్రత్యవకర్శనం కృశత్వకరం నివర్తకమిత్యర్థః. అత స్తదస్త్రతేజః ఉన్నద్ధం ఉత్కంటం విజృంభితమిత్యర్థః బ్రహ్మాస్త్రతేజసైవ జహి సూతయ. త్వత్ప్రయుక్తం చాస్త్రం తదుపసంహృత్య స్వయముప శామ్యేత్. యతస్త్వమస్త్రజ్ఞోఽసి సర్వాస్త్రప్రయోగ కుశలోఽసి.(28)

ఓ అర్జునా ! ఈ బ్రహ్మాస్త్రమును ఏ ఇతర అస్త్రములు కూడ మరల్చజాలవు. నీవు అస్త్రములను ఉపసంహారములను కూడా తెలిసినవాడవు. ఉత్కటమైన ఈ బ్రహ్మాస్త్ర తేజస్సును నీవు కూడ బ్రహ్మాస్త్ర తేజస్సుతోనే వారింపుము. నీచే ప్రయోగించబడిన అస్త్రము దానిని ఉపసంహరించి స్వయముగా కూడ శమించును.(28)

**సూత ఉవాచ.**

29. శ్లో. శ్రుత్వా భగవతా ప్రోక్తం
ఫల్గునః పరవీరహా ।
స్పృష్ట్వాపస్తం పరిక్రమ్య
బ్రాహ్మం బ్రాహ్మాయ సందధే ॥

టీ:- శ్రుత్వేతి. పరే శత్రవః త ఏవ వీరాః తాన్ హంతీతి తథా. పల్గునః అర్జునః ఆపః స్ప్రష్ట్వా ఆచమ్య తం కృష్ణం పరిక్రమ్య ప్రదక్షిణీ కృత్య బ్రాహ్మాయ బ్రహ్మాస్త్రం నివర్తయితుమ్.(29)

**సూతుడు చెపుతున్నాడు.**

వీరులగు శత్రువులను సంహరించునట్టి అర్జునుడు భగవంతుని మాటను గ్రహించి జలమును స్పృశించి, ఆచమనము చేసి, ఈ శ్రీకృష్ణునికి ప్రదక్షిణమొనర్చి, నమస్కరించి బ్రహ్మాస్త్ర నివారణకు బ్రహ్మాస్త్రమును సంధించెను.(29)

30. శ్లో. సంహత్యాన్యోన్యముభయోః
తేజసీ శరసంవృతే ।
ఆవృత్య రోదసీ ఖం చ
వవృధాతేఽర్క వహ్నివత్ ॥

టీ:- సంహత్యేతి.తతశ్చ ఉభయోర్బ్రహ్మాస్త్రయోస్తేజసీ. శరైస్సంవృతే సంవేష్టితే చ. పరస్పరం మిళిత్వా, వవృధాతే అవర్ధేతాం.కిం కృత్వా? రోదసీ, ద్యావాపృథివౌ. ఖం అంతరిక్షం. ఆవృత్య యథాప్రళయే సంకర్షణముఖాగ్నిః ఉపరి స్థితోఽర్కశ్చ సంహత్య వర్ధేతే.తద్వత్.(30)

తరువాత రెండు బ్రహ్మాస్త్రాల యొక్క తేజస్సులు ఆవృతములై అన్యోన్యముగా భూమ్యాకాశములనావరించి ప్రళయకాలమున సంకర్షణ ముఖాగ్ని, దానిపైనున్న సూర్యుడు ఒకదానినొకటి బాధించుచు పెరుగునట్లు పెరిగెను.(30)

31.శ్లో. దృష్ట్వాస్త్రతేజస్తు తయోః
త్రీన్‌లోకాన్ ప్రదహన్మహత్ ।
దహ్యమానాః ప్రజాః సర్వాః
సాంవర్తకమమంసత ॥

టీ:- దృష్ట్వేతి తయోః ద్రౌణిఫల్గునయోః. తతః తేన దహ్యమానాః సాం వర్తకం ప్రళయాగ్నిం. అమంసత మేనిరే.(31)

ఆ అశ్వత్థామ, అర్జునుల యొక్క అస్త్రముల తేజస్సులు మూడులోకాలను దహిస్తుండగా చూచి ప్రజలందరు కూడ వాటితో బాధింపబడుతున్నవారై అది ప్రలయమని భావించిరి.(31)

32. శ్లో. ప్రజోపద్రవమాలోక్య
లోకవ్యతికరం చ తమ్ ।
మతం చ వాసుదేవస్య
సంజహారార్జునో ద్వయమ్ ॥

టీ:- ప్రజేతి. లోకానాం వ్యతికరం వ్యత్యయం నాశమిత్యర్థః వాసుదేవస్య మతం చాలక్ష్య బ్రహ్మాస్త్రద్వయముపసంహృతవాన్.(32)

ప్రజల బాధను, లోకముల యొక్క నాశనాన్ని, శ్రీకృష్ణుని ఇష్టాన్ని గమనించి చూచి అర్జునుడు ఆ రెండు బ్రహ్మాస్త్రములను ఉపసంహరించెను. (32)

33. శ్లో. తత ఆసాద్య తరసా
దారుణం గౌతమీసుతమ్ ।
బబంధామర్షతామ్రాక్షః
పశుం రశనయా యథా ॥

టీ:- తత ఇతి. గౌతమవంశజా గౌతమీ కృపీ తస్యాస్సుతం. అమర్షేణ కోపేన తామ్రేఅక్షిణీ యస్య సః నిర్ఘృణత్వే దృష్టాంతః పశుంయథేతి. తస్య బంధనం ధర్మఇత్యత్ర వా దృషాంటతః యథా యాజ్ఞికం పశుమివ. రశనయా రజ్జ్వా.(33)

కోపముచే ఎఱ్ఱనైన నేత్రములుగల అర్జునుడు, గౌతమ వంశమున జన్మించిన కృపి కుమారుని అశ్వత్థామను పట్టుకొని ఒక పశువును కట్టినట్లు త్రాడుతో దారుణముగా రథమునకు కట్టివైచెను. ఇచట ఆ హంతకుని బంధనము ధర్మమని, యాజ్ఞికుడు యజ్ఞపశువును తాడుతో కట్టుట ధర్మమే కావున పుత్ర హంతకుని బంధించుట ధర్మమేనను దృష్టాంతము సూచించబడినది. (33)

34. శ్లో. శిబిరాయ నినీషంతం
బద్ధ్వా రజ్జ్వా రిపుం బలాత్ ।
ప్రాహార్జునం ప్రకుపితో
భగవానంబుజేక్షణః ॥

టీ:- శోకరోషాది యుక్తస్యార్జునస్య ధర్మనిష్ఠాఖ్యాపనాయ శ్రీకృష్ణవాక్యం తదాహ - షడ్భిః. శిబిరాయేతి. శిబిరాయ. రాజ నివేశాయ. నేతుమిచ్ఛంతం ప్రకుపితః తద్వధాభావేనామర్షం ప్రాప్త ఇవేతి.(34)

త్రాటితో కట్టి బలాత్కారముగా శిబిరానికి తన గుడారానికి నివేశానికి శత్రువును లాగుకొని పోతున్న అర్జునుని చూచి శ్రీకృష్ణుడు కోపముతో ఇట్లు పలికెను. ఇచట శ్రీకృష్ణ వాక్యము శోకము, కోపమునూ కలిగియున్న అర్జునునికి ధర్మనిష్ఠను తెలుపుటకే.(34)

35. శ్లో. నైనం పార్థార్హసి త్రాతుం।
బ్రహ్మబంధుమిమం జహి
యోఽసావనాగసః సుప్తాన్
అవధీన్నిశి బాలకాన్ ॥

టీ:- మేతి. అనాగసః నిరపరాధాన్. బ్రహ్మబంధుం బ్రాహ్మణాభాసం. (35)

అర్జునా ! భ్రష్టుడగు బ్రాహ్మణుడీఅశ్వత్థామ. ఇతనిని కాపాడుటకు నీవు అర్హుడవు కావు, కావున వానిని చంపుము వీడు ఏ తప్పూ చేయని బాలకులను, పడుకొని ఉన్నవారలను, రాత్రి అక్రమంగా చంపాడు కదా.(35)

36. శ్లో. మత్తం ప్రమత్తమున్మత్తం
సుప్తం బాలం జడం స్త్రియమ్ ।
ప్రపన్నం విరథం భీతం
న రిపుం హంతి ధర్మవిత్ ॥

టీ:- రిపోరిపి సుప్తస్య బాలస్య చ వధో న ధర్మ ఇతి, అన్యార్థైర్ద ర్శయతి - మత్తమితి. మత్తం మద్యాదినా. ప్రమత్తం అనవహితం. ఉన్మత్తం గ్రహవాతాదినా. జడంఅనుద్యమం ప్రపన్నం శరణాగతం. విరథం భగ్నరథమ్.(36)

శత్రువైనను పడుకొని ఉన్న బాలకుని చంపుట ధర్మముకాదని కృష్ణుడు తెలుపుతున్నాడు. మద్యపానమున మత్తెక్కి ఉన్నవానిని, సావధానంగా లేని వానిని,భూతావిష్టుని, ఉన్మత్తుని, జాడ్యంతో నిశ్చేష్టుడై ఉన్న వానిని, శరణాగతుని, పడుకున్న వానిని, బాలుని, ఆడమనిషిని, రథము లేని వానిని, భీరువునగు శత్రువును ధర్మవేత్త చంపడు.(36)

37. శ్లో. స్వ ప్రాణాన్ యః పరప్రాణైః
ప్రపుష్ణాత్యఘ్రుణః ఖలః ।
తద్వధస్తస్య హి శ్రేయో
యద్దోషాద్యాత్యధః పుమాన్ ॥

దయలేని దుర్మార్గుని , ఇతరుల ప్రాణాలు తీసి తన ప్రాణాలను కాపాడుకునే వాడిని చంపుట అతనికే మంచిది. చంపక వదిలిన, వాడు అధోగతిని పొందుతాడు. ఈవిషయమున ధర్మశాస్త్రము పాపము చేసిన మానవులు రాజు గారితో శిక్షింపబడి పాపములేనివారై పుణ్యాత్ములవలె స్వర్గాన్ని పొందుతారు అని కలదు.(37)

38. శ్లో. ప్రతిశ్రుతం చ భవతా
పాంచాల్యాః శృణ్వతో మమ ।
ఆహరిష్యే శిరస్తస్య
యస్తే మానిని పుత్రహా ॥

అర్జునా ! కుమారులను చంపిన వాని శిరస్సును తెచ్చి ఇస్తాను మానవతీ అని నేను వినుచుండగానే ద్రౌపదికి నీవు ప్రతిజ్ఞచేసి మాట ఇచ్చితివి కదా. ఆ పని చేయి.(38)

39. శ్లో. తదసౌ వధ్యతాం పాపః
ఆతతాయ్యాత్మ బంధుహా ।
భర్తుశ్చ విప్రియం వీర
కృతవాన్ కులపాసనః ॥

టీ:- స్వేతి. తద్వధో దండరూపః తస్యైవ శ్రేయః పురుషార్థః. యద్యతో దండప్రాయశ్చిత్తరహితాత్. దోషాత్ సః పుమాన్. అధో యాతీతి. నరకాదికం ప్రాప్నోతి. తథాస్మృతిఃశ్లో. 'రాజభిర్ధృత దండాస్తు కృత్వా పాపాని మానవాః విధూత కల్మషా యాంతి స్వర్గం సుకృతినో యథా' ఇతి.(37,38,39)

ఆత్మ బంధువులను చంపిన శస్త్రధారి ఈ అశ్వత్థామ పాపాత్ముడు. అతణ్ణి చంపాలి. ఓ వీరా ! అర్జునా ! తన ప్రభువగు దుర్యోధనునికి కూడ ఇష్టం లేని పని చేసిన వీడు కులానికే చెడ్డ పేరు తెచ్చినాడు. (39)

**శ్రీ సూత ఉవాచ.**

40.శ్లో. ఏవం పరీక్షితా ధర్మం
పార్థః కృష్ణేన చోదితః ।
నైచ్ఛద్గురుసుతం హంతుం
యద్యప్యాత్మహనం మహాన్ ॥

టీ:- ఏవమితి. యద్యపి చోదితస్తథాపి హంతుం నైచ్ఛత్. ఆత్మహనం పుత్రహంతార మపి. శ్రు. 'ఆత్మావై పుత్రనామాసీ'తి శ్రుతేః ఆత్మశబ్దేన పుత్ర పరామర్శ్యః, యతో మహాన్.(40)

**సూతులవారు పలుకుచున్నారు.**

ఈ విధముగా ధర్మాన్ని పరీక్షిస్తూ కృష్ణునిచేత అశ్వత్థామ వధకు ప్రేరేపింపబడినను గొప్పవాడు కనుక అర్జునుడు, తన కుమారులను చంపిన గురు (ద్రోణాచార్యుని) పుత్రుడగు అశ్వత్థామను చంపుటకు ఇష్టపడలేదు. కావున అర్జునుడు మహాత్ముడు. ఆత్మహనమను దానికి ఆత్మావై పుత్ర నామాసి అను శ్రుతి ననుసరించి తన పుత్రులను చంపినా తనను చంపినట్లే. అయినను అశ్వత్థామను చంపలేదని భావము. (40)

41. శ్లో. తతోఽభ్యేత్య స్వ శిబిరం
గోవింద ప్రియసారథిః ।
న్యవేదయత్తం ప్రియాయై ।
శోచంత్యా ఆత్మజాన్ హతాన్ ॥

టీ:- తత ఇతి. గోవిందః ప్రియస్సారథిశ్చయస్య. ఆత్మజాన్ శోచంత్యై. (41)

శ్రీకృష్ణుడే ప్రియ సారథిగాగల అర్జునుడు తన శిబిరానికి వచ్చి, చచ్చిన కుమారులను గురించి ఏడుస్తున్న ప్రియురాలగు ద్రౌపదికి అశ్వత్థామను చూపి విషయం తెల్పాడు.(41)

42. శ్లో. తథాఽహృతం పశువత్పాశబద్ధమ్
అవాఙ్ముఖం కర్మ జుగుప్సితేన ।
నిరీక్ష్య కృష్ణాఽపకృతం గురోస్సుతం
వామస్వభావా కృపయా ననామ చ ॥

టీ:- తథేతి. తథా పరిభవేనాహృతం ఆనీతం. కర్మణా జుగుప్మితేన దోషేణ, అవాఙ్ముఖం. అపకృతం అపకారిణం కృపయా నిరీక్ష్య. వామః శోభనః స్వభావో యస్యాస్సా ననామ చ ఉవాచ చేతి చకారాభ్యాం సంభ్రమస్సూచితః.(42)

పశువులా కట్టబడి, అర్జునిచేత తేబడిన అశ్వత్థామ, నలుగురు ఏవగించుకొనే పాపిష్ఠపు పనిచేసినందున తలవంచుకొని నిలబడి యుండెను. మంచి స్వభావముగల ద్రౌపది అపకారము చేసినను గురుపుత్రుడగు అశ్వత్థామకు దయతో నమస్కరించెను కూడ. ననామ చ అనుచోట చ అనేది సంభ్రమమును వేగమును కూడా సూచించును. తొందరపడి వేగముగా నమస్కరించి నివారించెనని కూడా అర్థము. (42)

43. శ్లో. ఉవాచ చాసహంత్యస్య
బంధనానయనం సతీ ।
ముచ్యతాం ముచ్యతామేష
బ్రాహ్మణో నితరాం గురుః ॥

టీ:- ఉవాచేతి. చేతి చకారాభ్యాం సంభ్రమః సూచితఃబంధేనేనా నయనమసహమానా.(43)

అలా బంధించి అశ్వత్థామను తేవడాన్ని సహించలేని ద్రౌపది అయ్యో విడువండి, విడువండీతనిని, ఈతడు బ్రాహ్మణుడు, మిక్కిలి ఆదణపాత్రుడు, గురువు అని పల్కెను. ముచ్యతాం ముచ్యతాం అని రెండు మార్లు పలుకుట 'వీప్సాయాంద్విరుక్తిః' అశ్వత్థామను వదలుటయందు ద్రౌపదికిగల ప్రగాఢేచ్ఛను అతనిపట్ల గౌరవమును సూచించును.(43)

44. శ్లో. సరహస్యో ధనుర్వేదః
సవిసర్గోపసంయమః ।
అస్త్రగ్రామశ్చ భవతా
శిక్షితో యదనుగ్రహాత్ ॥

టీ:- సరహస్య ఇతి. సరహస్యః గోప్యమంత్రసహిత విసర్గోఽస్త్ర ప్రయోగః ఉపసంయమః ఉపసంహారః. తాభ్యాం సహితోఽస్త్రసమూహశ్చ. యదనుగ్రహాత్ యస్య ద్రోణస్యానుగ్రహాత్ ప్రసాదాత్.(44)

ఎన్నో రహస్యాలతో కూడిన ధనుర్వేదము, రహస్య మంత్ర సహితమైన ప్రయోగ ఉపసంహారములతో కూడిన అస్త్ర సమూహమును ఎవరి అనుగ్రహము వలన మీరు పొందిరో అట్టి ద్రోణాచార్యులే ఇప్పుడు ఈ అశ్వత్థామ రూపములో ఉన్నాడని ద్రౌపది అర్జునునితో పల్కి వధ నుండి వారించెను.(44)

45. శ్లో. స ఏష భగవాన్ ద్రోణః
ప్రజారూపేణ వర్తతే ।
తస్యాత్మనోఽర్ధం పత్న్యాస్తే ।
నాన్వగాద్వీరసూః కృపీ ॥

టీ:- స ఇతి. కించ తస్య ద్రోణస్యాత్మనో దేహస్యార్థం కృపీ ఆస్తే. అర్ధత్వేహేతుః, పత్నీ. శ్రు. 'అర్ధో వాఏష ఆత్మనో యత్పత్నీ' ఇత్యాది జాయాపతీ అగ్ని మాదధీయాతామిత్యుభ యోరేకాకార త్వావగమాచ్చ. నను భర్తరీ మృతే కథంసాజీవతి? తత్రాహ -నాన్వగాత్. భర్తారం. యతో వీరసూః పుత్రవతీ.(45)

పూజ్యుడగు ఆ ద్రోణాచార్యుడే కుమారుని రూపముతో అశ్వత్థామగా ఉన్నాడు. ఆయన శరీర సగభాగమగు ఆయన భార్య కృపి ఇంకను బ్రతికియేయున్నది. ఆమెకు పుత్ర శోకము కలిగించరాదని ద్రౌపది అన్నది. మరి ఆ పతివ్రత ద్రోణుని ఎందుకు అనుగమింపలేదు. అనుదానికి సమాధానము ఆమె వీరసూః అనగా వీర పుత్ర, సంతానవతి అని అర్థము. పుత్రవతికి ధర్మశాస్త్రమున సహగమనము నిషిద్ధము. ఈ విషయమున భర్తలో సగము శరీరము పత్ని అని దానికి అర్ధోవా ఏష ఆత్మనో యత్పత్నీ' అని శ్రుతి. జాయాపతీ అగ్నిమాదధీయాతామ్' అనియును భార్యా భర్తలకు ఏకాకారము చెప్పిన శ్రుతియు ప్రమాణము.(45)

46. శ్లో. తద్ధర్మజ్ఞ మహాభాగ
భవద్భిర్గౌరవం కులమ్ ।
వృజినం నార్హతి ప్రాప్తుం
పూజ్యం వంద్యమభీక్ష్ణశః ॥

టీ:- తదితి. తస్మాత్ గౌరవం గురోః కులం. కౌరవంవా. భవద్భిః కర్తృభిః వృజినం దుఃఖం ప్రాప్తుంనార్హతి, కింతు పూజ్యం వంద్యం చ.(46)

కావున అర్జునా ! గౌరవించదగిన గురుకులము ధర్మజ్ఞుడవగు నీ చేత పాపపంకిలం చేయబడి దుఃఖింపబడకూడదు. గురుకులము మిక్కిలి పూజ్యము, నమస్కార యోగ్యము కదా అన్నది ద్రౌపది. (46)

47. శ్లో. మా రోదీత్తస్య జననీ
గౌతమీ పతి దేవతా ।
యథాఽహం మృతవత్సాఽర్తా
రోదిమ్యశ్రుముఖీ ముహుః ॥

పతినే దేవునిగా భావించే గౌతమ వంశమును మెట్టిన కృపి అశ్వత్థామ తల్లి కుమారులను కోల్పోయి కన్నీళ్ళు కారుస్తూ మాటి మాటికి నేను ఏడుస్తున్నట్లు ఏడవరాదు. గురు పత్నికి పుత్రశోకం తేరాదు. ఇట్లనుటలో ద్రౌపది పాత్ర మహా ఉదాత్తమైనదని వ్యాసులవారు నిరూపించినారు. (47)

48. శ్లో. యైః కోపితం బ్రహ్మకులం
రాజన్యైరజితాత్మభిః ।
తత్కులం ప్రదహత్యాశు
సానుబంధం శుచార్పితమ్ ॥

ఇంద్రియాలను జయించలేని రాజులచేత కోపింపబడిన, పీడింపబడిన బ్రాహ్మణ కులము, ఆ రాజుల వంశమును సకుటుంబ పరివారముగా దుఃఖాక్రాంతము చేసి దహించును. ఇచ్చట అశ్వత్థామ హత్య పరమపాపకారణమని భావము. (48)

టీ:- మారోదీదితి. మృతవత్సా మృత పుత్రా. విపక్షే దోషమాహ- యైరితి. తేషాం రాజన్యానాం కులం కర్మ. కథంభూతం? సానుబంధం సపరివారం. శుచా శోకేన. అర్పితం వ్యాప్తం చ. బ్రహ్మ కులం కర్తృ ప్రదహతి. (47,48)

**శ్రీ సూత ఉవాచ**

49. శ్లో. ధర్మ్యం న్యాయ్యం సకరుణం
నిర్వ్యలీకం సమం మహత్ ।
రాజా ధర్మసుతో రాజ్ఞ్యాః
ప్రత్యనందద్వచో ద్విజాః ॥

**సూతులవారు చెప్పుచున్నారు.**

ఓ ఋషులారా ! ధర్మము తప్పనట్టి, న్యాయము తప్పనట్టి దయతో కూడిన, నిర్వ్యలీకము సమము అగునట్టి ద్రౌపది వాక్కును విని ధర్మరాజు మిక్కిలి అభినందించెను. (49)

టీ:- ధర్మ్యమితి. ధర్మ్యమిత్యాదయః వచసః షడ్గుణాః పూర్వషట్కే ద్రష్టవ్యాః. తత్ర ధర్మ్యం ధర్మాదనపేతం ముచ్యతాం ముచ్యతామితి న్యాయ్యం న్యాయాదనపేతం నరహన్య ఇత్యాది. తస్య ఆత్మనోఽర్థమిత్యాది. నిర్వ్యళీకం తద్ధర్మజ్ఞేతి. సమం మారోదీదితి దుఃఖ సామ్యోక్తేః. మహత్యైఃకోపితమితి నిష్ఠురోక్త్యాహితోపదేశాత్. ఏవంభూతం రాజ్ఞ్యాః వచః హేద్విజాః ప్రత్యనందత్ అనుమోదితవాన్. (49)

50. శ్లో. నకులః సహదేవశ్చ
యుయుధానో ధనంజయః ।
భగవాన్ దేవకీపుత్రో
యే చాన్యే యాశ్చ యోషితః ॥

నకులుడు, సహదేవుడు, యుయుధానుడు అనగా సాత్యకి, సంజయుడు, భగవానుడగు దేవకీనందనుడు కృష్ణుడు, ఇతర పురుషులు, స్త్రీలు అందరును ధర్మరాజు వలెనే ద్రౌపది మాటలను అభినందించిరి.(50)

టీ:- నకుల ఇతి. నకులాదయశ్చ ప్రత్యనందన్. యుయుధానః సాత్యకిః. (50)

51.శ్లో. తత్రాహామర్షితో భీమః
తస్య శ్రేయాన్వధః స్మృతః ।
న భర్తురాత్మనశ్చార్థే
యోఽహన్ సుప్తాన్ శిశూన్ వృథా ॥

అచట క్రోధావిష్టుడగు భీముడు మాత్రము అశ్వత్థామను చంపుటయే మంచిదనెను. అనవసరంగా, తన ప్రభువగు దుర్యోధనునికి గాని, తనకుగాని ఏ ప్రయోజనము లేకుండా, పడుకొనియున్న శిశువులను చంపిన వాడీతడు ఉపేక్షార్హుడు కాదు, అటులైతే నరకమున పడగలడనెను.(51)

టీ:- తత్రేతి తస్య తథా విధస్య ద్రౌణేః వధఏవ శ్రేష్ఠః. అన్యథా, అస్య నరకపాతప్రసంగాత్. తదాహ - న భర్తురితి. అహన్ జఘాన. (51)

52. శ్లో. నిశమ్య భీమగదితమ్ ।
ద్రౌపద్యాశ్చ చతుర్భుజః ।
ఆలోక్య వదనం సఖ్యుః ।
ఇదమాహ హసన్నివ ॥

టీ:- నిశమ్యేతి. చతుర్భుజ ఇత్యుక్తేరయం భావః. భీమే తం హంతుం ప్రవృత్తే, ద్రౌపద్యాం చ అనిచ్ఛంత్యాం సహసా తన్నివారణే ప్రవృత్తాయాముభయోస్సన్నివారణాయావిష్కృతచతుర్భుజ ఇతి సందిహానస్య సఖ్యురర్జునస్య. (52)

భీముని మాటలను, ద్రౌపది అభిప్రాయమును, విని చతుర్భుజుడగు శ్రీకృష్ణుడు అర్జునుని ముఖముచూచి నవ్వుతూ ఈ విధముగా పలికెను. భీముడు అతన్ని చంపుటకు, ద్రౌపది ఆతని వధను నివారించుటకు ప్రయత్నించగా ఆ రెంటిలో ఏది కర్తవ్యమని సంశయించుచున్న అర్జునుని ముఖముచూచి కృష్ణుడు పలికెను. చతుర్భుజుడని కృష్ణ విశేషణము సాభిప్రాయమని రెండు చేతులతో భీముని మరిరెండు చేతులతో ద్రౌపదిని వారించెనని పరికరాలంకారముగా వివరించెను. (అపుడు శ్రీకృష్ణుడు చతుర్భుజుడుగా కనిపించెను.) (52)

**శ్రీభగవానువాచ**

53. శ్లో. బ్రహ్మబంధుర్న హంతవ్యః ।
ఆతతాయీ వధార్హణః ।
మయైవోభయమామ్నాతమ్ ।
పరిపాహ్యనుశాసనమ్ ॥

**భగవంతుడిట్లనుచున్నాడు.**

శస్త్రమును ధరించి హత్యచేసిన ఆతతాయి భ్రష్టుడు, వధార్హుడేయైనను జన్మతో బ్రాహ్మణుడైనందున హంతవ్యుడు కాడు. అర్జునా నా చేతనే ఈ రెండును సమర్థింపబడివి. అట్టి శాస్త్ర వాక్యాలను నా మాటలను అనుసరించుము. ఇచట 'బ్రాహ్మణో న హన్తవ్యః' అను వేద వాక్యమును, ' ఆతతాయి నమాయాన్తమపి , వేదాన్త పారగమ్

టీ:- బ్రహ్మబంధురితి. వధార్హణః వధార్హః. మయైవ శాస్త్రకృతా బ్రాహ్మణో న హంతవ్య ఇతి తథా.శ్లో. 'ఆతతాయినమా యాంతమపి వేదాంతపారగమ్, జిఘాంసంతం జిఘాంసీయాన్న తేన బ్రహ్మహా భవేత్' ఇతి వదతా తదుభయమప్యనుశాసనం పరిపాలయ; తవ చ ప్రతిజ్ఞాం పూరయేత్యాహ.(53)

జిఘాంసంతం జిఘాంసీయాన్న తేన బ్రహ్మహా భవేత్'. అను వాక్యమును ప్రమాణములే అనగా బ్రాహ్మణుని చంపరాదు అనియు, తనను చంపుటకు శస్త్రం ధరించి వచ్చిన బ్రాహ్మణుని, వేదాంతినైనా చంపిన బ్రహ్మ హత్యాదోషములేదనియు రెండు ప్రామాణిక వచనములు వీటినాలోచించి కర్తవ్యమును నిర్వహింపుమని భావము.(53)

54. శ్లో. కురు ప్రతి శ్రుతం సత్యం
యత్తత్సాంత్వయతా ప్రియామ్ ।
ప్రియం చ భీమసేనస్య
పాంచాల్యా మహ్యమేవ చ ॥

టీ:- కుర్వితి. ప్రియాం సాంత్వయతా త్వయా యత్ప్రతిశ్రుతం హననం, తచ్చ సత్యం కురు. మహ్యం మమ, తత్ర వధే భీమస్య ప్రియం భవతి. అవధే ద్రౌపద్యాః ప్రియం, ద్వయే కృష్ణస్య ప్రియమితి చ. (54)

నీ ప్రతిజ్ఞను పూర్తిచేయుమని భగవానుడు అర్జునునితో అనుచున్నాడు. ప్రియురాలగు ద్రౌపదిని ఓదారుస్తూ అశ్వత్థామ శిరస్సు తెస్తానని నీవు చేసిన ప్రతిజ్ఞను సత్యము చేయుము, అదే విధంగా అశ్వత్థామను చంపవలసిందే అను భీమసేనునికి ఇష్టమైన పని చేయుము. బ్రాహ్మణుని, గురుపుత్రుని విడువుమను ద్రౌపదికిని, చంపడము, చంపకపోవడము రెండును శాస్త్ర సమ్మతమేనని వచించిన నాకును, అందరికిని ఇష్టమైనట్లు చేయుమని కృష్ణుడు అర్జునునితో వక్కాణించెను.(54)

**శ్రీసూత ఉవాచ.**

55. శ్లో. అర్జునః సహసాజ్ఞాయ
హరేర్హార్దమథాసినా ।
మణిం జహార మూర్ధన్యం
ద్విజస్య సహమూర్ధజమ్ ॥

టీ:- అర్జున ఇతి. హరేః శ్రీకృష్ణస్య హార్దమభిప్రాయం. ఆజ్ఞాయ జ్ఞాత్వా, నహ్యాశక్యముభయం విదధ్యాత్ . అతోఽయమభిప్రాయ ఇతి జ్ఞాత్వేత్యర్థః. అసినా ఖడ్గేన. మూర్ధన్యం మూర్ధ్నిజాతం, సహమూర్ధజం సకేశమ్. (55)

**శ్రీ సూతులవారు చెపుచున్నారు.**

అర్జునుడు శ్రీకృష్ణపరమాత్మ అభిప్రాయమును, రెండు పనులు కూడ సాధ్యమే అను విషయాన్ని తెలిసికొని అశ్వత్థామ శిరస్సున ఉన్న సహజమగు మణిని వెంట్రుకలతోసహా నరికి తీసికొనెను. దీనివల్ల చంపకపోయినను చంపినట్లే అయ్యెనని.(55)

56. శ్లో. విముచ్య రశనాబంధం
బాలహత్యా హతప్రభమ్ ।
తేజసా మణినా హీనం
శిబిరాన్నిరయాపయత్ ॥

టీ:- విముచ్యేతి. మణినా చ హీనం. నిరయాపయత్ నిస్సారితవాన్. (56).

శిశుహత్యతో తేజోవిహీనుడైన, బ్రహ్మతేజస్సును, శిరోమణిని కూడ కోల్పోయిన అశ్వత్థామను, అర్జునుడు అతనికి కట్టులను విడచి శిబిరము నుండి వెడలగొట్టెను. (56)

57. శ్లో. వపనం ద్రవిణాదానమ్
స్థానాన్నిర్యాపణం తథా ।
ఏష హి బ్రహ్మబంధూనామ్
వధో నాన్యో స్తి దైహికః ॥

టీ:- అనేన కృష్ణోక్తం సర్వం సంపాదితమిత్యాహ-వపనమితి. (57).

ఇంతటితో శ్రీకృష్ణపరమాత్మ ఆజ్ఞ సమస్తము పూర్తి అయినది అని తెలుపుతున్నాడు. "వపనమని". క్షౌరము చేయించుట, ద్రవ్యము లాగుకొనుట, స్థానభ్రంశము చేయుట ఇవి భ్రష్టుడగు బ్రాహ్మణునికి వధ వంటివి. శారీరిక వధ అతని కుండదు అని శాస్త్రము.(57)

58. శ్లో. పుత్రశోకాతురాః సర్వే
పాండవాః సహ కృష్ణయా ।
స్వానాం మృతానాం యత్ కృత్యం
చక్రుర్నిర్హరణాదికమ్ ॥

టీ:- పుత్రేతి. నిర్హరణం దాహార్థం నయనం.(58)

పుత్రశోకమును పొందిన పాండవులందరు ద్రౌపదితో కూడి చనిపోయిన తమ వారందరికి చేయవలసిన దహనాది సంస్కారములు చేసిరి.(58)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం
సంహితాయాం ప్రథమేస్కంధే భావార్థదీపికాయాం
సప్తమోధ్యాయః**

**శ్రీమద్భాగవతము యొక్క ప్రథమస్కంధ
సప్తమాధ్యాయమునకు శ్రీధరీయవ్యాఖ్యానుసార
ఆంధ్రానువాదము ముగిసినది.**

## అష్టమోఽధ్యాయః

**సూత ఉవాచ.**

1. శ్లో. అథ తే సంపరేతానాం
స్వానాముదకమిచ్ఛతామ్ ।
దాతుం సకృష్ణా గంగాయాం
పురస్కృత్య యయుః స్త్రియః ॥

టీ:- శ్లో. అష్టమే కుపిత ద్రౌణేస్త్రాదక్షా పరీక్షితః శ్రీకృష్ణసంస్తుతిః కుంత్యా రాజ్ఞశ్శోకశ్చ కీర్త్యతే అథేతి. తే పాండవాః. సంపరేతానాం మృతానాం గంగాయాముదకం నివాపోదకం. దాతుం శ్రీకృష్ణాః కృష్ణేన సహితాః స్త్రియః స్త్రీః పురస్కృత్య అగ్రతః కృత్వా. తస్మిన్ కార్యే స్త్రీ పురస్సరత్వవిధానాత్.(1)

2. శ్లో. తే నినీయోదకం సర్వే
విలప్య చ భృశం పునః ।
ఆప్లుతా హరిపాదాబ్జ
రజఃపూతసరిజ్జలే ॥

టీ:- త ఇతి. ఉదకం, నినీయ నివాపోదకం దత్వా. హరిపాదాబ్జరజోభిః పూతా యా సరిత్ గంగా తస్యాః జలే పునర్గ్రహణా దాదావపి స్నాత్వా ఇతి గమ్యతే. (2)

## అష్టమాధ్యాయము.

**సూతుడిట్లు చెప్పెను.**

తరువాత పాండవులు మృతులైన తమ బంధువులందఱకు గంగలో తిలోదకాలు ఇచ్చుటకు ఆడవారిని ముందుంచుకొని ద్రౌపదితో సహా కృష్ణునితో సహా వెడలిరి. అటువంటి కృత్యమునందు ఆడవారు ముందు నడవాలని శాస్త్రము విధించినది. అందుకే పాండవులు అలా వెళ్ళారు.(1)

వారందరు అచట మృతులైన వారికి తర్పణమునిచ్చి మరల మిక్కిలి దుఃఖించి, విష్ణుమూర్తి పాదపద్మముల యొక్క రజస్సుచేత పవిత్రమగు గంగాజలమందు మరల స్నానముగావించిరి. ఇచట పునః స్నాతాః అనుదానినిబట్టి ముందు కూడ స్నానము చేశారని తోచును. పారలౌకిక తిలోదక, ధర్మోదక క్రియలలో మొదట స్నానం చేసి ఉదక ప్రదానం చేసి మరల స్నానం చేయుట నియమము.(2)

3. శ్లో. తత్రాసీనం కురుపతిం
ధృతరాష్ట్రం సహానుజమ్ ।
గాంధారీం పుత్ర శోకార్తాం
పృథాం కృష్ణాం చ మాధవః ॥

టీ:- తత్రేతి. కురుపతిం యుధిష్ఠిరం. సహానుజం భీమాది సహితం. (3)

4. శ్లో. సాన్త్వయామాస మునిభి
ర్హత బన్ధూన్ శుచార్పితాన్ ।
భూతేషు కాలస్య గతిమ్ ।
దర్శయన్న ప్రతిక్రియామ్ ॥

టీ:- సాంత్వయానానేతి. మునిభిస్సహితః(4)

5. శ్లో. సాధయిత్వాऽజాతశత్రోః ।
స్వరాజ్యం కితవైర్హృతమ్ ।
ఘాతయిత్వాऽసతో రాజ్ఞః ।
కచస్పర్శక్షతాయుషః ॥

పిమ్మట అచట కూర్చొనియున్న భీమార్జునులతో ఉన్న ధర్మరాజును, ధృతరాష్ట్రుని, పుత్రశోకార్తయగు గాంధారిని, కుంతిని, ద్రౌపదిని కృష్ణుడు ఓదార్చెను. సాంత్వయామాస= ఓదార్చెను. అని ముందు శ్లోకములో కలదు. పుత్రశోకార్తయను విశేషణము గాంధారి, కుంతి,ద్రౌపది ముగ్గురికి వర్తిస్తుంది. వంశీధరుడు కృష్ణాయనగా విశేషించి సుభద్రయని ఆమెకూడ పుత్రశోకార్తయని సూచించాడు. గాంధారికి దుర్యోధనాదుల శోకము, కుంతికి కర్ణుని శోకము, ద్రౌపదికి ఉపపాండవుల శోకము, సుభద్రకు అభిమన్యుని శోకమని భావము.(3)

మునులతో కలిసి కృష్ణుడు, ప్రాణుల విషయమున ప్రతీకారములేనట్టి కాలపు నడకను వ్యవస్థను బోధించుచూ, బంధువుల వధతో దుఃఖాక్రాంతులైన పాండవులను గాంధారి, కుంతి, సుభద్రలను ఓదార్చెను అని భావము.(4)

కృష్ణుడు, ద్రౌపది కేశగ్రహణాదులతో, ఆయువు నశించిన దుర్మార్గులగు దుర్యోధనాదులను చంపించి, ద్యూతగాండ్రగు దుర్యోధనాదుల చేత అపహరింపబడిన రాజ్యమును అజాతశత్రువగు ధర్మరాజుకు సంపాదించిపెట్టెను ( దీనికి ముందు శ్లోకముతో అన్వయము.) (5)

టీ:- సాధయిత్వేతి. కితవైర్ధూర్తైః దుర్యోధనాభిః. ద్రౌపద్యాః కచగ్రాహణాదినా క్షతం నష్టమాయుర్యేషాం తాన్. (5)

6. శ్లో. యాజయిత్వాఽశ్వమేధైస్తం
త్రిభిరుత్తమకల్పకైః ।
తద్యశః పావనం దిక్షు
శతమన్యోరివాతనోత్ ॥

ఆ ధర్మరాజు ద్వారా కల్పోక్త ప్రకారముగా మూడు అశ్వమేధ యజ్ఞములను చేయించి, దేవేంద్రుని యొక్క కీర్తివలె పవిత్రమగు ఆ ధర్మరాజు కీర్తిని దిక్కులయందు విస్తరింపచేసినాడు కృష్ణుడు. మునుముందు ధర్మరాజు చేయించబోయే అశ్వమేధ యాగములనిచట పేర్కొన్నాడని గ్రహించాలి.(6)

టీ:- యాజయిత్వేతి. యాజయిత్వేత్యాది భావికథాసంక్షేపః. శతమన్యోశ్శతక్రతోరివ.(6)

7. శ్లో. ఆమంత్ర్య పాండుపుత్రాంశ్చ
శైనేయోద్ధవసంయుతః
ద్వైపాయనాదిభిర్విప్రైః
పూజితైః ప్రతిపూజితః ॥

కృష్ణుడు, ద్వైపాయనాది బ్రహ్మర్షులను పూజించి వారితో కూడ పూజలనందుకొని, శైనేయుడగు సాత్యకి, ఉద్ధవులతో కలసి, ఇక వెళ్ళివస్తానని, పాండవుల నుండి సెలవు తీసికొన సంకల్పించెను. (ముందటి శ్లోకముతో అన్వయము.) (7)

టీ:- ఆమంత్ర్యేతి. శైనేయః శినేర్నప్తా సాత్యకిః తేన చ ఉద్ధవేన చ సంయుతః.(7)

8. శ్లో. గంతుం కృతమతిర్బ్రహ్మన్
ద్వారకాం రథమాస్థితః ।
ఉపలేభేఽభిధావంతీం
ఉత్తరాం భయవిహ్వలామ్ ॥

టీ:- గంతుమితి. రథమాస్థితస్సన్. ఉత్తరాం పరీక్షిన్మాతరం. అభిధావంతీం. ఉపలేభే దదర్శ.(8)

ఓ శౌనకా ! కృష్ణుడు ద్వారకకు వెళ్ళుటకు నిశ్చయించుకొని రథముపైనెక్కియుండెను. ఇంతలో భయముతో దిక్కుతోచక పరుగెత్తి ఎదురుగా వచ్చుచున్న ఉత్తరను చూచెను.(8)

**ఉత్తరోవాచ.**

9. శ్లో. పాహి పాహి మహాయోగిన్
దేవదేవ జగత్పతే ।
నాన్యం త్వదభయం పశ్యే
యత్ర మృత్యుః పరస్పరమ్ ॥

టీ:- ఉత్తరా శ్రీకృష్ణం ప్రార్థయ తే ద్వాభ్యాం - పాహీతి. అన్యస్తు ప్రార్థనాయోగ్యో నాస్తీత్యాహ-నేతి. త్వత్ త్వత్తః అన్యం భయరహితం. న పశ్యామి యత్ర లోకే పరస్పరం మృత్యుర్భవతి.(9)

**ఉత్తర పలికెను.**

మహాయోగీశ్వరా, జగన్నాథా, దేవదేవా కృష్ణా ! కాపాడు కాపాడు. నీవు తప్ప నా భయమును పోగొట్టు వారు వేరెవరులేరు. లోకమున అన్యోన్యముగా మృత్యువు సంభవించును. ఒక ప్రాణి మరో ప్రాణిని చంపుచున్నది నీవు అభయమిచ్చిన కాని ఏది రక్షింపబడదు.(9)

10. శ్లో. అభిద్రవతి మామీశ
శరస్తప్తాయసో విభో ।
కామం దహతు మాం నాథ
మా మే గర్భో నిపాత్యతామ్ ॥

టీ:- తత్ర ప్రస్తుతం భయమావేదయతి-అభిద్రవతీతి. అభిద్రవతి అభిముఖమాయాతి.తప్తం ఆయసం లోహమయం శల్యం యస్య సః అతికార్పణ్యేనాహ- కామమితి. కామం యథేచ్ఛం మా నిపాత్యతాం నభ్రశ్యతు.(10).

ఉత్తర తనకు కలిగిన భయాన్ని తెలుపుతున్నది.

ఈశ్వరా ! ప్రభూ ! అని దీనంగా తన బాధను వివరిస్తున్నది. బాగా కాచిన ఇనుపముక్కతో చేయబడిన బాణము నాకెదురుగా చంపడానికి వచ్చుచున్నది. అది నన్ను యథేచ్ఛగా కాల్చినను ఫరవాలేదు. ఓ రక్షకా ! పాండవాంకురముగా నున్న నా గర్భము మాత్రము పడిపోకపోవుగాక, గర్భస్థ శిశువునైతే తప్పక రక్షించు ప్రభూ! అని ప్రార్థించినది.(10)

**శ్రీసూత ఉవాచ.**

11.శ్లో. ఉపధార్య వచస్తస్యా
భగవాన్ భక్తవత్సలః ।
అపాండవమిదం కర్తుం
ద్రౌణేరస్త్రమబుధ్యత ॥

టీ:- ఉపధార్యేతి. పరాభవేనాతికుపితస్య ద్రౌణేః అస్త్రంఅపాండవం పాణ్డవశూన్యం ఇదం విశ్వం కర్తుం. ప్రవృత్తం బ్రహ్మాస్త్రం అబుధ్యత. (11)

**సూతులవారు చెప్పుచున్నారు.**

భక్తులయందు ప్రేమగల భగవానుడగు కృష్ణుడు ఆ ఉత్తర వాక్కులను విని, అర్జుననిచే అవమానితుడగు అశ్వత్థామ లోకమున పాండవులెవ్వరు మిగల కుందురుగాక అని ఆగ్రహంతో ప్రయోగించిన బ్రహ్మాస్త్రమది అని తెలిసికొనెను.(11)

12. శ్లో. తర్హ్యేవాథ భృగుశ్రేష్ఠ
పాండవాః పంచసాయకాన్ ।
ఆత్మనోఽభిముఖాన్ దీప్తాన్
ఆలక్ష్యాస్త్రాణ్యుపాదదుః ॥

టీ:- అత ఏవ బహుముఖం తదాగతమిత్యాహ-తర్హీతి. తర్హ్యేవ తదానీమేవ.(12)

ఓ శౌనకా ! అపుడే పాండవులును తమ కెదురుగా మండుచూ వస్తున్న అయిదు బాణములను గుర్తించి వాటిని ఎదుర్కొనుటకు తమ అస్త్రములను పైకి తీసినారు.(12)

13. శ్లో. వ్యసనం వీక్ష్య తత్తేషా
మనన్య విషయాత్మనామ్ ।
సుదర్శనేన స్వాస్త్రేణ
స్వానాం రక్షాం వ్యధాద్విభుః ॥

టీ:- వ్యసనమితి. బ్రహ్మాస్త్రస్యాస్త్రాంతరై రనివర్త్యత్వాత్తద్దుష్పరిహారం వ్యసనం వీక్ష్య అనన్యవిషయః ఆత్మా యేషాం, స్వైకనిష్ఠానామిత్యర్థః (13)

ఇతరాస్త్రములతో నివారింప శక్యముగాని బ్రహ్మాస్త్రము వలన, తననే నమ్ముకొన్న పాండవులకు కలిగిన కష్టాన్ని చూచి ప్రభువైన కృష్ణుడు తన అస్త్రమగు సుదర్శన చక్రాయుధమును ప్రయోగించి తన వారికి రక్షణ కలిగించెను.(13)

14. శ్లో. అంతస్థః సర్వభూతానామ్
ఆత్మాయోగీశ్వరో హరిః ।
స్వమాయయాऽవృణోద్గర్భం
వైరాట్యాః కురుతంతవే ॥

టీ:- అంతస్థ ఇతి. వైరాట్యాః ఉత్తరాయాః. అంతస్థస్సన్ గర్భమావృతవాన్. తత్ర హేతుః, యతః ఆత్మా అంతర్యామీ యోగేశ్వర ఇతి బహిష్ఠస్యాపి ప్రవేశఘటనార్థముక్తం. కురూణాం తంతవే సంతానాయ.పాండవానామపి కురువంశజత్వాదేవ ముక్తమ్.(14)

సర్వభూతాత్మకుడు, యోగీశ్వరుడును అయిన శ్రీకృష్ణుడు ఉత్తర యొక్క గర్భమున ఉండి తన మాయతో దాన్ని ఆవరించి రక్షణ కల్పించెను. అంగుష్ఠమాత్ర పురుషుడుగా ఉత్తర గర్భమున నిలిచి గర్భముచుట్టూ తన చక్రాన్ని తిప్పుతూ రక్షణ గావించెను. ఇచట శ్రీకృష్ణుడు యోగీశ్వరుడు కనుక బయట, లోపల ఉండి ఉత్తరాగర్భమున ప్రవేశింపగల్గెను. పాండవులు కూడా కురువంశజులే కనుక కురువంశరక్షణకై ఉత్తర గర్భ రక్షణ చేసెనని భావము.(14)

15. శ్లో. యద్యప్యస్త్రం బ్రహ్మశిరః
త్వమోఘం చాప్రతిక్రియమ్ ।
వైష్ణవం తేజ ఆసాద్య
సమశామ్యద్భృగూద్వహ ॥

టీ:- యదితి. అమోఘం అప్రతిక్రియం చ సమశామ్యత్ సంశాంతమసీత్.(15).

ఆ బ్రహ్మశిరోనామకాస్త్రము మొక్కుపోనిది తిరుగులేనిదేయైనను ఓ భృగువంశ శ్రేష్ఠ శౌనకా ! వైష్ణవ సుదర్శన తేజస్సు ముందు నిలువ లేనిదై శమించెను.(15)

16. శ్లో. మా మంస్థా ఏతదాశ్చర్యం
సర్వాశ్చర్యమయేఽచ్యుతే ।
య ఇదం మాయయా దైవ్యా
సృజత్యవతి హంత్యజః ॥

ఇంతటి బ్రహ్మాస్త్రమును సుదర్శనము ఎలా శమింపజేసెనని ఆశ్చర్యపడకుము. సర్వాశ్చర్యమయుడగు అచ్యుతుడు కృష్ణుడే. ఈ విశ్వాన్ని తన దైవమాయ చేత సృజిస్తాడు కాపాడుతాడు సంహరిస్తాడు. (16)

టీ:- మేతి. ఏతద్బ్రహ్మాస్త్రశమనం మామంస్థాః మామన్యస్వ. ఇదం జగత్.(16)

17. శ్లో. బ్రహ్మతేజో వినిర్ముక్తై
రాత్మజైః సహ కృష్ణయా ।
ప్రయాణాభిముఖం
కృష్ణమాదమిహ పృథా సతీ ॥

బ్రహ్మాస్త్రము నుండి వినిర్ముక్తులై, రక్షితులైన తన పుత్రులు, పాండవులు, ద్రౌపదితో కలిసి కుంతీదేవి, ప్రయాణాభిముఖుడైన కృష్ణునితో ఈ విధముగా పలికెను.(17)

టీ:- బ్రహ్మేతి. కృష్ణయా చ సహ. (17)

**కుంత్యువాచ.**

**కుంతి పలుకుచున్నది.**

18.శ్లో. నమస్యే పురుషం త్వాద్యమ్
ఈశ్వరం ప్రకృతేః పరమ్ ।
అలక్ష్యం సర్వభూతానామ్
అంతర్బహిరవస్థితమ్ ॥

కృష్ణా నీకు నమస్కారము చిన్న వానిని నాకు నమస్కారమేల చేసెదవంటావేమో, నీవు ఆది పురుషుడవు ఎందుకంటే ప్రకృతికన్న మొదటివాడవు. నీవు ఈశ్వరుడవు, ప్రకృతిని కూడ నియమించువాడవు. అందుకే అన్ని భూతముల లోపల, బయట కూడ ఉండువాడవు.

టీ:- నమస్యఇతి. త్వా త్వాం నమస్యే నమస్కరోమి. నను కనిష్ఠం మాం కథం నమస్కరోషి? తత్రాహ-ఆద్యం పురుషం. కుతః? ప్రకృతేః పరం. తత్కుతః? ప్రకృతేః ఈశ్వరం. ప్రకృతేరపి నియంతారం, అతఏవ సర్వభూతానాం అంతర్బహిశ్చ పూర్ణత్వేనావస్థితం. తథాప్య లక్ష్యం. తత్ర హేతుః.(18)

పరిపూర్ణుడవు. అయినా అందరిచేత గుర్తింపబడని వాడవు.(18)

19. శ్లో. మాయాజవనికాచ్ఛన్నమ్
అజ్ఞా஽ధోక్షజమవ్యయమ్ ।
న లక్ష్యసే మూఢదృశాం
నటో నాట్యధరో యథా ॥

టీ:- మాయేతి. మాయేవ యవనికా తిరస్కరిణీ. తయా ఆచ్ఛన్నం ప్రతిచ్ఛన్నం. అతో஽హమజ్ఞా కేవలం నమస్యామి. అధః కృతం అక్షజం జ్ఞానం యస్మాత్తం. అవ్యయమపరిచ్ఛన్నం. తత్రప్రపంచయతి - నేతి. నటో యథా నట ఇవ మూఢదృశాం దేహాభిమానినాం పుంసాం త్వ న లక్ష్యసే కించ.(19)

అందరిచే గుర్తింపబడకుండుటకు ఇచట హేతువును చెపుతున్నాడు. మాయయను తెఱచేత ఆవరింపబడినవాడవు. అందుకే నేను తెలిసికొనజాలకున్నాను. భక్తియోగము కూడా తెలియని దానను. నమస్కారము చేయుట మాత్రమే ఎరిగిన దానను. నీవేమో ఇంద్రియ జ్ఞానాతీతుడవు,నాశరహితుడవు, అపరిచ్ఛిన్నుడవు. నటించు నటుని లాగ దేహాభిమానంగల అజ్ఞులకు గోచరించవు.(19)

20. శ్లో. తథా పరమహంసానాం
మునీనామమలాత్మనామ్ ।
భక్తియోగవిధానార్థం
కథం పశ్యేమహిస్త్రియః ॥

టీ:– తథేతి. పరమహంసానాం ఆత్మనాత్మవివేకినాం. తతో మునీనాం మననశీలానామపి. తతశ్చామలాత్మనాం నివృత్తరాగాది దోషాణామపి. తథా తేన మహిమ్నా. న లక్ష్యసే, అతో భక్తియోగం విధాతుం త్వాం వయం స్త్రియః కథం పశ్యేమ? యద్వా, పరమహంసా నామపిభక్తియోగవిధానార్థంత్వాం. అయం భావః. ఆత్మారామాణా మపి అచింత్యనిజగుణైరాకృష్య భక్తియోగం కారయితుం అవతీర్ణం త్వాం స్త్రియో వయం కథం పశ్యేమేత్యర్థః.(20)

అంతేగాక ఆత్మానాత్మ వివేకముగల పరమహంసలకు, ఎల్లప్పుడు నిన్ను మననం చేసే వారికి, రాగద్వేషాలు లేని మహనీయులకుకూడ నీవు గోచరించనివాడవు. మేమెట్లు తెలిసికొన గలుగుదుము. నీ యందు అనన్యమైన భక్తియోగమును సామాన్యులకు విధించి తరింపజేయుటకు అవతరించినవాడవు. అట్లు కానిచో స్త్రీలమగు మేము కృష్ణా నిన్ను ఏవిధముగా చూడగలుగుతాము. గ్రహించగల్గుతాము? (20)

21. శ్లో. కృష్ణాయ వాసుదేవాయ
దేవకీనందనాయ చ ।
నందగోపకుమారాయ
గోవిందాయ నమోనమః ॥

టీ:– జ్ఞానభక్త్యోరశక్యత్వముక్త్వా పునః కేవలం నమస్కరోతి ద్వాభ్యాం. (21)

జ్ఞానము, భక్తి కూడి సులభముకాదని కేవలము భగవన్నామ స్మరణ చేస్తూ రెండు శ్లోకాలతో కుంతి నమస్కరిస్తున్నది. కృష్ణా, వాసుదేవా, దేవకీనందనా, నందగోపకుమారా, గోవిందా ! నీకు నమస్కారము నీ నామమును ఉచ్చరించుట, నమస్కరించుట తప్ప నాకేమి తెలియదు.(21)

22. శ్లో. నమః పంకజనాభాయ
నమః పంకజమాలినే ।
నమః పంకజనేత్రాయ
నమస్తే పంకజాంఘ్రయే ॥

టీ:- నమ ఇతి. పంకజం నాభౌ యస్య పంకజానాం మాలా అస్తి యస్య. పంకజవత్ప్రసన్నే నేత్రే యస్య. పంకజాంకితావంఘ్రృ యస్య. (22)

నాభిలో పద్మము కలవాడా నీకు నమస్కారము, కమలమాలికను ధరించిన నీకు నమస్కారము, పద్మములవలె విశాలమగు నేత్రములు కలవాడా నీకు నమస్కారము, పద్మరేఖాంకితములగు పద్మసదృశ పాదాలు కలవాడా నీకు నమస్కారము. (22)

23. శ్లో. యథా హృషీకేశ ఖలేన దేవకీ
కంసేన రుద్ధా సుచిరం శుచార్పితా ।
విమోచితాహం చ సహాత్మజా విభో
త్వయైవ నాథేన ముహుర్విపద్గణాత్ ॥

టీ:- తత్కృతోపకారాననుస్మ రతి ద్వాభ్యాం-యథేతి. అయమర్థః, మాతృతోఽపి మయ్యధికా తవ ప్రీతిః తథాహి. హే హృషీకేశ యథా దేవకీ కంసేన రుద్ధా త్వయా మోచితా, అహం చ తథైవ కిం మోచితేతి కాక్వా మహాన్విశేష ఉక్తః తం దర్శయతి-సా అతిచిరం రుద్ధా సతీ తస్మాదేకస్యస్మాదేవ. సకృద్విమోచిత. తథా శుచార్పితా సతీ. న చ

శ్రీకృష్ణుడు తమకు చేసిన ఉపకారాలను 'యథా' అని రెండు శ్లోకాలతోకుంతి స్మరించుచున్నది. ఓ హృషీకేశా ! దుర్మాగుడగు కంసునిచేత చాలా కాలము కారాగారమున బంధింపబడి, దుఃఖించిన నీ తల్లిని నీవెట్లు విడిపించితివో అటులనే నన్ను నా కుమారులతో సహా మాటిమాటికిని అనేక విపత్తులలో నుండి యున్నప్పుడు ప్రభువగు నీవే విడిపించినావు. కుంతి పరోక్షముగా కృష్ణుని స్తుతిస్తూ నీకు నీ తల్లి యందున్న ప్రేమ కన్నా నాయందే ఎక్కువ ప్రేమ యున్నది. కంసుని బాధల నుండి దేవకిని విడిపించి నట్లే నా బాధల నుండి విడిపించినప్పటికి ఆమె చాలా కాలము దుఃఖము అనుభవించి విముక్తురాలైనది, ఆమె పుత్రులు రక్షింపబడలేదు. ఒకే విపత్తు నుండి

తస్యాః పుత్రారక్షితాః అస్తి చాన్యో నాథస్తస్యాః అహం తు విపద్గణాత్. అత్రాపి మహుశ్శీఘ్రుం చ సాత్మజా చ త్వయైవ నాథేనేతి. (23)

ఆమెను ఒక్కసారే రక్షించావు. అట్లుకాక నన్ను నా పుత్రులను అనేక ఆపదల నుండి పలుమార్లు కాపాడినావు. (23)

24. శ్లో. విషాన్మహాగ్నేః పురుషాదదర్శనాత్
అసత్సభాయా వనవాసకృచ్ఛ్రతః ।
మృధేమృధేఽనేక మహారథాస్త్రతో
ద్రౌణ్యస్త్రతశ్చాస్మ హరేఽభిరక్షితాః ॥

టీ:- విపద్గణమేవదర్శయతి - విషాదితి. విషాత్ భీమస్య విష మోదకదానాత్. మహాగ్నేః జతుగృహదాహాత్. పురుషాదాః హిడింబాదయో రాక్షసాః తేషాం దర్శనాత్. అసత్సభాయాః ద్యూతస్థానాత్ అభితో రక్షితాః ఆస్మ అభవామ. (24)

కుంతి తమ ఆపదలను వివరించి తెలుపుచున్నది. ఓ కృష్ణా ! విషము కలిసిన అన్నము నుండి భీముని, లక్క ఇంటి అగ్ని నుండి, హిడింబాది రాక్షసులనుండి, మోసముచేయు జూదగాండ్రుగల ద్యూతసభ నుండి, వనవాసపు అన్ని కష్టముల నుండి దుర్యోధనుడు పంపగా వచ్చి అడవిలో అన్నము యాచించిన మహా కోపియగు దూర్వాసుని శాపము నుండి, అంతేకాక యుద్ధమందు భీష్మాదుల యొక్క అనేక అస్త్రముల నుండి చివరకు ఈ అశ్వత్థామ బ్రహ్మాస్త్రము నుండి కూడా నీవేమమ్ము కాపాడినావు.(24)

25 .శ్లో. విపదః సంతు నః శశ్వత్
తత్ర తత్ర జగద్గురో ।
భవతో దర్శనం యత్స్యా ద్
అపునర్భవదర్శనమ్ ॥

టీ:- విపద ఇతి. యత్ యాసు విపత్సు. కీదృశం దర్శనం. నాస్తి పునరపి భవస్య సంసారస్య దర్శనం యస్మాత్.(25)

ఓ జగన్నాథా ! కృష్ణా ! మాకు ఎల్లపుడు అప్పుడప్పుడు ఆపదలే కలగాలి. అప్పుడే పునర్జన్మ లేకుండ జేయు నీ దర్శనము మాకు కలుగుతుంది. మనిషికి కష్టాలు వస్తేనే భగవంతుడు గుర్తుకొస్తాడు కావున కష్టాలేమాకవసరము.(25)

26. శ్లో. జన్మైశ్వర్యశ్రుతశ్రీభిః
ఏధమానమదః పుమాన్ ।
నచార్హత్యభిధాతుం వై
త్వామకించనగోచరమ్ ॥

టీ:- సంపదస్తు శ్రేయః పరిపంథిన్య ఇత్యాహ-జన్మేతి. జన్మ సత్కులే. జన్మాదిభిరేధమానో మదో యస్య సః అభిధాతుం కృష్ణేతి గోవిందేతి వక్తుమపి. అకించనానాం గోచరం విషయభూతమ్. (26)

సంపదలు, శ్రేయస్సునకు శత్రువులవంటివనుచున్నది కుంతి. మంచికులమున జన్మించుటచేత, సంపద అధికారములచేత, వేదాంతాది శాస్త్రజ్ఞానముచేత, ధనముచేత, మదము పెరిగిన మనుష్యుడు, నీ నామమును ఉచ్చరించనర్హుడుకాడు. ఉచ్చరించలేదు కూడ భగవంతుని తలచడు. ఏమియును లేక కష్టపడుచున్నవాడే భగవంతుని నామమును ఉచ్చరించుచూ ఆతనిని స్మరించగలుగును. (26)

27. శ్లో. నమో౨కించన విత్తాయ
నివృత్తగుణవృత్తయే ।
ఆత్మారామాయ శాంతాయ
కైవల్యపతయే నమః ॥

టీ:- ప్రస్తుత మనోరథ పూరణాయ పునః ప్రణమతి-అకించనాః భక్తా ఏవ విత్తం సర్వస్వం యస్య తస్మై. నివృత్తాః గుణవృత్తయో ధర్మార్థ కామవిషయాః యస్మాతస్మై. కుతః! ఆత్మారామాయ కుతః? శాంతాయ కించ కైవల్యపతయే కైవల్యం దాతుం సమర్థాయ (27)

ప్రస్తుతములైన అంశములను ప్రస్తావించుటకు పూరించుకొనుట కుంతి భగవంతుని మరల నమస్కరించుచున్నది. ధనములేని భక్తులే ధనముగా కలవాడా, ధర్మార్థ కామాలతో నీకుపనిలేదు. ఆత్మారామా, రాగాదులు లేనట్టి శాంతుడా, మోక్షదాయకా కృష్ణా ! నీకు నమస్కారము. (27)

28. శ్లో. మన్యే త్వాం కాలమీశానమ్
అనాదినిధనం విభుమ్ ।
సమం చరన్తం సర్వత్ర
భూతానాం యన్మిథః కలిః ॥

టీ:- నను దేవకీ పుత్రం మాం కథ మేవం స్తౌషి? తత్రాహ-మన్యే ఇతి. మన్యేత్వా కాలాం.న తు దేవకీపుత్రం తత్ర హేతవః - ఈశానం నియంతారం ఆద్యంతశూన్యం. విభుం ప్రభుం సమం యథాభవతి. తథా. సర్వత్రచరంతంచ పార్థసారథేర్మమ కథం సామ్యం తత్రాహ- యత్ యతః త్వత్తః నిమిత్తభూతాత్. భూతానామేవ మిథః కలిః కలహో భవతి. న తు స్వత స్త్వయి వైషమ్యమ్. (28)

29. శ్లో. న వేద కశ్చిద్భగవంశ్చికీర్షితం
తమేహమానస్య నృణాం విడంబనమ్
న యస్య కశ్చిద్దయితోఽస్తి కర్హిచిత్ ।
ద్వేష్యశ్చ యస్మిన్ విషమా మతిర్నృణామ్ ॥

టీ:- నను నిగ్రహానుగ్రహరూపం మయి వైషమ్యం ప్రసిద్ధమత ఆహ - నేతి. నృణాం విడంబనం అనుకరణం. ఈహమానస్య కుర్వతః యస్మిన్ త్వయి విషమామతిః అనుగ్రహనిగ్రహరూపా భవతి. (29)

దేవకీ పుత్రుడనగు నన్నిట్లేల స్తుతించెదవు అను ప్రశ్నకు సమాధానము చెపుతున్నది కుంతి. నేను నిన్ను కాలస్వరూపునిగా తలచెదను, కాని దేవకీ కుమారునిగాకాదు. నీవు ఈశ్వరుడవు, జగన్నియామకుడవు, ఆద్యంతాలు లేనివాడవు, ప్రభుడవు, అంతటను సమభావము కలవాడవు. పార్థసారథినగు నాకు వాటితో సామ్యము కలదా అనగా నిమిత్తభూతుడవగు నీ వలననే భూతములకు కలహము జరుగుచున్నది. కాని స్వతః నీకు వైషమ్యము లేదు. భగవానునికి పక్షపాతము కలదని కొందరు, లేదని కొందరు కలహించుకొంటారు, కాని ఆయనకందరూ సమానులే వారివారి పుణ్య పాపాలను బట్టి ఫలమిస్తాడు ఆయన నిమిత్త మాత్రుడే పుణ్యాత్ములను కాపాడును, పాపులను శిక్షించును.(28)

ఐతే ఒకరిని భగవానుడు అనుగ్రహించుట మరియొకరిని నిగ్రహించుట అనునవి ప్రసిద్ధములుగదా ఇది విషమత్వము కాదా అనగా కాదనుచున్నది. "నవేద"అని. ఓ భగవంతుడా మనుష్యులను అనుకరించవలెననుకొను నీ చరితము ఎవరికిని తెలియదు. నీకు ఒకడు ఇష్టుడు మరొకడు పడిరానివాడు లేడు మనుజులను అనుకరించు నీయందు మానవులకు రాగద్వేషాదులతో విషమబుద్ధి ఏర్పడుచున్నది. స్వతః నీకు రాగద్వేషాదులు లేవు.(29)

30.శ్లో. జన్మ కర్మ చ విశ్వాత్మన్
అజస్యాకర్తురాత్మనః ।
తిర్యఙ్నరర్షి యాదస్సు
తదత్యంత విడంబనమ్ ॥

టీ:- జన్మేతి. అజస్య జన్మ. అకర్తుః కర్మ. తిర్యక్షు వరాహాది రూపేణ. ఋషిషు. వామనాదిరూపేణ యాదస్సు మత్స్యాదిరూపేణ. (30)

31..శ్లో. గోప్యాదదే త్వయి కృతాగసి దామ తావత్
యా తే దశాऽశ్రుకలిలాంజనసంభ్రమాక్షమ్
వక్త్రం నినీయ భయ భావనయా స్థితస్య
సా మాం విమోహయతి భీరపి యద్బిభేతి ॥

టీ:- నరవిడంబనం త్వయి అత్యాశ్చర్యమిత్యాహ- గోపీతి. గోపీ యశోదా. త్వయి కృతా గసి దధిభాండస్ఫోటం కృతవతి. యావద్దామ జగ్రాహ. తావత్తక్షణఏవ. తే యా దశా అవస్థా సా మాం విమోహయతి.కింభూతస్య?అశ్రుభిః కలిలం వ్యామిశ్రం అంజనం యయోస్తేచ తే. సంభ్రమేణ వ్యాకులే.అక్షిణీ యస్మిన్ తద్వక్త్రం నినీయ అధఃకృత్వా.తాడయిష్యతీతి భయస్య భావనయా స్థితస్య. యత్ యతస్త్వత్తఃభీరపిస్వయంబిభేతి. తస్యతే దశా(31)

సర్వాత్మకుడవగు ఓ భగవంతుడా ! పుట్టుక లేని నీకు, పుట్టుక. కర్తృత్వములేని నీకు కర్మ కనిపిస్తున్నవి. వరాహరూపమున తిర్యక్ జంతువుగా, రామాది రూపమున మనుష్యుడవుగా, ఋషులలో వామనాది రూపంతో, జలజంతువులందు మత్స్యాది రూపముతో నీ జన్మ మిక్కిలి అనుకరణమే కాని వాస్తవములుకావు. అవి నీ లీలలు.(30)

ఓ కృష్ణా ! మనుషులను నీవు అనుకరించుట చిత్రమనుచున్నది. “గోపీ”అని. పెరుగు కుండను పగులగొట్టి తప్పు చేసితివని నిన్ను పట్టుకొని కట్టివేయడానికి యశోద చేతితో త్రాడు పుచ్చుకొనగా వెంటనే, కన్నీళ్ళతో నిండిన కాటుక కల, చంచలములైన కన్నులుకల ముఖాన్ని కిందికి వంచి, కొడుతుందేమోనన్న భయంతో నిలుచొనియున్న ఆ నీ స్థితి నన్ను నీ మీద ఏదో తెలియని మోహమును కలిగించుచున్నది. నీ వలన భయమే స్వయముగా భయపడి పారిపోవును కదా అట్టి నీకు భయమేల? అదంత నటనే దాన్ని అప్పటి నీస్వరూపాన్ని తలచుకొంటేనే మేము నీయందు మోహాభక్తిని పొందుచున్నాము.(31)

32. శ్లో. కేచిదాహురజం జాతం
పుణ్యశ్లోకస్య కీర్తయే ।
యదోః ప్రియస్యాన్వవాయే
మలయస్యేవ చందనమ్ ॥

టీ :– అతఏవ జగన్మోహనతయా దుర్జ్ఞేయత్వాత్. తవ జన్మాని బహుధా వర్ణయంతిత్యాహచతుర్భిః కేచిదితి. పుణ్యశ్లోకస్య ప్రియస్య యుధిష్ఠిరస్య కీర్తయే. యదోరేవ కీర్తయు ఇతి వా యదోః ప్రియస్యాన్వవాయే వంశేమలయస్య కీర్తయే వనే చందనం యథా. (32)

జగత్తును మోహింపజేసే స్వభావంకల నీ జన్మము మొదలైన వాటిని అనేక మంది అనేక రకాలుగా చెపుతున్నారు అనుదానిని 'కేచిదని' నాలుగు శ్లోకాలతో చెపుతున్నది. కొందరు ధర్మరాజుకు గొప్ప కీర్తిని కలిగించుటకని, మరికొందరు ప్రియుడు వంశకర్తయగు యదువునకు కీర్తిని కలిగించుటకు, నీవు పుట్టితివని, మలయ పర్వతమునకు చందన వృక్షము ఎట్టిదో యదు వంశమునకు జన్మలేని నీవు అట్టివాడవై జన్మించితివని అనుకొనుచున్నారు. (32).

33. శ్లో. అపరే వసుదేవస్య
దేవక్యాం యాచితోఽభ్యగాత్ ।
అజస్త్వమస్య క్షేమాయ
వధాయ చ సురద్విషామ్ ॥

టీ:– అపర ఇతి . తథా వసుదేవస్య భార్యాయాం దేవక్యాం.అజ ఏవ త్వమభ్యగాత్. పుత్రత్వమితి శేషః. ప్రథమ పురుషస్త్వార్షః అభ్యగా ఇతి వా పాఠస్సుగమః. తాభ్యామేవ పూర్వం సుతపః పృశ్నిరూపాభ్యాం యాచితస్సన్. అస్య జగతః క్షేమాయ. (33)

అదే విధముగా పుట్టుక లేని నీవు యాచింపబడి వసుదేవుని భార్యయగు దేవకి యందు పుత్రత్వమునొందితివి. నీ జన్మ లోకము యొక్క క్షేమము కొరకు, దేవశత్రువులగు రాక్షసుల సంహారము కొరకు వచ్చినదని మరికొందరు అనుచున్నారు.(33)

34. శ్లో. భారావతరణయాన్యే
భువో నావ ఇవోదధౌ ।
సీదంత్యా భూరిభారేణ
జాతో హ్యాత్మభువార్థితః ॥

టీ:- భారేతి అత్మ భువేతి బ్రహ్మప్రార్థనాయాః ప్రాధాన్యవివక్షయా. (34)

బ్రహ్మచే ప్రార్థింపబడి గొప్ప బరువుతో క్రుంగిపోతున్న భూమి యొక్క భారాన్ని తగ్గించుటకు సముద్రమున నౌకవలె నీవు జన్మించితివని మరికొందరనుచున్నారు కృష్ణా.(34)

35. శ్లో. భవేఽస్మిన్ క్లిశ్యమానానామ్ ।
అవిద్యాకామకర్మభిః ।
శ్రవణస్మరణార్హాని ।
కరిష్యన్నితి కేచన ॥

టీ :- మతాంతరం పరమానందస్వరూపాజ్ఞానమవిద్యా. తతో దేహద్యభిమానాత్కామః తతః కర్మాణి తైః క్లిశ్యమానానాం తన్నివృత్తయే శ్రవణాద్యర్హాణి కర్మాణి కరిష్యన్ (35)

భగవదవతార విషయమున మతాంతరము వివరింపబడుతున్నది. ఈ జన్మలో అజ్ఞానముతో కోరికలతో అనేకములగు పనులతో బాధపడుచున్న మానవులకు ఆ బాధలు తొలగించుటకు భగవన్నామ శ్రవణము, స్మరణము మొదలగు పనులను కలిగించి తరింపజేయుటకు నీవు అవతరించితివని కొందఱనుచున్నారు. మిక్కిలి ఆనందస్వరూపమగు పరబ్రహ్మను తెలియకుండుట అజ్ఞానమని దానితో కలుగు దేహమందలి అభిమానము కామమని, దాని వలన కలుగునవి వివిధ కర్మలని వాటివల్లనే అందఱికి బాధలు కల్గునని ఇచట గ్రహించవలయును. (35)

36. శ్లో. శృణ్వంతి గాయంతి గృణంత్యభీక్ష్ణశః
స్మరంతి నందంతి తవేహితం జనాః ।
త ఏవ పశ్యంత్యచిరేణ తావకం
భవప్రవాహోపరమం పదాంబుజమ్ ॥

టీ:- అస్య పక్షస్య సిద్ధాంతతామభిప్రేత్య శ్రవణసంకీర్తనాదిభిరేవ త్వత్పదాంబుజప్రాప్తిరిత్యాహ-శృణ్వంతీతి. నందతి అన్యైః కీర్త్యమానమభినందంతి. కించ యే జనా స్తవేహితం చరితం. తావకం త్వదీయం పదాంబుజం. త ఏవ పశ్యంతేవ. అచిరేణైవేతి చ సర్వత్రావధారణం కీదృశం? భవప్రవాహస్య జన్మపరంపరాయాః, ఉపరమో నివారణం యస్మిన్ తత్. (36)

భగవన్నామ స్మరణ తత్కథా శ్రవణ ఫలితాన్ని చెపుతున్నది. ఓ భగవానుడా జనులు నీ చరితాన్ని మిక్కిలి ఆదరణతో విందురు, గానము చేయుదురు, వివరింతురు, తలతురు, ఇతరులు చెప్పగా విని అభినందింతురు. అట్టి నీ భక్తులే అచిరకాలంలో జనన మరణరూప సంసార పరంపరను తొలగించునట్టి నీ పాదకమలములను చూడగలుగుదురు.(36)

37. శ్లో. అప్యద్య న స్త్వం స్వకృతేహితప్రభో
జిహాససి స్విత్సుహృదోఽనుజీవినః ।
యేషాం న చాన్యద్భవతః పదాంబుజాత్
పరాయణం రాజసు యోజితాంహసామ్ ॥

టీ:- ఇదానీం తవాస్మత్పరిత్యాగోఽనుచిత ఇత్యాహ- చతుర్భిః అపీతి. హే ప్రభో. సుహృదః అతిస్నిగ్ధాన్. అనుజీవినశ్చ నః అస్మాన్ అద్య అపిస్వత్ కింస్విత్ త్వం జిహాససి హాతుమిచ్ఛసి.యేషామస్మాకం

ఇపుడుకూడా ఓ కృష్ణా ! మమ్ములను విడువక కాపాడవలెనను ఆశయముతో పలుకుచున్నది కుంతి అపి అని నాలుగు శ్లోకాలతో. ఓ ప్రభూ నీ స్నేహితులను, నిన్నే ఆధారంగా చేసికొని నమ్మి జీవించుచున్న మమ్ములను ఇప్పుడు వదిలిపోవాలనుకున్నావా? అది కుదరదు. మాకు మీ పాదకమలములకంటె ఇతర మైనదేది దిక్కులేదు. రాజుల విషయమున అనగా రాజులను వారి పుత్రులను ఎంతో మందిని చంపి పాపము కట్టుకొన్న మాకు, దుఃఖముగల మాకు నీవే దిక్కు. నీకు నీవారమగు మాకు హితమును చేకూర్చువాడవు కదా.

అన్యత్పరాయణంనాస్తి.కుతః? రాజసు యోజితం అంహో దుఃఖం యైస్తేషాం. స్వానాం కృతమీహితం అపేక్షితం యేన స్వాశ్రితకృత సర్వాభీష్ట ఇత్యర్థః. తస్య సంబోధనం. విసర్గాంతపాఠే త్వంపద విశేషణమ్. (37)

ఇచట స్వకృతేహితః అని విసర్గాంత పాఠమున్నచో నది త్వమను పదానికి విశేషణమని, నీవారికి మేలు చేయునట్టి ఓ కృష్ణా భక్తపరాధీనా అని అర్థము.(37)

38.శ్లో. కే వయం నామరూపాభ్యాం
యదుభిః సహ పాండవాః ।
భవతో దర్శనం యర్హి ।
హృషీకాణామివేశితుః ॥

టీ:- నను తవ బంధవో యాదవాః పుత్రాశ్చ పాండవాః శూరాస్సమర్థాశ్చ. తత్కిం కార్పణ్యం భాషసే? అత ఆహ-క ఇతి. యర్హి భవతః అదర్శనం యదా త్వమస్మాన్న పశ్యసి. తదా నామ్నా విఖ్యాత్యా రూపేణ సమృద్ధ్యా చ యదుభిస్సహితాః పాండవా నామ కే వయం న కేఽపి. అతితుచ్ఛా ఇత్యర్థః, హృషీకాణామింద్రియాణా మీశితుః జీవస్య అదర్శనే యథా న కించిన్నామ చ రూపం చ తద్వత్.(38)

నీ బంధువులగు యాదవులు, కుమారులగు పాండవులు శూరులు కదా ఈ విధముగా దీనముగా ఎందుకు మాట్లాడుతావు అని కృష్ణుడు అంటాడేమో అనుకొని కుంతి ఈ విధముగా అనుచున్నది. ఏ విధముగా ఇంద్రియములకు అధిపతియగు జీవుడు కనిపించకున్న నామరూపములుండవో అదే విధముగా నీవు కనిపించకున్నచో లేదా నీవు మమ్ములను చూడకున్నచో పేరులతో ప్రసిద్ధిగాంచిన రూపములతో సమృద్ధిగా కనిపించుచున్న యాదవులు గాని పాండవులము మేముగాని ఎందుకు పనికిరాని తుచ్ఛులము.(38)

39. శ్లో. నేయం శోభిష్యతే ధాత్రీ
యథేదానీం గదాధర ।
త్వత్పదైరంకితా భాతి
స్వలక్షణవిలక్షితైః ॥

టీ:- నేతి. కించ. యథేదానీమియమస్మత్పాల్యా భూమిః, స్వైరసాధారణైర్వజ్రాంకుశాదిభిర్లక్షణైర్విలక్షతైశ్చిహ్నితైః త్వత్పదైరంకితా సతీ భాతి తత్ర తదా త్వయి నిర్గతే సతి. న శోభిష్యతే.(39)

ఓ గదాధరా కృష్ణా ! ఇపుడు మేము పరిపాలించే భూమి నీ మంచి లక్షణములతో విలక్షణములుగానున్న నీ పాదములతో చిహ్నితమయి ఏ విధముగా శోభించుచున్నదో, నీవు ఈ భూమిని వదలి వెళ్లిపోయినచో అట్లు శోభించదు.(39)

40. శ్లో. ఇమే జనపదాః స్వృద్ధాః
సుపక్వౌషధివీరుధః ।
వనాద్రి నద్యుదన్వంతో
హ్యేధంతే తవ వీక్షితైః ॥

టీ:- ఇమే ఇతి. ఇమే జనపదాః దేశాః స్వృద్ధాస్సుసమృద్ధాస్సంతః తవ వీక్షితైరేధంతే.(40)

బాగా పండిన ఓషధులు, చెట్ల పొదలు, వనములు, పర్వతాలు, నదులు, సముద్రాలతో, మంచి సమృద్ధిగా ఉన్న ఈ దేశములు మీ చల్లగా చూచుటచేతనే అభివృద్ధి గాంచుచున్నవి.(40)

41. శ్లో. అథ విశ్వేశ విశ్వాత్మన్
విశ్వమూర్తే స్వకేషు మే ।
స్నేహపాశమిమం ఛింధి
దృఢం పాండుషు వృష్ణిషు ॥

టీ:- గమనే పాండవానా మాకులం. అగమనే యాదవానాం ఇత్యుభయతో వ్యాకులయిత్తా సతీ తేషు స్నేహనివృత్తిం ప్రార్థయతే- అథేతి. విశ్వేశేత్యాది సంబోధనాని. స్నేహపాశచ్ఛేదసామర్థ్యఖ్యాపనాయ, ధృడం సతతం(41)

శ్రీకృష్ణుడు వెళ్ళిపోతే పాండవులకు, వెళ్ళకపోతే యాదవులకు క్షేమముగా కలుగదని మనస్సున కలవరపడుతూ బంధువుల యెడ తనకుగల ప్రేమపాశాన్ని తొలగించమని అథ అని ఈ శ్లోకము కుంతి కోరుకొంటున్నది. విశ్వేశాది విశేషణాలతో స్నేహపాశచ్ఛేదన సామర్థ్యము భగవంతునికి కలదని సూచించును. ఓ భగవానుడా కృష్ణా నీవు విశ్వేశుడవు, అధిపతివి, సర్వాంతర్యామివి, సర్వప్రపంచ స్వరూపుడవు అట్టి సమర్థుడవగు నీవు నా వారి యందు నాకుగల దృఢమగు ఈ ప్రేమపాశమును భేదింపుము. పాండవులందు, యాదవులందు నాకు మిక్కిలి ప్రేమకలదు అది బంధహేతువు దానిని తొలగింపుము.(41)

42. శ్లో. త్వయి మేఽనన్యవిషయా
మతిర్మధుపతేఽసకృత్ ।
రతిముద్వహతాదద్ధా
గంగేవౌఘముదన్వతి ॥

టీ:- తతః కిమత ఆహ-త్వయీతి. అనన్యవిషయా సతతీ మే మతిః రతిముద్వహతాత్ అనపచ్ఛిన్నాం ప్రీతిం కరోత్విత్యర్థః. ఓఘం పూరం. యథా గంగాప్రతిబంధం న గణయతి ఏవం మతిరపి విఘ్నాన్ న గణయత్వితి భావః. (42)

అయితే ఏమి అను ప్రశ్నకు సమాధానము. ఓ కృష్ణా, మధురానాథా ఇతర విషయాలను ఆలోచించక నా బుద్ధి నీ పట్లనే ఎల్లప్పుడు ప్రసరించి ఎడతెగని ప్రేమతో ప్రవహించుగాక ప్రవాహమునకడ్డు తగిలినను వాటిని లెక్కచేయక తెంచుకొని పోయి గంగ సముద్రమున కలియునుగదా ఆ విధముగానే భగవద్విషయక మగు బుద్ధి విఘ్నాలను లెక్కించక ముందుకు పోవుగాక. (42)

43. శ్లో. శ్రీకృష్ణ కృష్ణసఖ వృష్ణ్యృషభావనిధ్రుగ్
రాజన్యవంశదహనానపవర్గవీర్య ।
గోవింద గోద్విజసురార్తిహరావతార
యోగీశ్వరాఖిలగురో భగవన్నమస్తే ॥

టీ:- ఏవమభ్యర్థ్య పునః ప్రణమతి-శ్రీకృష్ణేతి . హే శ్రీకృష్ణ తే నమః ఉపకారాననుస్మరతి. బహుధా సంబోధయతి. కృష్ణసఖ అర్జున సఖే. వృష్ణీనాం ఋషభ శ్రేష్ఠ. అవన్యే భూమ్యై ద్రుహ్యంతి యే రాజన్యాస్తేషాంవంశస్య దహన. ఏవమప్యనపవర్గవీర్య అక్షీణప్రభావ గోవింద సంప్రాప్తకామధేన్వైశ్వర్య. గోద్విజసురాణామార్తిహరోఽ వతారో యస్యేతి.(43)

కుంతి ఈ విధముగా భగవంతుని ప్రార్థించి మరల నమస్కరించుచున్నది. ఓ కృష్ణా ! నీకు నమస్కారము. కృష్ణుడు అర్జునునికి, పాండవులకు చేసిప ఉపకారాలను స్మరిస్తూ కృష్ణ సఖ అని సంబోధించినది ఓ అర్జునుని స్నేహితుడా అని మరో విశేషణము ఓ యాదవ శ్రేష్ఠా అని భూమికి భారమై ఆమెకు ద్రోహము చేయుచున్న రాజుల వంశమును దహించువాడా, ఓ గోవిందుడా! కామధేనువువంటి ఐశ్వర్యముకలవాడా గో బ్రాహ్మణ దేవతల బాధలను హరించుటకు అవతరించినవాడా, మహాయోగీశ్వరుడా అందరికిని గురువగు షడ్గుణైశ్వర్య సంపన్నుడవగు ఓ భగవానుడా నీకు నా నమస్కారము. (43)

44. శ్లో. పృథయేత్థం కలపదైః
పరిణూతాఖిలోదయః ।
మందం జహాస వైకుంఠః
మోహయన్నివ మాయయా ॥

టీ:- పృథయేతి. కలాని. మధురాణిపదాని యేషు తైః వాక్యైః పరిణూతః ప్రకటీకృతః అఖిలోతయో మహిమా యస్య సః. ణు

పృథయనగా కుంతి ఆమె చేత మధురమైన పదాలుగల వాక్యములచేత బాగా స్తుతింపబడిన మహిమగల విష్ణువు కృష్ణుడు తన మాయచేత మోహింపబడుచున్న వానివలె మెల్లగా చిరునగవు మొగమున చిందించెను. ఇచట పరియను ఉపసర్గతో కూడిన ణుస్తుతౌ అను ధాతువు యొక్క క్త ప్రత్యయాంత రూపము పరిణుతః అనియే అగును కాని పరిణూతః అని దీర్ఘము వ్యాసులవారు ఈ శ్లోకమున పలుకుట ఆర్షం, యోగమును సూచించును. ఇచట శ్రీకృష్ణుని హాసమే మాయ.(44)

స్తుతావిత్యస్మాత్పరిణుతేతి వక్తవ్యేదీర్ఘశ్ఛందోనురోధేనేతి జ్ఞేయః, మందమీషత్, తస్య హాస ఏవ మాయా. వక్ష్యతి హి.శ్లో. 'హాసో జనోన్మాదకరీ చ మాయా' ఇతి.(44)

45.శ్లో. తాం బాఢమిత్యుపామంత్ర్య
ప్రవిశ్య గజసాహ్వయమ్ ।
స్త్రియశ్చ స్వపురం యాస్యన్ ।
ప్రేమ్ణా రాజ్ఞా నివారితః ॥

టీ:- తామితి. త్వయి మే అనన్యవిషయా మతిరితి యత్ ప్రార్థితం తద్బాఢమిత్యంగీకృత్య రథస్థానాత్ పశ్యాత్ గజసాహ్వయమాగత్య పశ్యాత్తాంచాన్యాశ్చ సుభద్రాప్రముఖాః స్త్రియః ఉపామంత్ర్య అనుజ్ఞాప్య. స్వపురం యాస్యన్. రాజ్ఞా యుధిష్ఠిరేణ ప్రేమ్ణా అత్రైవకం చిత్కాలం నివసేతి సంప్రార్థ్య నివారితః (45)

46. శ్లో. వ్యాసాద్యైరీశ్వరేహాజ్ఞైః
కృష్ణేనాద్భుత కర్మణా ।
ప్రబోధితోఽ పీతిహాసైః
నాబుధ్యత శుచార్పితః ॥

త్వయి మేనన్య విషయామతిః ఉద్వహతీత్ అను కుంతి ప్రార్థనను శ్రీకృష్ణుడు అంగీకరించి, రథస్థానము నుండి హస్తినాపురము నకు వచ్చి తరువాత సుభద్రమున్నగు స్త్రీలకు వెళ్ళి వస్తానని చెప్పి ఆజ్ఞగైకొని తన ద్వారకా నగరానికి వెళ్ళుతున్నవాడై ధర్మరాజు చేత ప్రేమపూర్వకముగా మరికొంతకాలము ఉండుమని ప్రార్థింపబడి నివారింపబడెను.(45)

భీష్ముని నిర్యాణ కథను ప్రస్తావిస్తూ ఉపోద్ఘాతం చెపుతున్నాడు. ధర్మరాజు దుఃఖాక్రాంతుడై వ్యాసాది మునులచేత బోధింపబడి కూడ వివేకము బొందలేదు.ఎందుకనగా తన భక్తుడగు భీష్ముని నిర్యాణమున ధర్మరాజుతోసహా కురుక్షేత్రమునకు వెళ్ళి అతనితోనే ధర్మరాజుకు

టీ:- అథ భీష్మనిర్యాణోత్సవం వక్తుం ఉపోద్ఘాతకథం ప్రస్తౌతి. వ్యాసేతి. వ్యాసాద్యైః ప్రబోధితోఽపి. శుచా వ్యాప్తస్సన్. నా బుధ్యత వివేకం న ప్రాప. ఈశ్వరేహ యా అజ్ఞేః. స్వభక్త భీష్మ నిర్యాణ మహోత్సవాయ రాజ్ఞాసహకురుక్షేత్రంగంతవ్యం. తన్ముఖైనైవాయం ప్రతిబోధనీయ ఇతీశ్వరాభిప్రాయః కార్యద్వయవిధాయక స్తమజాన్న రిత్యర్థః. శ్రీకృష్ణేనాపి ప్రబోధితో నాబుధ్యత. తత్రహేతుః అద్భుతకర్మణా. యథా కురుపాండవసంధానార్థం గతోఽపి యథోచితమేవ వదన్నపి విగ్రహమేవ దృఢీకృతవాన్ ఏవమత్రాపి ప్రబోధయన్నబోధమేవ, దృఢీచకారేత్యర్థః. (46).

ధర్మాలను చెప్పించాలనునది ఈశ్వరేచ్ఛ. దానిని వ్యాసాదులు గుర్తించలేదు ఆశ్చర్యకర్మలు చేయు కృష్ణుని చేత అనేక కథల ద్వారా బోధింపబడి కూడ ధర్మజుడు వివేకము బొందలేదు. కురు పాండవ సంధికి వెళ్ళి కృష్ణుడు సంధి చేసుకొమ్మని చెపుతూ వారి వైరాన్ని యుద్ధాన్నే ప్రోత్సహించాడు అదే విధంగా ధర్మరాజుకు వివేకాన్ని బోధించుచు అజ్ఞానాన్నే కలిగించాడు.(46)

47. శ్లో. ఆహ రాజా ధర్మసుతః
చింతయన్ సుహృదాం వధమ్ ।
ప్రాకృతేనాత్మనా విప్రాః
స్నేహమోహవశం గతః ॥

టీ:- అబోధమేవ ప్రపంచయతి-షడ్భిః. ఆహేతి. ప్రాకృతేన అవివేకవ్యాప్తేన ఆత్మనా చిత్తేన హే విప్రాః. (47).

ధర్మరాజు వివేకాన్ని పొందక దుఃఖించుచున్నాడని వివరిస్తున్నాడు. ఆహ అని మొదలిడి ఆరు శ్లోకాలతో. ధర్మరాజు యుద్ధమున తమచే చంపబడిన సుహృద్బంధువులను గురించి విచారిస్తూ అవివేకముతో కూడిన బుద్ధిచేత అజ్ఞానమునకు లోనై ఈ విధముగా పలికెను.(47)

48. శ్లో. అహో మే పశ్యతాజ్ఞానం
హృది రూఢం దురాత్మనః ।
పారక్యస్యైవ దేహస్య
బహ్వ్యో మేఽ క్షౌహిణీర్హతా ॥

టీ:- అహోఇతి. పారక్యస్యైవ శ్వసృగాలాద్యాహారస్యైవ దేహస్యార్థే మే మయా అక్షౌహిణీః అక్షౌహిణ్యః (అర్షత్వాత్ప్రథమార్థే ద్వితీయా) - అక్షౌహిణీప్రమాణం చ వ్యాసేనోక్తం-శ్లో. "అక్షౌహిణీ ప్రసంఖ్యాతా రథానాం ద్విజసత్తమాః, సంఖ్యాగణనత్త్వజ్ఞైస్సహస్రాణ్యేకవింశతిః, శతాన్యుపరిచైవాష్టౌ తథా భూయశ్చ సప్తతిః, గజానాం చ ప్రసంఖ్యాన మేతదేవ ప్రకీర్తితమ్, జ్ఞేయం శతసహస్రం తు సహస్రాణి నవైవ తు, నరాణామపి పంచాశచ్ఛతాని త్రీణి చైవ హి. పంచషష్టిసహస్రాణి తథాశ్వానాం శతాని చ, దశోత్తరాణి షట్ప్రాహుస్సంఖ్యాతత్త్వవిదో జనాః . ఏతామక్షౌహిణీం ప్రాహుర్యథావదిహ సంఖ్యయా" ఇతి. (48).

ధర్మరాజు బాధపడుతున్నాడు. అయ్యో దుర్మాగుడనగు నా హృదయమున పాదుకొని ఉన్న అజ్ఞానము చూడండి రాజ్యకాంక్ష్యచేత, దేహాభిమానముచేత అనేక అక్షౌహిణీల సేనలను ఎంతో మందిని చంపితినిగదా ఈ శరీరము ఎందుకు ? ఇది పడిపోయిన తరువాత కుక్క నక్కలకు ఉపయోగపడేదేకదా. అక్షౌహిణీ అనగా ఇరువదిఒక్కవేల రథాలు, ఎనిమిది వందల డెబ్బది ఏనుగులు, నూటతొమ్మిది వేల ఏబది మూడు వందల మనుష్యులు, అరువది ఐదువేల ఆరువందల పది గుఱ్ఱములు.(48)

49. శ్లో. బాల ద్విజ సుహృన్మిత్ర
పితృ భ్రాతృ గురుద్రుహః ।
న మే స్యాన్నిరయాన్మోక్షో
హ్యపి వర్షాయుతాయుతైః ॥

పిల్లలు, బ్రాహ్మణులు, సంబంధులు. స్నేహితులు, పితృవ్యులు, చిన్నాన్న పెదనాన్నలు, అన్నదమ్ములు మొదలైన వారిని చంపి ద్రోహము చేసిన నాకు వేల సంవత్సరాలకైనను నరకమునుండి మోక్షము కలుగదు.(49)

టీ:- బాలేతి. సుహృదస్సంబంధినః. మిత్రాణి సఖాయః పితరోఽత్ర పితృవ్యాః. (49).

50 శ్లో. నైనో రాజ్ఞః ప్రజాభర్తుః
ధర్మే యుద్ధే వధో ద్విషామ్ ।
ఇతి మే న తు బోధాయ
కల్పతే శాసనం వచః ॥

ధర్మశాస్త్రము చెప్పినందున ధర్మయుద్ధమున శత్రువులను చంపినా దోషములేదు కదా అంటే దానికి చెపుతున్నాడు. ఆ వచనము తన ప్రజలను ఇతరులు బాధించినపుడు చంపవచ్చునని ఆజ్ఞయొసగును, కాని దుర్యోధనుడు చక్కగా ప్రజలను పాలించుచుండగా కేవలము నా స్వార్థబుద్ధితో రాజ్యలోభము వలననే వారు చంపబడినందున అది నా పాపమే యగును.(50)

టీ:- నేతి. ద్విషాం వధః ఏనః పాపం న భవతీతి యచ్ఛాసనం శిక్షారూపం వచః కుతోనుకల్పతే? యతస్తద్వచః ప్రజాభర్తురేవ. అయం భావః. స్వప్రజానామప్యన్యతో బాధే వధే ప్రసక్తే తద్వధోఽనుజ్ఞాతః. దుర్యోధనేన తు ప్రజాయాం పాల్యమానాయాం మయా కేవలం రాజ్యలోభేన హతత్వాత్, పాపమేవేదమితి. కించ. (50)

51. శ్లో. స్త్రీణాం మద్ధతబంధూనాం
ద్రోహోఽయోవిహోత్థితః ।
కర్మభిర్గృహమేధియైః
నాహం కల్పో వ్యపోహితుమ్ ॥

అంతేకాకుండా యుద్ధమున పురుషులను చంపుట ధర్మమయితే కావచ్చునుకాని నాచేత చంపబడిన బంధువులుగల స్త్రీలకు ఏ ద్రోహమైతే చేయబడినదో దానిని తొలగించుటకు గృహస్థాశ్రమ విహితములైన కర్మలు సరిపోవు.(51)

టీ :- స్త్రీణామితి. యుద్ధే పుంసాం వధో భవతు నామ ధర్మః. స్త్రీణాం

తు మయా హతాః బంధవో యాసాం తాసాం. యో౽సౌ ద్రోహః అనుద్దిష్టో౽పృపస్థితః. తం వ్యపోహితుం అపాకర్తుం కల్యస్సమర్థో న భవామి. గృహమేధీయైర్గృహాశ్రమవిహితైః. (51)

52. శ్లో. యథా పంకేన పంకాంభః
సురయా వా సురాకృతమ్ ।
భూతహత్యాం తథైవైనాం
న యజ్ఞో మార్ష్టుమర్హతి ॥

టీ:- ననుచ శ్రు. 'సర్వం పాప్మానం తరతి తరతి బ్రహ్మహత్యాం యో౽శ్వమేధేన యజతే, యఉచైవ మేవం వేద'ఇతిశ్రుతేః. పాపమశ్వమేధేన నశ్యేదిత్యాశంక్య, అవివేకవిజృంభితం హేతువాద మాశ్రిత్య, నిరాకరోతి-యథేతి. యథా పంకేన పంకాంభో నమృజ్యతే. యథావాసురాలేపకృతం అపవిత్రత్వం బహ్వ్యాసురయా న మృజ్యతే, తథైవ భూతహత్యాం ఏనాం ప్రమాదతో జాతాం. బుద్ధిపూర్వహింసాప్రాయైర్యజ్ఞైర్మాష్టుం శోధయితుం నార్హ తీతి. (52)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం సంహితాయాం ప్రథమేస్కంధే భావార్థదీపికాయాం అష్టమోధ్యాయః**

అశ్వమేధయాగము చేసినచో బ్రహ్మహత్యాది మహాపాపములు తొలగునని శ్రుతి చెపుతుందికదా అనుశంకను వేసికొన్న ధర్మరాజు, అవివేకంతో ఏర్పడిన నాస్తిక హేతువాదాన్ని ఆశ్రయించి నిరాకరిస్తున్నాడు. "యథా" అని . ఏ విధముగా సురాపానం కొద్దిగా చేయడముతో ఏర్పడిన పాపం బాగా తాగితే తొలగదో, అదే విధంగా పొరపాటున జరిగిన భూతహత్యా పాపాన్ని తొలగించుటకు యజ్ఞాదులతో, బుద్ధి పూర్వకముగా నేను చేసిన జ్ఞాతివధ పాపాన్ని తొలగించుకోబడదు. అంటిన బురదను తొలగించుకొనుటకు బురదతో కడిగినట్లగును. అనగా శత్రువధ రూపపాపము అనుభవించవలసినదే అని ధర్మరాజు పశ్చాత్తప్తుడయ్యెను.(52)

**శ్రీమద్భాగవతము యొక్కప్రథమస్కంధ అష్టమాధ్యాయమునకు శ్రీధరీయవ్యాఖ్యానుసార ఆంధ్రానువాదము ముగిసినది.**

## నవమోఽధ్యాయః

1. శ్లో. ఇతి భీతః ప్రజాద్రోహాత్ ।
సర్వధర్మ వివిత్సయా ।
తతో వినశనం ప్రాగాత్ ।
యత్ర దేవవ్రతో పతత్ ॥

టీ :– శ్లో. యుధిష్ఠిరాయ భీష్మేణ సర్వధర్మ నిరూపణమ్ శ్రీ కృష్ణస్య స్తుతిర్ముక్తిర్నవమే తస్య వర్ణ్యతే. యదర్థం తస్యావివేకః శ్రీకృష్ణేన సంవర్ధితః తద్దర్శయతి – ఇతీతి. సర్వేషాం ధర్మాణాం. వివిత్సయా వేత్తుమిచ్ఛయా. వినశనం కురుక్షేత్రం. దేవవ్రతో భీష్మః. (1)

2. శ్లో. తదా తద్భ్రాతరస్సర్వే ।
సదశ్వైస్స్వర్ణభూషితైః ।
అన్వగచ్ఛన్ రథైర్విప్రాః ।
వ్యాసధౌమ్యాదయస్తథా ॥

3. శ్లో. భగవానపి విప్రర్షే ।
రథేన సధనంజయః ।
సతైర్వ్యరోచత నృపః ।
కుబేర ఇవ గుహ్యకైః ॥

## నవమాధ్యాయము.

ఈ విధముగా ప్రజాద్రోహము వలన, జ్ఞాతివధపాపము వలన భయపడిన ధర్మరాజు అన్ని ధర్మాలు తెలిసికొనవలెనన్న ఇచ్ఛచేత కురుక్షేత్రమునకు, దేవవ్రతుడు భీష్ముడు యుద్ధరంగములో పడిపోయి స్వేచ్ఛా మరణమునకై శరతల్పగతుడై, ఉత్తరాయణము కొరకు నిరీక్షించుచుండు చోటికి ధర్మజుడు చేరెను. (1)

బంగారు సొమ్ములతో భూషింపబడిన మంచి అశ్వములు పూన్చిన రథములలో, ధర్మజుని సోదరులును వ్యాసుడు, ధౌమ్యుడు మొదలగు వారును బ్రాహ్మణోత్తములును ధర్మరాజును అనుసరించి వెళ్లిరి. (2)

ఓ బ్రాహ్మణ శ్రేష్ఠుడా శౌనకా శ్రీకృష్ణుడు కూడ అర్జునునితో కలిసి రథములో ధర్మరాజు ననుసరించి వెళ్ళెను. వారితో ఆ ధర్మరాజు యక్షులతో వెంబడిపబడిన కుబేరునివలె ప్రకాశించెను. (3)

టీ :- తదేతి. సంతః శ్రేష్ఠా అశ్వా యేషు తైః రథైః.(2,3)

4. శ్లో. దృష్ట్వా నిపతితం భూమౌ
దివశ్చ్యుతమివామరమ్ ।
ప్రణేముః పాండవా భీష్మం
సానుగాస్సహ చక్రిణా ॥

స్వర్గము నుండి జారిన దేవతవలె, భూమిమీద పడియున్న ఆ భీష్ముని, పాండవులు వారి పరివారము, శ్రీకృష్ణుడును నమస్కరించిరి. 4)

టీ :- సానుగాః పరివారసహితాః (4)

5. శ్లో. తత్ర బ్రహ్మర్షయస్సర్వే
తథా దేవర్షిసత్తమాః ।
రాజర్షయశ్చ తత్రాసన్
ద్రష్టుం భరతపుంగవమ్ ॥

బ్రహ్మర్షులు, దేవర్షులు, రాజర్షులును భరతవంశ శ్రేష్ఠుడగు భీష్ముని చూచుటకు అచటికి వచ్చియుండిరి.(5)

టీ :- తత్రేతి. తత్ర తదా తత్రాసన్ తత్క్షణ ఏవ ఆగతా ఇత్యర్థః. భరతపుంగవం భీష్మం.(5)

6. శ్లో. పర్వతో నారదో ధౌమ్యో
భగవాన్బాదరాయణః ।
బృహదశ్వో భరద్వాజః
సశిష్యో రేణుకాసుతః ॥

టీ:- పర్వతఇతి. రేణుకాసుతః పరశురామః(6)

పర్వతుడు, నారదుడు, ధౌమ్యుడు, పూజ్యుడగు వేదవ్యాసమహర్షి, బృహదశ్వుడు, భరద్వాజుడు, శిష్యులతో సహా పరశురాముడు భీష్ముని చూచుటకు వచ్చి యుండిరి.(6)

7. శ్లో. వసిష్ఠ ఇంద్రప్రమదః
త్రితో గృత్స్నమదోఽసితః ।
కక్షీవాన్ గౌతమోఽత్రిశ్చ
కౌశికోఽథ సుదర్శనః ॥

టీ:- వసిష్ఠ ఇతి, కౌశికో విశ్వామిత్రః.(7)

వసిష్ఠుడు, ఇంద్రప్రమదుడు, త్రితుడు, గృత్స్నమదుడు, అసితుడు, కక్షీవంతుడు, గౌతముడు, అత్రి, కౌశికుడు మఱియు సుదర్శనుడు భీష్ముని చూచుటకు వచ్చిరి.(7)

8. శ్లో. అన్యే చ మునయో బ్రహ్మన్
బ్రహ్మరాతాదయోఽమలాః ।
శిష్యైరుపేతా ఆజగ్ముః
కాశ్యపాంగిరసాదయః ॥

టీ:- అన్య ఇతి. బ్రహ్మరాతః శుకః అంగిరసో బృహస్పతిః. (8)

ఓ శౌనకా ! ఇంకను ఎందరో ఇతర మునులు, శ్రీశుక మహర్షి, కాశ్యపాంగిరసాదులు వారి శిష్యులును భీష్ముని సమీపమునకు వచ్చిరి.(8)

9. శ్లో. తాన్ సమేతాన్మహాభాగాన్
ఉపలభ్య వసూత్తమః ।
పూజయామాస ధర్మజ్ఞో
దేశ కాలవిభాగవిత్ ॥

టీ:- వసూత్తమో భీష్మః. దేశకాల విభాగ విదిత్యుత్థాతుమశక్యత్వాచ్ఛయాన ఏవ మనసా వాచా చ పూజయామాసేత్యభిప్రాయః (9)

భీష్ముడు దేశ కాలవిభాగాలను తెలిసినవాడు కావున లేచే శక్తి లేనప్పటికి పరుండియే ఆ వచ్చిన వారందరిని మనస్సుతో, వాక్కులతోను పూజించెను.(9)

10. శ్లో. కృష్ణం చ తత్ప్రభావజ్ఞః
ఆసీనం జగదీశ్వరమ్ ।
హృదిస్థం పూజయామాస
మాయయోపాత్త విగ్రహమ్ ॥

టీ:- హృదిస్థం సంతం పురతః ఆసీనం పూజయామాస. (10)

శ్రీకృష్ణుని ప్రభావమును మహిమను తెలిసినవాడైన భీష్ముడు, మనస్సులోనే ఉన్నను ఎదురుగా కూడ వచ్చి కూర్చొనియున్నట్టి మాయామానుష విగ్రహుడైన శ్రీకృష్ణుని పూజించెను.(10)

11.శ్లో. పాండుపుత్రానుపాసీనాన్
ప్రశ్రయ ప్రేమసంగతాన్ ।
అభ్యాచష్టానురాగాస్రైః
అంధీభూతేన చక్షుషా ॥

వినయము, ప్రేమ కలిగి తన దగ్గర కూర్చొని ఉన్న పాండురాజు కుమారులను చూచి భీష్మునికి, ప్రేమతో కన్నీళ్ళు కమ్మగా, గుడ్డివైన కనపడని కళ్ళతోనే చూస్తూ భాషించెను. పాండవులతో మాట్లాడినపుడు భీష్మునికి వారియందున్న ప్రేమతో కన్నులలో నీరు కమ్ముకొనెనని భావము.(11)

టీ:- పాండు పుత్రానితి. ఉపాసీనాన్ సమీపే ఉపవిష్టాన్. ప్రశ్రయో వినయః. ప్రేమ స్నేహః.తాభ్యాం సంగతాన్ ఉపపన్నాన్. పాఠాంతరే. సన్నతాన్ అవనతాన్ అభ్యచష్ట అభ్యభాషత. అను రాగాస్రైః స్నేహాశ్రుభిః. అంధీభూతేన చక్షుషా. ఉపలక్షితః. దదర్శేతివా.(11)

12. శ్లో. అహో కష్టమహోఽన్యాయ్యం
యద్యూయం ధర్మనందన ।
జీవితం నార్హథ క్లిష్టం
విప్రధర్మాచ్యుతాశ్రయాః ॥

ఆ మాట్లాడిన విషయమును చెపుతున్నాడు. అహో అని పదకొండు శ్లోకాలచేత. ఓ ధర్మనందనా ! అయ్యో ! మీకు ఎంత కష్టము కలిగినది, ఎంత అన్యాయము జరిగినది. ఇట్టి కష్టమైన జీవితాన్ని మీరు గడపదగినవారు కారు. శ్రీకృష్ణుని ఆశ్రయించిన కూడా బ్రాహ్మణ ధర్మమును, భిక్షాటనమును అవలంబించి మీరు జీవనము గడపవలసివచ్చినది.(12)

టీ:- అభిభాషణమాహ - ఏకాదశభిః. అహో ఇతి. హే ధర్మనందన క్లిష్టం యథా భవత్యేవం జీవితుం నార్హథయూయమితి యత్. ఏతత్ అహో కష్టం జుగుప్సితం. అహో అన్యాయ్యం చైతత్. యతోయూయం. విప్రా ధర్మః అచ్యుతశ్చ ఆశ్రయో యేషాం తే. (12)

13. శ్లో. సంస్థితేఽతిరథే పాండౌ
పృథా బాలప్రజా వధూః ।
యుష్మత్కృతే బహూన్ క్లేశాన్
ప్రాప్తా తోకవతీ ముహుః ॥

అతిరథుడైన పాండు మహారాజు మృతినొందగా, చిన్న పిల్లలుగల మీ తల్లి కుంతి కూడా మీ కొఱకు మాటి మాటికి అనేక కష్టాలను అనుభవించినది.(13)

టీ:- కించ. సంస్థితేతి సంస్థితే మృతే. బాలాః ప్రజాః యస్యాస్సా వధూశ్చేతి దైన్యం దర్శితం. తోకాన్యపత్యాని తద్వతీ. అపత్యైస్సహ క్లేశాన్ ప్రాప్తేత్యర్థః(13)

14 .శ్లో. సర్వం కాలకృతం మన్యే
భవతాం చ యదప్రియమ్ ।
స కాలో యద్వశే లోకో
వాయోరివ ఘనావలిః ॥

పాండవుల దుఃఖాన్ని రెండు శ్లోకాలతో వివరిస్తున్నాడు భీష్ముడు. మీకు ఇంతటి కష్టము, అనిష్టము సంప్రాప్తించుట, ఇదంతయును కాలకృతము అని భావింతును. మేఘపంక్తి వాయువునకు అధీనమయి ఉన్నట్లు లోకమంతయును కాలమునకు వశమైయుండును .(14)

టీ:- కాలకృతత్వేన శోకం నివారయతి-ద్వాభ్యాం సర్వమితి. భవతామపి. యద్వశే యస్య వశే వర్తతే.(14)

15 .శ్లో. యత్ర ధర్మసుతో రాజా
గదాపాణిర్వృకోదరః ।
కృష్ణోஉస్త్రీ గాండీవశ్చాపః
సుహృత్కృష్ణస్తతో విపత్ ॥

అఘటితఘటనా సామర్థ్యము కలది కదా కాలము అని అంటున్నాడు భీష్ముడు 'యత్ర' అని. ధర్మనందనుడు రాజై ఉండి, భీముడు గదాధారియై, అర్జునుడు అస్త్రధారిగా గాండీవ ధన్విగా ఉండి, కృష్ణుడు స్నేహితుడుగాగల మీకు కూడా (పాండవులకు) విపత్తులు కలిగెను. కాలము చాలా గొప్పప్రభావము కలది. పుణ్యము, శరీరబలము, అస్త్రనైపుణ్యము, మంచి శస్త్ర సంపత్తి, దైవానుగ్రహము ఇవన్ని ఉన్నను పాండవులు విపత్తులనొందిరి.(15)

టీ:- అహో దుర్ఘటఘటనాపటుః కాల ఇత్యాహ-యత్రేతి. కృష్ణః అర్జునః. అస్త్రీ ధన్వీ. తతః తత్రాపి విపత్ పుణ్యశరీర బలాస్త్రనైపుణ్య శస్త్రదైవసంపత్తావపీత్యర్థః. (15)

16. శ్లో. న హ్యస్య కర్హిచిద్రాజన్
పుమాన్ వేద విధిత్సితమ్ ।
యద్విజిజ్ఞాసయా యుక్తాః
ముహ్యంతి కవయోఽపి హి॥

టీ:- నను శ్రీకృష్ణం కథం కాలోఽతిక్రమేదిత్యపేక్షాయామాహ - నహీతి. అస్య కృష్ణస్యేత్యంగుళ్యా నిర్దిశతి-విధిత్సితం కర్తుమిష్టం. యస్య విదిత్సితస్య విజిజ్ఞాసయా.(16)

కాలమెట్లు అతిక్రమించుననగా చెపుతున్నాడు. ఓ ధర్మరాజా! ఈ కాలము చేయదలచిన దాన్ని ఎవ్వడు తెలిసికొనలేడు. భగవంతుని సంకల్పాన్ని, కాలము చేయదలచిన దానిని విద్వాంసులు కూడా అజ్ఞానంలోపడి తెలిసికొనలేరు.(16)

17. శ్లో. తస్మాదిదం దైవతంత్రం
వ్యవస్య భరతర్షభ ।
తస్యానువిహితోఽనాథాః
నాథ పాహి ప్రజాః ప్రభో ।

టీ:- తస్మాదితి. దైవతంత్రం ఈశ్వరాధీనం. వ్యవస్య నిశ్చిత్య. తస్యేశ్వరస్యానువిహితః అనువర్తీ సన్. కర్తరిక్తః. హేనాథ ! కులపరంపరాగత స్వామిన్. ప్రభో సమర్థ. అనాథాః ప్రజాః పాహి.(17)

ఓ యుధిష్ఠిరా ! ఇది దైవాధీనమైన పనియని నిశ్చయించుకొని, ఆ ఈశ్వరుని అనుసరించి దైవము వలన విధింపబడిన రాజధర్మముగల వాడవై, వంశపారంపర్యముగా ఏర్పడిన అధికారమును పొందినవాడవై, సమర్థుడవై, రాజుగా, నాథుడవుగా దీనులు, దిక్కులేని వారైన ఈ ప్రజలను కాపాడుము. ఇది నా అభిమతము.(17)

18. శ్లో. ఏష వై భగవాన్ సాక్షాద్
ఆద్యో నారాయణః పుమాన్ ।
మోహయన్మాయయా లోకం
గూఢశ్చరతి వృష్ణిషు ॥

టీ:- అనువిధేయః పరమేశ్వరశ్చ శ్రీకృష్ణ ఏవేత్యాహ- ఏష ఇతి. ఏష ఏవ భగవాన్ సర్వేశ్వరః యతః ఆద్యః పుమాన్. యతో నారాయణస్సాక్షాత్.(18)

మనకు అనుసరింపదగినవాడు రక్షకుడు శ్రీకృష్ణుడేయని చెపుతున్నాడు. ఈ కాలము ఆది పురుషుడైన కృష్ణభగవానుడైన సర్వేశ్వరుడైన, సాక్షాత్తు నారాయణుడే.తన మాయతో లోకాన్ని మోహింపచేసి యాదవులలో రహస్యముగా సంచరించుచున్నాడు.(18)

19. శ్లో. అస్యానుభావం భగవాన్
వేద గుహ్యతమం శివః ।
దేవర్షిర్నారదః సాక్షాత్
భగవాన్ కపిలో నృపః ॥

టీ:- తదుపపాదయతి-అస్యేతి. అనుభావం ప్రభావం. (19)

పై విషయమునే వివరిస్తున్నాడు 'అస్య' అని. ఓ రాజా ! రహస్యమైన ఈ కృష్ణుని ప్రభావమును, శివుడు, దేవర్షి నారదుడు, సాక్షాత్తుగా భగవదవతారమైన కపిల మహర్షి మున్నగువారు తెలిసికొనగలరు. ఇతరులు తెలిసికొనుట అసాధ్యము.(19)

20. శ్లో. యం మన్యసే మాతులేయం
కృష్ణం మిత్రం సుహృత్తమమ్ ।
అకరోః సచివం దూతం
సౌహృదాదథ సారథిమ్ ॥

ఓ ధర్మరాజా ! నీవు అజ్ఞానముచే కృష్ణుని, దేవకి కుమారుడని మేనబావయని, మంచి చేసే ఉత్తమ వ్యక్తి అని,స్నేహితుడని ప్రత్యుపకారము కోరక సహాయంచేసేవాడని, అంతేకాక విశ్వాసము

టీ:- యమితి. త్వమజ్ఞానాత్ యం ఏవం మన్యసే.మాతులాన్యాః దేవక్యాస్సుతం.ప్రియం ప్రీతివిషయం మిత్రం ప్రీతికర్తారం సుహృత్తమం ఉపకారానపేక్ష్యోపకారకం చ. సౌహృదాత్. స్నేహాత్ అకరోః కృతవానపి. సచివం మంత్రిణం చ.(20)

ప్రేమభావముతో మంత్రియని, దూతయని, సారథియని కూడా భావించితివి కాని భగవంతుడని భావించలేదు.(20)

21. శ్లో. సర్వాత్మనః సమదృశో
హ్యద్వయస్యానహంకృతేః ।
తత్కృతం మతివైషమ్యం
నిరవద్యస్య న క్వచిత్ ॥

టీ:- నన్వీశ్వరశ్చేత్కథం నీచే సారథ్యాదౌ ప్రవృత్తస్త్రాహ-సర్వాత్మన ఇతి. తత్కృతం నీచోచ్చకర్మకృతం.మమ యోగ్యమయోగ్యమితి వైషమ్యం నాస్తి. కుతః? నిరవద్యస్య రాగాదిశూన్యస్య. తత్కుతః? అనహంకృతే, తచ్చ కుతః?అద్వయస్య. తదపి కుతః? సమదృశః తత్రాపి హేతుః, సర్వాత్మనః. యథేష్టం వా హేతుమద్భావః.(21)

శ్రీకృష్ణుడు ఈశ్వరుడే అయితే అల్పములైన సారథ్యాది కార్యములను ఎట్లు ఆచరించెను? అనుదానికి చెపుతున్నాడు 'సర్వాత్మనః' అని. సర్వాంతర్యామియగు శ్రీకృష్ణపరమాత్మ అంతటను సమదృష్టి కలవాడు, ఈ పని నాకు యోగ్యము, ఇది అయోగ్యము అనే విచారము లేనివాడు. అతనికి రాగద్వేషాదులు లేవు. అహంకారము లేదు. అతడు అద్వితీయుడు, అతనికి భేదబుద్ధి లేదు. ఈ శ్లోకమున సర్వాంతర్యామిత్వాది ధర్మములకు మతివైషమ్యా భావమునకు హేతుహేతుమద్భావము తెల్పబడినది.(21)

22 .శ్లో. తథాప్యేంకాంత భక్తేషు
పశ్య భూపానుకంపితమ్ ।
యన్మేఽసూంస్త్యజతః సాక్షాత్
కృష్ణో దర్శనమాగతః ॥

ఓ రాజా ! అందరి విషయమున సమత్వము కలవాడే అయినను ఈ కృష్ణుడు తనను అనన్యమైన భక్తితో ఆరాధించు భక్తుల విషయమున మిక్కిలి దయగలవాడై ప్రవర్తించును. ఏలయన ప్రాణాలను వదలుచున్న నాకిపుడు సాక్షాత్తు దర్శనమిచ్చెనుగదా. ఆహా ! ఎంత భక్త వత్సలుడో కదా ! (22)

టీ:- తథేతి. తథాపి సమత్వేఽపి హే భూప. అనుకంపితం అనుకంపాం.(22)

23. శ్లో. భక్త్యాఽఽవేశ్య మనో యస్మిన్
వాచా యన్నామకీర్తయన్ ।
త్యజన్ కలేబరం యోగీ
ముచ్యతే కామకర్మభిః ॥

భక్తితో ఆ కృష్ణుని యందు మనస్సును ఉంచి, వాక్కుతో ఆతని నామాన్ని ఉచ్చరించుచూ, తన శరీరాన్ని వదలెడు యోగి సమస్త కామకర్మలనుండి విముక్తుడై మోక్షాన్ని పొందగలుగును.(23)

24. శ్లో. స దేవదేవో భగవాన్ ప్రతీక్షతాం
కలేబరం యావదిదం హినోమ్యహమ్ ।
ప్రసన్నహాసారుణ లోచనోల్లసన్
ముఖాంబుజో ధ్యానపథశ్చతుర్భుజః ॥

టీ:- ఇదానీం స్వస్యదేహత్యాగపర్యంతం కృష్ణావస్థానం ప్రార్థయతే – భక్త్యేతి – ద్వాభ్యాం స ఇతి. యావదితి. విలంబంద్యోతయతి–అహం హినోమి త్యజామీతి స్వాతంత్ర్యం. ఇదమిత్యనాత్మ త్వేన జ్ఞాతం ప్రసన్నహాసేన అరుణలోచనాభ్యాం చ ఉల్లసత్ రుచిరం ముఖాంబుజం యస్య ధ్యానస్య పంథాః విషయః యోఽన్యైశ్చింత్యతే కేవలం, సోఽగ్రతః సితస్సన్. మాం ప్రతీక్షతామిత్యర్థః.(23,24)

అట్టి దేవదేవుడైన శ్రీకృష్ణుడు, ప్రసన్నమైన చిరునగవు కలవాడు, ఎఱ్ఱని కన్నులతో అందమైన ముఖముగలవాడు, నాలుగు చేతులు గలవాడు, ధ్యానమునకు విషయమై, ఇతరములను చింతింపనీయక ముందుండువాడు, నేడు నా ముందుండి నేను శరీరాన్ని వదలు వరకు ఎదురుచూచుగాక. ఈ శరీరాన్ని వదలువరకు అనుటలో శరీరము తాను (ఆత్మ) కాదన భావము సూచింపబడినది.(24)

**శ్రీసూత ఉవాచ.**

25. శ్లో. యుధిష్ఠిరస్తదాకర్ణ్య
శయానం శరపంజరే ।
అపృచ్ఛద్వివిధాన్ ధర్మాన్
ఋషీణామనుశృణ్వతామ్ ॥

టీ:- యుధిష్ఠిరఇతి. తత్సానుకంపం వాక్యమాకర్ణ్య. (25)

**సూతులవారు చెపుతున్నారు.**

యుధిష్ఠిరుడు ఆ భీష్ముని పలుకులు విని శర పంజరమున పరుండియున్న భీష్ముని, అనేక ధర్మములు అడిగెను. భీష్ముడు వచించెను. ఇవియే భారతమున శేషధర్మములని ప్రసిద్ధిగాంచినవి. వీనిని ఆ చుట్టుపక్కల నుండి చేరిన ఋషులును వినుచుండిరి. (25)

26. శ్లో. పురుషస్వభావవిహితాన్
యథావర్ణం యథాశ్రమమ్ ।
వైరాగ్యరాగోపాధిభ్యామ్
ఆమ్నాతోభయలక్షణాన్ ॥

టీ:- పురుష ఇతి. పురుష స్వభావవిహితాన్ నరజాతిసాధారణాన్. వర్ణయా మాసేతి తృతీయేనాన్వయః. యథావర్ణం వర్ణధర్మాన్ యథాశ్రమమాశ్రమధర్మాంశ్చ. వైరాగ్యరాగాభ్యాముపాధిభ్యాం. క్రమేణామ్నాతముభయం నివృత్తిప్రవృత్తిరూపం లక్షణం యేషాం తాన్.(26)

వ్యక్తి స్వభావముతో విధించబడిన మానవజాతి సాధారణ ధర్మాలను, బ్రహ్మచర్యాది ఆశ్రమధర్మాలను, వైరాగ్యముతో, అనురాగముతో ఆచరింపబడు నివృత్తి, ప్రవృత్తి ధర్మములను అన్నింటిని ధర్మరాజు అడిగెను. (26)

27. శ్లో. దానధర్మాన్ రాజధర్మాన్
మోక్షధర్మాన్ విభాగశః ।
స్త్రీధర్మాన్ భగవద్ధర్మాన్
సమాసవ్యాసయోగతః ॥

టీ:- పునస్తత్రైవ విశేషమాహ-దానేతి. మోక్షధర్మాన్ శమదమాదీన్. భగవద్ధర్మాన్ హరితోషణాన్ ద్వాదశ్యాదినియమరూపాన్. సమాస వ్యాసౌ సంక్షేపవిస్తారౌ, తావేవ యోగావుపాయౌ తతస్తాభ్యాం. (27)

మరల ఆ ధర్మముల విశేషములను తెలుపుతున్నాడు. దానధర్మాలను, రాజధర్మాలను, మోక్షధర్మాలను, అంతరింద్రియ, బహిరింద్రియ నిగ్రహధర్మాలను, భగవద్ధర్మాలను శ్రీహరిని సంతోషపెట్టు వానిని, ఏకాదశి, ద్వాదశి మొదలగు వ్రతనియమము లను, స్త్రీధర్మాలను, సంక్షేపముగా, విస్తారముగా ఉన్న వాటిని వివరించుమని ధర్మరాజు భీష్ముని అడిగెను.(27)

28. శ్లో. ధర్మార్థకామమోక్షాంశ్చ
సహోపాయాన్ యథామునే ।
నానాఖ్యానేతిహాసేషు
వర్ణయామాస తత్త్వవిత్ ॥

టీ:- ధర్మేతి. ధర్మాదీంశ్చ యథా యథాధికారం. ప్రతినియతోపాయ సహితాన్యథావత్ నానాఖ్యానేష్వితిహాసేషు, యథా యథా ప్రతిపాదితా స్తథా వర్ణయామాస. (28)

ఓ శౌనకా ! తత్త్వవేత్తయగు భీష్ముడు ధర్మరాజడిగిన ధర్మార్థకామమోక్షాలను వాటి ఉపాయాలను అనేక కథలయందు, ఇతిహాసములందు వర్ణింపబడిన వివిధ ధర్మాలను ధర్మజునకు బోధించెను.(28)

29. శ్లో. ధర్మాన్ ప్రవదతస్తస్య
స కాలః ప్రత్యుపస్థితః ।
యో యోగినశ్ఛందమృత్యోః
వాంఛితస్తూత్తరాయణః ॥

టీ:- ధర్మానితి. ఛందేనేచ్ఛయా మృత్యుర్యస్య.(29)

ఈ విధముగా ధర్మాలను ధర్మరాజుకు బోధిస్తుండగా స్వేచ్ఛా మరణముగల యోగి భీష్ముడు కోరిన దేహత్యాగమునకు అనుకూలమైన ఉత్తరాయణ పుణ్యకాలము వచ్చెను.(29)

30. శ్లో. తదోపసంహృత్య గిరః సహస్రపో (ణీః) ।
విముక్త సంగం మన ఆదిపురుషే ।
కృష్ణే లసత్పీతపటే చతుర్భుజే
పురఃస్థితే మీలిత దృగ్వ్యధారయత్ ॥

టీ:- తదేతి. సహస్రణీః యుద్ధే సమీపస్థాన్ సహస్రంరథినః నయతి పాలయతీతి సహస్రణీః భీష్మః. పహస్రిణీరితి పాఠే సహస్రార్థవతీర్గిరః లసంతౌ పీతౌ పటౌ యస్య తస్మిన్. ఆమీలితదృగేవ మనః వ్యధారయత్.(30)

అపుడు వేయిమంది రథికులను పాలించే రథికుడైన భీష్ముడు తన బహుముఖములు అనేకాగ్రములైన వాక్కులను ఉపసంహరించి, ఆదిపురుషుడు, మెరయుచున్న పచ్చని పీతాంబరమును ధరించిన, చతుర్భుజుడు, తన ముందున్న శ్రీకృష్ణుని చూచుచు తెరచిన కన్నులను, మూసికొని ఇతర సాంగత్యములను వదిలి ఆతనియందే మనస్సును నిలిపెను. ఇచట సహస్రణీః అని పాఠాంతరము కలదు అపుడు ధర్మవిషయములతో, ప్రార్థనలతో కూడిన తన మాటలను ఉపసంహరించెనని అర్థము.(30)

31. శ్లో. విశుద్ధయా ధారణయా హతా శుభః
తదీక్షయైవాశుగతాయుధవ్యథః ।
నివృత్తసర్వేంద్రియవృత్తివిభ్రమః
తుష్టావ జన్యం విసృజన్ జనార్దనమ్ ॥

టీ:- విశుద్ధయేతి. అనయైవ విశుద్ధయా ధారణయా ధ్యానవిశేషేణ హతం అశుభం యస్య సః. తస్య కృష్ణస్యేక్షయా కృపాదృష్ట్యైవ గతా అయుధవ్యథా యస్య సః. అతఏవ నివృత్తసర్వేంద్రియవృత్తీనాం విభ్రమో వివిధం భ్రమణం యస్మాత్సః. జన్యం దేహం. విసృజన్ జనార్దనమస్తౌత్ (31)

తన విశుద్ధమైన ధారణచేత, శ్రీకృష్ణ విశ్వరూప ధ్యానముచేత సమస్త అశుభములు తొలగగా ఆ కృష్ణుని కటాక్షముచేతనే ఆయుధముల వలన కలిగిన వ్యథ తొలగగా, సమస్తేంద్రియప్రవృత్తులు తొలగగా తన శరీరాన్ని వదలుతూ ఆ భీష్ముడు శ్రీకృష్ణుని స్తుతించెను. (31)

**శ్రీ భీష్మకృత శ్రీకృష్ణ స్తుతి.**

**శ్రీ భీష్మ ఉవాచ.**

32. శ్లో. ఇతి మతిరుపకల్పితా వితృష్ణా ।
భగవతి సాత్త్వతపుంగవే విభూమ్ని ।
స్వ సుఖముపగతే క్వచిద్విహర్తుమ్ ।
ప్రకృతిముపేయుషి యద్భవప్రవాహః ॥

టీ:- పరమఫలరూపాం శ్రీకృష్ణే రతిం ప్రార్థయమానః. స్వకృతమర్పయతి ఇతీతి. ఇతి నానాధార్మాద్యుపాయైమతిర్మనోధారణ

**భీష్ముడు పలుకుచున్నాడు.**

ఉత్కృష్టమగు ఫలాన్ని ఇచ్చే శ్రీకృష్ణునియందు అనురాగాన్ని కోరుతూ మొదట తాను చేసిన వ్యవహారమునంతటిని ఇతి అని భగవంతునికి అర్పిస్తున్నాడు. అనేక ధర్మాది ఉపాయములచేత, సాధనలచేత ఏ కోరికలు లేని నా బుద్ధి షడ్గుణైశ్వర్య సంపన్నుడు, యదువంశశ్రేష్ఠుడు, అందరికన్న గొప్ప మహిమకలవాడు అగు శ్రీకృష్ణునియందు నిలుచుగాక పరమానంద స్వరూపాన్నిపొంది కూడా ఒకప్పుడు విలాసముగా క్రీడించుటకై యోగమాయను ఆశ్రయించి, స్వస్వరూపమును మరచిన జీవుడై, అతనికై సృష్టి పరంపర

లక్షణా ఉపకల్పితా సమర్పితా క్వ? సాత్వతానాం పుంగవే శ్రేష్ఠే భగవతి. వితృష్ణా నిష్కామా. అవితృష్ణేతి వా ఛేదః, కృష్ణే అవితృప్తేత్యర్థఃవిగతో భూమా యస్మాత్మస్మిన్. యమపేక్ష్యాన్యత్ర మహత్త్వం నాస్తీత్యర్థఃతదేవ పరమైశ్వర్యమాహ - స్వసుఖం స్వరూపభూతం పరమానందం. ఉపగతే ప్రాప్తవత్యేవ. క్వచిత్కదాచిద్విహర్తుం క్రీడితుం. ప్రకృతిముపేయుషి స్వీకృతవతి. న తు స్వరూపతిరోధానేన జీవవత్పారతంత్ర్య మిత్యర్థః. విహర్తుమిత్యుక్తం ప్రపంచయతి-యత్ యతః ప్రకృతేఃభవప్రవాహః సృష్టేః పరంపరా భవతి.(32).

33. శ్లో. త్రిభువనకమనం తమాలవర్ణం
రవికరగౌరవరాంబరం దధానే ।
వపురలకకులావృతాననాబ్జం
విజయసఖే రతిరస్తు మే: నవద్యా ॥

టీ:- ఇదానీం శ్రీకృష్ణమూర్తిం వర్ణయన్ రతిం ప్రార్థయతే - త్రిభువనకమనమితి. త్రిభువనకమనం త్రిలోక్యామేకమేవ యత్ కమనీయం, తద్వపుర్దధానే రతిర్మేఽస్తు. తమాలవన్నీలోవర్ణో యస్య తత్. ప్రాతః కాలీనా రవేః కరా ఇవ స్వతఏవ గౌరే పీతే వరే నిర్మలే అంబరే యస్మిన్ తత్, విజయసఖే, పార్థసారథౌ. అనవద్యా అహైతుకీ ఫలాభిసంధిరహితా.(33)

కలిగించునట్లు ప్రవర్తించు భగవంతుడైన శ్రీకృష్ణునియందు నా బుద్ధి నిలుచుగాక ! (32)

మూడు లోకాలకు ఒకేఒక అందమైనవాడు నల్లని కానుగ చెట్టు రంగు వంటి శరీరచ్ఛాయగలవాడు, సూర్య కిరణాలవలె పచ్చగా మెరయుచున్న పీతాంబరాన్ని ధరించినవాడు, ముంగురులతో ఆవరింపబడిన ముఖకమలముగలవాడు, అర్జునుని స్నేహితుడగు శ్రీకృష్ణునియందు నాకు ఏ ఫలాభిసంధిలేని అహేతుకమైన అనింద్యమైన ప్రీతికలుగుగాక.(33)

34. శ్లో. యుధి తురగరజో విధూమ్రవిష్వక్
కచలులితశ్రమవార్యలంకృతాస్యే ।
మమ నిశితశరైర్విభిద్యమానేత్వచి
విలసత్కవచేఽస్తు కృష్ణ ఆత్మా ॥

టీ:- విజయసఖిత్వమేవానువర్ణయన్ రతిం ప్రార్థయతే-యుధీతి. యుధి యుద్ధే తురగాణాం ఖురరజస్తురగరజః, తేన విధూమ్రాః ధూసరాః. తే చ విష్వంచః ఇత స్తతశ్చలంతః. కచాః కుంతలాః .తైర్విలులితం వికీర్ణం. శ్రమవారి స్వేదబిందురూపం. తేన భక్తవాత్సల్యద్యోతకేన. అలంకృతమాస్యం యస్య తస్మిన్ శ్రీకృష్ణే. మమాత్మా మనోఽస్తు. రమతామిత్యర్థః. పునః కథంభూతే? మదీయైర్నిశితైస్తీక్ష్ణైశ్శరైర్విభిద్యమానా త్వగ్యస్య. శరైరేవ విలసత్కవచం యస్య. తత్తస్మిన్ కించ.(34)

కృష్ణుడు అర్జునుని స్నేహితుడని వర్ణిస్తూ ఆయనయందు భక్తి కలుగవలెనని కోరుకుంటున్నాడు భీష్ముడు. యుద్ధరంగమున గుఱ్ఱముల గిట్టలతో లేపగొట్టబడిన ధూళిచేత ధూసరవర్ణము కలిగినవాడు, అంతటను ఇటునటు కదలుచున్న ముంగురులచేత, పొదిమిన చెమట బిందువులచేత అలంకరింపబడిన ముఖముగలవాడు తీవ్రమైన నా బాణములచేత ఛేదింపబడిన, చర్మమునందు ప్రకాశిస్తున్న కవచముగల శ్రీకృష్ణునియందు నా మనస్సు లగ్నమై ఉండుగాక. ఇచట శ్రీకృష్ణునికి అతని తత్తరపాటు వలన అర్జునుని యందుగల వాత్సల్యము గోచరిస్తున్నది. అర్జునునికి భీష్ముని వలన ప్రాణాపాయ మేర్పడుతుందేమోనని పరమాత్మ ఒక్కసారి భీష్మునిపైకి రథము నుండి దుమికి పరుగిడినాడు.(34)

35. శ్లో. సపది సఖివచో నిశమ్య మధ్యే
నిజపరయోర్బలయో రథం నివేశ్య ।
స్థితవతి పరసైనికాయురక్ష్ణా
హృతవతి పార్థసఖే రతిర్మమాస్తు ॥

ఓ కృష్ణా ! రెండుసేనల నడుమ నా రథమును నిలుపుము యుద్ధమునకు వచ్చిన వారిని నేను చూతును అని అర్జునుడు చెప్పిన మాటను విని వెంటనే రెండుసేనల నడుమ రథమును అపి, తన చూపులతోనే దుర్యోధనాది పాండవ శత్రుల ఆయువును హరించిన వాడు అర్జునుని స్నేహితుడైన శ్రీకృష్ణునియందు నాకు భక్తి కలుగుగాక.

టీ:- సపదీతి. శ్లో. సేనయోరుభయోర్మధ్యేరథం స్థాపయ మేఽచ్యుత, యావదేతాన్నిరీక్షేఽహం యోద్ధుకామానవస్థితానితి సఖ్యుః అర్జునస్యవచో నిశమ్య సపది తత్క్షణమేవ స్వపరయోస్సైన్యయో ర్మధ్యే రథం ప్రవేశ్య స్థితే పార్థసఖేరతిర్మ మాస్తు తత్ర స్థిత్వాకృతం సఖ్యం దర్శయతి-పరస్య దుర్యోధనస్య సైనికానామాయుః అక్ష్ణాకాలరూపేణ, హృతవతి అసౌ భీష్మః. అసౌ ద్రోణః అసౌ కర్ణ ఇతి తత్తత్ప్రదర్శనవ్యాజేన దృష్ట్వైవ సర్వేషామాయురాకృష్య అర్జునస్య జయం కృతవతి.(35)

ఇతడు భీష్ముడు, ఇతడు ద్రోణుడు, ఇతడు కర్ణుడు అని చూపుతూ వారి ఆయువును కృష్ణుడు హరించెను. అని తాత్పర్యము. (35)

36. శ్లో. వ్యవహితపృతనాముఖం నిరీక్ష్య
స్వజనవధాద్విముఖస్య దోషబుద్ధ్యా ।
కుమతిమహరదాత్మవిద్యయా యః
చరణరతిః పరమస్య తస్య మేఽస్తు ॥

టీ:- న కేవలమర్జునస్య సపత్నాయుర్హ్వ రణేనైవ జయమావహత్. కింతు అవిద్యాహరణేనాపీత్యాహ-వ్యవహితేతి. వ్యవహితాయాః దూరే స్థితాయాః పృతనాయాః. ముఖమివ ముఖం. అగ్రే స్థితాన్ భీష్మాదీన్నిరీక్ష్యేత్యర్థః. స్వజనవధాద్విముఖస్య నివృత్తస్య. తదుక్తం గీతాసు. శ్లో. 'ఏవముక్త్వార్జునస్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్, విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః' ఇతి. కుమతిం అహం మమేత్యాదికుబుద్ధిం. (36)

కేవలము అర్జునుని శత్రువుల ఆయువును హరించుటచేత అర్జునునికి జయము కలిగించుటే కాదు, అర్జునుని అజ్ఞానమును కూడా హరించుటచేత జయము చేకూర్చెను. దూరముననున్న సేనా ముఖమందు ముందుగా నిల్చొనియున్న భీష్మాదులను చూచి స్వజన వధ నుండి విరతుడైన అర్జునునికి ఆత్మ విద్యను బోధించి శ్రీకృష్ణుడు జ్ఞానోపదేశం చేసెను.'ఏవముక్త్వా' అను గీతా శ్లోకమున అర్జునుడు విషాదముతో బాణమును ధనుస్సును వదిలెను. అపుడు కృష్ణుడు జ్ఞానబోధతో ఆతనిని యుద్ధమునకు పురిగొల్పెను.'హన్త' అని ప్రారంభించి ఆతని మోహావిష్టమైన చెడు బుద్ధిని తొలగించెను. అట్టి కృష్ణపరమాత్మ పాదములయందు నాకు భక్తి కలుగుగాక.(36)

37. శ్లో. స్వనిగమమపహాయ మత్ప్రతిజ్ఞామ్
ఋతమధికర్తుమవప్లుతో రథస్థః ।
ధృతరథచరణో౽భ్యయాచ్చలద్గుః
హరిరివ హంతుమిభం గతోత్తరీయః ॥

టీ:- మమ మహాంతమనుగ్రహం కృతవానిత్యాహ - ద్వాభ్యాం. స్వనిగమమితి. స్వనిగమం అశస్త్రఏవాహం సాహాయ్యమాత్రం కరిష్యే. ఇత్యేవంరూపాం స్వప్రతిజ్ఞాం హిత్వా శ్రీకృష్ణం శస్త్రం గ్రాహయిష్యామీత్యేవరూపాం మత్ప్రతిజ్ఞాం ఋతం సత్యం యథాభవతి తథా. అధి అధికాం కర్తుం యో రథస్థస్సన్ అవప్లుతః. సహసైవావతీర్ణః ఉద్ధృతరథచరణః ఉద్ధృతచక్రః. మామభ్యయాత్ అభీముఖం అధావత్. ఇభం హంతుం హరిః సింహ ఇవ కింభూతః? తథా చ సంరంభేణ మానుష్యనాట్యవిస్మృతేః. ఉదరస్థసర్వభువనభారేణ ప్రతిపదం బహుశశ్చలంతీ గౌః పృథివీ, యస్మాత్తేనైవ సంరంభేణ. పథి గతంచ్యుతముత్తరీయం వస్త్రం యస్య స ముకుందో మే గతిః భవత్విత్యుత్తరేణాన్వయః. (37)

కృష్ణుడు తనకు గొప్ప అనుగ్రహాన్ని ప్రసాదించెనని భీష్ముడు రెండు శ్లోకాలతో చెపుతున్నాడు. నేను శస్త్రము పట్టకయే మీకు సహాయము చేస్తానని శ్రీకృష్ణుడు ప్రతిజ్ఞను చేయగా, ఆ కృష్ణునితో శస్త్రము పట్టిస్తానని నేను (భీష్ముడు) చేసిన ప్రతిజ్ఞను సత్యము చేయుటకు అర్జునుడు వద్దన్నా వినక రథము నుండి దుమికి చక్రము పట్టుకొని, ఏనుగును చంపుటకు పరుగెత్తుతున్న సింహమువలె, తన ఉదరముననున్న లోకాలన్ని ఇటునటు పరుగిడుతుండగా, అడుగడుగునా భూమి కంపించుచుండగా కప్పుకొన్న ఉత్తరీయము జారిపోవుచుండగా నా పైకి వచ్చు కృష్ణుడు నాకు దిక్కగుగాక సద్గతిని కలుగచేయుగాక. తరువాతి నాలుగు శ్లోకములతో అన్వయము. (37)

38. శ్లో. శితవిశిఖహతో విశీర్ణదంశః
క్షతజపరిప్లుత ఆతతాయినో మే ।
ప్రసభమభిససార మద్వధార్థం
స భవతు మే భగవాన్ గతిర్ముకుందః ॥

టీ:- శితవిశిఖేతి. ఏవం యదాభ్యయాత్తదా స్మయమనస్యాతతాయినో ధన్వినో మే శితైస్తీక్ష్ణైర్విశిఖైర్హతః,అతో విశీర్ణదంశో విధ్వస్తకవచః, అతఏవ క్షతజేన రుధిరేణ పరిప్లుతః వ్యాప్తాంగస్సన్ ప్రసభం బలాద్వార యంతమప్యర్జునమతిక్రమ్య మద్వధార్థమభిససార అభిముఖం జగామ.ఏవం లోకప్రతీత్యా అర్జునపక్షపాతీవ లక్షితః. వస్తుతస్తు మయ్యేవానుగ్రహం కృతవాన్. మద్భక్తేన యద్వచ ఉక్తం తత్తథాస్త్వితి స భగవాన్ మే గతిర్భవత్విత్యర్థః. (38)

ఈ విధముగా ఎపుడైతో చక్రము చేపట్టెనో అపుడు నవ్వుతూ, శస్త్రధారినై ఉన్న నేను వాడి బాణములతో కొట్టగా కవచము చినిగి, ఒళ్ళంతా రక్తముతో నిండినవాడైన కృష్ణుడు, తొందరగా నన్ను చంపుటకు ఎదురుగా వచ్చెను. అట్టి శ్రీకృష్ణభగవానుడు, ముకుందుడు నాకు సద్గతిని ఇచ్చుగాక. లోకమున అర్జున పక్షపాతి శ్రీకృష్ణుడనడమే కాని యథార్థానికి నన్నే అతడనుగ్రహించాడు, కావున భీష్మపక్షపాతి కృష్ణుడు. నా భక్తుని ప్రతిజ్ఞను సత్యము చేయవలెనని ఆయుధముపట్టి నన్ను అనుగ్రహించాడని భావము.(38)

39. శ్లో. విజయరథకుటుంబ ఆత్తతోత్రే
ధృతహయరశ్మిని తచ్ఛ్రియేక్షణీయే ।
భగవతి రతిరస్తు మే ముమూర్షోః
యమిహ నిరీక్ష్య హతా గతాః సరూపమ్ ॥

అన్యాయమైనను, సేవకుని అర్జునుని రక్షించుటలో తొందరపాటు కలిగి చక్రముపట్టిన శ్రీకృష్ణుని యందు చావ సిద్ధముగా ఉన్న నాకు భక్తి కలుగుగాక అని భీష్ముని కోరిక. దానిని తెలుపుచున్నాడు. అర్జునుని యొక్క రథమనే కుటుంబమును రక్షించుటకు కొరడా, ( సారథిగా గుఱ్ఱాలను తోలుటకు ఉపయోగించే కఱ్ఱగల ) గుఱ్ఱముల పగ్గాలను ధరించిన మరియు ఆ సారథ్యశోభచేత

టీ:- తదేవమన్యాయైరపి భృత్యరక్షావ్యగ్రే శ్రీకృష్ణే రతిమాశాస్తే- విజయేతి విజయోఽర్జునః. తస్య రథఏవ కుటుంబమకృత్యశతైరపి రక్షణీయం యస్య తస్మిన్ ఆత్తం తోత్రం ప్రతోదో యేన తస్మిన్ ధృతా హయానాం రశ్మయః ప్రగ్రహాస్తే సంతి యస్య తస్మిన్. వ్రీహ్యాదిభ్యశ్చే త్యనకారాంతాదపి రశ్మిశబ్దాదీనిః. తచ్ఛ్రియా తాదృ క్సారథ్యకరణోప యేగివేషేణ ఈక్షణీయే శోభమానే. ముమూర్షోర్మర్తు మిచ్ఛోః నన్వన్యాయవ ర్తినికిమితి రతిః ప్రార్థ్యతే.? అత ఆహ - భగవత్య చింత్యైశ్వర్యే తదాహ - ఇహ యుద్ధే హతాః సర్వేయం నిరీక్ష్య. స్వరూపం తత్సమానరూపం. గతాః ప్రాప్తాః. ఇతి దివ్యదృష్ట్యా పశ్యన్నాహ- (39)

40. శ్లో. లలితగతివిలాసవల్గుహాస
ప్రణయనిరీక్షణకల్పితోరుమానాః ।
కృతమనుకృతవత్య ఉన్మదాంధాః
ప్రకృతిమగన్ కిల యస్య గోపవధ్వః ॥

చూడముచ్చటగా ఉన్న శ్రీకృష్ణునియందు నా మనస్సు నిలుచుగాక. ఇచట అర్జునుని రథము కుటుంబమనుటలో, అన్యాయముచేసి అయినా కుటుంబాన్ని కాపాడే బాధ్యత యజమానునికి ఉంటుంది. అదే విధముగా శ్రీకృష్ణుడు తన ప్రతిజ్ఞను వదలి భీష్ముని పైకి చక్రము పట్టుకొని వెళ్ళుట అన్యాయమే, అయినా భక్త రక్షణవ్రతము కలవానికి అది తప్పుకాదు. అయితే అన్యాయం చేసేవాని యందు నీకు భక్తి ఎందుకు అని అంటారేమో అనే ప్రశ్నకు సమాధానముగా ఆయన భగవానుడు, అచింత్యమైన ఐశ్వర్యము కలవాడు, ఇచట యుద్ధమున చచ్చిన వారంతా ఆయనను చూచి ఆయనతో సమానమైనరూపమనే సారూప్య ముక్తిని పొందారు కదా అని దివ్యదృష్టితో చూచి భీష్ముడు చెపుతున్నాడు అని భావము. అంతగొప్పవాడు భక్త పరాధీనుడు కనుక అసలు ఆయన చేసిన పనులు అన్యాయము కావు అని భీష్ముని స్తుతి. ఇచట శ్లోకమున రశ్మిని అని రశ్మ శబ్దము ఇకారాంతము కాని నకారాంతముగా వాడబడినది. దానికి 'వ్రీహ్యాదిభ్యశ్చ' అను వ్యాకరణ సూత్రమే ప్రమాణము. (39)

క్షాత్ర కర్మచేత యుద్ధంచేసి చచ్చినవారు ఆయన స్వరూపాన్ని బొందారనడం చిత్రమేమి?అని ఆశంకించి మదాంధులు కూడా సద్గతిని పొందారు కదా.'ద్వావిమౌ పురుషౌలోకే సూర్యమండల భేదినౌ

టీ:- క్షత్రధర్మేణ యుధ్యమానాస్తత్సరూపం ప్రాపురిత్యేతన్న చిత్రం. యతో మదాంధాఅపిప్రాపురిత్యాహ. లలితేతి లలితగతిశ్చ విలాసశ్చ వల్గుహసాది మంజుగత్యాదిభిరాత్మీయైః. తదీయైర్వా కల్పితః ఉరుః మానః పూజాయాసాం తాః. అతః. ఉత్కటేన మదేన అంధాః. అత ఏవ తదేకచిత్తత్వేన తస్య కృతం కర్మ గోవర్ధనోద్ధరణాదికం, ఆనుకృతవత్యో గోపవధ్వః. యస్య ప్రకృతిం స్వరూపం అగన్ అగమన్. మకరలోపస్త్వార్షః. కిల ప్రసిద్ధో. తస్మిన్ మే రతిరస్త్వితి పూర్వేణాన్వయః (40)

పరివ్రాడ్యోగయుక్తశ్చ రణే చాభిముఖో హతః' అని ధర్మశాస్త్రము అను విషయమును చెప్పుచున్నారు. అందమైన గమనము, ఒయ్యారము, సుందరమైన చిరునగవు, ప్రేమచూపులచేతను, కృష్ణుని చేష్టలను అనుకరించుటలో ఆరాధనభావము కలిగి గోవర్ధనోద్ధారాది పనులను అనుకరిస్తూ, స్మరిస్తూ మత్తెక్కిన గోపస్త్రీలు ఆయన స్వరూపాన్ని పొందారుకదా అట్టి శ్రీకృష్ణునియందు నాకు భక్తి కలుగుగాక అని పూర్వ శ్లోకముతో అన్వయము. శ్లోకమున క్రియారూపము అగమన్‌కు బదులు అగన్ అని కలదు మకార లోపము ఆర్షము.(40)

41. శ్లో. మునిగణనృపవర్యసంకులేఽంతః
సదసి యుధిష్ఠిరరాజసూయ ఏషామ్ ।
అర్హణముపపేద ఈక్షణీయో
మమ దృశి గోచర ఏష ఆవిరాత్మా ॥

టీ:- జగత్పూజ్యతామనుస్మరన్నాహ- మునీతి. మునిగణైః నృపవర్యైశ్చ. సంకులే వ్యాప్తే. అంతస్సదసి సభామధ్యే యుధిష్ఠరస్య రాజసూయే. యేషాం మునిగణాదీనాం ఈక్షణీయః అహో రూపమహో మహ ఇత్యాశ్చర్యేణ విలోకనియస్సన్. అర్హణముపపేదే ప్రాప. స ఏష జగతామాత్మా మమ దృశి గోచరః దృష్టివిషయస్సన్ ఆవిః ప్రకటో వర్తతే. అహో మహోభాగ్యమితి భావః.(41)

శ్రీకృష్ణుడు జగత్పూజ్యుడని తలచుచూ భీష్ముడు స్తుతిస్తున్నాడు. మునీశ్వరులు, మహారాజులతో నిండిన యుధిష్ఠిరుని రాజసూయయాగ సభామధ్యమున, అందరిచేతను, ఎంత అందము, ఎంత మహిమ, ఎంత సామర్థ్యము అని స్తుతింపబడుతూ అగ్రపూజ్యతను అందుకొన్న శ్రీకృష్ణుడు జగత్తునకే ఆత్మ, సర్వాంతర్యామి. అట్టివాడు నా ముందు నిలిచి ఉన్నాడు, ఆహా ! నాదెంత అదృష్టము.(41)

42. శ్లో. తమిమమహమజం శరీరభాజాం
హృది హృది ధిష్ఠితమాత్మకల్పితానామ్ ।
ప్రతిదృశమివ నైకధార్కమేకం
సమధిగతోఽస్మి విధూతభేదమోహః ॥

టీ:- సోఽహం కృతార్థోఽస్మీత్యాహ- తమితి. తమిమమజం. సమ్యగధిగతోఽస్మి. సమ్యక్త్వమాహ-విధూతభేదమోహః తదర్థం భేదస్యోపాధికత్వమాహ - ఆత్మకల్పితానాంస్వనిర్మి తానాం. శరీరభాజాం ప్రాణినాం హృదిహృది ప్రతిహృదయం ధిష్ఠితం అధిష్ఠితం. అకారలోపస్త్వార్షః. శ్రు. "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్. జజానజాతా ననువివేశే"తి శ్రుతేశ్చ నైకధా అనేకధా. అధిష్ఠానభేదా దనేకవత్ భాంతమిత్యర్థః. శ్రు. "ఏకం సంతం బహుధా కల్పయంతీతి" శ్రుతేః తత్ర దృష్టాంతః. సర్వప్రాణినాం దృశం దృశంప్రతి. ఏకమేవార్కమనేకధా ప్రతీతమివేతి. (42).

నేను భేదభావమనే అజ్ఞానము తొలగినవాడనై పుట్టుకలేనట్టి, ప్రాణులందరిలో అంతర్యామిగా స్థిరముగా ఉన్నట్టి దానిని ఒక సూర్యుడే ఆయా అధిష్ఠాన ప్రతిబింబితుడై భిన్న భిన్నముగా భాసించినట్లు తాను నిర్మించుకొన్న ప్రాణులలో వేఱు వేఱుగా భాసించుచున్న వాడను అగు శ్రీకృష్ణపరమాత్మను పొందియున్నాను. నా అవసానసమయమున ఆయన నాయందు కలడని ఇచట భీష్ముని భావము. పై శ్లోకమున అధిష్ఠితము ధిష్ఠితమని అకారలోపముతో ప్రయోగించుట ఆర్షము. (42)

**సూత ఉవాచ.**

43. శ్లో. కృష్ణ ఏవం భగవతి
మనోవాగ్దృష్టివృత్తిభిః ।
ఆత్మన్యాత్మానమావేశ్య
సోఽంతశ్శ్వాస ఉపారమత్ ॥

**సూతుడు చెపుతున్నాడు.**

భగవానుడగు శ్రీకృష్ణుని త్రికరణ శుద్ధిగా అనగా మనస్సుతో ధ్యానిస్తూ, వాక్కులతో స్తుతిస్తూ, ఆ కృష్ణుని దివ్యమంగళ విగ్రహాన్ని తన చూపులతో అలా చూస్తూ ఆ పరమాత్మయందే తన ఆత్మను విలీనంచేస్తూ భీష్ముడు తన తుది శ్వాసను వదిలెను. (43)

టీ:- కృష్ణఇతి. మనోవాగ్దృష్టీనాం వృత్తిభిః పరమాత్మని కృష్ణే అంతరేవ విలీనం నిశ్వాసో యస్య సః (43)

44. శ్లో. సంపద్యమానమాజ్ఞాయ
భీష్మం బ్రహ్మణి నిష్కలే ।
సర్వే బభూవుస్తే తూష్ణీం
వయాంసీవ దినాత్యయే ॥

నిర్గుణ పరబ్రహ్మయందు అట్లు విలీనమైన వానిగా భీష్ముని గమనించి, సాయంకాలసమయమున పక్షులవలె, అచటనున్న ధర్మరాజాదులందరును మౌనము వహించిరి.(44)

టీ:- సంపద్యమానమితి. నిష్కళే నిరుపాధౌ. సంపాద్యమానం మిళితం ఆజ్ఞాయ ఆలక్ష్య. వయాంసి పక్షిణ ఇవ.(44)

45. శ్లో. తత్ర దుందుభయో నేదుః
దేవ మానవవాదితాః ।
శశంసుః సాధవో రాజ్ఞాం
ఖాత్పేతుః పుష్పవృష్టయః ॥

వెంటనే అప్పుడు దేవతలచేత, మనుష్యులచేత దుందుభులు, తప్పెటలు మ్రోగింపబడెను. అచట రాజుల మధ్యనున్న సాధువులు భీష్ముని పరమ కృష్ణ భక్తాగ్రేసరుడని ప్రశంసించిరి. ఆకసమునుండి పుష్పవర్షములు కురిసెను.(45)

టీ:- తత్రేతి. దేవైర్మానవైశ్చ వాదితాః రాజ్ఞాం మద్యే సాధవః అనుసూయవః.(45)

46. శ్లో. తస్య నిర్హరణాదీని
సంపరేతస్య భార్గవ ।
యుధిష్ఠిరః కారయిత్వా
ముహూర్తం దుఃఖితో௨భవత్ ॥

టీ:- తస్యేతి. నిర్హ రణాదీని సంస్కారాదీని. సంపరేతస్య సమ్యక్పరం పరమాత్మానం. ఇతస్య ప్రాప్తస్య ముక్తస్యాపీత్యర్థః.(46)

భార్గవా ! శౌనకా ! పరలోకాన్ని పొంది, ముక్తుడైన భీష్మునికి ధర్మరాజు దహన సంస్కారాలను చేయించి, ఒక ముహూర్తముపాటు మానవతా దృష్టితో వ్యవహరించి దుఃఖించెను.(46)

47.శ్లో. తుష్టువుర్మునయో హృష్టాః
కృష్ణం తద్గుహ్యనామభిః ।
తతస్తేకృష్ణ హృదయాః
స్వాశ్రమాన్ ప్రయయుః పునః ॥

టీ :- తస్య గుహ్యనామామభిర్వేదోక్తైః. కృష్ణ ఏవ హృదయం యేషాం తే కృష్ణాహృదయాః. (47)

మునీశ్వరులు సంతోషించి కృష్ణుని వేదోక్త రహస్య నామములతో స్తుతించిరి. ఆ తరువాత అందరు అచటనే శ్రీకృష్ణుని ధ్యానించుచూ తమతమ ఆశ్రమములకు తిరిగి వెళ్ళిపోయిరి.(47)

48. శ్లో. తతో యుధిష్ఠిరో గత్వా
సహ కృష్ణో గజాహ్వాయమ్ ।
పితరం సాంత్వయామాస
గాంధారీం చ తపస్వినీమ్ ॥

టీ:- తత ఇతి. పితరంధృతరాష్ట్రం తపస్వినీం పుత్రశోకజనిత సంతాపవతీం. (48)

తరువాత యుధిష్ఠిరుడు కృష్ణునితో కూడి హస్తినాపురమునకు వెడలి, తన పెదతండ్రి ధృతరాష్ట్రుని, సంతాపముతో కూడిన గాంధారిని పుత్రశోకము నుండి తేరుకొనచేసిరి. భీష్మనిర్యాణ విషయమును కూడా తెల్పి ఓదార్చిరి. (48)

49. శ్లో. పిత్రా చానుమతో రాజా
వాసుదేవానుమోదితః ।
చకార రాజ్యం ధర్మేణ
పితృపైతామహం విభుః ॥

టీ:- పిత్రేతి. విభుః రాజాయుధిష్ఠిరః. అనుమతః అనుజ్ఞాతః. (49)

ఆ తరువాత ప్రభువగు యుధిష్ఠిరుడు పెద తండ్రిగారి చేత, శ్రీకృష్ణుని చేత అనుజ్ఞ బడిసి, తన తండ్రి, తాతల నుండి తనకు పారంపర్యముగా సంక్రమించిన రాజ్యమును ధర్మముగా పరిపాలించెను. (49)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం సంహితాయాం ప్రథమేస్కంధే భావార్థదీపికాయాం నవమోఽధ్యాయః**

**శ్రీమద్భాగవతము యొక్క ప్రథమస్కంధ నవమాధ్యాయమునకు శ్రీధరీయవ్యాఖ్యానుసార ఆంధ్రానువాదము ముగిసినది.**

## దశమోఽధ్యాయః

**శౌనక ఉవాచ.**

1. శ్లో. హత్వా స్వరిక్థస్పృహ ఆతతాయినో
యుధిష్ఠిరో ధర్మభృతాం వరిష్ఠః ।
సహానుజైః ప్రత్యవరుద్ధభోజనః
కథం ప్రవృత్తః కిమకారషీత్తతః ॥

టీ:- శ్లో. 'దశమే కృతకార్యస్యహస్తినాపురతో హరేః, స్త్రీభిస్సంస్తూయమానస్య వర్ణ్యతే ద్వారకాగమః. తత్ర హస్తినాపురే రాజ్యం చకారేత్యుక్తం. తత్ర పృచ్ఛతి శౌనకః-హత్వేతి. స్వస్యరిక్థే ధనేఽపి స్పర్ధయా స్పృహాం కుర్వతః. యద్వా.స్వరిక్థాయ స్పృట్ సంగ్రామో యేషాం తే. అత ఏవ తద్ధరణీహరణాదాతతాయినః. తాన్ హత్వా ప్రత్యవరుద్ధభోజనః బంధువధదుఃఖేన సంకుచితభోగఃరాజ్యలాభేన ప్రాప్తాధికభోగో వా. కథం రాజ్యే ప్రవృత్తః? ప్రవృత్తోవా తతః కిమకార్షీత్? కిమకరోత్? అత్ర రేఫాదుదార్షః.(1)

## దశమాధ్యాయము

**శౌనకుడు అడుగుతున్నాడు.**

ధర్మరాజు రాజ్యమును పరిపాలిస్తున్నాడు అని ఇదివరలో చెప్పబడినది. ఆ విషయమునే అడుగుతున్నాడు. ధర్మాత్ములలో శ్రేష్ఠుడగు యుధిష్ఠిరుడు తమ ధనాన్ని చూచి అసూయపడిన తమ ధనము కొరకు ఘోర యుద్ధము సల్పిన శస్త్రధారులగు దుర్యోధనాదులను చంపి, బంధు వధ దుఃఖముతో సరిగా భోజనము చేయనట్టివాడై, రాజ్య లాభము కలిగినను భోగములందు ఆసక్తిలేనివాడై తమ్ములతో కలిసి రాజ్యము చేయగలిగెనా? మఱి ఎట్లు రాజ్యము చేసెను? ఆ తరువాత ఏమి చేసెను? (1)

**సూత ఉవాచ.**

2. శ్లో. వంశం కురోర్వంశదవాగ్నినిర్హృతం
సంరోహయిత్వా భవభావనో హరిః ।
నివేశయిత్వా నిజరాజ్య ఈశ్వరో
యుధిష్ఠిరం ప్రీతమనా బభూవ హ ॥

టీ:- రాజ్యస్య ప్రవృత్తౌ శ్రీకృష్ణస్య ప్రీతిం పర్యాలోచ్య, ప్రవృత్త ఇత్యాశయేనోత్తరమాహ-వంశమితి. కురోర్వంశం సంరోహయిత్వా పరీక్షిద్రక్షణేన సంరోహ్య అంకురితం కృత్వా. కథంభూతం? వంశదవాగ్నినిర్హృతం. వంశ ఏవ దవో వనం. తస్మాదుద్భూతః క్రోధరూపోఽగ్నిః.తేన నిర్హృతం దగ్ధం. నిజరాజ్యే నివేశ్య.(2)

**సూతులవారు చెపుతున్నారు.**

రాజ్యప్రవృత్తిలో శ్రీకృష్ణుని ప్రేమను ఆలోచించి ప్రవృత్తుడాయెనని సమాధానము చెపుతున్నాడు. వెదుళ్ళయందు పుట్టిన కారుచిచ్చు అడవిని దహించినట్లు , క్రోధాగ్నిచే దహింపబడిన కురువంశపు బూడిద నుండియే పరీక్షిత్తు అనే అంకురాన్ని మొలిపించి, ధర్మరాజును తన రాజ్యపు సింహాసనముపై కూర్చొండబెట్టి జరుగు దానిని జరుగునట్లుచేయు శ్రీహరి సంతుష్టుడాయెను.(2)

3. శ్లో. నిశమ్య భీష్మోక్తమథాచ్యుతోదితం
ప్రవృత్తవిజ్ఞానవిధూతవిభ్రమః ।
శశాస గామింద్ర ఇవాజితాశ్రయః
పరిధ్యుపాంతామనుజానువర్తితః ॥

టీ:- ప్రవృత్తౌ హేతుముక్త్వా, కిమకార్షీ దిత్యస్యోత్తరమాహ-నిశమ్యేతి ప్రవృత్తం యద్విజ్ఞానం పరమేశ్వరాధీనం జగన్న స్వతంత్రమిత్యేవం

రాజ్యపరిపాలనలో ప్రవృత్తుడగుటకు హేతువును చెప్పి తరువాత ఏమిచేసెను. అనుదానికి సమాధానము చెపుతున్నాడు. భీష్ముడు మరియు శ్రీకృష్ణుడు చెప్పిన ధర్మాలను విని, విజ్ఞానమును పొంది మోహము తొలగించుకొని పరమేశ్వరాధీనమైనది ఈ జగత్తని తెలిసికొని, జ్ఞానదృష్టి కలవాడై తన తమ్ములతో కలిసి శ్రీకృష్ణపరమాత్మనే ఆశ్రయించిన సముద్రపరివృతమగు భూమండలాన్ని ధర్మరాజు ఇంద్రునివలె పరిపాలించెను.(3)

భూతం, తేన విధూతో విభ్రమః. అహం కర్తేత్యేవంభూతో మోహో యస్య సః. అనుజైరనువర్తితస్సేవితస్సన్. అజితః కృష్ణఏవాశ్రయో యస్య సః, పరిధిః సముద్రః. ఉపాంతాం తత్పర్యంతాం. గాం పృథివీం. పాలయామాస.(3)

4. శ్లో. కామం వవర్ష పర్జన్యః
సర్వకామదుఘా మహీ ।
సిషిచుః స్మ వ్రజాన్ గావః
పయసోధస్స్వతీర్ముదా ॥

టీ:- తస్య రాజ్యం వర్ణయతి-త్రిభిః. కామమితి. మహీ సర్వకామదుఘా. సర్వాభీష్టదోగ్ధ్రీ బభూవ. వ్రజాన్ గోష్ఠాని ఊధస్స్వత్యః ప్రథమార్థే ద్వితీయా.స్థూలోధస ఇత్యర్థః సిషిచుః అభ్యషించన్.(4)

5. శ్లో. నద్యస్సముద్రా గిరయః
సవనస్పతివీరుధః ।
ఫలంత్యోషధయస్సర్వాః
కామమన్వృతు తస్య వై ॥

టీ:- నద్య ఇతి. అన్వృతుఋతావృతౌ.(5)

ధర్మరాజు రాజ్యమును వర్ణిస్తున్నాడు, సూతుడు 'కామం' అను మూడు శ్లోకాలతో. పర్జన్యుడు సకాలమున వానలను కురిపించెను. భూమి గోవువలె సమస్త కోరికలను పితికి ఇచ్చెను. గోష్ఠములయందు గొల్లపల్లెలందు పెద్ద పొదుగులు కల ఆవులు పాలను వర్షించెను. సకాల వర్షములచే ధర్మరాజు పరిపాలనలో భూమి సస్యవతియై, గోవులు పాలసమృద్ధికలవై ఉండెనని, పాడి పంటలకు కొదువ లేకుండెనని భావము.(4)

నదులు, సముద్రాలు, పర్వతాలు, వృక్షాలు, పొదలు ఓషధులు (మొక్కలు) ధర్మజుని పాలనలో ప్రతి ఋతువులోను మిక్కిలి సమృద్ధిగలవై ఫలించెను.(5)

6. శ్లో. నాధయో వ్యాధయః క్లేశాః
దైవభూతాత్మహేతవః ।
అజాతశత్రావభవన్
జంతూనాం రాజ్ఞి కర్హిచిత్ ॥

టీ:- నేతి. ఆధయోమనోవ్యథాః. వ్యాధయో రోగాః. క్లేశాః శితోష్ణాదికృతాః, దైవం భూతానిచ ఆత్మా చ హేతుర్యేషాం. ఆధిదైవికాది భౌతికాధ్యాత్మికాః. జంతూనాం నాభవన్.(6)

ఆధ్యాత్మికములగు బాధలు (మానసికమైన బాధలు, శారీరికమైన రోగాలు) ఆధిదైవికములగు బాధలు,(అతివృష్ట్యనావృష్ట్యశనిపాతాదులు) ఆదిభౌతికములగు బాధలు (సర్ప, వ్యాఘ్రాదుల వలని బాధలు) అజాతశత్రువగు ధర్మరాజు రాజుగా ఉన్నపుడు ప్రజలకు కలుగలేదు.(6)

7. శ్లో. ఉషిత్వా హాస్తినపురే
మాసాన్ కతిపయాన్ హరిః ।
సుహృదాం చ విశోకాయ
స్వసుశ్చ ప్రియకామ్యయా ॥

టీ:- ఇదానీం ద్వారకాగమనం నిరూపయితుమాహ-ఉషి త్వేతి. స్వసుః సుభద్రాయాః. సుహృదాం యుధిష్ఠిరాదీనాం.(7)

ఇపుడు శ్రీకృష్ణుడు ద్వారకకు వెళ్ళుటను తెలుపుతున్నాడు 'ఉషిత్వా' అని. హస్తినాపురమున తన స్నేహితులకు దుఃఖము కలుగకుండుటకై తన చెల్లెలగు సుభద్రకు సంతోషము కలిగించుటకై కొన్ని నెలలు శ్రీకృష్ణుడు అచటనే ఉండి తరువాత అచటి నుండి బయలుదేరెను. ముందు శ్లోకముతో అన్వయము.(7)

8. శ్లో. ఆమంత్ర్య చాభ్యనుజ్ఞాతః
పరిష్వజ్యాభివాద్య తమ్ ।
ఆరురోహ రథం కైశ్చి
త్పరిష్వక్తోఽభివాదితః ॥

టీ:- ఆమంత్ర్యేతి. తం యుధిష్ఠిరం. (8)

శ్రీకృష్ణుడు ధర్మరాజుతో వెళ్ళివస్తానని తెల్పి, అనుజ్ఞను పొంది, సములను కౌగలించుకొని, పెద్దవారికి నమస్కరించి, కొందరు తనను కౌగిలించుకొనగా, కొందఱు నమస్కరించగా ద్వారకకు వెళ్ళుటకై రథమును అధిరోహించెను.(8)

9. శ్లో. సుభద్రా ద్రౌపదీ కుంతీ
విరాటతనయా తథా ।
గాంధారీ ధృతరాష్ట్రశ్చ
యుయుత్సుర్గౌతమో యమౌ ॥

టీ:- సుభద్రేతి. యుయుత్సుః ధృతరాష్ట్రాద్వైశ్యాయాం జాతః. గౌతమః కృపః. యమౌ సకులసహదేవౌ.(9)

సుభద్ర, ద్రౌపది, కుంతి, ఉత్తర, గాంధారి, ధృతరాష్ట్రుడు, యుయుత్సువు (ధృతరాష్ట్రుని వైశ్య భార్యకు జనించినవాడు), గౌతముడు, కృపాచార్యుడు, కవల పిల్లలగు నకుల సహదేవులు కృష్ణుని విరహాన్ని సహించలేక పోయారు ముందటి శ్లోకముతో అన్వయము.(9)

10. శ్లో. వృకోదరశ్చ ధౌమ్యశ్చ
స్త్రియో మత్స్యసుతాదయః ।
న సేహిరే విముహ్యంతో
విరహం శార్‌ఙ్గధన్వనః ॥

భీమసేనుడు, పాండవుల పురోహితుడగు ధౌమ్యుడు, ఉత్తర, సత్యవతి మున్నగు ఇతర స్త్రీలు మోహవశమున శ్రీకృష్ణుని విరహాన్ని సహించలేకపోయారు. ఇచట మత్స్యసుత అని ఉత్తరను మరల పూర్వ శ్లోకమున చెప్పిన దానినే చెప్పుట వలన ఆమె గర్భమున వంశాకురమైన పరీక్షిత్తును రక్షించిన కృష్ణుడు వెళుతుంటే ఆమెకు

టీ:- వృకోదర ఇతి. అన్యాశ్చస్త్రియః. మత్స్యసుతా ఉత్తరా. తస్యాః పునర్గ్రహణం గర్భరక్షక శ్రీకృష్ణవిరహే మోహాధిక్యాత్. యద్వా - మత్స్యసుతా సత్యవతీ.(10)

ఎక్కువ మోహము, బాధ కలిగినవని భావము. పునరుక్త దోష నివారణకు మత్స్యసుతా అనగా సత్యవతి అని అర్థమును తీసికొనిన ఇంకాబాగుండును. (10)

11. శ్లో. సత్సంగాన్ముక్తదుస్సంగో ।
హాతుం నోత్సహతే బుధః ।
కీర్త్యమానం యశో యస్య ।
సకృదాకర్ణ్య రోచనమ్ ॥

టీ:- తేషాం కృష్ణవిరహా సహనం కైముతికన్యాయేనాహ. ద్వాభ్యాం - సదితి. సతాం సంగాద్ధేతోః ముక్తః పుత్రాది విషయో దుస్సంగో యేన సః. సద్భిః కీర్త్యమానం రోచనం రుచికరం మనోహరమిత్యర్థః యస్య యశః సకృదప్యాకర్ణ్య సత్సంగం త్యక్తుం న శక్నోతి. (11)

శ్రీకృష్ణుని విరహాన్ని వారు సహించలేక పోయారనడాన్ని కైముక్తిక న్యాయంచేత 'సత్సంగా'దని రెండు శ్లోకాలతో చెపుతున్నాడు. సత్సాంగత్యం వలన పుత్రాది మోహము తొలగిన విజ్ఞుడు అట్టి సత్సాంగత్యాన్ని వదలజాలడు. ఏ సజ్జనుని కీర్తిని మంచివారు కీర్తింతురో దాన్ని ఒక్కసారి విన్నను ఆ సత్సాంగత్యాన్ని విడువజాలడు కదా, అది రుచించుట వలన వదల శక్యముగాదని భావము.(11)

12. శ్లో. తస్మిన్న్యస్తధియః పార్థాః
సహేరన్ విరహం కథమ్ ।
దర్శనస్పర్శనాలాప
శయనాసనభోజనైః ॥

ఓ పరీక్షిన్మహారాజా ! శ్రీకృష్ణుని అనుక్షణము చూచుచూ, స్పృశించుచూ అతనితో మాట్లాడుతూ ఒకే దగ్గర పరుండియును, కూర్చొనియును, సహ పంక్తి భోజనము చేయుచు ఆ కృష్ణునియందే ఎల్లప్పుడు తమ బుద్ధిని నిల్పినవారు ఆ కృష్ణుని విరహాన్ని ఎలా సహిస్తారు? సహించలేరని భావము.(12)

టీ:- తస్మిన్నితి. దర్శనాదిభిః తస్మిన్ శ్రీకృష్ణే న్యస్తా సమర్పితా ధీర్యేషాం తే. (12)

13. శ్లో. సర్వే తేఽనిమిషైరక్షైః
తమనుద్రుతచేతసః ।
వీక్షంతః స్నేహసంబద్ధాః
విచేలుస్తత్ర తత్ర హ ॥

ఆ కృష్ణుని విరహాన్ని సహించలేనివారు కనుకనే వారందరు కనురెప్ప కొట్టకుండా చూస్తూ, ఆ కృష్ణునియందే మనస్సులను లగ్నము చేసి, మిక్కిలి స్నేహపాశ బద్ధులై అక్కడక్కడ తిరుగుతున్నారు.(13)

టీ:- సర్వ ఇతి. అతఏవానిమిషైరక్షైర్నేత్రైస్తమేవ వీక్షమాణాః. తత్రతత్రార్ఘ్యణాద్యానయనార్థం చలన్తి స్మ. యతస్స్నేహేన సమ్యగ్బద్ధాః అతఏవ తమనుద్రుతాని అనుగతాని చేతాంసి యేషాం తే.(13)

14. శ్లో. న్యరుంధన్నుద్గలద్బాష్పమ్
ఔత్కంఠ్యాద్దేవకీసుతే ।
నిర్యాత్యగారాన్నాం భద్ర
ససుహృద్బాంధవస్త్రియః ॥

శ్రీకృష్ణుని యందలి ప్రగాఢ ప్రేమ చేత, అతడు ఇంటి నుండి బయలుదేరగానే మిత్ర బంధుస్త్రీల కండ్లలో నీళ్ళు కమ్మగా, ఆ కన్నీళ్ళు కిందపడితే క్షేమము కలుగదని కండ్లలోనే వాటిని ఆపుకున్నారు. (14)

టీ:- న్యరుంధన్నితి. అగారాన్నిర్యాతి గచ్ఛతిసతి. ఔత్కంఠ్యాదాసక్త్యతిశయాద్ధేతోరుద్గళత్ప్రస్రవద్బాష్పం అశ్రూణి న్యరుంధన్. నేత్రే

ష్వేవ స్తంభితవత్యః. తత్రహేతుః–అభద్రం మాస్యాత్ అమంగళం మాభవేదిత్యేతదర్థం. (14)

15. శ్లో. మృదంగశంఖభేర్యశ్చ
వీణాపణవగోముఖాః ।
దుంధుర్యానకఘంటాద్యా
నేదుర్దుందుభయస్తథా ॥

టీ:– మృదంగేతి మృదంగాదయోదః వాద్యభేదాః. సమం ఏకకాలం. (15)

మద్దెల, శంఖములు, దుందుభులు, వీణలు, పణవములు, గోముఖములు, దుంధురులు, ఆనకములు, ఘంటలు, భేరీలు మొదలైన దశవిధ వాద్యములు శ్రీకృష్ణుని ప్రయాణ కాలమున మ్రోగెను.(15)

16. శ్లో. ప్రాసాదశిఖరారూఢాః
కురునార్యో దిదృక్షయా ।
వవృషుః కుసుమైః కృష్ణే
ప్రేమ వ్రీడాస్మితేక్షణాః ॥

టీ:– ప్రాసాదేతి. ప్రేమవ్రీడాభ్యాం స్మితపూర్వ ఈక్షణమవలోకనం యాసాం తాః. (16)

శ్రీకృష్ణుని చూచే ఇచ్ఛచే కురువంశ స్త్రీలు మేడలపైకి ఎక్కి, కృష్ణునివైపు లజ్జ, ప్రేమతో కూడిన చిరునగవుగల చూపులు చూస్తూ, అతనిపై పువ్వుల వాన కురిపించిరి.(16)

17. శ్లో. సితాతపత్రం జగ్రాహ
ముక్తాదామవిభూషితమ్ ।
రత్నదండం గుడాకేశః
ప్రియః ప్రియతమస్య హ ॥

టీ:- సితేతి. గుడాకా నిద్రా తస్య ఈశః జితనిద్రోఽర్జునః.(17)

శ్రీకృష్ణుని ప్రియసఖుడగు అర్జునుడు తన ప్రియతముడైన కృష్ణునికి, బంగారముపై రత్నాలు పొదగబడిన, ముత్యాల హారాలతో విలసిల్లు తెల్లని గొడుగును పట్టెను.(17)

18. శ్లో. ఉద్ధవః సాత్యకిశ్చైవ
వ్యజనే పరమాద్భుతే ।
వికీర్యమాణః కుసుమైః
రేజే మధుపతిః పథి ॥

టీ:- ఉద్ధవఇతి. వ్యజనే చామరే జగృహతుః. మధూనాం దేశానాంపతిః శ్రీకృష్ణః. (18)

శ్రీకృష్ణుని మంత్రి అగు ఉద్ధవుడు, సాత్యకి మిక్కిలి ఆశ్చర్యజనకములైన వింజామరలతో శ్రీకృష్ణునికి విసిరిరి. మార్గమున పుష్పవర్షము కురిపించబడగా కృష్ణుడు ప్రకాశించెను.(18)

19. శ్లో. అశ్రూయంతాశిషః సత్యాః
తత్ర తత్ర ద్విజేరితాః ।
నానురూపానురూపాశ్చ
నిర్గుణస్య గుణాత్మనః ॥

శ్రీకృష్ణుడు వెడుతుండగా అక్కడక్కడ బ్రాహ్మణోత్తములచే పలుకబడుచున్న "సత్యాఃసన్తు యజమానస్యకామాః " అని ఆశీస్సులు వినబడుతుండెను. నిర్గుణుడగు శ్రీకృష్ణపరబ్రహ్మ సచ్చిదానంద స్వరూపుడు అట్టి కృష్ణునియెడ 'సుఖీభవ' మొదలైన ఆశీస్సులు తగినవికావు. కాని మనుష్యాకారునికి అట్టి ఆశీస్సులు తగినవే.(19)

టీ:- అశ్రూయం తేతి. సత్యాః శ్రీకృష్ణే తాసామవ్యభిచారాత్. కించ నానురూపాశ్చ అనురూపాశ్చ ఆశిషః. నిర్గుణస్య పరమానందస్య. సుఖీ భవేత్యాదయో నానురూపాః. గుణాత్మనో మానుష్యవతోஉను రూపాశ్చేత్యర్థః. (19)

20. శ్లో. అన్యోన్యమాసీత్సంజల్పః
ఉత్తమశ్లోకచేతసామ్ ।
కౌరవేంద్రపురస్త్రీణామ్
సర్వశ్రుతిమనోహరః ॥

పుణ్యాత్ములగు హస్తినాపుర స్త్రీలు పరస్పరము మనోహరమైన భాషణములు చేసుకొనుచుండిరి. అవి వినసొంపుగా ఉండెనని కూడా అర్థము. ఉపనిషత్తులు గూడా ఆకారమును ధరించి వారి భాషణములను అభినందించినవి.(20)

టీ:- అన్యోన్యమితి. ఉపనిషదోஉపి మూర్తిమత్యస్సత్యః. తం సమజల్పన్నభ్యనందన్నిత్యర్థః.(20)

21. శ్లో. స వై కిలాయం పురుషః పురాతనో
య ఏక ఆసీదవిశేష ఆత్మని ।
అగ్రే గుణేభ్యోஉజనదాత్మనీశ్వరే
నిమీలితాత్మన్నిశి సుప్తశక్తిషు ॥

శ్రీకృష్ణుని ఆ గొప్పతేజస్సు దివ్యసౌందర్యమును చూచి ఆశ్చర్యపడునట్టి సఖురాండ్రకు 'స వా' అని నాలుగు శ్లోకాలచేత ఇతర స్త్రీలు చెపుతున్నారు. ఇచట ఆశ్చర్యపడవల్సిందేమిలేదు ఈ కృష్ణుడు సాక్షాత్తుగా పరమేశ్వరుడే. ( వై అను అవ్యయము స్మరించుటయందు, కిల అనునది ప్రసిద్ధియందు రూఢములు.) రెండవవాడులేని ఒకే ఒక పురుషుడు అంటే ఇతడే ఈ శ్రీకృష్ణుడే

టీ:- తత్ర తేజస్సౌందర్యాతిశయేన విస్మితాభ్యస్సఖీభ్యోఽన్యాః స్త్రియః కథయంతి. నాత్ర విస్మయః కార్యః. సాక్షాదీశ్వరత్వాద్వదస్యేతి చతుర్భిః స ఇత్యాదిభిః. వైస్మరణే. కిలేతి ప్రసిద్ధ్యా ప్రమాణద్యోతనమ్. య ఏక ఏవాద్వితీయః పురుషః ఆసీత్. స ఏవాయం శ్రీకృష్ణః. కుత్రాసీత్? అవిశేషే ఆత్మని. నిష్ప్రపంచే నిజస్వరూపే. కదా? అగ్రే గుణేభ్యః గుణక్షోభాత్పూర్వం. తథా నిశి. ప్రళయే చ. తస్య లక్షణం, జగతామాత్మని. నిమీలితాత్మన్నితి లుప్తసప్తమ్యంతం పదం జాతా వేకవచనం. ఈశ్వరేజీవేషు లీనరూపేషు సత్స్విత్యర్థః. నను జీవానాం బ్రహ్మత్వాత్కథం లయస్తత్రాహ - సుప్తాసు శక్తిషు సతీషు. జీవోపాధి భూత సత్త్వాదిశక్తిలయ ఏవ జీవలయ ఇవ లక్ష్యత ఇత్యర్థః(21)

గుణక్షోభకు పూర్వము, ప్రపంచము సృష్టికిపూర్వము లేనపుడు ఇతడు తన నిజ స్వరూపమున ఎక్కడ ఉన్నాడు? ప్రళయమందు ఎక్కడ ఉన్నాడు ? ప్రళయము అనగా ఈశ్వరునియందు జీవులు లీనమై ఉండుట జీవుడే బ్రహ్మ కదా అతనికి లయమెక్కడిది? ఈ ప్రశ్నలకు జీవుని శక్తులు క్షీణించగా అతని ఉపాధియైన సత్త్వాది శక్తుల లయమే జీవుని లయము అనునదే సమాధానము. (నిమీలితాత్మని అని ఉండుటకు బదులు నిమీలితాత్మన్ అని ఉండుట లోపించిన సప్తమీ విభక్తిగల శబ్దము) (21)

22. శ్లో. స ఏవ భూయో నిజవీర్య చోదితాం
స్వజీవమాయాం ప్రకృతిం సిసృక్షతీమ్ ।
అనామరూపాత్మని రూపనామనీ
విధిత్సమానోఽనుససార శాస్త్రకృత్ ॥

టీ:- తదేవం సృష్టేరాదౌ ప్రళయానంతరం చ నిష్ప్రపంచావస్థానముక్త్వా సృష్టిప్రళయయోర్మధ్యే ప్రపంచావస్థాన మాహుః. స ఏవాప్రచ్యుతస్వరూపసిద్ధి రేవ. ప్రకృతిమనుససార అధిష్ఠితవాన్.

ఈ విధంగా సృష్ట్యాదియందును, ప్రళయానంతరమందును, ప్రపంచములేని స్థానాన్నిచెప్పి సృష్టి, ప్రళయాల మధ్యన ఉన్న ప్రపంచ స్థితిని గూర్చి చెపుతున్నారు. ఆ కనిపించని స్వరూపస్థితియే ప్రకృతిని అనుసరించిఅధిష్ఠించినది. సృష్టి అనాది కావున మరల ఏకనారాయణుడే సృష్టించాలనుకొన్నాడు. సృష్టిచేయవలెననుకొని ప్రకృతిని కాలశక్తి ప్రేరితురాలిని, తనయంశభూతులగు జీవులను మాయద్వారా మోహింపజేయు దానిని అనుసరించాడు. ఎందుకు భగవానుడు ప్రకృతిని అనుసరించాడు అంటే నామరూపరహితమగు జీవునియందు

భూయః సృష్టిప్రవాహస్యానాదిత్వాత్కీదృశీం? నిజవీర్యచోదితాం స్వకాలశక్తిప్రేరితాం స్వాంశ భూతానాం జీవానాం.మాయాం మోహినీం. అత ఏవ సిసృక్షతీం స్రష్టుమిచ్ఛంతీం. కిమర్థమనుససార? అనామరూపే ఆత్మని జీవే. రూపనామనీ విధాతమిచ్ఛుః. ఉపాధిసృష్ట్వా జీవానాం భోగాయేత్యర్థః కర్మాణి చ విధాతుం వేదాన్ కృతవానిత్యాహుః - శాస్త్రకృదితి.(22)

నామరూపాలను కల్పించుటకు. ఉపాధిని సృష్టించి జీవులయొక్క భోగాలకొరకును కర్మలు విధించుటకును వేదములను చేసెను సృష్టించెను అని సమాధానము. (22)

23. శ్లో. స వా అయం యత్పదమత్ర సూరయో
జితేంద్రియా నిర్జితమాతరిశ్వనః ।
పశ్యంతి భక్త్యుత్కలితామలాత్మనా
నహ్యేష సత్త్వం పరిమార్ష్టుమర్హతి ॥

టీ:- అస్య దర్శనమతిదుర్లభమస్మాభిర్లబ్ధమిత్యాహుః. స ఇతి. సవై అయం యస్యపదం స్వరూపం అఘ్రిం వా నిర్జితో మాతరిశ్వా ప్రాణోయైః. ప్రస్పత్వమార్షం. తే సూరయ ఏవ పశ్యంతి కేన? భక్త్యా ఉత్కలితః. ఉత్కంఠితో౽మలోయ ఆత్మాబుద్ధిస్తేన. శ్రు."దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా" ఇతి శ్రుతేః. బుద్ధివైమల్యస్యాప్యయమేవ హేతురిత్యాహుః. నను హే సఖి ఏష ఏవ నస్సత్వం బుద్ధిం పరిమార్ష్టుం సమ్యక్ శోధయితం అర్హతి. నతు యోగాదయ ఇత్యర్థఃయద్వా. నను హే సఖి ఏష ఏవ నస్సత్త్వం జ్ఞాతం. పరిమార్ష్టుం నాశయితుం.

ఈతని దర్శనము దుర్లభము అది మనకు లభించినది అనుచున్నారు. ఇతడే ఈశ్వరుడు. ఈయన స్వరూపాన్ని (పాదాన్ని) ఎవరు గుర్తిస్తారు? ఎవరైతే ప్రాణవాయువును నిరోధించి తపిస్తారో,అట్టి విద్వాంసులు, తపస్సంపన్నులు, భక్తితో పరవశించిన నిర్మలమైన మనస్సుతో బుద్ధితో అతన్ని చూస్తారు. ఓ చెలీ ! ఈతడే బుద్ధిని నిర్మలము చేయగలడు యోగాభ్యాసాదులు ఆ పనిని చేయలేవు. యోగాభ్యాసాదులు చేసినా భగవదనుగ్రహం లేనిదే బుద్ధి నిర్మలమై భగవత్ సాక్షాత్కారము చేసికోలేదు. ఈతడు కనిపించకుండా దూరముగా వెళితే మనకు అతని జ్ఞానము నశిస్తుంది. కావున మనము ఇతనితోనే వెళ్ళాలి.(23)

దూరగమనేన అప్రత్యక్షీభవితుం నార్హతి. కింతు అనేన సహైవ గంతవ్యమిత్యర్థః. (23)

24. శ్లో. స వా అయం సఖ్యనుగీతసత్కథో
వేదేషు గుహ్యేషు చ గుహ్యవాదిభిః ।
య ఏక ఈశో జగదాత్మలీలయా
సృజత్యవత్యత్తి న తత్ర సజ్జతే ।

టీ:- పుణ్యశ్లోకతామహుః-స ఇతి. హేసఖి వేదేషు గుహ్యేషు రహస్యాగమేషు చ. రహస్య నిరూప కైః అనుగీతసత్కథః అనుగీతాః సత్కథాః యస్య సఏవాయం గాన ప్రకారమాహుః.-య ఏక ఇత్యాదినా.(24)

భగవానుడు కృష్ణుడు పుణ్యశ్లోకుడని చెపుతున్నారు. ఓ చెలీ ! ఈతడేకదా రహస్యములను తెల్పు సత్యమైన కథలతో, రహస్యములైన వేదములయందు గానము చేయబడేవాడు. 'య ఏక ఈశో' అని ఈతడొక్కడే తన లీలచేత జగత్తును సృష్టించి, కాపాడి, సంహరించ గలడు. జీవునిలాగ ఆ జగత్తునందు తగులుకొని సుఖ దుఃఖాదులను అనుభవించడు.(24)

25. శ్లో. యదాహ్యధర్మేణ తమోధియో నృపా
జీవంతి తత్రైష హి సత్త్వతః కిల ।
ధత్తే భగం సత్యమృతం దయాం యశో
భవాయ రూపాణి దధద్యుగే యుగే ॥

ఇటువంటి పరమాత్మ అనేక అవతారాలనెత్తుటకు కారణము చెపుతున్నారు.'యదాహి' అని. తమోగుణ ప్రధానులు, అజ్ఞానావృత బుద్ధులునగు రాజులు ఎపుడైతే అధర్మంగా జీవిస్తూ, స్వార్థపరులై తమ ప్రాణాలను పోషించుకుంటూ, ఇతరుల ప్రాణాలుతీస్తుంటారో అప్పుడు ప్రపంచస్థితి కొరకు ఈ భగవానుడే శుద్ధసత్త్వ ప్రధానమగు రూపాలను ధరించి, తన ఐశ్వర్యమును ప్రకటించి, దుష్టశిక్షణ, శిష్టరక్షణ

టీ:- ఏవం భూతస్య నానావతారకారణత్వమాహుః-యదేతి. తమోవ్యాప్తా ధీర్యేషాం తే నృపాః అధర్మేణ .జీవంతి కేవలం ప్రాణాన్ పుష్ణంతి. తత్ర తదా ఏషఏవ భవాయ స్థిత్యై. సత్వతః విశుద్ధ రూపేణ సత్వేన రూపాణి దధత్ భగాదీని ధత్తే ప్రకటయతి. యుగే యుగే తత్తదవసరే. భగ మైశ్వర్యం. సత్యం సత్య ప్రతిజ్ఞత్వం. ఋతం యథార్థోపదేశకత్వం దయాం భక్త కృపాం. యశః అద్భుత కర్మత్వం. (25)

ప్రతియుగమందును చేయును. భగమనగా ఐశ్వర్యము. భగవానుడనగా షడ్గుణైశ్వర్యసంపన్నుడు. అట్టి ఈతడు సత్య ప్రతిజ్ఞను యథార్థోపదేశమును, భక్తులయెడ కృప, అద్భుత కర్మలు చేయుటకు మాటిమాటికి అవతరించును.(25)

26 .శ్లో. అహో అలం శ్లాఘ్యతమం యదోః కులమ్
అహో అలం పుణ్యతమం మధోర్వనమ్ ।
యదేష పుంసామృషభః ప్రియశ్రవాః
స్వజన్మనా చంక్రమణేన చాంచతి ॥

టీ:- విశేషతః శ్రీకృష్ణావతారసౌభాగ్యం వర్ణయతి.-అహో ఇత్యాదిభిః పంచభిః యద్యస్మాదేవ పురుషోత్తమః శ్రియః పతిః స్వజన్మనా యదోః కులం అంచతి పూజయతి. సత్కరోతి. అతః శ్లాఘ్యతమం తత్ చంక్రమణేన చ మంధోర్వనం మధురాం సత్కరోతి. అతస్తత్పుణ్యతమ మితి తమ ప్రత్యయస్యాత్యంతాతిశయేన అలమితి. తత్రా ప్యాశ్చర్యే అహో ఇత్యుక్తం(26)

ముఖ్యముగా శ్రీకృష్ణావతార శ్రేష్ఠత్వమును 'అహో' అని అయిదు శ్లోకాలతో వివరిస్తున్నారు. ఈ కృష్ణుడు పురుషోత్తముడైనందున, లక్ష్మీనాథుడైనందున, తన జన్మచేత యదువంశాన్ని అలంకరించినాడు, దానిని గౌరవించినాడు. అందుకే ఆ యదుకులము ప్రశంసనీయ మైనది. కృష్ణుడు ఆవిర్భవించుట చేత మధువనముకూడా మిక్కిలి శ్రేష్ఠమైనది. తమప్ ప్రత్యయము మిక్కిలి శ్రేష్ఠత్వమును తెల్పినను, అలమను అవ్యయమువాడుట మిక్కిలి శ్రేష్ఠమైన వాటిలో కూడ శ్రేష్ఠమయ్యున్నది, తగినట్లుగా ఉన్నది. దానిలో కూడా ఆశ్చర్యజనక ముగా ఉన్నది. అను అర్థమును సూచించును.(26)

27. శ్లో. అహోబత స్వర్యశసస్తిరస్కరీ
కుశస్థలీ పుణ్యయశస్కరీ భువః ।
పశ్యంతి నిత్యం యదనుగ్రహేషితమ్
స్మితావలోకం స్వపతిం స్మ యత్ప్రజాః ॥

టీ:- ద్వారకాంశ్లాఘంతే. అహో ఇతి. అహో బత అత్యాశ్చర్యం కింతత్? కుశస్థలీ ద్వారకా. స్వర్గ ఉత్కృష్ట ఇతి యద్యశః తస్య తిరస్కరీ పరిభవకర్త్రీ. భువశ్చ పుణ్యయశస్కరీ భర్త్రీ భవతి. యద్యతః యత్ర త్యాన్సర్వాః ప్రజాః. స్వానుగ్రహేణ ఈషితం ప్రేషతం. స్మితపూర్వావలోకనం. యద్వా, అనుగ్రహార్థమీషితమిష్టం. స్వస్యాత్మనః పతిం శ్రీకృష్ణం. న తు పిత్రాదివద్దేహమాత్రస్య పతిం నిత్యం పశ్యంతి స్మ. ఉషితమితి పాఠే స్వానుగ్రహార్థముషితం కృతవాసం నైతత్స్వర్గేఽస్తీత్యర్థః. (27)

ద్వారకానగరాన్ని ప్రశంసిస్తున్నారు. ఎంత ఆశ్చర్యము? అదేమిటి? ఈ ద్వారక స్వర్గవైభవాన్ని, దాని కీర్తిని కూడ తిరస్కరిస్తున్నది. భూలోకానికి పవిత్రమగు గొప్ప కీర్తిని ఆపాదించినదిది. ఈ కుశస్థలిలో (ద్వారకలో) ఉన్న ప్రజలు కృష్ణుని అనుగ్రహంతో చిరునగవులతో, ప్రేమ పూర్వకమైన చూపులతో నిత్యము ఆ భగవంతుని అనుభవిస్తున్నారు. వారు తమకు పార్థివ దేహాన్ని ప్రసాదించిన పితరులనువలె గాక, శ్రీకృష్ణుని తమ ప్రాణనాథునిగా కూడా భావిస్తున్నారు. స్వర్గలోకవాసులకుగూడ నిత్యము శ్రీకృష్ణ దర్శన భాగ్యము లేదు. అది ద్వారకా వాసులకు లభించినది, అది వారి పుణ్య విశేషము. (27)

28. శ్లో. నూనం వ్రతస్నానహుతాదినేశ్వరః
సమర్చితో హ్యస్య గృహీతపాణిభిః ।
పిబంతి యాః సఖ్యధరామృతం ముహుః
వ్రజస్త్రియః సంముముహుర్యదాశయాః ॥

ఓ చెలీ ! శ్రీకృష్ణప్రభువు పాణిగ్రహణము చేసిన ఆయన పత్నులు నిశ్చయముగా పూర్వజన్మలో అనేక వ్రతములు, ప్రాతః స్నానములు, హోమముల ద్వారా ఈశ్వరుని పూజించి ఉండాలి. ఇక ఈ కృష్ణుని అధరోష్ఠామృతపానమందు మనస్సు కల వ్రజస్త్రీలు మాటిమాటికి మోహముతో దానిని పానము చేయగలుగుతున్నారు. ఆ కృష్ణునితో వ్రజస్త్రీలకు గల అనుబంధము ఈ జన్మదికాదు అది

టీ:- నూనమితి- హే సఖి. అస్య గృహీతపాణిభిః పత్నీభిః. ఈశ్వరః అయమేవ. నూనం జన్మాంతరేషు సమర్చితః యస్మిన్ అధరామృతే. ఆశయః చిత్తం యాసాం తాః. సంముముహుః సంమోహం ప్రాప్తాః ఇతి మనోహరత్వముక్తం. (28)

29. శ్లో. యా వీర్యశుల్కేన హృతాః స్వయంవరే
ప్రమథ్య చైద్యప్రముఖాన్ హి శుష్మిణః ।
ప్రద్యుమ్న సాంబాంబ సుతాదయో: పరా
యాశ్చాహృతా భౌమవధే సహస్రశః ॥

టీ:- ఏతత్ప్రపంచయతి ద్వాభ్యాం-యేతి. వీర్యం ప్రభావ ఏవ శుల్కం మూల్యం తేన. విశుష్మిణః బలిష్ఠాన్. ప్రద్యుమ్నశ్చ సాంబశ్చ అంబశ్చ సుతాః యాసాం రుక్మిణీ జాంబవతీనాగ్నజితీనాం. తా ఆదిర్యాసాం సత్యభామాదీనాం తాః. యాశ్చాపరాః. అస్య శ్లోకస్యోత్తరశ్లోకేనాన్వయః (29)

30. శ్లో. ఏతాః పరం స్త్రీత్వమపాస్తపేశలం
నిరస్తశౌచం బత సాధు కుర్వతే
యాసాం గృహాత్పుష్కరలోచనః పతిః
న జాత్వపైత్యాహృతిభిర్హృది స్పృశన్ ॥

జన్మాంతరీయమే నిశ్చయము.(28)

ఈ విషయాన్నే విస్తరించి రెండు శ్లోకాలతో చెపుతున్నారు. పరాక్రమమే మూల్యముగాగల కృష్ణుడు, స్వయంవరములందు బలిష్ఠులైన శిశుపాలాదులను వధించి, రుక్మిణీ, జాంబవతీ, నాగ్నజితీ, సత్యభామాది నారీమణులను ఇంకను నరకాసుర వధచేసి అనేక వేలమంది రాజకన్యలను భార్యలగా పొందెను. వారి వలన ప్రద్యుమ్నుడు, సాంబుడు, లింబుడు అను కుమారులను కూడా పొందెను. స్త్రీత్వాన్ని పొందడమే మంచిదని ఆ పత్నులు భావించారని చెప్పు తరువాతి శ్లోకముతో అన్వయము.(29)

వీరందరు ఏ స్వాతంత్ర్యము లేనిదైనను, శుచిత్వము లేనదైనను అట్టి స్త్రీత్వమే మిక్కిలి శ్రేష్ఠమని తలచినారు. కమలాక్షుడగు కృష్ణుడు వారి భర్త ఎల్లప్పుడు ప్రియవాక్యాలను పలుకుతూ, పారిజాత వృక్షము మొదలగు తమ కిష్టమైన వస్తువులను తెచ్చిపెడుతూ, వారి మనస్సులను స్పృశిస్తూ, ఆనందపరుస్తూ వారి ఇండ్లను విడిచిపోలేదు కావున తమ స్త్రీత్వాన్ని సమర్థించుకొన్నారు శ్రీకృష్ణుని ప్రియురాండ్రు.(30)

టీ:- ఏతా ఇతి. ఏతాః స్త్రీత్వమేవ పరం కేవలం, సాధు శోభనం కుర్వతే. అపాస్తం గతం పేశలం భద్రం స్వాతంత్ర్యం యస్మాత్తత్. నిరస్తం శౌచం శుచిత్వం యస్మాత్ తథా భూతమపి. జాతు కదాచిదపి నాపైతి న నిర్గచ్ఛతి . ఆహృతిభిర్వ్యాహారైః. యద్వా. పారిజాతాది ప్రియవస్త్వాహరణైః హృది స్పృశన్ ఆనందయన్.(30)

**శ్రీసూత ఉవాచ.**

31. శ్లో. ఏవం విధా వదంతీనాం
స గిరః పురయోషితామ్ ।
నిరీక్షణేనాభినందన్
సస్మితేన యయౌ హరిః ॥

**సూతుడిట్లనెను.**

ఇటువంటి చిత్రములైన వాక్కులను పలుకుచున్న పురస్త్రీల యొక్క మాటలను చిరునగవుతో కూడిన తన చూపులచేత అభినందిస్తూ ద్వారకకు శ్రీకృష్ణుడు వెళ్ళెను.(31)

టీ:- ఏవం విధా ఇతి. ఏవంవిధాఃవిచిత్రా గిరః. సస్మి తేన నిరీక్షణేనాభినందన్ స హరిర్యయౌ.(31)

32. శ్లో. అజాతశత్రుః పృతనాం
గోపీథాయ మధుద్విషః ।
పరేభ్యః శంకితః స్నేహాత్
ప్రాయుఙ్క్త చతురంగిణీమ్ ॥

ధర్మరాజు, ప్రేమతో శ్రీకృష్ణునికి శత్రువుల వలన ప్రమాదాన్ని ఊహించి రక్షణగా ఆశ్వికి, హాస్తిప, రథిక, పదాతి బలాలతో కూడిన సేనను పంపించెను.(32)

టీ:- అజాతశత్రురితి. మధుద్విషో గోపీథాయ రక్షణాయ. స్నేహాత్పరేభ్యశ్శత్రుభ్యశ్శంకితస్సన్. ప్రాయుజ్క్త. శ్లో. "హ స్త్యశ్వరథ పాదాతం సేనాంగం స్యాచంచతుర్విధ" మిత్యేవం చతురంగిణీం పృతనాం సేనాం.(32)

33\. శ్లో. అథ దూరాగతాన్ శౌరిః
కౌరవాన్ విరహాతురాన్ ।
సంనివర్త్య దృఢం స్నిగ్ధాన్
ప్రాయాత్స్వనగరీం ప్రియైః ॥

చాలా దూరము వఱకు వెంబడి వచ్చిన పాండవులను, తన విరహముతో బాధ పడుతున్న తనయందత్యంత ప్రేమగల వారిన, వెనకకు మరల్చి శ్రీకృష్ణుడు ఉద్ధవాది ప్రియ భక్తులతో తన పట్టణానికి వెళ్ళెను. పాండురాజు కురువంశజుడు కనుక పాండవులు ఇచట కౌరవులనబడినారు, ప్రియులనగా ఉద్ధవాదులు.(33)

టీ:- అథేతి. పాండోః కురు వంశజత్వాత్ పాండవా అపి కౌరవా ఏవ. తాన్ ప్రియైరుద్ధవాదిభిస్సహ.(33)

34\. శ్లో. కురుజాంగలపాంచాలాన్
శూరసేనాన్ సయామునాన్ ।
బ్రహ్మావర్తం కురుక్షేత్రం
మత్స్యాన్ సారస్వతానథ ॥

కురుక్షేత్రమును, అచటి అరణ్యప్రాయమైన జాంగలదేశమును, పాంచాలదేశాన్ని, యమునానదితో కూడిన శూరసేనదేశాన్ని, బ్రహ్మావర్తనమును, కురుదేశాంతర్గతమగు కురుక్షేత్రమును, మత్స్యదేశమును సారస్వతదేశముల చుట్టు తిరుగుతూ శ్రీకృష్ణుడు వెళ్ళెనని ముందటి శ్లోకముతో అన్వయము.(34)

టీ:- కుర్వితి. కురుక్షేత్రం, కురుదేశాంతర్గతమేవ. క్రమోఽత్ర న వివక్షితః.(34)

35. శ్లో. మరుధన్వానతిక్రమ్య
సౌవరాభీరయోః పరాన్ ।
ఆనర్తాన్ భార్గవః ప్రాగాత్
శ్రాంతవాహో మనాగ్విభుః ॥

టీ:- మర్వితి. మరుః నిరుదకో దేశః ధన్వోఽల్పోదకదేశః. ఆనర్తాఖ్యో ద్వారకాదేశః. స విభుః ప్రాగాత్ప్రాప్తః, హే భార్గవ శౌనక. మనాక్ ఈషచ్ఛ్రాంతాః వాహాః యస్య సః.(35)

ఓ శౌనకా ! నీరులేని మరుభూములను, కొద్దిగా నీరుకల మరుధన్వభూములను, ఆభీర దేశములను ఆ తరువాత వచ్చు ఆనర్త దేశములను, దాటి కొద్దిగా అలసి పోయిన గుఱ్ఱములతో ప్రభువైన కృష్ణుడు ద్వారకా నగరమున ప్రవేశించెను.(35)

36. శ్లో. తత్ర తత్ర హ తత్రత్యైః
హరిః ప్రత్యుద్యతార్హణః ।
సాయం భేజే దిశం పశ్చాత్
గవిష్ఠో గాం గతస్తదా ॥

టీ:- తత్రేతి. తత్రతత్ర దేశే తత్రత్యైర్జనైః. ప్రత్యుద్యతాని నివేదితాని. అర్హణాని ఉపాయనాని యస్మై సః. సాయమపరాహ్ణే. పశ్చాద్దిశం పశ్చిమాందిశం. భేజే ప్రాప్తః. తదా గవిష్ఠః ఆకాశస్థః సూర్యః. గాం ఉదకం. గతః ప్రవిష్టః. అస్తంగత ఇత్యర్థః."శ్రు. అద్భ్యోవా ఏష ప్రాతరుదేత్యపస్సాయం ప్రవిశతి" ఇతి శ్రుతేః. యద్వా,తదా సాయంకాలే రథాదవతీర్య గవిష్ఠః భూమౌ స్థితః. గాం జలాశయం గతస్సన్, పశ్చాద్దిశం భేజేసంధ్యాముపాసితవానిత్యర్థః.(36)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం సంహితాయాం ప్రథమేస్కంధే భావార్థదీపికాయాం దశమోఽధ్యాయః**

ఆయా దేశములందు అచటనున్న జనులచేత ప్రేమతో ఒసగబడిన కానుకలను స్వీకరించిన శ్రీకృష్ణుడు, సాయంసమయమున పశ్చిమ దిక్కు నుండి ద్వారకానగరమున ప్రవేశించెను. అపుడు స్వర్గమున ప్రకాశించు సూర్యుడు అస్తమించెను. లేదా అపుడు సాయంకాలముకాగా శ్రీకృష్ణుడు రథము నుండి దిగి జలాశయానికి వెళ్ళి పశ్చిమ దిక్కున సంధ్యోపాసనగావించెను అని అర్థము.(36)

**శ్రీమద్భాగవతము యొక్క ప్రథమస్కంధ దశమాధ్యాయమునకు శ్రీధరీయవ్యాఖ్యానుసార ఆంధ్రానువాదము ముగిసినది.**

## ఏకాదశోఽధ్యాయః

**సూత ఉవాచ.**

1. శ్లో. ఆనర్తాన్ స ఉపవ్రజ్య
స్వృద్ధాన్ జనపదాన్ స్వకాన్ ।
దధ్మౌ దరవరం తేషాం
విషాదం శమయన్నివ ॥

టీ:- శ్లో. ఏకాదశే రతిస్సమ్యగ్యాదవేంద్రస్య వర్ణ్యతే, ఆనర్తైస్స్వీయ మానస్య పురీం నిర్విశ్యబంధుభిః. ఉత్సవైరుల్లసత్తౌరముదం చద్ధ్వజవారణమ్, ఉల్లసద్రత్నదీపాది స్వపురం ప్రావిశత్ప్రభుః. ఆనర్తానితి. స్వృద్ధాన్ సమృద్ధాన్, దరవరం పాంచజన్యం శంఖం, దధ్మౌ నాదితవాన్. (1)

2. శ్లో. స ఉచ్చకాశే ధవళోదరో దరో ।
ఉరుక్రమస్యాధరశోణశోణిమా ।
దాధ్మాయమానః కరకంజసంపుటే ।
యథాఽబ్జఖండే కలహంస ఉత్స్వనః ॥

## ఏకాదశాధ్యాయము

**సూతులవారు చెపుతున్నారు.**

సమృద్ధములైన తన ఆనర్త దేశములనుచేరి అచటి ప్రజల చేత, తన బంధువులచేత స్తుతించబడినవాడై, ఆ శ్రీకృష్ణుడు ద్వారకావాసులలో తన వియోగంచేత ఏర్పడిన దుఃఖాన్ని తొలగించుచున్నాడో యన్నట్లు, శంఖములలో శ్రేష్ఠమైన తన పాంచజన్యమను శంఖమును పూరించెను. శంఖనాదముచేత తన రాకనెఱింగించి ద్వారకావాసులకు సంతోషము కలిగించెను. (ఈ ఏకాదశాధ్యాయమున తన బంధువుల స్తోత్రములతో శ్రీకృష్ణునికి కలిగిన సంతోషాన్ని వ్యాసులవారు వర్ణించారు.) గొప్ప ఉత్సవముతో, సంభ్రమముగా ఉన్న, ఇంటింట ఎగురవేయబడిన జెండాలు, తోరణాలుకల, బాగా ప్రకాశిస్తున్న రత్నదీపాలుకల తన ద్వారకాపురిలో ప్రభువగు శ్రీకృష్ణుడు ప్రవేశించెను.(1)

తెల్లనైన ఉదర భాగముకల ఆ పాంచజన్య శంఖము, శ్రీకృష్ణభగవానుని ఎఱ్ఱని పెదవుల మధ్య, ఎఱ్ఱదైన ఆ భగవానుని కరకమలముల సంపుటమందు ధరించబడి, పూరింపబడుతూ, ఎఱ్ఱని కమలముల సమూహ మధ్యనుండి కలకలారావములు గావించు రాజహంసవలె మిక్కిలిగ ప్రకాశించెను.(2)

టీ:- స ఇతి. దరః శంఖః దధ్మాయమానః అతిశయేన భగవతా పూర్యమాణః, ఉచ్చకాశే శుశుభ ఇత్యన్వయః, కథంభూతః? ధవళముదరం యస్య సః ధవళోదరః ఉరుక్రమస్య దామోదరస్య. కృష్ణస్య అధరస్య శోణేన రాగేణ శోణిమా శోణభావో యస్య సః అధరశోణశోణిమా. స్వార్థే వా ఇమన్. కరకంజే హస్తకమలే తయోస్సంపుటే మధ్యే వర్తమానశ్శుశుభే. కథమివ? అబ్జషండే రక్తే కమలసమూహే కలహంసో రాజహంసో యథా, తద్వత్.(2)

3. శ్లో. తముపశ్రుత్య నినదం
జగద్భయభయావహమ్ ।
ప్రత్యుద్యయుః ప్రజాః సర్వాః
భర్తృదర్శన లాలసాః ॥

టీ:- తమితి. జగతో యద్భయం తస్య భయావహం. జగద్భవభయాపహమితి పాఠే జగతాం జీవానాం. భవాత్సంసారాద్భయం తదపహంతీతి జగద్భవభయాపహం, ప్రత్యుద్యయుః ప్రత్యుజ్జగ్ముః. భర్తృదర్శనేలాలసాః.(3)

జగత్తు యొక్క భయమునకు భయాన్ని కలిగించు దానిని లేదా జగత్తునకు భయము కలిగించు రాక్షసులకు భయము కలిగించునట్టి తమ ప్రభువు యొక్క శంఖ ధ్వనిని ద్వారకాపురప్రజలు తమ ప్రభువును చూడవలయునను ప్రగాఢమైన కోరికకలవారై మహోత్సాహముతో ఎదురుగా వచ్చి స్వాగతమును పలికిరి.(3)

4. శ్లో. తత్రోపనీతబలయో ।
రవేర్దీపమివోద్యతాః ।
ఆత్మారామం పూర్ణకామం
నిజలాభేన నిత్యదా ॥

టీ:- తత్రేత్యాదిశోకద్వయ మేకం వాక్యం. తత్ర తస్మిన్ శ్రీకృష్ణే. ఉపనీతాస్సమరితాః బలయః ఉపాయనాని యాభిస్తాః. నిరపేక్షేఽపి తస్మిన్నాదరేణ సమర్పణే దృష్టాంతః. రవేర్దీపమివేతి(4)

5. శ్లో. ప్రీత్యుత్ఫుల్లముఖాః ప్రోచుః ।
హర్షగద్గదయా గిరా ।
పితరంసర్వ సుహృదమ్
అవితారమివార్భకాః ॥

టీ:- ప్రీతీతి. పితరమర్భకా ఇవతం సర్వసుహృదం అవితారం స్వసంరక్షకం ప్రోచురిత్యు త్తరేణాన్వయః సుహృత్త్వేనైవావితారం. నతు కామేన తత్రహేతుః ఆత్మారామం తత్రాపి హేతుః, పరమానంద నిజ స్వరూపలాభేనైవ పూర్ణ కామం.(5)

సంతోషము, ప్రేమ, మందహాసముఖములు కలవారై ఆ ద్వారకా ప్రజలు శ్రీకృష్ణునికి కానుకలు సమర్పించిరి. ఆ పరమాత్మ అపేక్షించకున్నను సూర్యునికి దీపమువలె ఆదర భావముతో సమర్పించిరి. తండ్రి పట్ల ప్రవర్తించు పిల్లలవలె ఆ ద్వారకావాసులు అందఱకు స్నేహితుడగు ఆ పరమాత్ముని కేవలము స్నేహభావముతో ఏ కోరికలు లేకుండా హర్ష, గద్గద స్వరముగల వాక్కుతో, ప్రీతితో ఇట్లు పలికిరి. పరమేశ్వరుడు ఆత్మారాముడు. తనలో తానే ఆనందించువాడు మిక్కిలి విశిష్టమైన నిజస్వరూప లాభముతోనే పూర్ణకాముడు కావున.(4,5 శ్లోకములకు కలిపి)

6. శ్లో. నతాః స్మ హే నాథ తవాంఘ్రి పంకజం
విరించివైరించసురేంద్రవందితమ్ ।
పరాయణం క్షేమమిహేచ్ఛతాం పరం
న యత్ర కాలః ప్రభవేత్పరః ప్రభుః ॥

టీ:- నతా ఇతి. విరించిః బ్రహ్మ వైరించాస్సనకాదయః. ఇహ సంసారే, పరంక్షేమమిచ్ఛతాం. పరాయణం శరణం కుతః? పరేషాం బ్రహ్మాదీనాం ప్రభురసి. కాలోయత్ర ప్రభుర్నభవేత్.(6)

శ్రీకృష్ణునితో వారేమనిరి అనుదానికి చెపుతున్నాడు. ఓ ప్రభూ! బ్రహ్మ సనకాదిమహామునులచే నమస్కరింపబడునట్టిదియు, ఈ సంసారమున సారమైన ఉత్కృష్టముగా క్షేమమును కోరునట్టి వారికి మిక్కిలి రక్షకమైనట్టిదియు అగు నీ పాదకమలములకు నమస్కరించు చున్నాము. బ్రహ్మాదులకు, అందరికిని ప్రభువగు కాలము కూడ ఏ స్వామిపాద సన్నిధి అధికారము సాగించలేదో అట్టి విశిష్టమైనది భగవంతుడవగు నీ పాదము. కాలము అందరిని కబళించును అట్టి కాలము కూడా మృత్యువు కూడా భగవంతుడవైన నీ విషయమున ఏమి చేయుటకును సమర్థముకాదు. భగవద్భక్తులను మృత్యువు కూడ ఏమిచేయలేదు. (6)

7. శ్లో. భవాయ నస్త్వం భవ విశ్వభావన
త్వమేవ మాతాఽఽత్మసుహృత్పితా ।
త్వం సద్గురుర్నః పరమం చ దైవతం
యస్యానువృత్త్యా కృతినో బభూవిమ ॥

టీ:- భవాయేతి. అతోభవాయ ఉద్భవాయ. నోఽస్మాకం త్వం భవ. హే విశ్వ భావన, కృతినః కృతార్థః బభూవిమ జాతావయం (7)

ప్రపంచమును సృష్టించినవాడా ! ప్రపంచమున భావింపబడువాడా ! ఓ పరమేశ్వరా నీవు మా క్షేమము కొరకు రూపమును ధరించుము. మాకు నీవే సర్వము ఇతరులెవ్వరు కారు. (ఇచట ఏవకారము ఇతర యోగవ్యవచ్ఛేదకార్థము) స్వామీ నీవే మాకు తల్లివి, తండ్రివి, స్నేహితుడవు, అధిపతివి, మంచి గురుడవు, అభీష్టదైవమవు. నీ సేవచేతనే మేము కృతార్థులము అయినాము.(7)

8. శ్లో. అహో సనాథా భవతా స్మ యద్వయం
త్రైవిష్టపానామపి దూరదర్శనమ్ ।
ప్రేమస్మితస్నిగ్ధ నిరీక్షణాననం
పశ్యేమ రూపం తవ సర్వసౌభగమ్ ॥

టీ:- కృతార్థత్వమేవాహుః -అహో ఇతి. అహో భవతా వయం సనాథాఃస్మః యద్యస్మాత్తవ రూపంపశ్యేమ. త్రైవిష్టపానామపి దూరదర్శనం దేవానామపి దుర్దర్శమిత్యర్థః, ప్రేమ్ణా యత్ స్మితం తద్యుక్తం స్నిగ్ధం నిరీక్షణంయస్మింస్తదాననం యస్మిన్, తద్రూపం సర్వేషు చాంగేషు సౌభగం యస్మిన్ తద్రూపం.(8)

వారు తమకు కృతార్థత్వము కలిగినదని చెపుతున్నారు. అయ్యా! మేము మీ వలన సనాథులమయ్యాము. ఆ కారణముగా దేవతలకు కూడ చూడ శక్యముగాని కనిపించినా దూరంగా మాత్రమే కనిపించే వాడవును, ప్రేమతో చిరునగవు చిందించు వాడవును, స్నేహంతో కూడిన చూపులు గల ముఖము కలిగినవాడవును, ప్రభూ ! మేము సమస్తావయవ సౌందర్యసారమైన నీ రూపమును చూస్తున్నాము.(8)

9. శ్లో. యర్హ్యంబుజాక్షాపససార భో భవాన్
కురూన్మధూన్వాథ సుహృద్దిదృక్షయా ।
తత్రాబ్దకోటిప్రతిమః క్షణోఽభవద్ ।
రవేర్వినాక్ష్ణోమివ నస్తవాచ్యుత ॥

టీ:- అర్భకా ఇవ సకరుణమాహుః-యర్హీతి. యర్హి యదా. భోఅంబుజాక్ష ! నో భవానితి పాఠే న ఇత్యనాదరే షష్ఠీ. భవాన్ అస్మాన్ అనాదృత్య అపససార అపహాయ జగామ. కురూన్ హస్తినాపురం. మధూన్ మధురాన్వా. తత్ర తదా. రవింవినా ఆంధ్యమక్ష్ణోర్యథా ఏవం తవ; నః త్వదీయానామస్మాకమపీత్యర్థః(9)

చిన్న పిల్లలవలె దీనముగా ద్వారకావాసులు పలుకుచున్నారు. ఓ కమలాక్షా ! మీరు స్నేహితులను చూచుటకు కురుదేశానికి, హస్తినాపురమునకు, మధురకు ఇచటి నుండి వెళ్ళిపోయినప్పటి నుండి ( మమ్ములనాదరింపక అని అనాదరార్థమున నః = మాకు అని షష్ఠీ విభక్తి) మా చూపు సూర్యుడు లేని గుడ్డి చూపువలె అయినది, ఒక్కొక్క క్షణము కోటి సంవత్సరములకు సమానమైనదిగా అయినది.(9)

**శ్రీసూత ఉవాచ.**

10. శ్లో. ఇతి చోదీరితా వాచః
ప్రజానాం భక్తపాలకః ।
శృణ్వన్ననుగ్రహం దృష్ట్యా
వితన్వన్ ప్రావిశత్పురీమ్ ॥

టీ:- ఇతీతి. ఇతి చ ఏవంవిధాః అన్యాః ఉచ్చరితాః వాచఃశృణ్వన్ దృష్ట్యా సాభినందనావలోకనేన. అనుగ్రహం కుర్వన్. పురం ద్వారకాం ప్రావిశత్. (10)

**శ్రీసూతులవారిట్లనిరి.**

భక్తవత్సలుడగు భగవానుడు ప్రజల యొక్క ఇట్టి ప్రేమ పూరితములైన మాటలను వినుచు అభినందన, ఆత్మీయతగల చూపుతో వారిని అనుగ్రహిస్తూ ద్వారకా నగరము ప్రవేశించెను. (10)

11. శ్లో. మధుభోజదశార్హార్హ
కుకురాంధకవృష్ణిభిః ।
ఆత్మతుల్యబలైర్గుప్తాం
నాగైర్భోగవతీమివ ॥

టీ:- ద్వారకాం ప్రస్తౌతి-పంచభిః. మధ్వితి. స్వతుల్యబలైర్మధు భోజాభిర్గుప్తాం రక్షితాం. (11)

ఆ ద్వారకానగరాన్ని ఐదు శ్లోకాలతో స్తుతిస్తున్నాడు. తనతో సమానమైన బలముగల మధు భోజ, దశార్హ, అర్హ, కుకుర, అంధక, వృష్ణి వంశీయులైన వారిచేత కాపాడబడుతూ, నాగరాజుల చేత కాపాడబడు పాతాళమువలెనున్న ద్వారకను ప్రవేశించెను. (పూర్వశ్లోకముతో అన్వయము) (11)

12. శ్లో. సర్వర్తుసర్వవిభవైః
పుణ్యవృక్షలతాశ్రమైః ।
ఉద్యానోపవనారామైః
వృతాం పద్మాకరశ్రియమ్ ॥

టీ:- సర్వేతి. సర్వేషు ఋతుషు. సర్వే విభవాః పుష్పాదిసంపదో యేషాం తే పుణ్యా వృక్షాః లతాశ్రమాః లతామంటపాశ్చ యేషు తైరుద్యానాదిభిర్వృతాః యే పద్మాకరాస్సరాంసి, తైర్యా శ్రీః శోభా యస్యా తాం. ఉద్యానం ఫలప్రధానం ఉపవనం. పుష్పప్రధానం. ఆరామః క్రీడార్థం వనం.(12)

13. శ్లో. గోపురద్వారమార్గేషు
కృత కౌతుకతోరణామ్ ।
చిత్రధ్వజపతాకాగ్రైః
అంతఃప్రతిహతాతపామ్ ॥

టీ:- గోపురేతి గోపురం పురద్వారం. ద్వారం గృహద్వారం, కృతాని కౌతుకేన ఉత్సవేన తోరణాని యస్యాంతాం గరుడాది వీరచిహ్నాంకితాః ధజాః జయప్రదయంత్రాకితా పతాకాః చిత్రాణాం ధ్వజపతాకానాం. అగ్రైరంతః ప్రతిహతః అత పోయస్యాం తాం (13)

అన్ని ఋతువులయందు కూడ అన్ని రకాల పుష్పముల సంపదలతో, మంచి వృక్షముల, లతామండపముల,ఆశ్రమములతో ఉద్యానవనముల, ఉపవనముల, ఆరామములతో, కూడిన కమలముల సరస్సుల శోభగల ఆ ద్వారకను కృష్ణుడు ప్రవేశించెను. (ఇచట సాధారణంగా తోటలు అను అర్థం కల ఉద్యాన, ఉపవన, ఆరామ పదాలకు శ్రీధరులచే విశేషార్థాలు వివరించబడినాయి. ఉద్యాన వనములు పండ్లు ప్రధానంగా కలవని, ఉపవనాలు పూలు ప్రధానము లుగా కలవని, ఆరామాలు ఆటలు విహారభూములు ప్రధానము లుగాగల స్థానాలని శ్రీధరులు విశ్లేషించారు) (12)

ద్వారకాపట్టణమున ప్రతి ఇంటి ద్వారములందును, రాజమార్గములయందును ఉత్సవముతో, ఉత్సాహముతో తోరణాలు కట్టబడినవి. విచిత్రములైన గరుడాది చిహ్నములుగల జెండాలతో అలంకరింపబడినది. ఇళ్ళలోపలికి ఎండరాని ద్వారకను కృష్ణుడు ప్రవేశించెను.(13)

14\. శ్లో. సమ్మార్జితమహామార్గ
రథ్యాపణకచత్వరామ్ ।
సిక్తాం గంధజలైరుప్తాం
ఫలపుష్పాక్షతాంకురైః ॥

15\. శ్లో. ద్వారి ద్వారి గృహాణాం చ
దధ్యక్షతఫలేక్షుభిః ।
అలంకృతాం పూర్ణకుంభైః
బలిభిర్ధూపదీపకైః ॥

టీ:- సమ్మార్జితేతి. సంమార్జితాని నిస్సారితరజస్కాని. మహామార్గాదీని యస్యాం. మహామార్గాః రాజమార్గాః రథ్యాః ఇతరమార్గాః ఆపణకాః పణ్యవీథయః చత్వరాణి అఙ్గణాని. ఫలాదిభిరుప్తాం అవకీర్ణాం. (14,15)

ఆ ద్వారకానగర రాజమార్గాలు, ఇతర మార్గాలు, దుకాణాల వీధులు శుభ్రముగా ఊడువబడి, పన్నీరు చల్లబడి, పండ్లు, పూలు, అక్షతలచే, దూర్వాంకురములచే అలంకరింపబడినవి. అంతేకాక ప్రతి ఇంటి ద్వారములయందును పెరుగు, అక్షతలు, పండ్లు, చెరుకులు కడపలయందు పూర్ణకుంభములు ఉంచబడినవి. మరియు ఇండ్ల ద్వారములు ధూప దీప నైవేద్యములతో విరాజిల్లినవి. అట్టి ద్వారకా నగరములో శ్రీకృష్ణుడు ప్రవేశించెను. (14,15)

16\. శ్లో. నిశమ్య ప్రేష్ఠమాయాంతం
వసుదేవో మహామనాః ।
అక్రూరశ్చోగ్రసేనశ్చ
రామశ్చాద్భుతవిక్రమః ॥

అంతరాత్మవలె ప్రియమై, వచ్చుచున్న శ్రీకృష్ణుని గుర్తెటిగి, గొప్ప మనస్సుకల వసుదేవుడు, అక్రూరుడు, ఉగ్రసేనమహారాజు, బల పరాక్రమములుగల బలరాముడు మొదలైన వారు ఎదురేగి స్వాగతము పలికిరి. ( నాలుగవ శ్లోకముతో అన్వయము.) (16)

టీ:- నిశమ్యేత్యాదిశ్లోకచతుష్కమేకం వాక్యం. ప్రేష్ఠమత్యంత ప్రీతివిషయం ఆయాంతం. నిశమ్యశ్రుత్వా. వసుదేవాదయః ప్రత్యుజ్జగ్మురితి చతుర్థేనాన్వయః.(16)

17. శ్లో. ప్రద్యుమ్నశ్చారుదేష్ణశ్చ
యే చ సాంబగదాదయః ।
ప్రహర్షవేగోచ్ఛ్వశిత ।
శయనాసనభోజనాః ॥

టీ:- ప్రద్యుమ్న ఇతి. ప్రహర్షవేగోచ్ఛ్వసితాని ఉల్లంఘితాని శయనాదీని యైః శ్వస ప్లుతగతౌ(17)

ప్రద్యుమ్నుడు, చారుదేష్ణుడు, జాంబవతీ కుమారుడు సాంబుడు సంతోషమునందలి సంభ్రమముచే తొందఱతో ఎగిరి గంతులు వేయుచు, శయ్యలు, ఆసనాలు,భోజనాలు విడిచి, ఎదురేగి కృష్ణునికి స్వాగతము పలికిరి.( ముందటి శ్లోకముతో అన్వయము. మూలంలోని ఉచ్ఛ్వశిత అనుపదము ఉత్ అను ఉపసర్గతో కూడిన, ప్లుతగతితో దుంకుతూ వెళ్ళడమనే అర్థముకల శశ ధాతువు నుండి ఏర్పడిన క్త ప్రత్యయయుత రూపము.) (17)

18. శ్లో. వారణేంద్రం పురస్కృత్య
బ్రాహ్మణైస్ససుమంగలైః ।
శంఖతూర్యనినాదేన
బ్రాహ్మఘోషేణ చాదృతాః ॥

టీ:- వారణేంద్రమితి. వారణేంద్రం మంగళార్థం పురతః కృత్వా ససుమంగళైః సమంగళపుష్పాదియుక్తపాణిభిః బ్రహ్మఘోషో మంత్రపాఠశ్చ.(18)

ద్వారకావాసులందఱు బ్రాహ్మణోత్తములతో కూడి ఒక మహాగజాన్ని ముందుంచుకొని మంగళద్రవ్యములను, పుష్పాక్షతాదులను చేతులలో ధరించి శంఖధ్వనితో మంగళవాద్య ధ్వనులతో, వేదఘోషతో అత్యాదరముగా ఎదురేగి శ్రీకృష్ణునికి స్వాగతము పలికిరి. ( తరువాతి శ్లోకముతో అన్వయము.) (18)

19. శ్లో. ప్రత్యుజ్జగ్మూరథైర్హృష్టాః
ప్రణయాగతసాధ్వసాః ।
వారముఖ్యాశ్చ శతశో
యానైస్తద్దర్శనోత్సుకాః ।
లసత్కుండలనిర్భాత
కపోలవదనశ్రియః ॥

టీ:- ప్రత్యుజ్జగురితి సార్ధశ్లోక మేకం వాక్యం. ప్రణయేన స్నేహేన. ఆగతం సాధ్వసం సంభ్రమో యాషాం తే వారముఖ్యో నటాదయశ్చ ప్రత్యుజ్జగ్ముః లసత్కుండలైనిర్భాతాని యాని కపోలానితైర్వదనేషు శ్రీః శోభా యాసాం తాః వారముఖ్యా నర్తక్యో వేశ్యా ఇతి యావత్. (19)

వారందఱును ప్రేమతో తొందరపాటుతో మహాసంతోషముతో రథములపైన కూర్చొని శ్రీకృష్ణునికి ఎదురేగి స్వాగతము పలికిరి. అంతేగాక వారస్త్రీలు, నటాదులు కూడ శ్రీకృష్ణ దర్శనమందు మిక్కిలి వేడుకకలవారై, ప్రకాశించు కుండలములతో విలసిల్లు గండస్థలములు కల ముఖ శోభకలవారై ఆడుతూ పాడుతూ శ్రీకృష్ణునికి ఎదురేగిరి. (19)

20. శ్లో. నటనర్తక గంధర్వాః
సూతమాగధ వందినః ।
గాయంతిచోత్తమశ్లోక
చరితాన్యద్భుతాని చ ॥

టీ:- లసదితి. లసత్కుండలైర్నిర్భాతాని యాని కపోలాని. తైర్వదనేషు శ్రీర్యాంసాం తాః వారముఖ్యాః నర్తక్యోవేశ్యాః. నటాః నవరసాభినయన చతురాః. తాళాద్యనుసారేణ నృత్యంతో నర్తకాః గంధర్వాః గాయకాః

అచట నటులు, నర్తకులు. గంధర్వులు, సూతులు, వందిమాగధులు ఉత్తమ శ్లోకుడగు శ్రీకృష్ణుని అద్భుత చరితములను భక్తవాత్సల్యాదులను గానం చేస్తూ శ్రీకృష్ణుని కెదురుగా వెళ్ళిరి. (నటులనగా నవరసములు అభినయించి చూపేవారని, రాగతాలాను సారముగా ఆడేవారు నర్తకులని, గానం చేసేవారు గాయకులని, పురాణాలు చెప్పేవారు సూతులని, వంశ కీర్తి ప్రతిష్ఠలను పొగిడేవారు మాగధులని భావము.) (20)

శ్లో.'సూతాః పౌరాణికాః ప్రోక్తాః మాగధా వంశశంసకాః, వందినస్త్వమలప్రజ్ఞాః ప్రస్తావసదృశోక్తయః'.(20)

21. శ్లో. భగవాంస్తత్ర బన్ధూనాం
పౌరాణామనువర్తినామ్ ।
యథావిధ్యుపసంగమ్య
సర్వేషాం మానమాదధే ॥

టీ:- యథావిధీతి. యథావిధి యైస్సహ యథోక్తం తైస్తథా సమాగమ్య సమాగమం కృత్వా, సర్వేషాం మానం ఆదధే కృతవానిత్యర్థః.(21)

భగవానుడగు శ్రీకృష్ణపరమాత్మ తనకెదురుగా వచ్చి స్వాగతం పలికిన పురజనులను, బంధువులను విధ్యుక్తముగా శాస్త్రవిధిననుసరించి ఎవరికి ఏది తగునో ఆ విధముగా వారందరిని కలుసుకొని గౌరవించెను.(21)

22. శ్లో. ప్రహ్వాభివాదనాశ్లేష
కరస్పర్శస్మితేక్షణైః ।
ఆశ్వాస్య చాశ్వపాకేభ్యో
వరైశ్చాభిమతైర్విభుః ॥

టీ :- తదాహ-ప్రహ్వత్వం శిరసా నతిః అభివాదనం వాచానతిః ఆశ్వాస్య అభయం దత్వా. ఆ శ్వపాకేభ్యః శ్వపాకానప్యభివ్యాప్య, ఆచండాలమిత్యర్థః పరైరభీష్టదానైశ్చ మానం కృతవానిత్యర్థః (22)

ప్రభువగు కృష్ణుడు వినమ్ర భావము, శిరస్సు వంచి నమస్కరించుట, ఆలింగనము చేసికొనుట, కరచాలనము చేయుట, చిరునగవు చిందించుట, ప్రేమతో చూచుట మున్నగు పనులతో ఆయా బంధుమిత్రజనులను, గౌరవించెను. కుక్కను వండుకొనితిను నీచుల వరకు కూడ అందరిని వారి వారి యిష్టానుసారములైన వరములతో సంతోషపఱచి ద్వారకలో ప్రవేశించెను.(22)

23. శ్లో. స్వయం చ గురుభిర్విప్రైః
స్వదారైః స్థవిరైరపి ।
ఆశీర్భిర్యుజ్యమానోఽన్యైః
వందిభిశ్చావిశత్పురమ్ ॥

టీ:- అన్యైశ్చవందిభిశ్చ.(23)

స్వయముగా తాను పెద్దల చేత, బ్రాహ్మణుల చేత, తన భార్యల చేత, వయోవృద్ధుల చేత, ఇతరులగు వందిమాగధుల చేత ఆశీస్సులను మంగళాశాసనులనందుకొని ద్వారకా నగరాన్ని ప్రవేశించెను.(23)

24. శ్లో. రాజమార్గం గతే కృష్ణే
ద్వారకాయాం కులస్త్రియః ।
హర్మ్యా ణ్యారురుహుర్విప్రాః
తదీక్షణమహోత్సవాః ॥

టీ:- హే శౌనక ! తస్య ఈక్షణేన మహానుత్సవో యాసాం తాః॥ (24)

ఓ బ్రాహ్మణులారా ! శౌనకాదులారా ! శ్రీకృష్ణుడు రాజమార్గమునకు రాగానే ద్వారకలోనున్న కులస్త్రీలు అతనిని చూడడమనే గొప్ప ఉత్సాహము కలవారై తమ మేడలను ఆరోహించిరి. ప్రాసాదములనెక్కి కృష్ణుని తిలకించిరి.(24)

25. శ్లో. నిత్యం నిరీక్షమాణానాం
యదపి ద్వారకౌకసామ్ ।
న వితృప్యంతి హి దృశః
శ్రియో ధామాంగమచ్యుతమ్ ॥

ద్వారకలో నివసించు స్త్రీలు తమ చూపులతో నిత్యము ఆ కృష్ణపరమాత్మను చూస్తున్నప్పటికీ తృప్తి కలుగుట లేదు అందుకే ఔత్సుక్యముతో మేడలెక్కి చూశారు. ఆ కృష్ణుడు శోభకు, లక్ష్మికి నివాసమైన వక్షఃస్థలము కలవాడు కావున ఎంతచూచినా వారికి తృప్తి కాలేదు.(25)

టీ:- యత్ యస్మాన్నిత్యం సదా. అచ్యుతం నిరీక్షమాణానామపి. దృశోనైవ తృప్యంతి . అతః ఆరురుహుః. కథంభూతం? శ్రియః శోభాయాః ధామస్థానం మంగం యస్య తం.(25)

26. శ్లో. శ్రియో నివాసో యస్యోరః
పానపాత్రం ముఖం దృశామ్ ।
బాహవో లోకపాలానాం
సారంగాణాం పదాంబుజమ్ ॥

టీ:- తదేవాభినయేనాహ- శ్రియో లక్ష్మ్యాః. యస్య ఉరః వక్షః నివాసః యస్య ముఖం సర్వప్రణినాం దృశాం. సౌందర్యామృత పానాయ పానపాత్రం.యస్య బాహవో లోకపాలానాం నివాసః. సారం హరిం గాయంతీతి సారంగాః భక్తాః తేషాం యస్య పదాంబుజం నివాసః తన్నిరీక్షమాణానాం దృశ ఇతి పూర్వేణాన్వయః(26)

27.శ్లో. సితాతపత్రవ్యజనైరుపస్కృతః
ప్రసూనవర్షైరభివర్షితః పథి ।
పిశంగవాసా వనమాలయా బభౌ
ఘనో యథాఽర్కోడుపచాపవైద్యుతైః ॥

ఈ విషయమునే వ్యాసులవారు స్వయముగా తెలుపుతున్నారు. ఏ కృష్ణుని యొక్క వక్షఃస్థలము లక్ష్మికి నివాసమో, ఏ కృష్ణుని ముఖము సర్వప్రాణుల చూపులకు,(సౌందర్యామృతము తాగుటకు) పాత్రమో, ఏ కృష్ణుని బాహువులు లోకపాలకులకు నివాసములో, ఏకృష్ణుని పాదకమలము భక్తులకు నివాస స్థానమో అట్టి కృష్ణుని చూచుచున్న చూపులు (కన్నులు) తృప్తినొందజాలవు ( పూర్వశ్లోకముతో అన్వయము. ఇచట సారంగ పదానికి భక్తుడని అర్థము. సారము శ్రీకృష్ణుడు అతనిని గానము చేసేవారు సారంగులు భక్తులు.) (26)

నీలమేఘ శరీరధారి, పచ్చని పీతాంబరమును ధరించిన శ్రీకృష్ణుడు శ్వేతచ్ఛత్రములతో, వింజామరలతో అలంకరింపబడినవాడై, వనమాలను ధరించి సూర్య, చంద్ర, నక్షత్ర, విద్యుదింద్రధనుస్సులతో మేఘమువలె ప్రకాశించెను. ( ఇచట సూర్యుడు శ్వేతచ్ఛత్రమునకు, నక్షత్రాలు పుష్పవర్షానికి, చంద్రబింబము పరిభ్రమించుచూ మండలాకారము కలిగిన వింజామరకు, ఇంద్ర ధనుస్సు వనమాలకు,

టీ:- సితేతి. సితైః ఆతపత్రవ్యజనైః. ఉపస్కృతో మండితః. అర్కశ్చ. ఉడుపో నక్షత్రసహితశ్చంద్రః. చాపః ఇంద్రధనుశ్చ. వైద్యుతం విద్యుత్తేజశ్చ. తైః. అర్కః ఛత్రస్యోపమానం. నక్షత్రాణి పుష్పవృష్టేః చంద్రః పరిభ్రమకృతమండలాకారయోశ్చామరవ్యజనయోః. చాపః వనమాలాయాః విద్యుతేజః పిశంగవాససః. అభూతోపమేయం. యది ఘనస్యోపరిసూర్యబింబం. ఉభయతశ్చంద్రౌ. సర్వతో నక్షత్రాణాం మధ్యే చ మిళితం చాపద్వయం. స్థిరం విద్యుత్తేజో యది భవతి తర్హి స ఘనో యథా భాతి తథా హరిర్బభావిత్యర్థః.(27)

28. శ్లో. ప్రవిష్టస్తు గృహం పిత్రోః
పరిష్వక్తస్స్వమాతృభిః ।
వవందే శిరసా సప్త ।
దేవకీప్రముఖా స్తదా ॥

టీ:- దేవకీప్రముఖాస్సప్త వవంద ఇతి మాతృసౌందర్యోదార విశేషజ్ఞాపనార్థముక్తం. అష్టాదశాపి వసుదేవష్య భార్యాః మాతృతుల్యత్వా న్నమస్కృతా ఏవ.(28)

విద్యుత్తేజస్సు పచ్చని పీతాంబరానికి ఉపమానాలు. ఇది అభూతోపమాలంకారము.) (27)

శ్రీకృష్ణుడు తల్లిదండ్రుల గృహానికి వెళ్ళి, తన తల్లులు తనను ఆలింగనము చేసికోగా, దేవకీ మొదలగు ఏడుగురు తల్లులకు సంతోషముతో శిరస్సు వంచి నమస్కరించెను. దేవకీ సోదరీమణులకు కూడ ఆదరముతో నమస్కరించెను. వసుదేవునికి పదునెనిమిది మంది భార్యలు వారంతా కృష్ణునికి తల్లితో సమానలు కావున వారికి కూడ కృష్ణుడు నమస్కరించెను.(28)

29. శ్లో. తాః పుత్రమంకమారోప్య
స్నేహస్నుతపయోధరాః ।
హర్షవిహ్వలితాత్మానః
సిషిచుర్నేత్రజైర్జలైః ॥

టీ:- నేత్రజైః జలైః. (29)

ఆ తల్లులందరును శ్రీకృష్ణుని తొడపై కూర్చుండబెట్టుకొని, ప్రేమచేత లోపలి స్రవించుచున్నపయోధరములు కలవారై, మనస్సు సంతోషములో మునిగిపోగా ఆనందబాష్పములతో కృష్ణుని అభిషేకించినారు. (29)

30. శ్లో. అథావిశత్స్వభవనం
సర్వకామమనుత్తమమ్ ।
ప్రాసాదా యత్ర పత్నీనాం
సహస్రాణి చ షోడశ ॥

టీ:- స్వగృహ ప్రవేశమాహ - అథేతి. సహస్రాణి చ షోడశేతి చకారాదష్టోత్తర శతాధికానీతి జ్ఞేయమ్.(30)

తరువాత శ్రీకృష్ణపరమాత్మ తన స్వంత ఇంటికి వెళ్ళెను. ఆ యిల్లు సమస్త కోరికలు,భోగాలు కలిగి అన్నిటికన్న ఉత్తమమైనదిగా ఉన్నది. అక్కడ ఆతని భార్యలకు పదునారువేల ఇండ్లు కలవు, షోడశ చ అని మూలమున చ కారము చెప్పుటతో మరి నూట ఎనిమిది మంది అని కూడ గ్రహించవలయును. అనగా శ్రీకృష్ణుని భార్యల ఇండ్లు పదునారు వేల నూట ఎనిమిది సంఖ్యగలవని గుర్తించాలి.(30)

31. శ్లో. పత్న్యః పతిం ప్రోష్య గృహానుపాగతం
విలోక్య సంజాతమనోమహోత్సవాః ।
ఉత్తస్థురారాత్సహసాసనాశయాత్
సాకం వ్రతైర్వ్రీడితలోచనాననాః ॥

దేశాంతరము నుండి చిరకాలానికి వచ్చిన భర్తను చూచి శ్రీకృష్ణుని పత్నులు మనస్సులలో మహోత్సవములు కలుగగా, ప్రోషిత భర్తృకల వ్రత నియమమున ఉండి కూడా, ఆసనములనుండి లేచి, సిగ్గుతో అవనతముఖములు కలవారై నిలబడిరి. శ్రీకృష్ణునితో తమ

టీ:- పత్న్య ఇతి. ప్రోష్య దేశాంతరే ఉషిత్వా. ఆరాద్దూరాదేవ విలోక్య. సంజాతో మనసి మహోత్సవో యాసాం తాః. ఆసనాదాశయాచ్చ ఆసనాద్దేహేనోత్తస్థుః. ఆశయోऽంతఃకరణం. తస్మాదపి ఆత్మనా ఉత్తస్థుః కృష్ణేనాత్మనా ఆత్మనః సంశ్లేషే అంతఃకరణవ్యవధానమపి తాన సహంత ఇత్యర్థః ప్రీళితాని లోచనాని ఆననాని చ యాసాం తాః అపాంగై రేవ వీక్షణాద్వ్రీళిత లోచనాః అవనతముఖ త్వాద్వ్రీళితాననాః సాకం వ్రతైరితి హాస్యక్రీడావర్జనాది నియమా అపితాభ్యః ఉత్థస్థురిత్యర్థః ధృతవ్రతా ఏవోత్తస్థురితి వా. వ్రతాని చ యాజ్ఞవల్క్యేనోక్తాని. శ్లో. క్రీడాం శరీర సంస్కారం సమాజోత్సవదర్శనం, హాస్యం పరగృహే యానం త్యజేత్ప్రోషితభర్తృకా' ఇతి. (31)

ఆత్మలు కలియుటలో మనస్సు యొక్క వ్యవధానాన్ని కూడ వారు సహించలేదు. (ప్రోషితభర్తృకల వ్రతధారణ నియమాలు యాజ్ఞవల్క్యునిచే చెప్పబడినవి.) ఆటలాడుట, శరీరాన్ని అలంకరించుకొనుట సమాజమున జరిగే ఉత్సవాలకు వెళ్ళుట, హాస్యముచేయుట, పరుల యింటికి వెళ్ళుట ప్రోషితభర్తృకలు ( భర్త దేశాంతరములో ఉన్న స్త్రీలు) ఈ వ్రతంలో వదలాలి. (31).

32. శ్లో. తమాత్మజైర్దృష్టిభిరంతరాత్మనా
దురంతభావాః పరిరేభిరే పతిమ్ ।
నిరుద్ధమప్యాస్రవదంబునేత్రయోః
విలజ్జితానాం భృగువర్య విక్లబాత్ ॥

ఓ శౌనకా ! భృగువంశీయుడా ! ఆ కృష్ణుని పత్నులు వచ్చిన భర్తను చూడకమునుపే, లోపల తమ బుద్ధిచేతనే ఆలింగనము చేసికొనిరి. తరువాత తమ చూపులతో, అటుపిమ్మట సమీపమునకు వచ్చిన పతిని కంఠమున వ్రేలాడు కుమారులతో సహా ఆలింగనము చేసికొనిరి. వారు చాలా గంభీరమైన దర్శనాభిలాష కలవారు. వారి కండ్లలో బలవంతముగా నిలుపుకోబడినప్పటికి కన్నీళ్ళు ఆగక స్రవించెను. సిగ్గుపడి వివశలై కన్నీళ్ళు కార్చిరి. (32)

టీ :- తమితి. ఆయాంతం పతిం. దర్శనాత్పూర్వం ఆత్మనా బుద్ధ్యా. అంతర్హృదయే పరిరేభిరే. తతో దృష్టిభిః. తతస్సమీపగతం ఆత్మజైః పుత్రైః. పుత్రానుద్ధృహ్య తత్కంఠమాలింగయంత్య ఇవ స్వయమాలింగత వత్య ఇత్యర్థః. తత్ర హేతుః. దురంతభావాః గంభీరాభిప్రాయాః. తథా

చ తాసాం నేత్రయోర్నిరుద్ధమప్యంబు బాష్పః విక్లబాద్వైవశ్యాత్. ఆస్రవదీషత్సుస్రావః. అతఏవ ధైర్యహాన్యా విలజ్జితానాం. హేభృగువర్య శౌనక. చిత్రం శృణ్వితి. (32)

33. శ్లో. యద్యప్యసౌ పార్శ్వగతో రహోగతః
తథాపి తస్యాంఘ్రియుగం నవం నవమ్ ।
పదే పదే కా విరమేత తత్పదాత్
చలాపి యచ్ఛ్రీర్న జహాతి కర్హిచిత్ ॥

టీ :- యదీతి. పార్శ్వగతస్సమీపస్థః. తత్రాపి రహోగతః ఏకాంతే వర్తతేస్మ. పదేపదే ప్రతిక్షణం. నవం నవమేవ. అత్ర కైమతికన్యాయః కా విరమేతేతి చలా చంచలస్వభావాపి శ్రీః న జహతి(33)

34. శ్లో. ఏవం నృపాణాం క్షితిభార జన్మనామ్
అక్షౌహిణీభిః పరివృత్తతేజసామ్ ।
విధాయ వైరం శ్వసనో యథానలం
మిథో వధేనోపరతో నిరాయుధః ॥

టీ :- ఉక్తం శ్రీకృష్ణచరితం సంక్షిప్యాహ- ద్వాభ్యాం. ఏవమితి. క్షితేర్భారాయ జన్మ యేషాం తే పాపాతిశయేన కేవలం భూభారాయే

ఆ తరువాత శ్రీకృష్ణుడు పత్నుల ప్రక్కనే ఏకాంతముగా కొంతకాలము గడిపాడు. ఆతని పాదాలు ప్రతిక్షణం నిత్యనూతన శోభతో ఒప్పారుతుంటాయి. శ్రీకృష్ణుని పత్నులు వాటిని ఆశ్రయించారు. చాంచల్యముగల లక్ష్మీదేవి కూడ ఎప్పుడూ వదలక ఆతని పాదాలనాశ్రయించగా, ఏ ఇతర స్త్రీ వాటిని వదలగలదు. (కైముక్తిక న్యాయముతో) ఏ స్త్రీ కూడ వదలలేదని భావము.(33)

శ్రీకృష్ణుని చరితాన్ని సంగ్రహంగా రెండు శ్లోకాలతో 'ఏవమ్' అని చెపుతున్నాడు. ఆ తరువాత భూమికి బరువైనవారును, అక్షౌహిణీ సైన్యాలతో అంతట వ్యాపించిన ప్రభావముగల రాజులలో ద్వేషాన్ని పుట్టించి పరస్పరం చంపుకొనేటట్లు చేసి, వాయువులు ఏవిధంగా వెదురు కట్టల ఒరిపిడి చేత అగ్నిని పుట్టించి పరస్పరము కాల్చుకొని నిప్పుచల్లారగ శమించునో, అట్లు కృష్ణుడు తాను ఆయుధము పట్టకయే భూ భారాన్ని హరించి విరమించెను.(34)

త్పన్నానామిత్యర్థః అక్షౌహిణీభిః కృత్వా పరివృత్తం సర్వతః ప్రసృతం. తేజః ప్రభావో యేషాం. పరివృద్ధతేజసామితి వా. శ్వసనః వాయుర్వేణూనాం. అన్యోన్యసంఘర్షేణ అనలం విధాయ. మిథో దాహేన యథోపశామ్యతి తద్వత్. (34)

35. శ్లో. స ఏవం నరలోకేஉస్మిన్
అవతీర్ణః స్వమాయయా ।
రేమే స్త్రీరత్నకూటస్థో
భగవాన్ ప్రాకృతో యథా ॥

ఈ విధముగా భగవానుడైన ఆ శ్రీకృష్ణుడు తన మాయతో ఈ లోకమున అవతరించి ఉత్తమ స్త్రీ సమూహమున నుండి సాధారణ మానవునివలనే ప్రవర్తించి ఆనందించినాడు.(35)

టీ:- సఇతి. స్త్రీరత్నకూటస్థః ఉత్తమ స్త్రీకదంబస్థః. (35)

36. శ్లో. ఉద్దామభావపిశునామలవల్గుహాస ।
వ్రీడావలోకనిహతో మదనోஉపి యాసామ్ ।
సంముహ్య చాపమజహాత్ప్రమదోత్తమాస్తాః
యస్యేంద్రియం విమథితుం కుహకైర్నశేకుః ॥

స్త్రీసాంగత్యముచేసి ఆనందించు వానికి, జననమరణ రూపసంసారము ప్రాప్తించునుగదా, ఆయన భగవానుడని ఎలా చెప్పబడుతాడు. అను ప్రశ్నకు 'ఉద్దామ' అని రెండు శ్లోకాలతో సమాధానము చెపుతున్నారు. ఏ ఉత్తమ స్త్రీల గంభీరమగు రతి భావము సూచించు నిర్మల, సుందరమైన చిరునగవుతో లజ్జతో క్రీగంటి చూపులతో మన్మథుడుకూడ మోహమునొంది చేతిలోని తన ధనుస్సును వదలినాడో, అట్టిశ్రీకృష్ణుని పత్ను లైన స్త్రీలు తమ కపట విభ్రమ

టీ:- నన్వేవం స్త్రీసంగాదిభిః సంసారప్రతీతేః కథం భగవానవతీర్ణ ఇత్యుచ్యతే? తత్రాహ-ద్వాభ్యాం. ఉద్దామేతి. యాసాముద్దామో గంభీరో

యోభావో౽భిప్రాయః తస్య పిశునస్సూచకః అమలో వల్గుః మందహాసః. వ్రీడావలోకశ్చ తాభ్యాం నిహతః అమదః మహాదేవో౽పి సమ్ముహ్య లజ్జయా చాపం పినాకమజహాత్. ఏవం ప్రభావాః స్త్రియః ఇత్యేతావద్వివక్షితం. యద్వా-భగవతో మోహినీ రూపేణ మహేశో౽పి మోహిత ఏవ. ఏతశ్చలాః దృగ్విలాసాఏవేతి తథోక్తం. తాః కుహకైః కపటైః విభ్రమైః యస్యేంద్రియం విమథితుం క్షోభయితుం న శక్తాః (36)

విలాసములతో శ్రీకృష్ణుని మనస్సును క్షోభింపజేయుటకు సమర్థులు కాలేకపోయిరి. అందుకే అతడు అస్ఖలిత బ్రహ్మచారిగా పేర్కొనబడి నాడు. (36)

37. శ్లో. తమయం మన్యతే లోకో
హ్యసక్తమపి సంగినమ్ ।
ఆత్మౌపమ్యేన మనుజం
వ్యాపృణ్వానమతో౽బుధః ॥

టీ:- మన్యత ఇతి. తం కృష్ణం అయం ప్రాకృతో లోకః. ఆత్మౌపమ్యేన స్వసాదృశ్యేన. సంగినంమనుజంమన్యతే. వ్యాపృణ్వానంవ్యాప్రియ మాణం. అతో౽యమబుధః అతత్త్వజ్ఞః.(37)

కాని, నిస్సంగుని, ఏ మనోవికారము లేని శ్రీకృష్ణుని లోకులు (తమలా) నిత్య స్త్రీ సంగ విలోలునిగా అనుకొని, తమవంటి మానవుడే శ్రీకృష్ణుడని, యథార్థము తెలియక అనుకొనుచున్నారు. అతడు మాయా మనుష్యుడై అన్ని పనులలో వ్యాపృతుడైను, అతనికి కర్తృత్వ, భోక్తృత్వాలు లేవని అజ్ఞులు గుర్తించలేకపోయినారు.(37)

38. శ్లో. ఏతదీశనమీశస్య
ప్రకృతిస్థోఽపి తద్గుణైః ।
న యుజ్యతే సదాత్మస్థైః
యథా బుద్ధిస్తదాశ్రయా ॥

టీ:- కుత ఇత్యపేక్షాయామైశ్వర్యలక్షణమాహ. ఏతదితి ఈశస్య ఈశనం ఐశ్వర్యం నామైతదేవం. కిం తత్? ప్రకృతిస్థోఽపి తస్యాః గుణైః సుఖదుఃఖాదిభిః. సదా న యజ్యత ఇతి యత్ యథా ఆత్మస్థైః ఆనందాదిభిరాత్మాశ్రయాపి బుద్ధిర్నయుజ్యతే. తద్వత్ వై ధర్మ్యదృష్టాంతో వా. ఆత్మస్థైస్సత్తాప్రకాశాదిభిర్యథాబుద్ధిర్యుజ్యత ఇత్యేపం వా. అసదాత్మా దేహః తత్ర స్థైర్గుణైః. తదాశ్రయాబుద్ధి స్తదుపాధిర్జీవో యథా యుజ్యతే. ఏవంప్రకృతిఽస్థోపి తద్గుణైర్న యుజ్యత ఇతి యదేతదీశనమీశస్యేతి.(38)

శ్రీకృష్ణుని ఐశ్వర్య లక్షణాలను చెపుతున్నారు 'ఏతత్' అని. ఈశ్వరుని యొక్క ఐశ్వర్యమనగా ఇది. ఏమది? తామరాకు నీటిలోనున్నను దానికి నీరు అంటనట్లు, ప్రకృతిలోనున్న వాడైకూడ దాని గుణములగు సుఖ దుఃఖాదుల కతీతుడు అగుట. ఆత్మలోనున్న ఆనందాది గుణములందనురక్తమై, తనలో ఉన్న రాగద్వేషాలతో కలువకుండుట. ఆత్మయందున్న సత్తా ప్రకాశాదులచేత బుద్ధి కలిసి యుండుట, అసదాత్మ దేహము, దానియందున్న గుణములచేత దానినాశ్రయించు బుద్ధి దానిలోని జీవుడు యోగాన్ని పొందకుండుట ప్రకృతిలో ఉండి కూడ ఆ గుణాలనంటక పోవుట ఇదే ఈశ్వరుని యొక్క ఐశ్వర్యము.(38)

39. శ్లో. తం మేనిరేఽబలా మౌఢ్యాత్
స్త్రైణం చానువ్రతం రహః ।
అప్రమాణవిదో భర్తుః
ఈశ్వరం మతయో యథా ॥

ఆ శ్రీకృష్ణుని భార్యలకు కూడ ఆయన తత్త్వము తెలియదని చెపుతున్నారు. అతనిని స్త్రీ లోలుడుగా, తమకు వశమైన వానినిగా, తమను ఏకాంతమున అనుసరించువానినిగా శ్రీకృష్ణుని పత్నులు తలచిరి. వారు తమ భర్త యొక్క మహిమను గుర్తించని వారు.

టీ:- తత్పత్న్యోఽపి తన్య తత్త్వం న జానంతీత్యాహ -తమితి తం స్త్రైణం ఆత్మవశ్యం, రహః ఏకాంతే. అనువ్రతం అనుసృతం చ మేనిరే. భర్తురప్రమాణవిదః.ప్రమాణమియత్తామహిమానమజానంత్య ఇత్యర్థః. ఈశ్వరం క్షేత్రజ్ఞం మతయః అహంవృతయః యథాస్వాధీనం స్వధర్మ యోగినం మన్యంతే. తద్వదితి. యద్వా-యథా తాసాం మతయః కల్పనాః తాస్తథా. తథా మహిమానమీశ్వరం స్త్రైణాదిరూపం మేనిర ఇత్యర్థః.(39)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం సంహితాయాం ప్రథమేస్కంధే భావార్థదీపికాయాం ఏకాదశోధ్యాయః**

సాధారణాహంకారముతో, క్షేత్రజ్ఞుడగు పరమేశ్వరుని తమకు స్వాధీనుడని అనుకొని, ఏ ఏ విధముగా వారి బుద్ధులు, కల్పనలు కలుగునో ఆయా విధములుగా కృష్ణపరమాత్మను స్త్రీలను అనుసరించు వానిగా, స్త్రీలోలునిగా తలచిరి.(39)

**శ్రీమద్భాగవతము యొక్క ప్రథమస్కంధ ఏకాదశాధ్యాయమునకు శ్రీధరీయవ్యాఖ్యానుసార ఆంధ్రానువాదము ముగిసినది.**

## ద్వాదశోऽధ్యాయః

### శౌనక ఉవాచ.

1. శ్లో. అశ్వత్థామ్నోపసృష్టేన
బ్రహ్మశీర్ష్ణోరుతేజసా।
ఉత్తరాయా హతో గర్భః
కృష్ణేనాజీవితః పునః ॥

టీ:- ఇదానీమౌపోద్ఘాతికముక్తానువాదపూర్వకం పృచ్ఛతి శౌనకః- అశ్వత్థామ్నే ఇత్యాది. ఉపసృష్టేన. విసృష్టేన తస్య జన్మేత్యాదినా బ్రూహీత్యుత్తరేణాన్వయః. (1)

## ద్వాదశాధ్యాయము

### శౌనకుడు పలుకుచున్నాడు.

అశ్వత్థామకు దండన 7వ అధ్యాయములో వర్ణింప బడినది. ఈ ద్వాదశాధ్యాయమున పరీక్షిన్మహారాజు జన్మ వర్ణింపబడుతున్నది. రాజర్షి పరీక్షిన్మహారాజు జన్మ, ఆయన పని, విలయము, పాండవుల స్థితిగతులు, రాజ్యస్థితుల వర్ణనకు ముందు ఇది ఉపోద్ఘాతము. సప్తమాధ్యాయము మొదలుకొని నిరూపింపబడినది. దానిని అనుసరించి అడుగుతున్నాడు శౌనకుడు. అశ్వత్థామ తన అవమానాన్ని సహించక పాండవులపై బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని ప్రయోగించాడు. దాని తేజస్సు ఉత్తరాగర్భస్థుడగు పరీక్షిత్తును చంపడానికి రాగా ప్రభువగు కృష్ణుడు అతనిని కాపాడెను కదా అతని జన్మ గురించి చెప్పుము. (పై శ్లోకముతో అన్వయము.) (1)

2. శ్లో. తస్య జన్మ మహాబుద్ధేః
కర్మాణి చ మహాత్మనః ।
నిధనం చ యథైవాసీత్
స ప్రేత్య గతవాన్ యథా ॥

టీ :- తస్యేతి. సః పరీక్షిత్. ప్రేత్య దేహం త్యక్త్వా. నిధనం వినాశశ్చ. (2)

ఆ పరీక్షిన్మహారాజు గొప్ప మహాత్ముడు, బుద్ధిశాలి. అతని జన్మ, అతని పనులు, ఏ విధముగా ఆతడు దేహత్యాగము చేసి పరలోకానికి వెళ్ళెనో ఆ విషయాలు వివరించుము. (2)

3. శ్లో. తదిదం శ్రోతుమిచ్ఛామి
గదితుం యది మన్యసే ।
బ్రూహి నః శ్రద్ధధానానాం
యస్య జ్ఞానమదాచ్ఛుకః ॥

టీ:- తదితి. ప్రార్థయే న త్వాజ్ఞాపయామీత్యాహ-గదితుం యది మన్యసే, అనుగ్రహేణ తర్హి న బ్రూహీతి. యస్య జ్ఞాసమదాచ్ఛుక ఇతి శ్రవణేచ్ఛాయాం. కారణమ్ (3)

ఆ విషయాలు చెప్పుటకు ప్రార్థిస్తున్నాను. కాని ఇది ఆజ్ఞ కాదు, మీరు చెప్పదలచినచో, అనుగ్రహించి, శ్రద్ధ కల మాకు చెప్పండి. సాక్షాత్తు శుకమహర్షి ఆ పరీక్షిత్తునకు జ్ఞాన బోధ చేసినాడు. అట్టి పరీక్షిన్మహారాజు వృత్తాంతము వినగోరుతున్నానని శౌనకుడు సూతుని ప్రశ్నించెను. మోక్షదాయకమగు జ్ఞానము నందలి కోరిక శ్రవణేచ్ఛకు కారణము.(3)

**సూత ఉవాచ**

4. శ్లో. అపీపలద్ధర్మరాజః
పితృవద్రంజయన్ ప్రజాః ।
నిస్పృహస్సర్వకామేభ్యః
కృష్ణపాదానుసేవయా ॥

టీ:- నిస్స్పృహస్యాపి రాజ్ఞః శ్రీకృష్ణానుగ్రహోత్థాదృక్పాత్రం స మజనీతి వక్తుం తస్య శ్రీకృష్ణే భక్త్యుద్రేకమాహ- త్రిభిః అపీపలదితి. పితృవత్ అపీపలత్ పాలయామాస.(4)

**సూతుడు చెపుతున్నాడు.**

ధర్మరాజుకు శ్రీకృష్ణానుగ్రహము వలన అంత గొప్ప మనమడు పుట్టాడు అని చెప్పుటకు, ఆ ధర్మరాజుకు శ్రీకృష్ణునియందుగల భక్తి ఆవేశము కారణమని చెపుతున్నాడు. ధర్మరాజు తండ్రివలె ప్రజలను రంజిపజేయుచు ఏ విషయభోగములందు ఆసక్తిలేనివాడై కేవలము కృష్ణపాదసేవతో రాజ్యమును పరిపాలించెను.(4)

5. శ్లో. సంపదః క్రతవో లోకాః
మహిష్యో భ్రాతరో మహీ ।
జంబూద్వీపాధిపత్యం చ ।
యశశ్చ త్రిదివం గతమ్ ॥

టీ:- సంపద ఇతి. క్రతవః తదుపార్జితా లోకాశ్చ.(5)

ధర్మరాజు అనేక సంపదలను పొందాడు. అనేక యజ్ఞాలు చేసి, పుణ్యలోకాలను సాధించాడు. జంబూద్వీపాధిపత్యము ఆతనికి కలిగినది. భీమార్జునాదులు సోదరులుగా, ద్రౌపది పట్టమహిషిగా ఆతని కీర్తి స్వర్గము వరకు వ్యాపించినది.(5)

6. శ్లో. కిం తే కామాస్సురస్పార్హా
ముకుందమనసో ద్విజాః ।
అధిజహ్రుర్ముదం రాజ్ఞః
క్షుధితస్య యథేతరే ॥

టీ:- కిమితి. సురస్పృహ్యాః సురాణాం స్పృహణీయాః తే సంపదాదయః కామాః విషయాః రాజ్ఞః ముదం ప్రీతిం అధిజహ్రుః కృతవంతః కిం? న కృతవంత ఇత్యర్థః అత్ర హేతుః. ముకుందఏవ మనో యస్యేతి. క్షుధితస్య అన్నైకమనసః. యథా ఇతరే స్రక్చందనాదయః ప్రీతిం కుర్వంతి తద్వత్.(6)

ఓ ఋషులారా ! ఏ విషయభోగాలు, కోరికలు, సంపదలకు దేవతలే అర్హులో అవి కూడా ధర్మరాజుకు ఆనందాన్ని కలిగించలేదు. శ్రీకృష్ణునియందే లగ్నమైన మనస్సుకల ఆతనికి ఇతరమైన భోగానుభవాశలేదు. ఆకలితో అలమటించువానికి గంధమాల్యాది భోగములయందు ఆశకలుగునా కలుగదుకదా.(6)

7\. శ్లో. మాతుర్గర్భగతో వీరః
స తదా భృగునందన ।
దదర్శ పురుషం కంచిద్
దహ్యమానోఽస్త్ర తేజసా ॥

పరీక్షిత్ సంబంధమైన ప్రస్తుత విషయాన్ని చెపుతున్నాడు. ఓ శౌనకా ! తల్లి గర్భమున ఉన్న వీరుడగు పరీక్షిత్తు. అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రముచే దహింపబడుతూ ఒక దివ్యపురుషుని చూచినాడు. (7)

8\. శ్లో. అంగుష్ఠమాత్రమమలం
స్ఫురత్పురటమౌలినమ్ ।
అపీచ్యదర్శనం శ్యామం
తటిద్వాససమచ్యుతమ్ ॥

టీ:- ప్రస్తుతమాహ – అంగుష్ఠమాత్రమితి. పురటం సువర్ణం స్ఫురత్పురటమౌళిర్యస్యాస్తి తం. అధిక ప్రకాశహేమకిరీటధారిణ మిత్యర్థః వ్రీహ్యాదిభ్యశ్చేతి ఇని ప్రత్యయః. అపీచ్యం అతిసుందరం. దృశ్యత ఇతి దర్శనం రూపం యస్య తం. తటిద్విద్యుత్ తద్వద్వాససీ యస్యేతి. శ్యామమితి చ పదాభ్యాం విద్యుద్భూషితమేఘోపమా సూచితా. అచ్యుతమవికారం. (7,8)

ఆ దివ్యపురుషుడు స్వచ్ఛమైన కాంతిగలవాడు, బొటనవేలంత ప్రమాణము కలవాడు, శిరస్సుపై ప్రకాశిస్తున్న బంగారు కిరీటము కలవాడు, మిక్కిలి సుందరమైన ఆకారము, రూపముకలవాడు, నల్లని కాంతి కలవాడు, మెరుపు తీగలా మెరుస్తున్న పచ్చని పీతాంబరము ధరించినవాడు. చ్యుతి, నాశము, ఏవికారము లేనివాడుగా కనిపించెను. (మౌలి శబ్దమునకు 'వ్రీహ్యాదిభ్యశ్చ' అను వ్యాకరణ సూత్రముచే ణిని ప్రత్యయము చేరి మౌలిన్ అని నకారాంతముగా మారినది. శ్యామం తటిద్వాససమనుటచే మెరుపుతో కూడిన మేఘము యొక్క ఉపమానము శ్రీకృష్ణునికి సూచించబడినది. (8)

9. శ్లో. శ్రీమద్దీర్ఘ చతుర్బాహుం
తప్త కాంచన కుండలమ్ ।
క్షతజాక్షం గదాపాణిమ్
ఆత్మనస్సర్వతో దిశమ్ ।
పరిభ్రమంతముల్కాభ్యాం
భ్రామయంతం గదాం ముహుః ॥

టీ:- శ్రీమదితి. తప్తం దాహోత్తీర్ణం యత్కాంచనం తన్మయే కుండలే యస్యసః క్షతజాక్షం అహోమద్భక్తస్యాపి గర్భే అస్త్రాదిపీడేతి సంరంభాదత్యారక్త నేత్రం.(9)

పరీక్షిత్తు గర్భమున ఉండగా కనిపించిన ఆ దివ్యపురుషుడు కృష్ణుడు. పొడవైన నాలుగుచేతులు కలవాడు, పుటం వేసిన బంగారు కుండలాలు కలవాడు. పరీక్షిత్తును రక్షించే తొందర పాటుతో ఎఱ్ఱనైన కన్నులు కలవాడు, గదను ధరించినవాడు, అన్ని వైపుల నుండి పరీక్షిత్తు చుట్టూ తిరుగుతూ, కొరివిలా నిప్పు కక్కుతున్న తన గదను మాటి మాటికి త్రిప్పుతున్నాడు. అట్టి వానిని పరీక్షిత్తు చూచెను.(9)

10. శ్లో. అస్త్ర తేజః స్వగదయా
నీహారమివ గోపతిః ।
విధమంతం సన్నికర్షే
పర్యైక్షత క ఇత్యసౌ ॥

టీ:- పరిభ్రమం తమితి. అస్త్ర తేజోవిధమంతం నాశయంతం నీహారం హిమం గోపతిస్సూర్య ఇవ. సన్నికర్షే సమీపే. దృష్ట్వా చాసౌ క ఇతి పర్యైక్షత వితర్కితవాన్.(10)

సూర్యుడు మంచును నశింప చేసినట్లు బ్రహ్మాస్త్ర తేజస్సును తన గదతో నశింపచేయుచూ, తన సమీపమున ఉన్న వానిని పరీక్షిత్తు చూచి ఈతడెవరని వితర్కించుకొనెను.(10)

11. శ్లో. విధూయ తదమేయాత్మా
భగవాన్ ధర్మగుబ్విభుః ।
పశ్యతో దశమాసస్య
తత్రైవాంతర్దధే హరిః ॥

టీ:- అమేయాత్మా కథం తద్విధూతవాన్? ఇత్యవితర్క్యస్వరూపః. ధర్మం గోపాయతీతి ధర్మగుప్. యద్వా ధర్మం గోపయతీతి ధర్మగుపో రాజానః తత్ప్రభుః తేషామపి పాలకత్వాత్ దశమాసపరిచ్ఛేద్యస్య మిషతః పశ్యతః. యత్ర దృష్టస్తత్రైవ గర్భఏవ. అంతర్దధేఽంతర్హితః. నత్వన్యత్ర గతః. యతో విభుస్సర్వగతః.(11)

ఆ బ్రహ్మాస్త్ర తేజస్సును తొలగించి, అవితర్క్యరూపుడు, షడ్గుణైశ్వర్య సంపన్నుడు, ధర్మమును కాపాడువాడు, ధర్మరక్షణచేయు రాజులను కాపాడువాడు, ప్రభువైన శ్రీకృష్ణుడు, గర్భమునందున్న పదినెలల వయస్సుగల ఆ పరీక్షిత్తు చూస్తుండగనే అచటనే కనిపించకుండా అంతర్ధానముచెందెను. అంతటట ఉండువాడు కనుక మరోచోటికి వెళ్ళే ప్రసక్తి లేదు కేవలము అదృశ్యుడైనాడని భావము.(11)

12. శ్లో. తతస్సర్వ గుణోదర్కే
సానుకూల గ్రహోదయే ।
జజ్ఞే వంశధరః పాండోః
భూయః పాండురివౌజసా ॥

టీ:- ఉదర్కః ఉత్తరం ఫలం. సర్వగుణానాముత్తరోత్తరాధిక్య సూచక లగ్నే. తత్రహేతుః. అనుకూలై రన్యైర్గ్రహైస్సహితానాం శుభగ్రహాణాం ఉదయో యస్మిన్.(12)

తరువాత ఒక శుభదినమున సమస్త గుణములు శుభప్రదములై ఒకదానిని మించి మరియొకటి కలిసియుండగా, శుభ గ్రహోదయ లగ్నమందు, తన తేజస్సుతో మరల పాండురాజు ఉదయించినట్లుగా, పాండు మహారాజు వంశాంకురమైనట్టి పరీక్షిత్తు జన్మించెను.(12)

13. శ్లో. తస్య ప్రీతమానా రాజా
విప్రైర్ధౌమ్యకృపాదిభిః ।
జాతకం కారయామాస
వాచయిత్వా చ మంగలమ్ ॥

టీ:- జాతకమితి. జాతకం జాతకర్మ సుమంగళం పూణ్యాహం. (13)

సంతుష్టుడైన ధర్మరాజు, ఆ పుట్టిన బాలునికి ధౌమ్యుడు, కృపుడు మొదలగు బ్రాహ్మణోత్తముల చేత పుణ్యాహవాచన చేయించి, జాతకర్మ గావించెను.(13)

14. శ్లో. హిరణ్యం గాం మహీం గ్రామాన్ ।
హస్త్యశ్వాన్ నృపతిర్వరాన్ ।
ప్రాదాత్ స్వన్నం చ విప్రేభ్యః
ప్రజాతీర్థే స తీర్థవిత్ ॥

టీ :- వరాన్ శ్రేష్ఠాన్.స్వన్నం శోభనం అన్నం చ య తీర్థవిత్ దానార్హపాత్రదేశకాలాదిజ్ఞః. శ్లో."యావన్న ఛ్ఛిద్యతే నాళం తావ న్నాప్నోతి సూతకమ్, ఛిన్నే నాళే తతః పశ్చాత్సూతకంతు విధీయతే" ఇతి వచనాత్. తతః పూర్వం ప్రాదాత్. ఆమమన్నం.ప్రజాతీర్థే పుత్రోత్పత్తి పుణ్యకాలే. శ్లో."పుత్రే జాతే వ్యతీపాతే దత్తం భవతి చాక్షయమి"తిస్మృతేః శో. దేవాశ్చ పితరశ్చైవ పుత్రే ద్విజన్మనామ్, ఆయాంతి హి గృహం తస్మాత్సూర్యగ్రహశతాధిక" మితిస్మృతేః. నృపశ్రేష్ఠ పుణ్యాహమితి చాబ్రువన్నితి చ .(14)

పుత్ర జన్మకాలము దాన కాలములలో శ్రేష్ఠము. దానిని గుర్తించిన ధర్మరాజు శ్రేష్ఠములగు బంగారాన్ని, గోవులను, భూమిని, గ్రామములను, ఏనుగులను, గుఱ్ఱాలను, మంచి అన్నాన్ని, బ్రాహ్మణులకు దానమొసగెను.అపుడు జాతాశౌచము ఉండునుకదా ఎట్లుదానము చేసెను? అనుదానికి సమాధానము శిశువు బొడ్డు కోయక మునుపు సూతకము(పురుడు) ఉండదు. కావున తత్పూర్వమే ధర్మరాజు దానాలొసగెనని భావము. ప్రజాతీర్థే అనగా పుత్రోత్పత్తి పుణ్యకాలమున ఆమాన్నం,ఉప్పు, పప్పు మొదలగు సామగ్రి దానం ఇచ్చెనని చెప్పవచ్చు. కుమారుడు కలుగగా దేవతలు, పిత్రృ దేవతలు వచ్చి పుణ్యాహమని ఆశీర్వదిస్తారు.(14)

15. శ్లో. తమూచుర్బ్రాహ్మణాస్తుష్టాః
రాజానం ప్రశ్రయాన్వితమ్ ।
ఏష హ్యస్మిన్ ప్రజాతంతౌ
పురూణాం పౌరవర్షభః ॥

16. శ్లో. దైవేనాప్రతిఘాతేన
శుక్లే సంస్థాముపేయుషి ।
రాతో వోఽనుగ్రహార్థాయ
విష్ణునా ప్రభవిష్ణునా ॥

17. శ్లో. తస్మాన్నామ్నా విష్ణురాతః
ఇతి లోకే బృహచ్ఛ్రవాః ।
భవిష్యతి న సందేహో
మహాభాగవతోత్తమః ॥

టీ:- ఏషఇతి. కురూణాం కురువంశ్యానాం శుక్లే శుద్ధే అస్మిన్ ప్రజాతంతౌ దైవేన కథం భూతేన ? అప్రతిఘాతేన దుర్వారేణ సంస్థాంనాశం ఉపేయుషి గతే సతి. వోఽనుగ్రహార్థాయ యస్మాత్ప్రభ విష్ణునా ప్రభవన శీలేన విష్ణునా. రాతో దత్తః బృహచ్ఛ్రవాః మహాకీర్తిః . తస్మాల్లోకే విష్ణురాతఇతి నామ్నా. భవిష్యతీతి, మహాభాగవతశ్చ గుణైశ్చ మహాన్భవిష్యతి. నాత్ర సందేహ ఇతి తం రాజానం బ్రాహ్మణా ఊచురితి త్రయాణామన్వయః(15,16,17)

ధర్మరాజు బ్రాహ్మణులను పిలిపించి, సవినయముగా పరీక్షిత్తు జాతకమడిగెను. బ్రాహ్మణులు సంతుష్టులై, ఓ పురువంశ శ్రేష్ఠుడా ! ఈ కుమారుడు కురువంశపు పరువును నిలుపువాడు. వంశ బీజాంకురము, పరిశుద్ధమైన కురువంశము తిరుగులేని దైవము చేత నశించగా, ప్రభువగు విష్ణువుచేత మీ అనుగ్రహము కొరకు ఈతడు ఇవ్వబడినాడు. కావున లోకమందు గొప్ప కీర్తికల ఈతడు విష్ణురాతుడను పేరు పొందగలడు. గుణములతో గొప్పవాడగు ఈతడు విష్ణుభక్తికల మహాభాగవతోత్తముడు కాగలడు. ఇందులో ఏమాత్రము సందేహము లేదని ధర్మరాజుతో అనిరి.

(15,16,17 మూడు శ్లోకాలకు ఏకాన్వయము.)

**యుధిష్ఠిర ఉవాచ.**

18. శ్లో. అప్యేష వంశ్యాన్ రాజర్షీన్
పుణ్యశ్లోకాన్మహాత్మనః ।
అనువర్తితాస్విద్యశసా
సాధువాదేన సత్తమః ॥

టీ:- మహాభాగవతో భవిష్యతీత్యుక్తే హృష్టః పృచ్ఛతి రాజా-అపీతి. అపిస్విత్సాధువాదేన యశసా సత్కీర్త్యా. చానుపర్తితా భవిష్యతీతి పూర్వస్యైవాతః పరమప్యనుషంగః.(18)

**యుధిష్ఠిరుడిట్లడిగెను.**

పరీక్షిత్తు పరమ భాగవతోత్తముడు అగునని విని సంతోషించి యుధిష్ఠిరుడు ఆ బ్రాహ్మణోత్తములతో, ఓ మహాత్ములారా ! ఈ పిల్లవాడు మంచివారిచే ప్రశంసించదగిన నడవడి కలిగి, కురువంశీయులను, పవిత్రమగు కీర్తికల రాజర్షులను,మహాత్ములను అనుసరించగలడా? (18)

**బ్రాహ్మణా ఊచుః**

19. శ్లో. పార్థ ప్రజావితా సాక్షాద్
ఇక్ష్వాకురివ మానవః ।
బ్రహ్మణ్యస్సత్యసంధశ్చ
రామో దాశరథిర్యథా ॥

టీ:- ప్రజానామవితా రక్షకః మానవః వైవస్వతమనోః పుత్రః. బ్రాహ్మణేషు హితః. సత్యప్రతిజ్ఞః. శ్రీరామో యథా.(19)

**బ్రాహ్మణులు ఇట్లనిరి.**

ఓ ధర్మరాజా ఈ పిల్లవాడు సాక్షాత్తు మనువు కుమారుడగు ఇక్ష్వాకు మహారాజులవలె ప్రజలను కాపాడగలడు. శ్రీరాముని వలె బ్రాహ్మణులకు హితము చేయువాడు, సత్యప్రతిజ్ఞుడు కాగలడు.(19)

20. శ్లో. ఏష దాతా శరణ్యశ్చ
యథా హ్యౌశీనరశ్శిబిః ।
యశో వితనితా స్వానాం
దౌష్యంతిరివ యజ్వనామ్ ॥

టీ:- ఔశీనరః ఔశీనర దేశాధిపతిః శిబి శిబిచక్రవర్తీ యేన స్వమాంసం శ్యేనాయ దత్వా శరణమాగతః కపోతో రక్షితః.స్వానాం జాత్జీనాం యజ్వనాం చ యశోవితనితా విస్తా కః దౌష్యంతిః భరత ఇవ. (20)

బ్రాహ్మణులు ఇంకను పరీక్షిత్తు భవిష్యత్తు గురించి ధర్మరాజుకు చెపుతున్నారు. ఈతడు గొప్ప దాత, శరణు పొందిన పావురమును రక్షించుటకు డేగకు తన మాంసము నొసగిన శిబి చక్రవర్తి వలె శరణాగత రక్షకుడు కాగలడు. అంతేకాక దుష్యంతుని కుమారుడు భరతుని వలె, తన జ్ఞాతులు, పూర్వజుల వలె యజ్ఞ యాగాది క్రతువులు చేసి తన కీర్తిని విస్తరింప చేస్తాడు.(20)

21. శ్లో. ధన్వినామగ్రణీరేషః
తుల్యశ్చార్జునయోర్ద్వయోః ।
హుతాశ ఇవ దుర్ధర్షః
సముద్ర ఇవ దుస్తరః ॥

టీ:- అర్జునయోః పార్థకార్తవీర్యయోః.(21)

బ్రాహ్మణులు ఇంకను ఇలా చెపుతున్నారు. ఈ పరీక్షిత్తు గొప్ప ధనుర్ధారి, పరాక్రమవంతుడు, తన తాత అర్జునుని, చక్రవర్తియగు కార్తవీర్యార్జునుని కూడ పోలినవాడౌతాడు. అగ్నిహోత్రుని వలె చూడశక్యముగాని తేజస్సును, సముద్రుని వలె ఎవరును ఉల్లంఘించని ఆజ్ఞను కలవాడు కూడ అగును.(21)

22. శ్లో. మృగేంద్ర ఇవ విక్రాంతో
నిషేవ్యో హిమవానివ ।
తితిక్షుర్వసుధేవాసౌ
స విష్ణుః పితరావివ ॥

టీ:- హుతాశఇతి. హిమవానివ సతాం నిషేవ్యః అనన్య గతిత్వేన. వసుదేవ తితిక్షుః క్షాంతః పితరౌ మాతాపితరావివ సహిష్ణుః (22)

ఓ మహారాజా ఈ పిల్లవాడు సింహము లాంటి పరాక్రమము కలవాడు, హిమవంతుని వలె అందరిచే సేవించదగినవాడు, అంతేకాక భూదేవి లాంటి సహనము కలవాడు మరియు మాతా పితరులలాగ అన్నివిధాలుగా ప్రజలకు అండగా ఉంటాడు. అన్నింటిని సహించేవాడవుతాడు. (22)

23. శ్లో. పితామహసమస్సామ్యే
ప్రసాదే గిరిశోపమః ।
ఆశ్రయస్సర్వ భూతానాం
యథా దేవో రమాశ్రయః ॥

టీ:- పితామహో బ్రహ్మా. తేన సమః. సామ్యే సర్వభూతసమత్వే. (23)

ఈ బాలుడు బ్రహ్మదేవుని వలె సర్వసముడు, ప్రసన్నుడుగా ఉండుటలో శంకరునితో సమానుడు, శ్రీమహావిష్ణువువలె లక్ష్మికిని, సమస్తభూతములకు ఆశ్రయము అవుతాడు. బ్రహ్మదేవుడు దేవరాక్షసుల యెడ సమదృష్టి కలవాడు, శంకరుడు వెంటనే ప్రసన్నుడయ్యేవాడు, సమస్తప్రాణులకు ఆశ్రయణీయుడు హరి అందుకే పరీక్షిత్తుకు వారితో పోలిక చెప్పబడినవి.(23)

24. శ్లో. సర్వసద్గుణమాహాత్మ్యః
ఏష కృష్ణమనువ్రతః ।
రంతిదేవ ఇవౌదార్యే
యయాతిరివ ధార్మికః ॥

ఈ పరీక్షిత్తు సమస్త సద్గుణముల ప్రభావము కలవాడు, శ్రీకృష్ణుని అనుసరించువాడు, రంతిదేవుని వలె గొప్ప ఔదార్యము కలవాడు, యయాతి వలె గొప్ప ధార్మికుడుగా కూడా కాగలడు.(24)



ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

టీ:- ఆశ్రయఇతి. రమాశ్రయో హరిఃసర్వైస్సద్గుణైర్యన్మాహాత్మ్యం తస్మిన్ శ్రీకృష్ణతుల్యః.(24)

25. శ్లో. ధృత్యా బలిసమః కృష్ణే
ప్రహ్లాద ఇవ సద్గ్రహః ।
ఆహర్తైషోఽశ్వమేధానాం
వృద్ధానాం పర్యుపాసకః ॥

ఈ పరీక్షిత్తు ధైర్యములో బలి చక్రవర్తికి సమానుడు, శ్రీకృష్ణుని విషయమున ప్రహ్లాదునివలె మంచి అభినివేశము కలవాడు, గొప్ప భక్తుడు, అనేక అశ్వమేధయాగములు చేయువాడు, పెద్దలను సేవించువాడు, వినయ సంపన్నుడు కాగలడు.(25)

టీ:- ధృత్యా ధైర్యేణ సద్గ్రహః. సన్ భద్రః గ్రహః అభినివేశో యస్య. సఃఆహర్తా కర్తా.(25)

26. శ్లో. రాజర్షీణాం జనయితా
శాస్తా చోత్పథగామినామ్ ।
నిగృహీతా కలేశ్చైష
భువో ధర్మస్య కారణాత్ ॥

ఈ పరీక్షిత్తు యోగ్యులైన జనమేజయాది కుమారులను కనువాడు, దుర్మార్గులను శాసించువాడు, కలిని నిగ్రహించి, భూభారాన్ని తొలగించి ధర్మ స్థాపన చేయగలడు.(26)

టీ:- రాజర్షీణాం జనమేజయాదీనాం(26)

27. శ్లో. తక్షకాదాత్మనో మృత్యుం
ద్విజపుత్రోపసర్జితాత్ ।
ప్రపత్స్యత ఉపశ్రుత్య
ముక్తసంగః పదం హరేః ॥

టీ:- నిగృహీతేతి. ద్విజపుత్రేణ శృంగినామ్నా. ఉపసర్జితాత్ తక్షకాత్ ఆత్మనో మృత్యుముపశ్రుత్య. విరక్తః హరేః పదం ప్రపత్స్యతే భజిష్యతి. (27)

ఓ మహారాజా ! ఈ పరీక్షిత్తు ఒకానొక బ్రాహ్మణ కుమారునిచే (శృంగిచే) ప్రేరేపించడిన తక్షకుడను మహాసర్పము వలన తనకు మృత్యువు కలుగునని తెలిసికొని సర్వసంగ పరిత్యాగము చేసి విష్ణులోకమును చేరగలడు.(27)

28. శ్లో. జిజ్ఞాసితాత్మయాథాత్మ్యో
మునేః వ్యాససుతాదసౌ ।
హిత్వేదం నృప గంగాయాం
యాస్యత్యద్ధాఽకుతోభయమ్ ॥

టీ:- తతశ్చ జిజ్ఞాసితం. ఆత్మనో యాథాత్మ్యంయేన సః. ఇదం శరీరం గంగాయాం హిత్వా అకుతోభయం హరేః పదం యాస్యతి. అద్ధా నిశ్చయేన.(28).

ఓ రాజా ! ఈ పరీక్షిత్తు వ్యాసమహర్షి కుమారుడగు శుకయోగీంద్రుని వలన ఆత్మతత్త్వమును తెలిసికొని బ్రహ్మజ్ఞానియై ఆతను చెప్పిన భాగవతమును విని ముక్తపాపుడై గంగలో తన శరీరం వదలి ఎలాంటి భయములేని, పునరావృత్తి రహిత శాశ్వత పరబ్రహ్మ పదాన్ని పొందగలడు.(28)

29. శ్లో. ఇతి రాజ్ఞ ఉపాదిశ్య
విప్రా జాతకకోవిదాః ।
లబ్ధాపచితయస్సర్వే
ప్రతిజగ్ముః స్వకాన్ గృహాన్ ॥

టీ:- జాతకకోవిదాః జాతకశాస్త్ర సమర్థాః. లబ్ధా అపచితిః పూజాయైః తే.(29)

ఈ విధముగా జాతకములను తెలిసిన పండితులైన బ్రాహ్మణోత్తములు ధర్మరాజుకు పరీక్షిత్తు జన్మ, భవిష్యద్ వృత్తాంతములను తెల్పి రాజుగారిచే పూజలందుకొని తమ తమ ఇండ్లకు వెళ్ళిపోయిరి. (29)

30. శ్లో. స ఏష లోకే విఖ్యాతః
పరీక్షిదితి యత్ప్రభుః ।
గర్భే దృష్టమనుధ్యాయన్
పరీక్షేత నరేష్విహ ॥

టీ:- పరీక్షిదితి నామ నిర్వక్తి యదస్యత్ ప్రభుః సమర్థస్సన్.గర్భేతి. గర్భే దృష్టం పురుషం అభిద్యాయన్. ఇహ దృశ్యమానేషు నరేషు మధ్యే సర్వమపి నరం పరీక్షేత అయమసౌ భవేన్న వా ఇతి విచారయత్. అతః పరీక్షిదితి విఖ్యాతః . పూర్వం దృష్టమితి పాఠే తదా మాతృగర్భే దృష్టమిత్యర్థః. (30)

సమర్థుడగు ఆ బాలుడు తల్లి గర్భంలో తాను చూచిన ఆ భగవంతుడెక్కడ ఉన్నాడని లోకములోని మనుష్యులనందరిని, పరీక్షించి చూచుచు పరీక్షిత్తు అను సార్థక నామమును పొందెను.(30)

31. శ్లో. స రాజపుత్రో వవృధే
ఆశు శుక్ల ఇవోడుపః ।
ఆ పూర్యమాణః పితృభిః ।
కాష్ఠాభిరివ సోఽన్వహమ్ ॥

టీ:- శుక్లే శుక్లపక్షే సః ప్రసిద్ధః ఉడుపః చంద్రో యథా. అన్వహం కాష్ఠాభి ః. ఆపూర్యమాణో వర్ధతే. ఏవం పితృభిర్యుధిష్ఠరాదిభిః కామైః చతుష్షష్టికలాదిభిశ్చ. ఆపూర్యమాణో వవృధే. (31)

యుధిష్ఠిరాదులగు పితరులచేత, రాజకుమారుడగు పరీక్షిత్తు పదిహేను కళలతో శుక్లపక్ష చంద్రునివలె పెంపబడుచుండెను. చతుష్షష్టి కలలతో కూడి అభివృద్ధి గాంచెను.(31)

32. శ్లో. యక్ష్యమాణోఽశ్వమేధేన
జ్ఞాతిద్రోహజిహాసయా ।
రాజాఽలబ్ధధనో దధ్యౌ
నాన్యత్ర కరదండయోః ॥

టీ:- పూర్వమాకృష్యోక్తానశ్వమేదాన్ స్వావసరే సప్రకారం కథయఇతి. జ్ఞాతిద్రోహస్య హననేచ్ఛయా. యక్ష్యమాణః. కరదండయోః అన్యత్ర కరః షష్ఠాంశగ్రహణం దండః దుష్టనిగ్రహజనిత తదీయ ధనలాభః. తాభ్యాం వినా అలబ్ధధనః దద్యౌ చింతయామాస. కరదండార్జితధనస్య పరిజనభరణమాత్రోప లక్షణత్వాత్.(32)

పూర్వము చెప్పబడిన జ్ఞాతి వధ దోషపరిహారము కొరకు ధర్మరాజు అశ్వమేధయాగమును గావించదలచి ఆ యాగానికి పన్నుల వలనగాని, జరిమానాల వలనగాని వచ్చిన ధనాన్ని వాడకూడదని, వేరే విధముగా డబ్బు సంపాదించ వలెనని ఆలోచించెను. పన్నుల వలన వచ్చిన ద్రవ్యము, దండనల వలన వచ్చిన ద్రవ్యము పరిజనులకు ఇతరులకు దానముచేయుటతోనే తరిగిపోవుచుండెను. (అశ్వమేధ యాగముతో బ్రహ్మ హత్యాది పాతకాలు తొలగునని శ్రుతి.) (32)

33. శ్లో. తదభిప్రేతమాలక్ష్య
భ్రాతరోఽచ్యుత చోదితాః ।
ధనం ప్రహీణమాజహ్రుః
ఉదీచ్యాం దిశి భూరిశః ॥

టీ:- ప్రహీణం మరుత్తస్య యజ్ఞే త్యక్తం సువర్ణపాత్రాదికమానీతవంతః (33)

ఆ ధర్మరాజు అభిప్రాయాన్ని గుర్తెరిగి శ్రీకృష్ణునితో ప్రేరేపింపబడిన భీమార్జునులు ఉత్తరదిక్కుకు వెళ్ళి మిక్కిలి ధనాన్ని (మరుత్త మహారాజు యజ్ఞంలో వదిలిపెట్టిన బంగరు పాత్రలను) తెచ్చిరి. (33)

34. శ్లో. తేన సంభృత సంభారో
లబ్ధకామో యుధిష్ఠిరః ।
వాజిమేధైస్త్రిభిర్భీతో
యజ్ఞేశమయజద్ధరిమ్ ॥

35. శ్లో. ఆహూతో భగవాన్ రాజ్ఞా
యాచయిత్వా ద్విజైర్నృపమ్
ఉవాస కతిచిన్మాసాన్
సుహృదాం ప్రియకామ్యయా ॥

ఓ శౌనకా ! ఆ ధనము చేత అశ్వమేధ యాగానికి కావలసిన సామగ్రి సంభారాలను సంపాదించుకొని, యుధిష్ఠిరుడు (జ్ఞాతి పాప భయముతో) మూడు అశ్వమేధ యాగాలను చేసి యజ్ఞ పురుషుడగు విష్ణువును సంతోషపఱచెను. షడ్గుణైశ్వర్య సంపన్నుడగు శ్రీకృష్ణుడు ధర్మరాజుచే ఆహ్వానింపబడి బ్రాహ్మణుల సాహాయ్యముతో ధర్మరాజుతో అశ్వమేధ యాగాలు చేయించి తన స్నేహితుల ప్రీతికై కొంత కాలమచటనేయుండి ధర్మరాజుచేత, ద్రౌపదిచేత, అర్జునునిచేత అనుజ్ఞనుపొంది ద్వారకకు వెళ్ళెను.(34,35,36 )

36. శ్లో. తతో రాజ్ఞాభ్యనుజ్ఞాతః
కృష్ణయా సహ బంధుభిః ।
యయౌ ద్వారవతీం బ్రహ్మన్
సార్జునో యదుభిర్వృతః ॥

టీ:- సంభృతసంభారః సంపాదిత యజ్ఞోపకరణః. భీతః జ్ఞాతిద్రోహాత్. (34,35,36)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం సంహితాయాం ప్రథమేస్కంధే భావార్థదీపికాయాం ద్వాదశోధ్యాయః**

**శ్రీమద్భాగవతము యొక్క ప్రథమస్కంధ ద్వాదశాధ్యాయమునకు శ్రీధరీయవ్యాఖ్యానుసార ఆంధ్రానువాదము ముగిసినది.**

## త్రయోదశోఽధ్యాయః

**సూత ఉవాచ.**

1. శ్లో. విదురస్తీర్థయాత్రాయాం
మైత్రేయాదాత్మనో గతిమ్ ।
జ్ఞాత్వాఽగాద్ధాస్తినపురం
తయావాప్తవివిత్సితః ॥

టీ:- శ్లో. నిర్గమో ధృతరాష్ట్రస్య విదుర్యోక్త్యా త్రయోదశే, ఉక్తపౌత్రాభిషేకేణ వక్తుం రాజ్ఞోమహాపథమ్. ఇదానీం పరీక్షితః కలినిగ్రహాదీని కర్మాణి కథయిష్యన్ విదురాగమనేన ధృతరాష్ట్ర ప్రస్థానం. తతోఽర్జునాగమనం తతః పాండవప్రస్థానం చ. నిరూపయతి- త్రిభిరధ్యాయైః విదుర ఇతి ఆత్మనః గతిం శ్రీహరిం. తయా ఆత్మగత్యా. అవాప్తం వివిత్సితం జ్ఞాతుమిష్టం సర్వం యేన. (1)

2. శ్లో. యావతః కృతవాన్ ప్రశ్నాన్
క్షత్తా కౌషారవాగ్రతః ।
జాతైకభక్తిర్గోవిందే
తేభ్యశ్చోపరరామ హ ॥

## త్రయోదశాధ్యాయము

ఈ త్రయోదశాధ్యాయమందు విదురుని మాటలు విని ధృతరాష్ట్రుడు వనమునకేగుట, పౌత్రునికి అనగా పరీక్షిత్తుకు పట్టాభిషేకము చేసి ధర్మరాజు మహాప్రస్థానము గావించుట వర్ణించబడినది. ఇపుడు పరీక్షిన్మహారాజు యొక్క కలి నిగ్రహాది కర్మలను చెప్పబోతూ, విదురుని రాకతో ధృతరాష్ట్రుడు వనమునకేగుట తరువాత అర్జునుని రాక పిమ్మట శ్రీకృష్ణుని అంతర్ధానము, దానిని విని పాండవులు మహాప్రస్థానము గావించుట మూడు అధ్యాయములచేత సూతుడు తెలియచేయుచున్నాడు.

విదురుడు మైత్రేయుని వలన ఆత్మజ్ఞానమును తెలిసికొని దానిచేత పరిపూర్ణ జ్ఞానమును పొందగోరి హస్తినాపురమునకు వెళ్లెను. (1)

పైవిషయమునే చెపుతున్నాడు. కర్మయోగ వ్రతాదులకు సంబంధించిన ప్రశ్నలను విదురుడు మైత్రేయుని అడిగి, వానిలో కొన్నిటినే తెలిసికొని మధ్యలోనే శ్రీకృష్ణునియందు మిక్కిలి భక్తి కలవాడై ఆ ఇతర ప్రశ్నలడగకనే విరమించెను. (2)

టీ:- తదేవాహ. యావత ఇతి యావతః కర్మయోగజ్ఞానాదివిషయాన్ ప్రశ్నాన్ ప్రథమం కృతవాన్. కౌషారవస్య మైత్రేయస్య పురతః పశ్చాత్త్రిచతుర్నశ్నార్థజ్ఞానమాత్రేణ గోవిందే జాతైక భక్తిః. కృతార్థస్సన్. తేభ్యః ప్రశ్నేభ్యః మైత్రేయోక్తతాదృశ ప్రశ్న ప్రతివచనేభ్య ఇత్యర్థః ఉపరరామ తతః పరం న విజ్ఞాపితవాన్(2)

3. శ్లో. తం బంధుమాగతం దృష్ట్వా
ధర్మపుత్రస్సహానుజః ।
ధృతరాష్ట్రో యుయుత్సుశ్చ
సూతశ్శారద్వతః పృథా ॥

హస్తినాపురమునకు వచ్చిన తమ బంధువైన విదురుని చూచి ధర్మరాజు తన తమ్ములు, ధృతరాష్ట్రుడు, యుయుత్సువు, సంజయుడు, కృపాచార్యుడు, కుంతీదేవిలతో సహా ఎదురేగి ఆతనికి స్వాగతము పలికిరి. (తరువాతి శ్లోకముతో అన్వయము.) (3)

టీ:- తమితి. సూతః సంజయః శారద్వతః కృపః పృథాకుంతీ.(3)

4. శ్లో. గాంధారీ ద్రౌపదీ బ్రహ్మన్
సుభద్రా చోత్తరా కృపీ ।
అన్యాశ్చ జామయః పాండోః
జ్ఞాతయః ససుతాః స్త్రియః ॥

ఓ శౌనకా ! గాంధారి, ద్రౌపది, సుభద్ర, ఉత్తర, ద్రోణాచార్యుని భార్య కృపి మరియు ఇతరులైన పాండురాజు జ్ఞాతులందరును సుత కళత్రాదులతో ఆ విదురునికి ఎదురేగి స్వాగతము పలికిరి. (తరువాతి శ్లోకముతో అన్వయము.) (4)

టీ:- గాంధారితి. కృపీ ద్రోణభార్యా. జామయః జ్ఞాతిభార్యాః. అన్యాశ్చ స్త్రియః (4)

5. శ్లో. ప్రత్యుజ్జగ్ముః ప్రహర్షేణ
ప్రాణం తన్వ ఇవాగతమ్ ।
అభిసంగమ్య విధివత్
పరిష్వంగాభివాదనైః ॥

టీ:- ప్రత్యుజ్జగ్మురితి. ప్రాణం తన్వఇవేతి. కుతశ్చిన్మూర్ఛాదిదోషతః ప్రాణేఽవసన్నే సతి తన్వః కరాంఘ్ర్యాదయో నిశ్చేష్టా భవంతి. పునశ్చ తస్మిన్నావిర్భూతే యథోత్తిష్ఠంతి తద్వత్.(5)

శరీరమునకు ప్రాణమువలె, వచ్చినటువంటి ఆ విదురునికి సంతోషముతో ఎదురేగి శాస్త్రోక్త విధానముగా కౌగిలించుకొనుట, నమస్కరించుటలతో ఆతనిని కలుసుకొరి. (ఇచట ప్రాణం తన్వ అనుదానికి ఏ రోగము వలననైన అనగా మూర్ఛాది దోషములతో ప్రాణము పనిచేయనపుడు కాళ్ళు చేతులు పనిచేయక మూర్ఛ నుండి తేరుకొనగానే అన్ని అవయవములు పనిచేసినట్లు ఆ విదురుడు రాగానే అందరును లేచి స్వాగత, ఆలింగన, అభివాదములు చేసిరని భావము.) (5)

6. శ్లో. ముముచుః ప్రేమబాష్పౌఘం
విరహోత్కంఠకాతరాః ।
రాజా తమర్హయాంచక్రే
కృతాసనపరిగ్రహమ్ ॥

టీ:- ముముచురితి. విరహేణ యదౌత్కంఠ్యం తేన కాతరాః వివశాః (6)

చాలా కాలమునకు అతడు వచ్చుట వలన ఆతని విరహముతో ఆతురతతో వివశులై ప్రేమతో కన్నీళ్ళు కార్చిరి. యుధిష్ఠిరుడు, విదురునికి ఆసనమునొసగి కూర్చొనబెట్టి అర్ఘ్య,పాద్యాదులతో పూజించెను.(6)

7. శ్లో. తం భుక్తవంతం ఆసీనం
విశ్రాంతం సుఖమాసనే ।
ప్రశ్నయాఽవనతో రాజా
ప్రాహ తేషాం చ శృణ్వతామ్ ॥

భోజనము చేసి విశ్రాంతి తీసికొని సుఖాసనమున కూర్చొనియున్న ఆ విదురునితో, అందరు వినుచుండగా, వినమ్రుడై ధర్మరాజు ఇట్లు పలికెను.(7)

**యుధిష్ఠిర ఉవాచ.**

8. శ్లో. అపి స్మరథ నో యుష్మత్
పక్షచ్ఛాయాసమేధితాన్ ।
విపద్గణాద్విషాగ్న్యాదేః
మోహితా యత్సమాతృకాః ॥

టీ:- అపీతి. పక్షిణోహ్యపత్యాని యథాతి స్నేహేన పక్షచ్ఛాయయా వర్ధయంతి తద్వత్ యుష్మత్పక్షఛాయయా సమేధితాన్ నోఽస్మాన్ అపిస్మరథస్మ రథకిం? సమేధితత్వ మేవాహ-విపద్గణాద్యస్మాన్మోచితాః స్మః (7,8)

**ధర్మరాజు ఇట్లు పలికెను.**

బాబాయీ ! మీ ప్రేమ నీడలో పెరిగి పెద్దవారమైన మమ్ములను స్మరించితిరా? మేము మా తల్లితో సహా విషము, అగ్ని మొదలగు ఆపదల నుండి మీచేతనే కాపాడబడితిమి అట్టి మమ్ములను మీరు తీర్థయాత్రలలో స్మరించినారా? పక్షులు పిల్లలను ప్రేమతో తమ రెక్కల నీడలో పెంచును అట్లే మీ ప్రేమ నీడలలో మేము పెరిగితిమి, సమస్తాపదల నుండి రక్షింపబడితిమి. (8)

9. శ్లో. కయా వృత్త్యా వర్తితం వః
చరద్భిః క్షితిమండలమ్ ।
తీర్థాని క్షేత్రముఖ్యాని
సేవితానీహ భూతలే ॥

టీ:- కయేతి. వో యుష్మాభిః కయా వృత్త్యావర్తిం దేహవృత్తిః కృతా కానిచ తీర్థానిసేవితాని. (9)

మీరు భూమండలమును సంచరించు తీర్థయాత్రా సమయములో ఏ వృత్తితో గడిపిరి. ముఖ్యములగు ఏ యే తీర్థములను, క్షేత్రములను సేవించితిరి. (9)

10. శ్లో. భవద్విధా భాగవతాః
తీర్థభూతాః స్వయం ప్రభో ।
తీర్థీ కుర్వంతి తీర్థాని
స్వాంతస్థేన గదాభృతా ॥

టీ:- భవతాంచతీర్థాటనం నస్వార్థం కృతం కింతు తీర్థానుగ్రహార్థ మిత్యాహ-భవదితి.మలినజనసంపర్కేణ తీర్థాని మలినాని సంతి. సంతః పునః స్వాంతం మనః తత్ర స్థితేన స్వస్యాంతఃస్థితేనేతి వా పునః తాని తీర్థాన్యపి తీర్థీకుర్వన్తీత్యర్థః.(10)

ప్రభూ ! మీలాంటి భగవద్భక్తులు స్వయముగనే తీర్థముల వంటివారు. మీ హృదయముననున్న కృష్ణపరమాత్మునిచే అన్ని ప్రదేశములను మీరే తీర్థములుగా పవిత్రములుగా చేయుచున్నారు. మీరు తీర్థయాత్రలు చేయుట ఆ తీర్థములను అనుగ్రహించుట కొరకే గాని మీ కొరకు గాదు. పాపాత్ముల సంపర్కముచే కలుషితమైన తీర్థములను సజ్జనులు మరల పవిత్రము చేసి తీర్థములుగా చేయుచున్నారు. (10)

11. శ్లో. అపి నః సుహృదస్తాత
బాంధవాః కృష్ణదేవతాః ।
దృష్టాః శ్రుతా వా యదవః
స్వపుర్యాం సుఖమాసతే ॥

12. శ్లో. ఇత్యుక్తో ధర్మరాజేన
తత్సర్వం సమవర్ణయత్ ।
యథానుభూతం క్రమశో
వినా యదుకులక్షయమ్ ॥

ఓ తండ్రీ ! శ్రీకృష్ణుడే దైవతముగాగల యాదవులు మాకు మిత్రులే కాక బాంధవులు కూడ అట్టివారు మీకు కనిపించారా? వారిని గురించి విన్నారా? వారు వారి నగరములో సుఖముగా ఉన్నారా? అని ధర్మరాజు అడుగగా విదురుడు తాను కన్నది,విన్నది, యదువంశ క్షయము తప్ప అంతయును క్రమముగా వర్ణించి చెప్పెను.(11,12)

టీ:- అపీతి. అపికిం సుఖమాసతే భవద్భిః? క్వాపి దృష్టాః శ్రుతావా.(11,12)

13. శ్లో. నన్వప్రియం దుర్విషహం
నృణాం స్వయముపస్థితమ్ ।
నావేదయత్సకరుణో
దుఃఖితాన్ ద్రష్టుమక్షమః ॥

టీ:- యదుకులక్షయా వర్ణనే కారణమాహ-నన్వితి.(13)

14. శ్లో. కంచిత్కాలమథావాత్సీత్
తత్కృతో దేవవత్సుఖమ్ ।
భ్రాతుర్జ్యేష్ఠస్య శ్రేయస్కృత్
సర్వేషాం ప్రీతిమావహన్ ॥

టీ:- కమితి. శ్రేయస్కృత్తత్త్వముపదిశన్. (14)

యదుకుల నాశనము గురించి విదురుడు చెప్పకపోవడానికి కారణము చెపుతున్నాడు. విధివశాత్తు జరిగిన యదువంశ క్షయ వార్త ధర్మరాజుకు సహింపరానిదని, అప్రియమైనదని, అది వింటే ధర్మరాజు దుఃఖిస్తాడని, ఆతని దుఃఖాన్ని చూడలేక దయామయుడగు విదరుడు ఆ విషయాన్ని తెలుపలేదు. (13)

ఆ విదురుడు దేవుని వలె సత్కరింపబడినవాడై, పెద్దన్నగారగు ధృతరాష్ట్రునికి తత్త్వాన్ని, శ్రేయస్సును కలిగించే జ్ఞానాన్ని ఉపదేశించి. అందరికిని ముదము చేకూర్చుచూ సుఖముగా నుండెను.(14)

15. శ్లో. అబిభ్రదర్యమా దండం
యథాఘమఘకారిషు ।
యావద్దధార శూద్రత్వం
శాపాద్వర్షశతం యమః ॥

టీ:- నను శూద్రోఽసౌ కథం తత్త్వముపదిశేత్. స హ్యసౌ శూద్రః కింతు యమస్త ద్రూపేణాసీత్ కింతత్ర కారణం? యమేచాత్రాగతే అముత్ర కః దండధరః? ఇత్యపేక్షాయామాహ-అబిభ్రదితి. అబిభ్రత్ధృతవానిత్యర్థః మాండవ్యస్య శాపాత్. తథాహి క్వచిచ్చోరాననుధావంతో రాజభటాః మాండవ్యస్య ఋషేస్తపశ్చరతః ఆశ్రమసమీపే తాన్ సంప్రాప్య. తేన సహ నిబధ్యానీయ రాజ్ఞేనివేద్య తదాజ్ఞయా సర్వాన్ శూలేష్వారోపయామాసుఃతతో రాజా తమృషిం జ్ఞాత్వా. శూలదవతార్య ప్రసాదయామాస. తతో మునిర్యమం గత్వా కుపిత ఉవాచ కస్మాదహంచ శూలమారోపిత ఇతి తేనోక్తం త్వంబాల్యే శలభం కుశాగ్రేణావిధ్య క్రీడితవానితి. తచ్ఛ్రుత్వా మాండవ్యస్తం శశాప బాల్యే అజానతో మే మహాంతం దండం యతస్త్వం కారితవాన్, అతస్త్వం శూద్రోభవేతి.(15)

శూద్రుడగు విదురుడు ధృతరాష్ట్రునికి తత్త్వాన్ని ఎట్లు ఉపదేశించెను? అను దానికి సమాధానంగా విదురుడు శూద్రుడు కాదని ఆ రూపమున ఉన్న యమధర్మరాజని చెపుతున్నాడు. యమధర్మరాజే విదురుడుగా అవతరించినాడు. మఱి యముని పరిపాలన దుష్ట శిక్షణ యమలోకమున ఎట్లు సాగెనను? అనుదానికి సమాధానంగా అచట అర్యముడను వాడు ఆ కాలమున వారి వారి పాపాలననుసరించి శిక్షించుటకు దండాన్ని ధరించెను. ఎంతవరకు అనగా యముడు విదురుడుగా ఉన్న వంద సంత్సరాల వరకు.

**విదురుని శాపవృత్తాంతము.** ఒకానొకప్పుడు కొందరు దొంగలు రాజ ద్రవ్యాన్ని అపహరించి తమను వెంబడించుచున్న రాజభటులను చూచి పరుగెత్తుతూ మాండవ్యముని ఆశ్రమము చేరిరి. రాజభటులు మునితో సహా అందరిని బంధించి రాజు వద్దకు తెచ్చిరి. రాజు అందరిని శూలమున ఎక్కించి బాధించెను. కొంతకాలానికి రాజు, మాండవ్యుని మహర్షి అని గుర్తించి శూలము తొలగించి ప్రసన్నుని చేసికొనెను. అపుడు మాండవ్యుడు యమునికడకేగి తనకా కఠిన శిక్ష ఎలా విధించితివని ప్రశ్నించెను. అందుకు యముడు నీవు బాల్యమున మిడుత పురుగును దర్భ కఱ్ఱకు గుచ్చి బాధపెట్టావని, అందుకే నీకీ శిక్ష అని చెప్పాడు. చిన్నతనమున తెలియక చేసిన ఆ పనికి ఇంత దండన కలిగించావేమని కోపించి మాండవ్యుడు యమున్ని నీకు ధర్మం తెలియదని శూద్రుడుగా పుట్టుమని శపించెను(15)

**యుధిష్ఠిర ఉవాచ.**

16. శ్లో. యుధిష్ఠిరో లబ్ధరాజ్యో
దృష్ట్వా పౌత్రం కులంధరమ్ ।
భ్రాతృభిర్లోకపాలాభైః
ముముదే పరయా శ్రియా ॥

టీ:- ఇదానీం రాజ్యాపకర్షణం నిరూపయితం ఉత్కర్షం నిగమయతి. యుధిష్ఠిరఇతి. కులంధరం వంశధరం.(16)

యుధిష్ఠిరుడు రాజ్యాన్నిపొంది, వంశధరుడైన మనుమని (పరీక్షిత్తును) చూచి, లోకపాలకులతో సమానులైన తమ్ములతో, ఉత్కృష్టమైన శోభతో పరమానందమును పొందెను.(16)

17. శ్లో. ఏవం గృహేషు సక్తానాం
ప్రమత్తానాం తదీహయా ।
అత్యక్రామదవిజ్ఞాతః
కాలః పరమదుస్తరః ॥

టీ:- ఏవమితి. తదీహయా గృహవ్యాపారేణ ప్రమత్తానాం అత్యక్రామత్ ఆయుష్కాలోతిక్రాంతః. యద్వా-ఆయుశ్చ తా నభ్యభవదిత్యర్థః.(17)

ఈ విధముగా గృహకార్యములలో నిమగ్నులై ఉన్న పాండవులకు వానియందలి కోరికతో ప్రమత్తులై ఏమి జరుగుతున్నదో తెలియని స్థితిలో, వారికి తెలియకుండగనే ఎవరికిని దాటశక్యముగాని ఆయుష్కాలము అతిక్రమించెను. అనగా వారిని మృత్యువు సమీపించెను. (17)

18. శ్లో. విదురస్తమభిప్రేత్య
ధృతరాష్ట్రమభాషత ।
రాజన్నిర్గమ్యతాం శీఘ్రం
పశ్యేదం భయమాగతమ్ ॥

టీ:- విదుర ఇతి. ఆభిప్రేత్య జ్ఞాత్వా. (18)

విదురుడు ఆ విషయాన్ని తెలిసికొని ధృతరాష్ట్రునితో ఓ రాజా! చూడండి మీకు గొప్ప భయము రాబోతున్నది. అదే మృత్యువు వచ్చి పడినదనే అనుకోండి. ఇటనుండి భద్రమైన ప్రదేశమునకు త్వరగా వెళ్ళండి అనెను.(18)

19. శ్లో. ప్రతిక్రియా న యస్యేహ
కుతశ్చిత్కర్హిచిత్ప్రభో ।
స ఏవ భగవాన్ కాలః
సర్వేషాం సస్సమాగతః ॥

టీ :- నను తత్ప్రతీకారః క్రియతాం కిం నిర్గమనేన. తత్రాహ- ప్రతిక్రియేతి. సర్వేషామితి యైః ప్రతికర్తవ్యం తేషామపీత్యర్థః.(19)

వచ్చినటువంటి మృత్యుభయానికి ప్రతీకారము చేయవచ్చునుగదా వెళ్ళిపోవడం దేనికి అను ప్రశ్నకు సమాధానము చెపుతున్నాడు 'ప్రతిక్రియా' అని. ఎటునుండైనా, దేనివలననైనా ప్రతీకారము లేని, తిరుగులేని మృత్యుకాలము మనందరికి సంప్రాప్తించినది. (19)

20. శ్లో. యేన చైవాభిపన్నోయం
ప్రాణైః ప్రియతమైరపి ।
జనస్సద్యో విముచ్యేత
కిముతాన్యైర్ధనాదిభిః ॥

ఇల్లు, వాకిలి, ధన, ధాన్యాలను విడిచి వెళ్ళుట ఎట్లు సహించదగును అనుదానికి చెపుతున్నాడు 'యేన' అని. మృత్యువుచేత ఆక్రమించబడి, అన్నిటికన్న ప్రియమైన ప్రాణములను కూడా జనులు వెంటనే వదులుదురు. ఇక ధన ధాన్యాదుల గురించి ఏమి చెప్పవలెను.

టీ:- కథం ధనాదివియోగస్సోఢుం శక్య అతఆహ - యేనేతి. అభిపన్నః అభిగ్రస్తః. (20)

మనిషి ప్రాణములనే విడువగా ధనాదుల నెట్లు విడువడు అన్ని వదలి వెళ్ళవలసినదే.(20)

21. శ్లో. పితృభ్రాతృసుహృత్పుత్రాః
హతాస్తే విగతం వయః ।
ఆత్మా చ జరయా గ్రస్తః
పర గేహముపాససే ॥

టీ:- అత్రావస్థానం అతిదైన్యమితి దర్శయన్ వైరాగ్యముత్పాదయతి - సప్తభిః పిత్రితి. ఆత్మా దేహః. (21)

విదురుడు ఇచట ధర్మరాజు ఇంట ఉండుట మిక్కిలి దీనత్వమని చెపుతూ వైరాగ్యాన్ని పుట్టిస్తున్నాడు. ఓ ధృతరాష్ట్రుడా ! నీ తండ్రులు, సోదరులు, స్నేహితులు మరియు కుమారులు యుద్ధమున మరణించిరి. నీ వయస్సు దాటిపోయినది. నీ దేహమును ముసలితనము ఆక్రమించినది అయినను నీవు ఇంకను ఇతరుల ఇంటిలో పడియున్నావు. (21)

22. శ్లో. అహో మహీయసీ జంతోః
జీవితాశా యయా భవాన్ ।
భీమాపవర్జితం పిండమ్ ।
ఆదత్తే గృహపాలవత్ ॥

టీ:- అహోఇతి. యేన పుత్రాహతాస్తేన భీమేన దత్తం పిండం గృహపాల ఇవ గృహపాలః శ్వా.(22)

ఎంత ఆశ్చర్యము ! ప్రాణులకు గల జీవితాశ చాలా గొప్పది. అది నిన్ను తన వశము చేసికొన్నది. ఏ ఆశ చేత నీవు ఇంటియందలి కాపలా కుక్కవలె పడియుండి భీముని చేత పెట్టబడుతున్న పిండాన్ని (ఆహారాన్ని) తినుచున్నావు.(22)

23. శ్లో. అగ్నిర్నిసృష్టో దత్తశ్చ
గరో దారాశ్చ దూషితాః ।
హృతం క్షేత్రం ధనం యేషాం
తద్దత్తైరసుభిః కియత్ ॥

టీ :- అగ్నిరితి. నిసృష్టః క్షిప్తః గరో విషం దూషితాః అవమతాః. తద్దత్తైరన్నాదిభిర్లబ్ధైరసుభిః కియత్ప్రయోజనం. న కించిదిత్యర్థః (23)

మీ పిల్లలు పాండవులు నివసించు లాక్షాగృహానికి నిప్పుపెట్టారు, వారికి విషం పెట్టారు, వారి భార్య ద్రౌపదిని అవమానించారు, వారి రాజ్యాన్ని, ధనాన్ని హరించారు. వీటికన్నిటికి ఏదో విధంగా మీరు కారణమయ్యారు. అట్టి పాండవులు దయదలచి కాస్త పిండం పెడుతూ కాపాడుతున్న నీ ప్రాణాల వలన ఏమి ప్రయోజనము అని విదురుడు ధృతరాష్ట్రునికి వైరాగ్యాన్ని బోధించాడు.(23)

24. శ్లో. తస్యాపి తవ దేహోఽయం
కృపణస్య జిజీవిషోః ।
పరైత్యనిచ్ఛతో జీర్ణో
జరయా వాససీ ఇవ ॥

టీ:- తస్యేతి. తస్యాపి తవ దైన్యమనేభవతోఽపి.పరైతి క్షీయతే. అత ఏవ ధీరో భవేతి.(24)

ఈ విధంగా దీనత్వాన్ని పొంది ఇంకను జీవించాలని అనుకుంటున్న నీ దేహము నీకు ఇష్టము లేకున్నను ముసలితనముచే జీర్ణమై క్షీణించుచున్నది. పాత వస్త్రమువలె శిథిలమగుచున్నది, కావున ధీరుడవు కమ్ము అని విదురుడు ధృతరాష్ట్రునితో పలికెను.(24)

25. శ్లో. గతస్వార్థమిమం దేహం
విరక్తో ముక్తబంధనః ।
అవిజ్ఞాతగతిర్జహ్యాత్
స వై ధీర ఉదాహృతః ॥

ధీరుని లక్షణములేవి అనగా చెపుతున్నాడు 'గత స్వార్థమని'. కీర్తికాంక్షను, ధర్మాచరణకాంక్షను, స్వార్థములను వదలి దేహమునందు విరక్తిచెంది, అన్ని బంధములను విడిపించుకొని, ఎచటికి వెళ్ళెనో కూడ ఎవరికి తెలియక తన శరీరాన్ని ఎవడు వదలునో అతడే ధీరుడని చెప్పబడుతున్నాడు.(25)

టీ:- కిం లక్షణోధీర ఇత్యపేక్షాయామాహ. గతస్వార్థం యశోధర్మాదిశూన్యం ముక్తబంధనః త్యక్తాభిమానః. క్వగత ఇత్యవిజ్ఞాతా గతిర్యస్య స ధీరః. ప్రాప్తస్య దుఃఖస్య స్వయంసహనేన ముక్తిం ప్రాప్తేః (25)

26. శ్లో. యః స్వకాత్పరతో వేహః
జాతనిర్వేద ఆత్మవాన్ ।
హృది కృత్వా హరిం గేహాత్
ప్రవ్రజేత్స నరోత్తమః ॥

ఎవడైతే తనంతట తానుగాని ఇతరుల ఉపదేశము వలనగాని వైరాగ్యాన్ని పొంది, మనోనిగ్రహము కలవాడై, హృదయములో హరిని నిల్పి ఇంటితో సహా అన్ని వదలి సన్యసించునో వాడు మానవులలో శ్రేష్ఠుడు.(26)

టీ:- యఇతి. సర్వోత్తమస్తుతః ప్రాగేవ ఆకృత ప్రతీకారః. స్వకాత్స్వత ఏవ. పరతః పరోపదేశతో వా.(28)

27. శ్లో. అథోదీచీం దిశం యాతు
స్వైరజ్ఞాతగతిర్భవాన్ ।
ఇతోఽర్వాక్ ప్రాయశః కాలః
పుంసాం గుణవికర్షణః ॥

ఇంతకాలము నీవు నరోత్తముడవు కాలేదు ఇపుడైనా ధీరుడవుకమ్ము అని చెపుతున్నాడు, 'అథ' అని. ముందు రాబోయే కాలము ప్రధానముగా మానవుల సద్గుణములను క్షీణింపచేయును. కావున నీవు బంధువర్గానికి తెలియని విధంగా ఉత్తర దిక్కుకు వెళ్ళుము. (27)

టీ:- త్వం తు నరోత్తమో నాభూః. అతః ఇదానీం ధీరో భవేత్యాహ- అథేతి. అర్వాక్ అర్వాచీనః కాలః ఉత్తరకాలః అర్వాక్ నికృష్ట ఇతివా, గుణవికర్షణః గుణాన్ ధైర్యాదీన్ వికర్షతి ఆచ్ఛినత్తీతి తథా.(27)

28. శ్లో. ఏవం రాజా విదురేణానుజేన
ప్రజ్ఞాచక్షుర్బోధితశ్చాజమీఢః ।
ఛిత్త్వా స్వేషు స్నేహపాశాన్ ద్రఢిమ్నో
నిశ్చక్రామ భ్రాతృసందర్శితాధ్వా ॥

టీ:- ఏవమితి. ఆజమీఢః ఆజమీఢవంశజః.ప్రజ్ఞాచక్షుః అంధః ఏవంబోధితస్సన్ ద్రఢిమ్నః చిత్తదార్ఢ్యాంయద్భ్రాత్రా సందర్శితః. అధ్వా వన మోక్షయోర్మార్గో యస్య సః.(28)

సోదరుడగు విదురుని ఉపదేశమును విని, అజమీఢ వంశజుడగు ధృతరాష్ట్రుడు, వెంటనే వివేకము పొంది, అంధుడైనప్పటికి తనలోని దృఢత వలన స్నేహపాశములను త్రెంచుకొని విదురుడు చూపిన మార్గాన్ని అనుసరించి ఇల్లుదాటి వెడలెను. (28)

29. శ్లో. పతిం ప్రయాంతం సుబలస్య పుత్రీ
పతివ్రతా చానుజగామ సాధ్వీ ।
హిమాలయం న్యస్తదండప్రహర్షం
మనస్వినామివ సత్సంప్రహారః ॥

టీ:- పతిమితి. సుబలస్య పుత్రీ గాంధారీ సాధ్వీ సుశీలా హిమాలయం ప్రయంతం పతిమనుజగామ నను,కథం సాసుకుమారీ హిమాది దుఃఖ బహుళం హిమవంతం గతా? అత ఆహ. న్యస్త దండానాం ప్రహర్షో యస్మిన్తం. దుఖఃమపి కేషాంచిత్ప్రహర్ష హేతుర్భవతీత్యత్ర దృష్టాంతః. మనస్వినాం శూరాణాం. యుద్ధే సన్

సుబలుని కూతురు, పతివ్రత, మంచి శీలముగల గాంధారి, సన్న్యాసధర్ముడై విరక్తుడై వెళుతున్న భర్తను అనుసరించి హిమాలయానికి వెళ్ళెను. గాంధారి హిమాద్రివాస దుఃఖాన్ని ఎలా సహించెను. అనగా అభిమానవంతులగు వీరులకు రణమున తగిలిన దెబ్బలు కూడ ఎట్లు ఆనందమునే కలిగించునో, అదే విధముగా సన్న్యాసముచే సకల ప్రాణులకు అభయ ప్రదానము చేసే యతులకు హిమాలయములు ఆనందాన్నే కలిగించును.(29)

తీవ్రః సంప్రహారః. ప్రహారః పాఠాంతరే. సత్సంప్రహారం యుద్ధం యథేతి. (29)

30. శ్లో. అజాతశత్రుః కృతమైత్రో హుతాగ్నిః
విప్రాన్నత్వా తిలగోభూమిరుక్మైః ।
గృహం ప్రవిష్టో గురువందనాయ
న చాపశ్యత్పితరౌ సౌబలీం చ ॥

అజాతశత్రువగు ధర్మరాజు సంధ్యోపాసన (మిత్ర దేవతోపాసన) చేసి, అగ్న్యుపాసన గావించి బ్రాహ్మణులకు నువ్వులు, ఆవులు, భూమి, బంగారమును ఇచ్చి నమస్కరించి తన గురువగు ధృతరాష్ట్రునకి వందనము గావించుటకు వారి ఇంటికి వెళ్ళెను. కాని అచట తండ్రులగు విదుర, ధృతరాష్ట్రులు, తల్లియగు గాంధారి కనిపించలేదు. (30)

టీ:- అజాతశత్రురితి. కృతం మైత్రం మిత్రదైవత్యం సంధ్యావందనం యేన. నత్వా సంపూజ్య. పితరౌ విదురధృతరాష్ట్రౌ. సౌబలీం గాంధారీం నాపశ్యత్. (30)

31. శ్లో. తత్ర సంజయమాసీనం
పప్రచ్ఛోద్విగ్న మానసః ।
గావల్గణే క్వ నస్తాతో
వృద్ధో హీనశ్చ నేత్రయోః ॥

ధర్మరాజు మనస్సు కలవరపడగా, అచట కూర్చొని ఉన్న సంజయునితో, గవల్గుని కుమారుడవగు ఓ సంజయా ! కన్నులులేని, వృద్ధుడగు మా తండ్రి ధృతరాష్ట్రుడు ఏడి? ఎక్కడికి వెళ్ళెను? అని అడిగెను. (31)

టీ:- తత్రేతి. హే గా వల్గణే గావల్గణస్య పుత్ర సంజయ. (31)

32. శ్లో. అంబా చ హతపుత్రార్తా
పితృవ్యః క్వ గతస్సుహృత్ ।
అపి మయ్యకృతప్రజ్ఞే
హతబంధుస్స భార్యయా ॥

టీ:- అంబేతి. సార్ధశోకమేకం వాక్యం అకృతప్రజ్ఞే మందమతౌ. శమలం అపరాధం. ఆశంసమానః. ఆశంకమానః. భార్యయా సహ.(32)

ఓ సంజయా ! పుత్రవధ శోకంతో ఉన్న మా తల్లి గాంధారి, మంచి హృదయముగల పినతండ్రి విదురుడును ఎక్కడకు వెళ్ళారు? ధృతరాష్ట్రుడు బంధువధతో దుఃఖితుడై, మందమతినగు నాయందు అపరాధమును ఆశంకించాడా? భార్యతో గూడి ఎక్కడికి వెళ్ళినాడు? (32)

33. శ్లో. పితర్యుపరతే పాండౌ
సర్వాన్నస్సుహృదశ్శిశూన్ ।
అరక్షతాం వ్యసనతః
పితృవ్యౌ క్వ గతావితః ॥

టీ:- ఆరక్షాతామితి. యౌ అరక్షతాంతౌ ఇతః స్థానాత్.(33)

ఓ సంజయా ! మా తండ్రియగు పాండురాజు మరణించగా, చిన్న పిల్లలము, అభము శుభము తెలియని, నిర్మలమగు మనస్సుగల మమ్ములందరిని మాతండ్రి సోదరులగు విదుర, ధృతరాష్ట్రులు చాలాసార్లు ప్రమాదముల నుండి రక్షించిరి. వారిద్దరు ఇట నుండి ఎక్కడకు వెళ్ళిరి. (33)

**శ్రీసూత ఉవాచ.**

34. శ్లో. కృపయా స్నేహ వైక్లబ్యాత్
సూతో విరహకర్శితః ।
ఆత్మేశ్వరమచక్షాణో
న ప్రత్యాహాతి పీడితః ॥

టీ:-కృపయా స్నేహవైక్లబ్యాచ్చాతిపీడతః. ఆత్మేశ్వరం ధృతరాష్ట్రమపశ్యన్. విరహ కర్షితశ్చ సూతః సంజయః ప్రత్యుత్తరమాహ(34)

**సూతుడిట్లు చెప్పెను.**

తన ప్రభువగు ధృతరాష్ట్రుడు కనిపించకపోవడంతో అతని యందున్న జాలి, స్నేహపారవశ్యము కలిగి వారి విరహముతో కృశించి, బాధతో ఉన్న సూతుడగు సంజయుడు సమాధానమివ్వలేదు(34)

35. శ్లో. విమృజ్యాశ్రూణి పాణిభ్యామ్
విష్టభ్యాత్మానమాత్మనా
అజాత శత్రుం ప్రత్యూచే
ప్రభోః పాదావనుస్మరన్ ॥

టీ:- ఆత్మనా బుద్ధ్యా ఆత్మానం మనః విష్టభ్య ధైర్యయుక్తం కృత్వా. ప్రభోః ధృతరాష్ట్రస్య.(35)

సంజయుడు కొంతసేపటికి తన చేతులతో కన్నీళ్ళను తుడుచుకొని తనను తాను నిలదొక్కుకొని అజాతశత్రువగు ధర్మరాజుతో తన ప్రభువగు ధృతరాష్ట్రుని పాదాలను స్మరిస్తూ ఇట్లనెను.(35)

**సంజయ ఉవాచ.**

36. శ్లో. నాహం వేద వ్యవసితం
పిత్రోర్వః కులనందన ।
గాంధార్యా వా మహాబాహో
ముషితోఽస్మి మహాత్మభిః ॥

టీ:- గాంధార్యాశ్చ వ్యవసితం నిశ్చయం. యతో ముషితః వంచితోఽస్మీతి (38)

**సంజయుడిట్లనుచున్నాడు.**

కురుకులమునకే ఆనందము కలిగించు ఓ ధర్మరాజా ! నేను మీ తండ్రులగు విదుర ధృతరాష్ట్రుల అభిప్రాయమునుగాని, గాంధారి భావమునుగాని అవగతము చేసికొనలేకపోతిని. గొప్ప బాహువులుగల ఓ ధర్మరాజా ! నేను ఆ ముగ్గురు పెద్దల చేత (గాంధారీ,ధృతరాష్ట్ర , విదురుల) మోసగింపబడినాను. వారు నాకు చెప్పకుండగనే అదృశ్యులైనారు. (36)

37. శ్లో. అథాజగామ భగవాన్
నారదస్సహతుంబురుః ।
ప్రత్యుత్థాయాభివాద్యాహ
సానుజోఽభ్యర్చయన్నివ ॥

టీ:- ఏవం కంచిత్కలంశోచతి తస్మిన్ అథ నారద ఆజగామ. ఏతస్మిన్నంతర ఇత్యాది పాఠాంతరం కతిషుత్పుస్తకేషుదృశ్యతే. మయా యథాసంప్రదాయమేవ వ్యాఖ్యాయతే. శోకవేగాదభ్యర్చయచన్ని వాహ-రాజానభ్యర్చయన్.(37)

ఈ విధముగా దుఃఖించుచుండగా తుంబురునితో కలిసి నారదభగవానుడు అచటికి ఏతెంచెను. ధర్మజుడు దుఃఖాతిరేకమున నున్నను, తమ్ములతో కలిసి నారదునికెదురేగి నమస్కరించి పూజించుచున్నవానివలె, మనసులేకనే వినయముతో, గౌరవముతో ఇట్లు పలికెను. (ఇక్కడ కొన్ని పుస్తకాలలో పాఠభేదము కలదని, సంప్రదాయానుగుణముగా వ్యాఖ్యానించెదని పలికిన శ్రీధరులు, దుఃఖముతో ఉన్న ధర్మరాజు నారదుని పూజించుచున్నవానివలె ఉండెను గాని దుఃఖావేశముతో శ్రద్ధగా యథార్థముగా పూజించలేక పోయెనని వ్యాఖ్యానించిరి. (37)

**యుధిష్ఠిర ఉవాచ.**

38. శ్లో. నాహం వేద గతిం పిత్రోః
భగవన్ క్వ గతః పితా ।
అంబా వా హతపుత్రార్తా
క్వ గతా చ తపస్వినీ ।
కర్ణధార ఇవా పారే
భగవాన్ పారదర్శనః ॥

టీ :- నాహం వేద న వేద్మి. తపస్వినీ దుఃఖయుక్త అపారశోకార్ణవే. భగవాన్ స్వయమేవ. పారదర్శనః. అత్ర బ్రూహీతి శేషః (38)

**ధర్మజుడనుచున్నాడు.**

ఓ భగవానుడా ! నారదమహర్షీ ! కుమారులు చంపబడి బాధపడుతున్న మా తల్లి గాంధారి, ఇద్దరు తండ్రులు విదుర, ధృతరాష్ట్రులు ఇటనుండి ఎచటికి వెళ్ళిరో తెలియక, అంతులేని శోకసాగరమున మునిగి ఉన్న మాకు మీరు తీరమును చూపువారుగా ప్రత్యక్షమైనారు. మీరు అన్ని తెలిసినవారు కావున వారు ఎచటికి వెళ్ళిరో తెలుప ప్రార్థన. (38)

39. శ్లో. అథాబభాషే భగవాన్ ।
నారదో మునిసత్తమః ।
మా కంచన శుచో రాజన్
యదీశ్వరవశం జగత్ ॥

టీ:- ఆదావేవ యథావృత్తకథనే శోకేన మూర్ఛితః. పతేదితి. ప్రథమం తావచ్ఛోకముపశమయతి-మేతి. కంచన మా శుచః మాశోచః. న కేవలం తానేవ. యద్యస్మాదీశ్వరాధీనం జగత్.(39)

మునులలో శ్రేష్ఠుడగు నారదభగవానుడు తదుపరి ఇట్లు పలికెను. మొదటనే వారు గతించిన వార్తను తెలిపితే ధర్మజుడు మూర్ఛిల్లునని, మొదట దుఃఖాన్ని ఉపశమింపజేసే అనునయపు మాటలను వేదాంత వాక్యాలు చెపుతున్నాడు. ఓ రాజా ! ఈ జగత్తంతయును ఈశ్వరాధీనము. అందువలన ఎవరిని గురించి కూడా ఏడవకుము. అనగా ఆ పెద్దల గుఱించియే కాదు ఎవటిని గురించి కూడా ఏడవకూడదు. (39)

40. శ్లో. లోకాస్సపాలా యస్యేమే
వహంతి బలిమీశితుః ।
స సంయునక్తి భూతాని
స ఏవ వియునక్తి చ ॥

టీ :- తదేవాహ - లోకాఇతి . సంయునక్తి సంయోజయతి వియునక్తి వియునక్తి చ.(40)

41. శ్లో. యథా గావో నసి ప్రోతాః
తంత్యాం బద్ధాః స్వదామభిః ।
వాక్తంత్యాం నామభిర్బద్ధాః
వహంతి బలిమీశితుః ॥

టీ:- గావో బలీవర్దాః. తంత్ర్యాం దీర్ఘతంత్ర్యాం బద్ధోపదామభిః నసి నాసికాయాం ప్రోతాః స్వామినోబలిం వహంతి. యథా.ఏవం వాక్తంత్ర్యాం కర్తవ్యాకర్తవ్యవిధాయక వేదలక్షణాయాం నామభిః విప్రః బ్రహ్మచారీత్యాదివర్ణాశ్రమలక్షణై, బద్ధాః పరమేశ్వరస్య బలిం తేన ప్రేరితాః సర్వే వహంతీత్యర్థః. (41)

ఆ విషయమునే మరల మహర్షి చెపుతున్నాడు.ఏ ఈశ్వరుని లోకపాలకులందరు సేవింతురో, పూజసేయుదురో, అతడే ప్రాణులందరిని కలుపును, విడదీయును. కావున ఓ రాజా ! దుఃఖించకుము సంయోగవియోగాలు పరిహరింపశక్యముగానివి. (40)

ముక్కున తాళ్ళతో కట్టబడి పెద్ద త్రాటికి అనుబంధిపబడిన ఎద్దులు యజమాని అధీనముగాఉండి పనులుచేయును, వస్తువులను మోయును, ఆ విధముగా మానవులు విధి, నిషేధ రూపమగు వేదమనెడి త్రాటికి బ్రాహ్మణ, క్షత్రియాది బ్రహ్మచర్యాది వర్ణాశ్రమాలచే బద్ధులై పరమేశ్వరుని ప్రేరణచేత ఆతనికి వశులై అతడు ప్రేరేపించు యజ్ఞరూపమైన పనులు ఆచరింతురు. (41)

42. శ్లో. యథా క్రీడోపస్కరాణామ్ ।
సంయోగ విగమావిహ ।
ఇచ్ఛాయా క్రీడితుః స్యాతామ్ ।
తథైవేశేచ్ఛయా నృణామ్ ॥

టీ:- ప్రవృత్తౌ పారతంత్ర్యముక్త్వా సంయోగవిభాగయోరప్యాహ - క్రీడోపస్కరాణాం క్రీడాసాధనానామ్. (42)

43. శ్లో. యన్మనసే ధ్రువం లోకమ్ ।
అధ్రువం వా న చోభయమ్ ।
సర్వథా న హి శోచ్యాస్తే ।
స్నేహాదన్యత్ర మోహజాత్ ॥

టీ:- ఈశ్వరాధీనత్వన్న శోకః కార్యఇత్యుక్తంలోకతత్వే చ విచార్యమాణే నిర్విషయోఽయం లోక ఇత్యాహ-ఇచ్ఛయేతి.యత్ యది లోకం జనం ధ్రువం జీవరూపేణ, అధ్రువం దేహరూపేణ. నచేతి. న ధ్రువం నాప్యధ్రువం శుద్ధబ్రహ్మ రూపేణ అనిర్వచనీయత్వేన వా ఉభయం వా చిజ్జడాంశతః సర్వథాపి చతుర్ష్వపి పక్షేషు. తే పిత్రాదయో న శోచ్యాః, స్నేహదన్యత్ర. స్నేహఏవ కేవలం శోకహేతుః స చాజ్ఞానమూల ఇత్యర్థః. (43)

ప్రవృత్తి విషయమున సంయోగ వియోగాలకు స్వాతంత్ర్యము లేదని వచించుచున్నాడు. ఈ లోకమున ఆటగాని ఇచ్ఛననుసరించి ఆటవస్తువులకు కలయిక విడిపోవుట కలుగుచుండును, అటులనే మానవులకు ఈశ్వరేచ్ఛచేతనే సంయోగ వియోగాలు కలుగును. బొమ్మలు ఆడించేవాడు ఆడించినట్లు ఆడును, కాని బొమ్మలకు స్వాతంత్ర్యము లేదు. మనుజులు కూడా అంతే. సంయోగ వియోగాలు ఈశ్వరాధీనములు. (42)

కలయిక విడిపోవడము దైవాధీనములు కావున దుఃఖింపరాదని చెప్పబడుచున్నది. లోకంపోకడ చూడగా దుఃఖానికి అవకాశం లేదు. ఎందుకనగా మనుజుడు జీవుడుగా నిత్యుడు, అతనికి చావులేదు. అతడే దేహరూపంతో అనిత్యుడు. అంటే నిత్యుడుగాడు అనిత్యుడు గాడు. అతడు శుద్ధపరబ్రహ్మస్వరూపము. చెప్పశక్యముగాని జ్ఞాన, జడ స్వరూపములతో ఒప్పు, నిర్గుణుడు. నాలుగు రకాలుగా ఆలోచించినను నీ తండ్రి మొదలగువారి గురించి దుఃఖించదగదు. ఎందుకనగా స్నేహమే శోకకారణము. ఆ శోకము అజ్ఞానము వలన కలుగును. జ్ఞానికి శోకమోహాలు లేవు.(43)

44. శ్లో. తస్మాజ్జహ్యంగ వైక్లబ్యమ్
అజ్ఞానకృతమాత్మనః ।
కథం త్వనాథాః కృపణాః
వర్తేరంస్తే చ మాం వినా ॥

టీ:– తస్మాత్ మాం వినా కథం వర్తేరన్నితి ఆత్మనః మనసో వైక్లబ్యం వ్యాకులతాం త్యజ.(44)

ఓ ధర్మజా ! అందువలన నేను లేకపోతే దిక్కులేని వీరు కృపణులు, జారిచూపదగినవీరెలా ఉంటారో అనే నీ అజ్ఞానముతో మనస్సున కలవరపడకుము. జ్ఞానికి దుఃఖప్రసక్తి ఉండరాదు. (44)

45. శ్లో. కాలకర్మగుణాధీనో
దేహో౽యం పాంచభౌతికః ।
కథమన్యాంస్తు గోపాయేత్
సర్పగ్రస్తో యథా పరమ్ ॥

టీ:– తత్ర త్వద్దేహతః తేషాం వృత్తిరిత్యేతత్తావన్నాస్తీత్యాహ–కథమితి. కాలో గుణక్షోభకః కర్మ జన్మనిమిత్తం గుణాః ఉపాదానం. తదధీనః పాంచభౌతికో౽యం జడః తద్విభాగే నాశవాంశ్చ. సర్పగ్రస్తః అజగరగిళితః యథా అన్యం ముమూర్షుం న రక్షతి తద్వత్. (45)

ఈ దేహము పృథివ్యాది పంచభూతములతో నిర్మితమై, అందరిని క్షోభింపజేసే కాలానికి, ప్రారబ్ధకర్మకు, జన్మనిమిత్తాది గుణాలకు అధీనమైఉండును. ఇట్టి దేహము కొండచిలువచే మ్రింగబడినవాడు ఇతరులను కాపాడలేనట్లు మరియొకనిని ఎట్లు కాపాడగలడు ? (45)

46. శ్లో. అహస్తాని సహస్తానామ్
అపదాని చతుష్పదామ్ ।
ఫల్గూని తత్ర మహతాం
జీవో జీవస్య జీవనమ్ ॥

టీ:- ఈశ్వరేణ విహితా వృత్తిశ్చ సర్వతస్సులభైవేత్యాహ-అహస్తాని పశ్వాదీని. అపదాని తృణాదీని. తత్ర తేష్వహస్తాదిష్వపి.ఫల్గూని ఏవం జీవస్సర్వోఽపి సర్వస్య జీవస్య జీవనం జీవికా. ఏతేనైవ సర్వతో మృత్యుగ్రస్తత్వం చోక్తమ్.(46)

47. శ్లో. తదిదం భగవాన్ రాజన్
ఏక ఆత్మాత్మనాం స్వదృక్ ।
అంతరోఽనంతరో భాతి
పశ్య త్వం మాయయోరుధా ॥

టీ:- మోహనివృత్త్యర్థం ద్వైతస్యావస్తుత్వమాహ-తదిదం అహస్తసహస్తాదిరూపం జగత్. స్వదృక్ భగవానేవ న తతః పృథక్. సచ ఏకేవ నతునానా. నను సజాతీయ విజాతీయభేదే ప్రత్యక్షే కుత ఏతత్త్రాహ - అత్మనాం భోక్తౄణాం ఆత్మాస్వరూపం. అతోన

చేతులు లేని జంతువులు (పశువులు) చేతులుకల మానవులకు ఆహారములగును, పాదములులేని తృణాదులు నాలుగు పాదాలుకల పశువులకు ఆహారములగును, చిన్న ప్రాణులు పెద్దవాటికి ఆహారములగును, ఈ విధముగా ఒకజీవి మరియొక జీవికి బ్రతుకుతెరువై ఆహారముగా ఈశ్వరేచ్ఛచే కల్పింబడినది. జీవనాధారాన్ని ప్రతివానికి ఈశ్వరుడే కల్పించాడు. ఒకదానిని మరొకటి తినడమంటే సర్వము మృత్యువుచే కబళింపబడుతున్నదని గమనించాలి. (46)

అజ్ఞానము తొలగవలెనని ద్వైతమవాస్తవమని తెలుపుతున్నాడు నారదుడు ధర్మరాజునకు. కావున అహస్త సహస్తాది సమస్త రూపమున భాసించు ఈ జగత్తు అంతయును ఆత్మస్వరూపమే. "ఏకమేవా ద్వితీయం బ్రహ్మ" అను శ్రుత్యనుసారము ఈ జగత్తు నీకంటే వేరుకాదు. అది ఒక్కటే కాని వేరుగా అనేకముకాదు. సజాతీయ విజాతీయ భేదము ప్రత్యక్షము కదా అని అంటావేమో కాదు జాగ్రత్తగా వినుము. సజాతీయ భేదమునకు ఉదాహరణ ఈ మనిషి , ఆ మనిషికన్నా వేరు అనునది. విజాతీయ భేదమునకు ఉదాహరణ మనిషి పశువుకన్నా వేరు, మామిడిచెట్టు వేపచెట్టుకన్నా వేరు అనునది. నిజమునకు ఉన్నది

సజాతీయభేదః. అంతరోఽనంతరశ్చ అంతర్బహిర్భోక్తృభోగ్య రూపశ్చ భాతి. అతో న విజాతీయభేదోఽపి. నన్వేకః కథం తథా ప్రతీయతే? తత్రాహ-మాయయా బహుధా భాంతం కం పశ్యేతి. (47)

48. శ్లో. సోఽయమద్య మహారాజ
భగవాన్ భూతభావనః ।
కాలరూపోఽవతీర్ణోస్యామ్
అభావాయ సురద్విషామ్ ॥

టీ:- క్వాసావాస్తే స ఈశ్వరో మహామాయావీ? ద్వారకాయా మిత్యహ కాలరూపఇతి. అస్యాం పృథివ్యాం అభావాయనాశాయ. (48)

49. శ్లో. నిష్పాదితం దేవకృత్యమ్
అవశేషం ప్రతీక్షతే ।
తావద్యూయమవేక్షధ్వం
భవేద్యావదిహేశ్వరః ॥

టీ :- తర్హి శ్రీకృష్ణోఽత్రాస్తీత్యత్రైవాస్థాం మాకృథాః ఇత్యాహ. అత్ర

ఆత్మవస్తువు ఒకటే కావున అందరి ఆత్మలు ఒకటే. కావున సజాతీయ భేదము లేదు. లోపల ఉండి అనుభవించేది ఆత్మయే, బయట ఉండి అనుభవించబడే భోగ్యవస్తువులును ఆత్మయే కనుక విజాతీయ భేదము కూడా ఆత్మకు లేదు. (47)

ఇటువంటి మహామాయావి ఎక్కడున్నాడు? ద్వారకలో ఉన్నాడు. కాలస్వరూపుడగు కృష్ణభగవానుడు రాక్షస నాశనము కొరకు భూమిపైన అవతరించినాడు. ఓ ధర్మరాజా వగవకుము. (48)

శ్రీకృష్ణుడిచటనే ఉన్నాడు, ఇచటనే ఉండవచ్చును కదా అనుకోకుము. ఓ ధర్మరాజా! అతడు దేవకార్యమును పూర్తిచేశాడు, యాదవకుల నాశనమనే మిగిలిన పనిని చేయాలని చూస్తున్నాడు. ఆ తరువాత తన నిజ స్థానమైన వైకుంఠానికి వెళుతాడు. ఆయన ఉండేంతవఱకు మీరు కూడా ఎదురుచూచి ఆ తరువాత మహాప్రస్థానమునకై మీరు కూడా బయలుదేరి వెళ్ళండి. ఎంతవరకు

దేవానాం. కర్తవ్యం కార్యం తేన నిష్పాదితం కేవలం అవశేషం ప్రతీక్షతే. యదు కులక్షయమితి హృదిస్థం. తతో నిజం ధామ యాస్యతి తతో యూయమపి గచ్ఛతేత్యర్థః. తచ్చభూతమపి విదురవదసౌ నావర్ణయత్. (49)

కృష్ణుడుంటాడో అంతవరకు మీరు ఇచట ఎదురుచూడండి. (49)

50. శ్లో. ధృతరాష్ట్రస్సహ భ్రాత్రా
గాంధార్యా చ స్వభార్యయా ।
దక్షిణేన హిమవతః
ఋషీణామాశ్రమం గతః ॥

టీ :- తదేవ శోకావస్థానం నివార్య జిజ్ఞాసమానాయ తస్మై యథావృత్తం కథయతి. ధృతరాష్ట్ర ఇతి షడ్భిః.హిమవతో దక్షిణభాగే. (50)

ఈ విధముగా ధైర్యాన్నికలిగించి ధర్మజుని దుఃఖాన్ని పోగొట్టి, తన తండ్రులు, పెదతల్లి ఎక్కడున్నారో ప్రశ్నకు సమాధానముగా జరిగినది చెపుతున్నాడు నారదుడు "ధృతరాష్ట్ర" అను శ్లోకముతో ఆరంభించి ఆరు శ్లోకాలతో. ధృతరాష్ట్రుడు తన సోదరుడగు విదురుడు, తన భార్య గాంధారితోసహా హిమవత్పర్వత దక్షిణ భాగమున ఉన్న ఋషుల ఆశ్రమానికి వెళ్ళాడు. (50)

51. శ్లో. స్రోతోభిస్సప్తభిర్యా వై
స్వర్ధునీ సప్తధా వ్యధాత్ ।
సప్తానాం ప్రీతయే నానాః
సప్తస్రోతః ప్రచక్షతే ॥

ఆ ఆశ్రమము ఎక్కడ అనుదానికి చెపుతున్నాడు "స్రోతోభి" అని. సప్తర్షుల యొక్క ప్రీతి కొరకు గంగానది (మందాకిని) తనను తాను ఏడు పాయలుగా చేసికొని. ఎచట "సప్తస్రోతః" ఏడు ప్రవాహాలు కలిదిగా చెప్పబడుచున్నదో ఆ సప్తస్రోతస్సు అను గంగ ఒడ్డున వారుండు ఆశ్రమమున్నది. (51)

టీ :- తదపి కుత్రేత్యాహ. స్రోతోభిరితి. యావై ప్రసిద్ధా స్వర్ధునీ గంగా. ఆత్మానం యత్ర సప్తధా వ్యధాత్.కిమర్థం? నానాపృథక్సప్తభిః స్రోతోభిః ప్రవాహైః సప్తానామృషీణాం ప్రీతయే. అతఏవ తత్తీర్థం జనాస్సప్తస్రోతో వదంతి.(51)

52. శ్లో. స్నాత్వానుసవనం తస్మిన్
హుత్వా చాగ్నీన్ యథావిధి ।
అబ్భక్ష ఉపశాంతాత్మా
స ఆస్తే విగతైషణః ॥

టీ:- తత్ర తే నకృతమష్టాంగయోగమాహ-స్నాత్వేత్యాదిచతుర్భిః. తత్ర స్నానం హోమః. అబ్భక్షణం చ ఉక్తాః - భక్షణస్థానే అపాం స్వీకారాదబ్భక్షణః. ఉపశాంతః ఆత్మా యస్య. విగతా పుత్రాద్యేషణా యస్మాదితి యమా ఉక్తాః. (52)

53. శ్లో. జితాసనో జితశ్వాసః
ప్రత్యాహృత షడింద్రియః ।
హరిభావనయా ధ్వస్త
రజస్సత్వతమోమలః ॥

అచట ఆ ధృతరాష్ట్రునిచే చేయబడిన యోగమును చెపుతున్నాడు. స్నాత్వా అని మొదలిడి నాలుగు శ్లోకాలచేత. అచట స్నానము, హోమము జల భక్షణము అను నియమాలు చెప్పబడినవి వాటిని ఆచరించుచూ ప్రశాంతమగు ఆత్మభావముతో పుత్రాద్యేషణ లను వదలి, యమాలు కలిగి, ఆ తీర్థమున స్నానహోమాదులు చేయుచు ప్రశాంతుడై ధన,దార పుత్రేషణలు లేక ధృతరాష్ట్రుడు ఇప్పుడు ప్రసన్నమగు మనస్సుగలవాడై ఉన్నాడు. (52)

ఇప్పుడా ధృతరాష్ట్రుడాఆశ్రమమున జితాసనుడై ఆసన ప్రత్యాహార ప్రాణాయామాలు కలిగి సత్త్వ రజస్తమో మాలిన్యాలులేని ధ్యానము చేయుచున్నాడు. ధృతరాష్ట్రుడు ఆసనజయమునొంది ప్రాణాయామము చేసి, ఇంద్రియ నిగ్రహముతో మనస్సును ఏకాగ్రము చేసి శ్రీహరిని ధ్యానము చేస్తూ సత్త్వ రజస్తమో గుణాతీతుడై ఉన్నాడు. (53)

టీ:- జితాసన ఇత్యాదినా ఆసనప్రాణాయామ ప్రత్యాహారా ఉక్తాః హరిభావనయేతి. ధారణోక్తా. ధ్వస్తాః రజస్సత్వతమోరూపాః మలాః యస్యేతి.ఫలతో ధ్యానముక్తమ్.(53)

54. శ్లో. విజ్ఞానాత్మని సంయోజ్య
క్షేత్రజ్ఞే ప్రవిలాప్య తమ్ ।
బ్రహ్మణ్యాత్మానమాధారే
ఘటాంబరమివాంబరే ॥

విజ్ఞాన అను రెండు శ్లోకాలచే సమాధిని తెల్పుచున్నాడు. ధృతరాష్ట్రుడు ప్రస్తుతము తనను మనోఽహంకారాస్పద స్థూల దేహము నుండి విడదీసికొని విజ్ఞానాత్మతో కలిపి, ఆ విజ్ఞానాత్మను దృశ్యాదృశ్య వస్తువుల నుండి విడదీసికొని క్షేత్రజ్ఞుని (చూచేవాని, సాక్షిని, ఆత్మను బ్రహ్మమును చూచుకొనుచున్నాడు. ఘటాకాశాన్ని ఘటము నుండి విడదీసి మహాకాశమున కలిపినట్లు క్షేత్రజ్ఞాత్మను పరబ్రహ్మమునందు లయింపజేసికొనుచున్నాడు. (54)

టీ:- సమాధిమాహ -విజ్ఞానేత్యాది ద్వాభ్యాం.అహంకారాస్పదాత్ స్థూలదేహాద్వియోజ్య విజ్ఞానాత్మనిబుద్ధౌ సంయోజ్య ఏకీకృత్యతం విజ్ఞానాత్మానం దృశ్యాంశాద్వియోజ్య. క్షేత్రజ్ఞే ద్రష్టరివిలాప్య తం చ క్షేత్రజ్ఞం ద్రష్టృంజాద్వియోజ్య ఆశ్రయసంజ్ఞే బ్రహ్మణి విలాప్య ఘటాంబరం ఘటోపాధేర్వియోజ్య యథా మహాకాశే ప్రవిలాప్యతే, తద్వత్. (54)

55. శ్లో. ధ్వస్తమాయాగుణోదర్కో
నిరుద్ధకరణాశయః ।
నివర్తితాఖిలాహారః
ఆస్తే స్థాణురివాచలః ॥

కదలకుండ ధృతరాష్ట్రుడున్నాడని చెపుతున్నాడు. అంతరింద్రియ మనః క్షోభమున చక్షురాది బహిరింద్రియ క్షోభము వలన స్థానచలనము, లేవడము సంభవించును కాని ఇప్పుడు అవి రెండును ఆతనికి లేవు. మాయా గుణములు, ఉత్తరఫల వాసనలు

టీ:- వ్యుత్థానాభావమాహ. తద్ధి అంతర్గణక్షోభాద్బహిరింద్రియ క్షోభాద్వా తదుభయం తస్యనాస్తి. యతోధ్వస్తోమాయా గుణానాముదర్క ఉత్తరఫలం వాసనా యస్య. నిరుద్ధానికరణాని చక్షురాదిని ఆశయో మనశ్చ యస్య సః అతఏవ నివర్తితః అఖిలఆహారో భోజ్యం. ఇంద్రియైః విషయాహరణం వా యేనసః స్థాణురివ. నిశ్చలః ఆస్తే. (55)

లేనివాడై, చక్షురాది ఇంద్రియములను, మనస్సును నిగ్రహించి, బహిరింద్రియ వ్యాపారము నివర్తించిన ధృతరాష్ట్రుడు స్థాణువువలె ఉన్నాడు. అన్నింటి నుండి విరక్తుడై ఉన్నాడని భావము. (55)

56. శ్లో. తస్యాంతరాయో మైవాభూత్
సన్యస్తాఖిల కర్మణః ।
స వా అద్యతనాద్రాజన్
పరతః పంచమేఽహని
కలేవరం హాస్యతి స్వం
తచ్చ భస్మీభవిష్యతి ॥

టీ:- తథా భూతమప్యా నేతుముద్యతం ప్రత్యాహ-అంతరాయో విఘ్నః మైవాభూదిత్యడగామశ్ఛాందసః దర్శనమపి తావత్కుర్యామిత్యు ద్యతం ప్రత్యాహ - స ఇతి. సవైఅద్యతనాదహ్నః. పరతః ఉత్తరత్ర. స్వంస్వాధీనంతర్హి తద్దాహార్థంవాగమిష్యామి. నేత్యాహ తస్యేతి.(56)

సమస్త కర్మలు వదలిన ఆ ధృతరాష్ట్రునికి ఏ విఘ్నము కలుగదు నేటికి ఐదవ రోజున తన శరీరాన్ని వదిలిపెట్టును. అదియును భస్మమగును. అలాంటి ధృతరాష్ట్రుని తీసుకరాగలనని నీవను కొనకుము. ఆయన అన్ని కర్మలను వదిలినవాడు కావున ఆయన చేయు కర్మకు విఘ్నము కలిగించకుండుటే నీకు ధర్మము. (56)

57. శ్లో. దహ్యమానేగ్నిభిర్దేహే
పత్యుః పత్నీ సహోటజే ।
బహిః స్థితా పతిం సాధ్వీ
తమగ్నిమనువేక్ష్యతి ॥

టీ:- తర్హి గాంధార్యానయనార్థం గమిష్యామి నేత్యాహ -దహ్యమాన ఇతి. పత్యుర్దేహే సహోటజే పర్ణశాలాసహితే యోగాగ్నినా సహ గార్హపత్యాదిభిర్దహ్యమానే తస్య పత్నీ బహిఃస్థితా సతీ తం పతి తం పతిమను అగ్నింవేక్ష్యతి ప్రవేక్ష్యతి.(57)

ధృతరాష్ట్రుడు దగ్ధమైతే గాంధారిని తీసుకరాగలనని కూడా నీవు భావించకుము. అది కూడా జరుగదు. పతి దేహము పర్ణశాలతోసహా యోగాగ్నిలో దహింపబడగా, వెలుపల ఉన్న గాంధారి భర్తను అనుసరించి అగ్ని ప్రవేశము చేయును. (57)

58. శ్లో. విదురస్తు తదాశ్చర్యం
నిశమ్య కురునందన ।
హర్షశోకయుతస్తస్మాత్
గంతా తీర్థనిషేవకః ॥

టీ:- తర్హి విదురానయనార్థం గంతవ్యమేవ. నేత్యాహ-విదుర ఇతి. విదురస్తు తన్నిశామ్య దృష్ట్వా భ్రాతుః సుగత్యా హర్షః. తన్మృత్యునా శోకశ్చతాభ్యాం యుక్తస్తస్మాత్ స్థానాత్తీర్థాని సేవితం గంతా గమిష్యతి. (58)

ఓ ధర్మరాజా ! విదురుడును ఆ అద్భుతమగు దృశ్యమును చూచి సంతోషము, దుఃఖము కలుగగా తీర్థయాత్రలకు వెళ్ళును. విదురుని తీసుకరావడానికి కూడా నీవు సంకల్పించరాదు. అతడు కూడా అచట ఉండడు. విదురునికి ధృతరాష్ట్రుడు సద్గతి పొందెనని సంతోషము, ఆతడు మరణించెనని దుఃఖము కలుగును. (58)

**సూత ఉవాచ.**

59. శ్లో. ఇత్యుక్త్వా ర్వథారుహత స్వర్గమ్
నారదస్సహతుంబురుః ।
యుధిష్ఠిరో వచస్తస్య
హృది కృత్వాజహాచ్ఛుచః ॥

టీ:- ఇతీతి. శుచః శోకాన్.(59)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం సంహితాయాం ప్రథమేస్కంధే భావార్థదీపికాయాం త్రయోదశోధ్యాయః**

**సూతుడిట్లనెను.**

ఈ విధముగా చెప్పి నారదుడు తుంబురునితో సహా స్వర్గానికి వెళ్ళెను. యుధిష్ఠిరుడు నారదుని తాత్త్విక వచనాలు విని దుఃఖములను వదిలెను. (59)

**శ్రీమద్భాగవతము యొక్క ప్రథమస్కంధ త్రయోదశాధ్యాయమునకు శ్రీధరీయవ్యాఖ్యానుసార ఆంధ్రానువాదము ముగిసినది.**

## చతుర్దశోఽధ్యాయః

**సూత ఉవాచ.**

1. శ్లో. సంప్రస్థితే ద్వారకాయాం
జిష్ణౌ బంధుదిదృక్షయా ।
జ్ఞాతుం చ పుణ్యశ్లోకస్య
కృష్ణస్య చ చేష్టితమ్ ॥

టీ:- 'శ్లో. చతుర్దశేత్వరిష్టాని దృష్ట్వా రాజా విశంకితః అశృణోదర్జునా త్కృష్ణతిరోధానమితీర్యతే' సంప్రస్థిత ఇతి.కృష్ణస్య చేతి చకారేణాబి ప్రాయం చ జ్ఞాతుం.(1)

2. శ్లో. వ్యతీతాః కతిచిన్మాసాః
తదా నాయాత్తతోఽర్జునః ।
దదర్శ ఘోరరూపాణి ।
నిమిత్తాని కురూద్వహః ॥

టీ:- వ్యతీతా ఇతి. కతిచిత్సప్తమాసాః. తదా కాలాతిక్రమేపి. తతో ద్వారకాయా నాయాత్ నాగతః. నిమిత్తాని ఉత్పాతాన్. కురూద్వహో యుధిష్ఠరః (2)

## చతుర్దశాధ్యాయము.

**సూతుడిట్లు చెప్పెను.**

ఈ చతుర్దశాధ్యాయమున ధర్మరాజు తనకు కనిపిస్తున్న అపశకునములను చూచి అనుమానపడి, ద్వారక నుండి వచ్చిన అర్జునుని వలన కృష్ణ నిర్యాణమును వినుట చెప్పబడుచున్నది. అర్జునుడు బంధువులను దర్శించుటకు, పవిత్రమగు కీర్తిగల శ్రీకృష్ణుని అభిప్రాయమును తెలిసికొనుటకు ద్వారకానగరానికి వెళ్ళెను. నెలలు గడిచినా, ద్వారక నుండి అర్జునుడు తిరిగిరాలేదు. ధర్మరాజు భయంకరమగు అపశకునములను జూచెను.( దుర్నిమిత్తములు = ఉత్పాతములు) (1,2 శ్లోకములకు కలిపి)

3. శ్లో. కాలస్య చ గతిం రౌద్రాం
విపర్యస్తర్తుధర్మిణః ।
పాపీయసీం నృణాం వార్తాం
క్రోధలోభానృతాత్మనామ్ ॥

టీ:- కాలస్యేతి. రౌద్రాంఘోరాం. తదేవాహ-విపర్యస్తాః ఋతుధర్మాః యస్మిన్ తస్య. వార్తాం జీవికాం. క్రోధలోభావృతైః యుక్త ఆత్మా మనో యేషాం.(3)

కాలము భయంకరముగా కనిపించెను. ఋతు ధర్మములు తలకిందులాయెను. కోపము, పిసినారితనము, అసత్యముకల మానవులు పాపప్రవృత్తితో జీవనము గడుపుచుండిరి.(3)

4. శ్లో. జిహ్మప్రాయం వ్యవహృతం
శాఠ్యమిశ్రం చ సౌహృదమ్
పితృమాతృసుహృద్భ్రాతృ
దంపతీనాం చ కల్పనమ్ ॥

టీ:- జింహప్రాయమితి. జింహప్రాయం కపటబహుళం వ్యవహృతం వ్యవహారం. శాఠ్యం వచనం. తన్మిశ్రం సౌహృదం సఖ్యం. పిత్రాదీనాం స్వత్రియోగిభిః కల్కనం కలహాది.(4)

లోకవ్యవహారములన్ని మోసపూరితముగానుండెను. స్నేహము కూడ వంచనతో కూడియుండెను. తల్లి, తండ్రి, అన్నదమ్ములు, భార్యా, భర్తలు పరస్పరము కలహించుకొనుచుండిరి.(4)

5. శ్లో. నిమిత్తాన్యత్యరిష్టాని
కాలే త్వనుగతే నృణామ్ ।
లోభాద్యధర్మప్రకృతిం
దృష్ట్వా వాచాఽనుజంనృపః ॥

**యుధిష్ఠిర ఉవాచ.**

6. శ్లో. సంప్రేషి తో ద్వారకాయాం
జిష్ణుర్బంధుదిదృక్షయా ।
జ్ఞాతుం చ పుణ్యశ్లోకస్య
కృష్ణస్య చ విచేష్టితమ్ ॥

టీ:- నిమిత్తానీతి. అత్యరిష్టాని అత్యంతమశుభాని దృష్ట్వా నృణాం లోభాద్యధర్మప్రభృతిం చ లోభాదికం మానసికదుర్గుణం. అధర్మానుష్ఠాన ప్రభృతిం చ కాయికదుర్గుణం. దృష్ట్వానుజం భీమం నృపః యుధిష్ఠిరః (5,6)

7. శ్లో. గతాన్సప్తాధునా మాసాః
భీమసేన తవానుజః ।
నాయాతి కస్య వా హేతోః
నాహం వేదేదమంజసా ॥

టీ:- గతా ఇతి. వేతి వితర్కే. కస్మాద్ధేతోర్నాయాతీత్యహం న వేద్మి.(7)

రాబోవు కలి కాలమును సూచిస్తూ, మానవుల స్వభావములలో మార్పు కలుగుట, అశుభప్రదములగు అనేక అపశకునాలు సంభవించుట, మానవులలో లోభము మొదలగు అధర్మ ప్రవృత్తియును కలుగుట జూచి ధర్మరాజు తన తమ్ముడగు భీమునితో ఇట్లు పలికెను. (5)

**యుధిష్ఠిరుడు పలుకుచున్నాడు.**

అర్జునుడు బంధువులను చూచుటకు, పవిత్రకీర్తిగల శ్రీకృష్ణుని అభిప్రాయమును, లీలను తెలిసికొనుటకును ద్వారకు పంపబడెను.(6)

ఓ భీమసేనా ! నీ తమ్ముడు అర్జునుడు వెళ్ళి ఏడు నెలలు కావచ్చుచున్నది కాని అతడు తిరిగి రాలేదు. అతడు ఇంత వరకు రాకపోవడానికి కారణం తెలియలేదు. (7)

8. శ్లో. అపి దేవర్షిణా౾ ౾ దిష్టః ।
స కాలో౾ యముపస్థితః ।
యదాత్మనో౾ ంగమాక్రీడం
భగవానుత్సిసృక్షతి ॥

టీ:- అపీతి. అపి కిం యదా ఆత్మనః ఆక్రీడం క్రీడాసాధనం అంగంమనుష్యనాట్యవిగ్రహం. ఉత్స్రష్టుమిచ్ఛతి సకాలః ప్రాప్తః కిం?.(8)

దేవర్షి నారదుడు సూచించిన ఆ పాపపు కాలము సమీపించెనా? మనుష్య లోకమున మాయా మనుష్యుడుగా నవతరించిన శ్రీకృష్ణుడు, లీలా సాధనమగు తన శరీరాన్ని వదిలిపెట్ట దలచెనాయేమి? (8)

9. శ్లో. యస్మాన్నస్సంపదో రాజ్యం
దారాః ప్రాణాః కులం ప్రజాః ।
ఆసన్ సపత్నవిజయో ।
లోకాశ్చ యదనుగ్రహాత్ ॥

టీ:- అస్మాకం సర్వపురుషార్థహేతుః శ్రీకృష్ణః. అతస్తద్వియోగం వినా అనిష్టం న స్యాదిత్యాశయేనాహ-యస్మాదితి. యస్మాచ్ఛ్రీకృష్ణాద్ధేతోః ఏతచ్చోపరిష్టాదర్జునః స్పష్టీకరిష్యతి. లోకాశ్చ యజ్ఞకరణరూపాయ స్యానుగ్రహాత్.(9)

ఆ కృష్ణుని వలననే కదా మనకు సంపదలు, రాజ్యము, భార్య, ప్రాణము,కులము, సంతానము, శత్రువులపై విజయము, పుణ్యలోక ప్రాప్తి కలిగెను. ఆయన అనుగ్రహమున యజ్ఞాలు చేసి లోకాలను గెలిచాము. మనకు లభించిన ధర్మార్థకామమోక్ష పురుషార్థముల కన్నింటికి కారణమైన ఆ కృష్ణుని వియోగము కంటే మనకు మిన్నయగు అరిష్టమేమి కలదా? (9)

10. శ్లో. పశ్యోత్పాతాన్నరవ్యాఘ్ర
దివ్యాన్ భౌమాన్ సదైవికాన్ ।
దారుణాన్ శంసతోఽదూరాత్
భయం నో బుద్ధిమోహనమ్ ॥

టీ:- పశ్యేతి. అదూరాత్సన్నిహితం. నః అస్మాకం. ఆశంసతః ఉత్పాతాన్.(10)

ఓ మనుజశ్రేష్ఠా? భీమసేనా ! ఆకాశమున, భూమిపై, మన దేహమందు సంభవించిన అపశకునములను చూడుము. అవి చాలా భయంకరములై, కొద్ది కాలములోనే రాబోవు అరిష్టాలను సూచించుచూ, బుద్దిని కలవరపరచుచూ భయాన్ని నెలకొల్పుచున్నవి. (10)

11. శ్లో. ఊర్వక్షి బాహవో మహ్యం
స్ఫురంత్యపి పునః పునః ।
వేపథుశ్చాపి హృదయే
ఆరాద్దాస్యంతి విప్రియమ్ ॥

టీ:- దైహికానాహ - ఊర్వక్షీతి. ఊర్వాదయో వామాః స్ఫురంతి. వేపథుః కంపశ్చహృదయే వర్తతే. ఏతే మహ్యం ఆరాత్సన్నిహితం విప్రియం దాస్యంతి. (12)

దేహమునకు సంబంధించిన ఉత్పాతములను (అపశకునములను) చెపుతున్నాడు. మాటిమాటికి నా ఎడమ కన్ను,తొడలు,చేతులు అదరుచున్నవి. హృదయము కంపించుచున్నది. ఇవన్నియు త్వరలో రాబోవు అరిష్టమును సూచించుచున్నవి. (11)

12. శ్లో. శివైషోద్యంతమాదిత్యమ్ ।
అభిరౌత్యనలాననా ।
మామంగ సారమేయోఽయమ్ ।
అభిరౌతి హ్యభీరువత్ ॥

టీ:- భౌమానాహ-సార్ధైస్త్రిభిః శివేతి. శివా క్రోష్టీ ఆదిత్యమభిరౌతి ఉద్యత్సూర్యాభిముఖం క్రోశతి. అనలాననా అగ్నిం ముఖేన వహంతీ. అంగ హే భీమ. మామభిలక్ష్య సారమేయః శ్వా రోదితి. అభీరువత్ నిశ్శంకం.(12)

భూమికి సంబంధించిన దుఃశకునాలను చెపుతున్నాడు. ఈ ఆడనక్క ఉదయించుచున్న సూర్యుని కెదురుగా నిలుచొని అరచుచున్నది ముఖమునుండి అగ్నిని కక్కుచున్నది. ఓ భీమా ! నన్ను చూచుచూ కూడా నిర్భయముగా, నిశ్శంకగా, దీర్ఘ స్వరముతో కుక్క అరచుచున్నది.(12)

13. శ్లో. వస్తాః కుర్వంతి మాం సవ్యం
దక్షిణంపశవోఽపరే ।
వాహాంశ్చ పురుషవ్యాఘ్ర
లక్షయే రుదతో మమ ॥

టీ:- శస్తా ఇతి. గవాదయో మాం సవ్యం వామం కుర్వంతి. అపరే గర్దభాద్యాః ప్రదక్షిణం కుర్వంతి. వాహానశ్వాన్.(13)

ప్రశస్తములగు ఆవులు మొదలగు పశువులు నాకు ఎడమ వైపుగావెళుతున్నవి. గాడిదలు మున్నగు పశువులు కుడివైపు వెడలుచున్నవి. ఓ పురుష శ్రేష్ఠా భీమా ! నా గుఱ్ఱములు కూడ ఏడ్చుచున్నవి. (13)

14. శ్లో. మృత్యుదూతః కపోతోఽయ
ములూకః కంపయన్మనః ।
ప్రత్యులూకశ్చ కుహ్వానై
రనిద్రౌ శూన్యమిచ్ఛతః ॥

టీ:- మృత్యుదూత ఇతి. అయం కపోతో మృత్యుదూతః మృత్యుసూచకః. ఉలూకో ఘూకః ప్రత్యులూకః తత్ప్రతిక్షో ఘూకః కాకో వా, కుహ్వానైః కుత్సితశబ్దైః విశ్వం శూన్యం కర్తుమిచ్ఛతః(14)

మృత్యు సూచకమైన పావురము, పెద్దపిట్ట, గుడ్లగూబ దాని వైరి మరో పెద్దపిట్ట అనేక చెడ్డ అరుపులతో రాత్రంతా నా మనస్సును వణికించుచూ, ఈ ప్రపంచాన్నే లయింపచేసి, శూన్యము చేయుటకు కోరుచున్నట్లున్నవి.(14)

15. శ్లో. ధూమ్రా దిశః పరిధయః
కంపతే భూస్సహాద్రిభిః ।
నిర్ఘాతశ్చ మహానాసీత్
సాకం చ స్తనయిత్నుభిః ॥

టీ:- ధూమ్రా ఇతి. ధూమ్రాః ధూసరాః దిశః పరిధయః పరివేషాః అముం లోకమావృణ్వంతి. దివ్యానాహ-నిర్ఘాతాది సార్ధద్వాభ్యాం. నిర్ఘాతో నిరభ్రవజ్రపాతః. స్తనయిత్నవోఽత్ర గర్జితాని తైస్సహ.(15)

దిక్కులు ధూసర వర్ణములు కలవై, అగ్నివలె ఈ లోకాన్ని ఆవరించుచున్నవి. పర్వతాలతో సహా భూమి కంపించున్నది ఆకాశములో కూడా ముందుసూచన లేకుండగనే, పెద్ద గర్జనలతో మేఘములు వజ్రపాతమువలె పిడుగు పడెను. (15)

16. శ్లో. వాయుర్వాతి ఖరస్పర్శో
రజసా విసృజంస్తమః ।
అసృగ్వర్షంతి జలదాః.
భీభత్సమివ సర్వతః ॥

టీ:- వాయురితి. తమః విసృజన్. అసృక్ రక్తం (16)

ధూళి చేత చీకటిని సృష్టించుచూ, గాలి తీవ్రకఠినస్పర్శతో వీచుచున్నది. అంతటను భీభత్సాన్ని సృష్టిస్తూ మేఘాలు రక్తమును వర్షించుచున్నవి. (16)

17. శ్లో. సూర్యం హత ప్రభం పశ్య
గ్రహమర్దంచ ఖే దివి ।
స సంకులైర్భూతగణైః
జ్వలితే ఇవరోదసీ ॥

టీ:- సూర్యమితి. గ్రహాణాం మర్దం యుద్ధం. భూతాని రుద్రానుచరాః. తేషాం గణైస్సుసంకులైర్వ్యామిశ్రైః ప్రాణిభిస్సహితైః రోదసీ ద్యావాపృథివ్యౌ జ్వలితే ప్రదీప్తే ఇవ పశ్యేతి.(17)

సూర్యుడు నిస్తేజసుడై కనిపించుచున్నాడు. నాయనా భీమసేనా! చూడుము ఆకసమున గ్రహాలు పరస్పరము యుద్ధము చేస్తున్నవి. రుద్రుని అనుచరులగు భూత, ప్రేత, పిశాచగణాలు, ప్రాణులతో నిండిపోయి భూమ్యాకాశాలు మండుతున్నట్లున్నవి.(17)

18. శ్లో. నద్యో నదాశ్చ క్షుభితాః
సరాంసి చ మనాంసి చ ।
న జ్వలత్యగ్నిరాజ్యేన
కాలోఽయం కిం విధాస్యతి ॥

టీ:- పురర్భౌమానాహ–నద్య ఇత్యాదిసార్ధైస్త్రిభిః నద్య ఇతి ప్రాణినాం మనాంసి చ.(18)

మరల భూమికి సంబంధించిన దుశ్శకునాలు చెపుతున్నాడు మూడున్నర శ్లోకాలతో. నదీ,నదములు, సరస్సులు ప్రాణుల మనస్సులును క్షోభించుచున్నవి. నేయి పోసినను అగ్ని మండుటలేదు. నాయనా భీమా ! ఈ కాలము యేమి చేయునో కదా.(18)

19. శ్లో. న పిబంతి స్తనం వత్సాః
న దుహంతి చ మాతరః ।
రుదంత్యశ్రుముఖా గావో
న హృష్యంత్యృషభా వ్రజే ॥

టీ:- నేతి. న దుహ్యంతీతి కర్మకర్త్ర్యార్షం. న ప్రస్నువంతీత్యర్థః (19)

లేగ దూడలు తల్లుల స్తనములను ఆస్వాదించుటలేదు, పాలు తాగుటలేదు. ఆవులు కూడ ఆ లేగలకు పాలు ఇవ్వడంలేదు. ఆవులు కన్నీళ్ళు కారుస్తూ ఏడ్చుచున్నవి. గొల్ల పల్లెలో ఎద్దులు రంకెలు వేయుటలేదు, సంతోషించుటలేదు (ఇచట న దుహంతి అనుచోట గల దుహ ధాతువు ద్వికర్మకము, కాని ఇచట కర్మ కర్తరి ప్రయోగముగా వాడబడినది ఇది ఆర్షము.) (19)

20. శ్లో. దైవతాని రుదంతీవ
స్విద్యంతిహ్యుచ్చలంతి చ ।
ఇమే జనపదా గ్రామాః ।
పురోద్యానాకరాశ్రమాః ॥

టీ:- దైవతానీతి. దైవతాని ప్రతిమాః (20)

దేవతా ప్రతిమలు ఏడ్చుచున్న వానివలెనున్నవి, చెమట కారుస్తూ, పైకి ఎగురుచున్నవా ? అన్నట్లు కదలుచున్నవి. దేశాలు, గ్రామాలు, ఉద్యానవనాలు, ఆకరాలు, ఆశ్రమాలు, కళావిహీనములై, ఆనందహీనములై కనిపించుచున్నవి. ఏమి పాపము (దుఃఖము) సంభవించునో గదా.(20)

21. శ్లో. మన్య ఏతైర్మహోత్పాతై
ర్నూనం భగవతః పదైః
అనన్యపురుషశ్రీభి
ర్హీనాభూర్హతసౌభగా ॥

టీ:- భ్రష్టశ్రియ ఇతి. అఘం దుఃఖం ఏతైః కృత్వా న విద్యతే అన్యేషు పురుషేషు శ్రీర్వజ్రాంకుశాదిశోభాయేషాంతైః భగవతః పదైః అనన్యేతి, హీనా భూరిత్యహం మన్యే.(21)

ఈ గొప్ప దుశ్శకునముల చేత, నాకిలా అనిపిస్తోంది భీమా ! ఇతర పురుషులకు లేని శోభ (కాంతి) గల, షడ్గుణైశ్వర్య సంపన్నుడగు కృష్ణభగవానుని పాద పద్మములు ఈ భూమి నుండి తొలగినవేమో, లేచిపోయినవేమో భగవంతుడు అవతారసమాప్తిని చేసెనేమో! నాకు శంక కలుగుచున్నది.(21)

22. శ్లో. ఇతి చింతయతస్తస్య
స్వదృష్టారిష్టేన చేతసా ।
రాజ్ఞః ప్రత్యాగమత్ బ్రహ్మన్
యదుపుర్యాః కపిధ్వజః ॥

ఓ శౌనకా ! అనేక అరిష్టములు చూచి ధర్మజుడు ఈ విధముగా చింతించుచుండగా, హనుమద్ధ్వజుడైన అర్జునుడు ద్వారక నుండి ధర్మజుని కడకు తిరిగి వచ్చెను. (22)

టీ:- తస్య రాజ్ఞః ఇత్యేవం దృష్టాన్యరిష్టాని యేన చేతసా చింతయతస్తతః.(22)

23. శ్లో. తం పాదయోర్నిపతిత
మయథాపూర్వమాతురమ్ ।
అధోవదనమబ్బిందూ
న్మంచ తం నయనాబ్జయోః ॥

ఇదివఱకు వలెగాక, ఏడుపు ముఖముతో వచ్చి, కాళ్ల మీదపడి, నేలకు ముఖము వేసికొని, కమలముల వంటి కన్నుల నుండి కన్నీటి బిందువులు కార్చుచున్న అర్జునుని చూచి ధర్మజుడు ఇట్లు అడిగెను. ( ముందటి శ్లోకముతో అన్వయము. ) (23)

టీ:- అయథాపూర్వం నిపతితం. తదేవాహ. ఆతురమిత్యాదివిశేషణైః అపాంబిందూన్ అశ్రూణి నేత్రాభ్యాం విసృజంతమిత్యర్థః.(23)

24. శ్లో. విలోక్యోద్విగ్న హృదయో
విచ్ఛాయమనుజం నృపః ।
పృచ్ఛతి స్మ సుహృన్మధ్యే
సంస్మరన్నారదేరితమ్ ॥

ద్వారకలోని మిత్రుల మధ్య నుండి కళావిహీనమైన ముఖముతో తిరిగి వచ్చిన తమ్ముని చూచి ధర్మజుడు నారదుని పలుకులను స్మరించి, మనస్సులో భయపడుతూ ఇట్లు అడిగెను.(24)

టీ:- ఉద్విగ్నం కంపితం హృదయం యస్య. విచ్ఛాయం విగతకాంతిం. నృపః యుధిష్ఠిరః.(24)

**యుధిష్ఠిర ఉవాచ.**

25. శ్లో. కచ్చిదానర్త పుర్యాం
నస్స్వజనాన్సుఖమాసతే ।
మధుభోజదశార్హా
సాత్త్వతాంధకవృష్ణయః ॥

టీ:- పృచ్ఛతీతి. స్వజనాః బాంధవాః(25)

**ధర్మరాజు పలుకుచున్నాడు.**

ఓ అర్జునా ! ద్వారకానగరమున మధు, భోజ, దశార్హ, సాత్త్వకాంధక, వృష్ణి వంశీయులైన మన బంధువులందరు సుఖముగా నున్నారా?(25)

26. శ్లో. శూరో మాతామహకచి
త్స్వస్త్యాస్తేవాఽథ మారిషః ।
మాతులస్సానుజః కశ్చి
త్కుశల్యానకదుందుభిః ॥

టీ:- కిం వక్ష్యతీతి శంకయా వ్యవహితక్రమేణ పృచ్ఛతి-మద్విత. మారిషః మాన్యః మాతామహః. శోరోనామ యాదవం కుంత్యాః పితా. ఆనకదుందుభిర్వసుదేవః (26)

ఏమి చెప్పునో అను అనుమానముతో వరుసగా ధర్మజుడు అడుగుచున్నాడు. తల్లి, తండ్రి, తాత, మాన్యుడు, యాదవుడు అయిన కుంతితండ్రి మన తాత శూరుడు క్షేమముగా నున్నాడా? మేనమామ వసుదేవుడు ఆయన తమ్మునితో సహా క్షేమముగా నున్నాడా?(26)

27. శ్లో. సప్త స్వసారః తత్పత్న్యో
మాతులాన్యస్సహాత్మజాః ।
ఆసతే సస్నుషాః క్షేమం
దేవకీప్రముఖాః స్వయమ్ ॥

టీ:- స్వసారః.ఆసత ఇతి. పరస్పరం వసుదేవక్షేమతః తాసామపి క్షేమం పృష్టమేవ పృథగపి పృచ్ఛతి-స్వయమితి.(27)

దేవకి, ఆమె ఏడుగురు అక్కా చెల్లెండ్లు, వారు కొడుకులు, మునమామ వసుదేవుని భార్యలు, కోడండ్లు, దేవకీ మొదలైన వారందరు క్షేమముగా నున్నారా? (27)

28. శ్లో. కచ్చిద్రాజాఽఽహుకోజీవ
త్యసత్పుత్రోఽస్య చానుజః ।
హృదీకస్ససుతోఽక్రూరో
జయంతగదసారణాః ॥

29. శ్లో. ఆసతే కుశలం కచ్చి
ద్యే చ శత్రుజిదాదయః ।
కచ్చిదాస్తే సుఖం రామో
భగవాన్ సాత్త్వతాం ప్రభుః ॥

టీ:- ఆహుకః ఉగ్రసేనః. అసన్ పుత్రో యస్య. ఆతఏవ జీవనమాత్రమేవ పృష్టం అనుజశ్చ దేవకః హృదికస్య సుతః. కృతవర్మా. జయంతాదయః కృష్ణభ్రాతరః.(28,29)

దుర్మార్గుడగు కంసుని తండ్రి ఉగ్రసేన మహారాజు కుశలముగా నున్నాడా? ఆతని తమ్ముడు దేవకుడు, హృదీకుడు తన సంతానముతో బాగున్నారా? అక్రూరుడు, జయంతుడు, గదసారణులు అంతా బాగేనా? ( జయంతాదులు కృష్ణుని సోదరులు.) (28)

శత్రుజిత్తు మొదలైనవారు బాగున్నారా ? సాత్త్వత వంశ ప్రభువు బలరాముడు సుఖముగానున్నాడా?(29)

30. శ్లో. ప్రద్యుమ్నస్సర్వ వృష్ణీనాం
సుఖమాస్తే మహారథః ।
గంభీరరయోఽనిరుద్ధో
వర్తతే భగవానుత ॥

టీ:- కచ్చిదితి. సర్వవృష్ణీనాం మధ్యే మహారథః. గంభీరరయో యుద్ధే మహావేగః. వర్ధతే మోదత ఇత్యర్థః(30)

వృష్ణి వంశీయులందరిలో మహారథుడగు ప్రద్యుమ్నుడు సుఖముగానున్నాడా? యుద్ధమున మహావేగముగల అనిరుద్ధుడు సుఖముగానున్నాడా? (30)

31. శ్లో. సుషేణశ్చారుదేష్ణశ్చ
సాంబో జాంబవతీ సుతః ।
అన్యే చ కార్ష్ణిప్రవరా
స్సపుత్రా ఋషభాదయః ॥

టీ:- కృష్ణస్యాపత్యాని కార్ష్ణయః తేషు ప్రవరాః (31)

సుషేణుడు, చారుదేష్ణుడు, జాంబవతి కుమారుడు సాంబుడు కృష్ణుని సంతతిలోని శ్రేష్ఠులు, వారి పుత్రులు ఋషభుడు, మొదలగువారు అందరు క్షేమమేనా? (31)

32. శ్లో. తథైవానుచరాశ్శౌరేః
శ్రుతదేవోద్ధవాదయః ।
సునందనందశీర్షణ్యా
యే చాన్యే సాత్త్వతర్షభాః ॥

టీ:- సునందనందౌ శీర్షణ్యౌ యేషాం తే.(32)

శౌరియైన కృష్ణుని అనుచరులు శ్రుతదేవుడు, ఉద్ధవుడు మొదలగు వారు, ముఖ్యులగు సునందనందులు ఇంకను మిగతా యాదవ శ్రేష్ఠులును అంతా కుశలమేనా? (32)

33. శ్లో. అపి స్వస్త్యాసతే సర్వే
రామకృష్ణభుజాశ్రయాః ।
అపి స్మరంతి కుశల
మస్మాకం బద్ధసౌహృదాః ॥

బలరామకృష్ణుల బాహువులనాశ్రయించి, రక్షంపబడుచున్న మిగతా వారందరును క్షేమముగా నున్నారా? అర్జునా, వారు మనయందు స్నేహముగలవారై మన క్షేమాన్ని అడుగుచున్నారా? (33)

34. శ్లో. భగవానపి గోవిందో ।
బహ్మణ్యోభక్త వత్సలః ।
కచ్చిత్పురే సుధర్మాయాం
సుఖమాస్తే సుహృద్వృతః ॥

టీ:- భగవాన్ సుఖమాస్త ఇతి. ప్రశ్నస్యానౌచిత్యమాశంక్యాహ-పుర ఇత్యాది. (33,34)

షడ్గుణైశ్వర్య సంపన్నుడు, గోవిందుడు, బ్రాహ్మణ ప్రియుడు, భక్తులందు వాత్సల్యము గల కృష్ణుడు అతని స్నేహితులు సుధర్మ సభలో ద్వారకలో సుఖముగానున్నారా? అర్జునా? ( భగవంతుడు సుఖముగానున్నాడా అను ప్రశ్న అనౌచిత్యమని భావించినచో ఆయన ఊళ్ళో సుఖంగా ఉన్నాడా? అనే భావము చెప్పి అనౌచిత్యమును తొలగించు కొనవచ్చును) (34)

35. శ్లో. మంగలాయ చ లోకానాం
క్షేమాయ చ భవాయ చ ।
ఆస్తే యదుకులాంభోధా
వాద్యోనంతసఖః పుమాన్ ॥

టీ :- భగవతోఽత్రావస్థానే హి లోకానాం మంగళం

భగవానుడు కృష్ణుడు ఇక్కడ భూలోకంలో ఉంటేనే అన్ని లోకాలకు క్షేమము అను అభిప్రాయముతో నాలుగు శ్లోకాలతో వివరిస్తున్నాడు యుధిష్ఠిరుడు. లోకుల కుశలము, క్షేమము కొఱకు పాలన, రక్షణ , ఉద్భవము కొఱకు ఆర్యుడు, బలభద్ర సహాయుడగు శ్రీకృష్ణుడు యదువంశ సముద్రమున అనంతకాలసఖుడై సుఖముగా నున్నాడని భావిస్తున్నాను. (35)

నాన్యథేత్యాశయేనాహ-మంగళా యేత్యాది చతుర్భిః మంగళాయ శుభాయ. క్షేమాయ లబ్ధపాలనాయ భవాయ ఉద్భవాయ. అనంతసఖః బలభద్రసహాయః (35)

36. శ్లో. యద్బాహుదండగుప్తాయాం
స్వపుర్యాం యదవోర్చితాః ।
క్రీడంతి పరమానందం
మహాపౌరుషికా ఇవ ॥

టీ:- అర్చితాః సర్వైః పూజితాఃపరమానందం యథాభవతి తథా మహా పౌరుషికాః వైకుంఠ నాథానుచరాః.(36)

శ్రీకృష్ణుని బాహుదండములతో రక్షించబడుచున్న యాదవులు తమ నగరములో అందరి చేతను పూజింప బడుతున్నారు, విష్ణులోకవాసులగు దేవతలవలె ఆనందముగా ఆడుకొనుచు, క్షేమముగా నున్నారు అట్టి కృష్ణుడు క్షేమమే అని భావిస్తున్నాను. (36)

37. శ్లో. యత్పాదశుశ్రూషణముఖ్యకర్మణా ।
సత్యాదయోద్వ్యష్టసహస్రయోషితః ।
నిర్జిత్య సంఖ్యే త్రిదశాంస్తదాశిషో
హరంతి వజ్రాయుధవల్లభోచితాః ॥

టీ:- యదితి. యస్య పాదశుశ్రూషణమేవ ముఖ్యం తప ఆదిభ్యః శ్రేష్ఠం యత్కర్మ తేన. సత్యభామాదయః. సంఖ్యే యుద్ధే, కృష్ణబలేన

శ్రీకృష్ణుని పాద శుశ్రూషయే ముఖ్య కర్మగా భావించు సత్యభామ మొదలైన పదునారు వేల భార్యలు, ఆతని ఆశీస్సులతో యుద్ధమున దేవతలనుగూడ జయించి, శచీదేవికి ఉచితములు, ఇష్టములునగు పారిజాతాదివృక్షములను హరించినారు. అట్టి కృష్ణుడు క్షేమమేనా ? (37)

త్రిదశాన్ దేవాన్ నిర్జిత్య తదాశిషః. దేవభోగ్యాన్ పారిజాతాదీన్. వజ్రాయుధస్య వల్లభా శచీ. తస్యా ఉచితాః. (37)

38. శ్లో. యద్బాహుదండాభ్యుదయానుజీవినో
యదుప్రవీరా హ్యకుతోభయా ముహుః ।
అభిక్రమంత్యంఘ్రిభిరాహృతాం బలాత్
సభాం సుధర్మాం సురసత్తమోచితామ్ ॥

కృష్ణుని భుజదండముల విజయాన్ని అనుసరించి జీవించు యదుపుంగవులు, నిర్భయులై దేవతలకు ఉచితమైన సుధర్మ సభను బలాత్కారముగా సంపాదించి తమ పాదాలతో ఎక్కి అధిష్ఠించిఉన్నారు అట్టి శ్రీకృష్ణుడు కుశలమేనా? (38)

టీ:- యదితి. యద్బాహుదండప్రభవోపజీవినః సుధర్మామంఘ్రిభిరభిక్రమంతి. సగోవిందస్సుఖమాస్త ఇతి గతపంచమశ్లోకేనాన్వయః (38)

39. శ్లో. కచ్చిత్తేఽనామయం తాత ।
భ్రష్టతేజా విభాసి మే ।
అలబ్ధమానోఽవజ్ఞాతః
కిం వా తత్ర చిరోషితః ॥

ఇప్పుడు దీనముగానున్న తమ్ముని అర్జునుని ధర్మరాజు కుశలమడుగుచున్నాడు. ఆరు శ్లోకాలతో కచ్చిత్ అని ప్రారంభించి. ఓ అర్జునా ముఖ్యముగా నీవు కుశలమేనా? నాయనా ! నీవు నిస్తేజంగా కనపడుచున్నావు. కారణమేమి? చాలా కాలము అచట ఉన్నందు వలన నీవు బంధువులనుండి తగిన గౌరవము పొందకుంటివా? అవమానమును పొందితివా? (చాలా కాలము బంధువుల వద్ద నుంటే సాధారణముగా ఆదరణ తగ్గుతుంది. అని సూచించబడినది.) (39)

టీ:- ఇదానీం తస్యైవ కుశలం. పృచ్ఛతి-కచ్చిదిత్యాదిషడ్భిః, కచ్చిదితి. అనామయం ఆరోగ్యం. నలబ్ధో మనో యేన బంధుభ్యః సకాశాత్, కింవా తైః? ప్రత్యుత అపజ్ఞాతః తిరస్కృతః యతశ్చిరోషితః బహుకాలం తత్రస్థితః.(39)

40. శ్లో. కచ్చిన్నాభిహతో భావైః
శబ్దాదిభిరమంగలైః ।
న దత్తముక్తమర్థిభ్యః
ఆశయా యత్ప్రతిశ్రుతమ్ ॥

టీ:- కచ్చిదితి. అభావైరితిచ్ఛేదః. ప్రియశూన్యైరమంగళైః పరుషైః శబ్దాదిభిర్నాభిహతః న తాడితోఽసి కిం? యద్వా-అర్థిభ్యః అపిదాస్యామీత్యుక్తం, న దత్తం కిం? యద్వా- ఆశయా సహ యథా భవతి తథా దాస్యామీతి ప్రతిశ్రుతం సత్ న దత్తం కిం? (40)

ఓ అర్జునా ! బంధువులు బావలు నీతో ప్రేమలేని, అశుభములైన మాటలు మాట్లాడిరా? అతిథులు నిన్నేమైన అడిగితే లేదంటివా? ఆశతో నేమైనా అడిగిన అర్థులకు ఇస్తానని ఈయకపోతివా? నీ చింతకు కారణమేమి? (40)

41. శ్లో. కచ్చిత్త్వం బ్రాహ్మణం బాలం
గాం వృద్ధం రోగిణం స్త్రియమ్ ।
శరణోపసృతం సత్త్వం
నాత్యాక్షీశ్శరణప్రదః ॥

టీ:- కచ్చిదితి. అన్యద్వా-శరణాగతం సత్వం ప్రాణిమాత్రం నాత్యాక్షీః స త్యక్తవానసి కిం? యతస్త్వం పూర్వం శరణప్రదః ఆశ్రయప్రదః .(41)

ఓ అర్జునా ! ఇతరులకు శరణునొసగు నీవు శరణము పొందిన వానిని వదిలితివా? శరణునొందిన బ్రాహ్మణుని, బాలుని, వృద్ధుని, గోవును, రోగిని, స్త్రీని, రక్షించలేక వదిలితివా? అలా వదిలి వారిని బాధించితివా? నీ చింతకు కారణమేమి? (41)

42. శ్లో. కచ్చిత్త్వం నాగయోఽగమ్యాం
గమ్యాం వాఽసత్కృతాంస్త్రియమ్ ।
పరాజితో వాఽథ భవాన్
నోత్తమైర్నాసమః పథి ॥

టీ:- కచ్చిదితి. అగమ్యామితి ఛేదః. నిందితాం స్త్రియం నాగమః న గతవానసి కిం? అసత్కృతాం మలినవస్త్రాదికాం గమ్యాం నాగమః కిం? నోత్తమైః అనుత్తమైః సమైరిత్యర్థః. అసమైరథమైర్వా కిం న పరాజితోఽసి? ఇత్యర్థః. (42)

ఓ అర్జునా? నీవు పొంద కూడని స్త్రీని అధర్మంగా పొందితివా? పొందదగిన స్త్రీని మలిన వస్త్రాలు ఉన్నవని పొందకుంటివా? నీ సమానులు లేదా నీకన్న అధములతో నీవు మార్గమధ్యమున ఓడిపోతివా? ఎందుకీ చింత ? (42)

43. శ్లో. అపి స్విత్పర్యభుంక్థాస్త్వం
సంభోజ్యాన్ వృద్ధ బాలకాన్।
జుగుప్సితం కర్మ కించిత్
కృతవాన్న యదక్షమమ్ ॥

టీ:- అపీతి. సుభోజనార్హాన్ వృద్ధాన్, బాలకాంశ్చ, పర్యభుఙ్క్థాః తానసంభోజ్య భుక్తవానసి. పరిరత్ర వర్జనార్థః అక్షమం కుర్తుమయోగ్యం యత్తన్న కృతవానసి కిం?(43)

అర్జునా ! భోజన సమయమున అర్హులగు పెద్దలను లేదా బాలురను వదలి నీవు భుజించితివా? చేయకూడని, నిందితమగు కర్మను దేనినైనా చేసితివా? ఎందుకలా ఉన్నావు? (43)

44. శ్లో. కచ్చిత్ప్రేష్ఠతమే నాథ
హృదయేఽఽనాత్మబంధునా ।
శూన్యోఽసి రహితో నిత్యం
మన్యసేఽన్యథా న రుక్ ॥

ఓ అర్జునా ! శ్రేష్ఠుడు, ఎల్లప్పుడును ధ్యానించదగు, ఆత్మ బంధువగు శ్రీకృష్ణుని, నీ హృదయమున నిలుపుకోలేకపోతివా? కృష్ణుడు లేడని చింతించుచున్నావా? నీకేమైనా మానసిక బాధలు కలిగినవా ఏమైనది ? అని ఇట్లు ధర్మరాజు అర్జునుని పరిపరి విధాల ప్రశ్నించి ఆతని దుఃఖకారణము అడిగెను.(44)

టీ:- నిత్యం ప్రేష్ఠతమేన హృదయేన అత్యంతాంతరంగేణ స్వబంధునా శ్రీకృష్ణేన రహితః శూన్యోఽస్మీత్యాత్మానం మన్యసే. యద్వా-హృదయేన శూన్యోఽస్మీతి మన్యస ఇత్యర్థః. అన్యథా తే రుక్ మనః పీడా నఘటతే.(44)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం సంహితాయాం ప్రథమేస్కంధే భావార్థదీపికాయాం చతుర్దశోధ్యాయః**

**శ్రీమద్భాగవతము యొక్క ప్రథమస్కంధ చతుర్దశాధ్యాయమునకు శ్రీధరీయవ్యాఖ్యానుసార ఆంధ్రానువాదము ముగిసినది.**

## పంచదశోఽధ్యాయః

**శ్రీ సూత ఉవాచ.**

1. శ్లో. ఏవం కృష్ణసఖః కృష్ణో ।
భ్రాతా రాజ్ఞా వికల్పితః ।
నానాశంకాస్పదం రూపం
కృష్ణవిశ్లేషకర్శితః ॥

టీ:- శ్లో. కలిప్రవేశమాలక్ష్య ధురం న్యస్య పరీక్షితి, ఆరురోహ నృపస్స్వర్గమితి పంచదశేఽబ్రవీత్, ఏవమితి. కృష్ణః అర్జునః వికల్పితః ఇతిచ్ఛేదః నానాశంకాస్పదం రూపమాలక్ష్య వికల్పిత ఇత్యర్థః ప్రతిభాషితుం నాశక్నోదిత్యుత్తరేణాన్వయః. తత్రహేతుః.కృష్ణవిశ్లేషేణ కర్శితః కృశః కృతః.(1)

2. శ్లో. శోకేన శుష్యద్వదన
హృత్సరోజో హతప్రభః ।
విభుం తమేవానుధ్యాయన్
నాశక్నోత్ప్రతి భాషితుమ్

టీ:- శోకేనేతి. శోకేన హేతునా వదనం, చ హృచ్ఛ, తే ఏవ సరోజే శుష్యతీ తాపాతిశయేన శుష్కే వదనహృత్సరోజే యస్య. హతా ప్రభా తేజో యస్య.(2)

## పంచదశాధ్యాయము

**సూతుడు చెపుతున్నాడు.**

కలి ప్రవేశాన్ని ఊహించి, పరీక్షిన్మహారాజుయందు రాజ్య భారాన్ని ఉంచి ధర్మరాజు స్వర్గానికి వెళ్ళెనని ఈ పదిహేనవ అధ్యాయమున వర్ణించబడినది. శ్రీకృష్ణుని స్నేహితుడగు అర్జునుడు, కృష్ణ వియోగ దుఃఖము చేత బాధపడుచుండగా, అనుమానాస్పదంగా ఉన్న అర్జుని రూపాన్ని చూచి, నారదుడు చెప్పిన కృష్ణావతార పరిసమాప్తి జరిగినదా? అనే అనుమానముతో అనేక విధాలుగా ప్రశ్నించిన ధర్మరాజుకు సమాధానము చెప్పలేక, అర్జునుడు బాధపడుచుండెను. (ముందటి శ్లోకముతో అన్వయము.) (1)

దుఃఖముతో అర్జునుని ముఖము నిస్తేజమై, హృదయకమలము కాంతివిహీనముకాగా, ప్రభువగు ఆ కృష్ణపరమాత్మనే ధ్యానించుచూ, సమాధానము చెప్పలేక పోయెను.(2)

3. శ్లో. కృచ్ఛ్రేణ సంస్తభ్య శుచః
పాణినామృజ్య నేత్రయోః ।
పరోక్షేణ సమున్నద్ధ
ప్రణయౌత్కంఠ్యకాతరః ॥

టీ:- కృచ్ఛ్రేణేతి. శుచః శోకాశ్రూణి. యాన్యుద్గచ్ఛంతి తాని నేత్రయోరేవ సంస్తభ్య. గళితాని చ పాణినా ఆమృజ్య.పరోక్షేణ దర్శనాగోచరేణ శ్రీకృష్ణేన హేతునా. సమున్నద్ధమధికం యత్ప్రేమౌత్కంఠ్యం, తేనకాతరః వ్యాకులఃనృపమిత్యాహేత్యుత్తరేణాన్వయః.(3)

అర్జునుడు దుఃఖాన్ని అతి కష్టముగా ఆపుకొని, జారిన దుఃఖాశ్రువులను తన చేతితో తుడుచుకొని, తనకు కనిపించకుండా పోయిన కృష్ణుని కారణంగా పైకి పొంగివస్తున్న ప్రేమాతిశయముతో అయ్యో ! ఎంత పని జరిగిపోయినది అని భయపడుతూ, వణికిపోతూ ధర్మరాజుతో ఇట్లు పలికెనని ముందటి శ్లోకముతో అన్వయము.(3)

4. శ్లో. సఖ్యం మైత్రీం సౌహృదం చ
సారథ్యాదిషు సంస్మరన్ ।
నృపమగ్రజమిత్యాహ
బాష్పగద్గదయా గిరా ॥

టీ:- సఖ్యమితి.సఖ్యం హితైషితాం.మైత్రీముపకారితాం. సుహృత్త్వం సంబంధితాం చ బాష్పేణ కంఠావరోధాత్. గద్గదయా గిరా.(4)

శ్రీకృష్ణుడు గావించిన మంచిని, ఉపకారాన్ని ఆయన సహృదయతను, ప్రీతిసంబంధమును, తనకొనరించిన సారథ్యము మొదలగు వానిని స్మరించుకొని అర్జునుడు దుఃఖము పొంగి పొరలగా కన్నీళ్ళతో, గద్గద స్వరముతో తన అన్నయగు ధర్మరాజుతో ఇట్లు పలికెను.(4)

**అర్జున ఉవాచ.**

5. శ్లో. వంచితోఽహం మహారాజ ।
హరిణా బంధురూపిణా ।
యేన మేఽపహృతం తేజో ।
దేవ విస్మాపనం మహత్ ॥

టీ:- వంచిత ఇతి. యేన మాం వంచయతా దేవాన్ బ్రహ్మరుద్రాదీన్ విస్మాపయతీతి యత్. మహత్ సర్వోత్కృష్టం.(5)

**అర్జునుడు పలుకుచున్నాడు.**

అన్నా ! ఓ ధర్మరాజా ! బంధువు అనుకున్న శ్రీకృష్ణునితో నేను మోసగింపబడినాను. నాకు తెలియకనే ఆ స్వామి అదృశ్యుడైనాడు. దేవతలకు గూడ ఆశ్చర్యమును కలిగించు నా గొప్ప తేజస్సు ఆతనిచే అపహరింపబడినది.(5)

6. శ్లో. యస్య క్షణ వియోగేన ।
లోకో హ్యప్రియదర్శనః ।
ఉక్థేన రహితో హ్యేషః ।
మృతకః ప్రోచ్యతే యథా ॥

టీ:- యస్యేతి.యస్య క్షణవియోగేనేత్యాది శ్లోకస్థయచ్ఛబ్దానామంతే తేనాహమస్మిముషిత ఇతి ఇతోనవమశ్లోకస్థేన తచ్ఛబ్దేన సంబంధః. ప్రియస్యాప్రియత్వే దృష్టాంతః.ప్రాణేన రహిత ఏష పిత్రాదిః.(6)

కృష్ణుని వియోగముచే నాకు ఈ లోకమంటే ఏవగింపుకలిగినది చూడబుద్ధి అగుటలేదు. బ్రతికిఉన్న (తండ్రి మొదలగు) వారి శరీరాలనుండి ప్రాణము పోతే వారు శవాలని అనిపించుకొని వారు చూడశక్యముగా నుండరో ఆవిధముగా కృష్ణుడు లేని ఈ ప్రపంచము నాకు మృతప్రాయముగా ఉన్నది. (ఈ శ్లోకములోని యచ్ఛబ్దానికి ఏడవ శ్లోకముననున్న తచ్ఛబ్దముతో అన్వయము.) (6)

7. శ్లో. యత్సంశ్రయాత్ ద్రుపద గేహముపాగతానాం
రాజ్ఞాం స్వయంవరముఖే స్మరదుర్మదానామ్ ।
తేజో హృతం ఖలు మయాఽభిహతశ్చ మత్స్యః
సజ్జీకృతేన ధనుషాధిగతా చ కృష్ణా ॥

టీ:- శ్రీకృష్ణోపకారాననుస్మరతి-దశభిః.యదితి. యస్య సంశ్రయాద్బలాత్.స్మరేణకామేన. దుర్మదానామతిమత్తానాం తేజః ప్రభావః హృతం.ధనుర్గ్రహణేనైవ పశ్చాద్ధనుస్సజ్జీకృతం జ్యాసహితం చ. తేన మత్స్యో యంత్రః పరిభ్రమన్విద్ధః తాడితః. తతస్తాన్విజిత్య కృష్ణా ద్రౌపదీ ప్రాప్తా చ.(7)

శ్రీకృష్ణుని ఉపకారాలనన్నింటిని స్మరిస్తూ ఆయన వియోగానంతరము అర్జునుడు విలపిస్తున్నాడు. కామదుర్మదాంధులు, ద్రుపదుని ఇంటికి వచ్చిన రాజుల యొక్క తేజస్సును (స్వయంవరమునందు) కృష్ణుని అండదండల బలముగల నేను హరించి, ధనుస్సు ఎక్కుపెట్టి మత్స్య యంత్రాన్ని పడగొట్టి ద్రౌపదిని పొందితిని. శ్రీకృష్ణుడు నా పక్కనుండగా నేను నా శత్రువులను చూడగానే వారి తేజస్సు తగ్గి నా బలం పెరిగేది.అట్టి కృష్ణుడు ఇపుడు లేడు. (7)

8. శ్లో. యత్సన్నిధావహముఖాండవమగ్నయే దామ్
ఇంద్రం చ సామరగణం తరసా విజిత్య ।
లబ్ధా సభా మయకృతాద్భుతశిల్పమాయా
దిగ్భ్యోఽహరన్నృపతయో బలిమధ్వరే తే ॥

టీ:- యదితి. ఉ ఇతి విస్మయే. ఖాండవమింద్రస్య వనం. కాండవమితి వా పాఠః,అదాం దత్తవానస్మి. ఖాండవదాహే రక్షితేన మయేన కృతా సభాచ లబ్ధా.అద్భుతశిల్పరూపా మాయా యస్యాం సా. నిఖిలజగదాశ్చర్యకరశిల్పనిర్మాణేన జగన్మోహినీత్యర్థః. అధ్వరే రాజసూయే.బలిం ధనాదిరూపమర్హణద్రవ్యజాతం.(8)

(ఉ అను అవ్యయము ఆశ్చర్యద్యోతనము.) ఆశ్చర్యము ! అన్నా! ధర్మరాజా ! కృష్ణుని సాన్నిధ్యముచేతనే నేను దేవతా గణముతో కూడియున్న దేవేంద్రుని కూడా నా బలముతో జయించితిని అగ్నిహోత్రుని ప్రీతికై ఖాండవ వనాన్ని అర్పించితిని, అగ్ని దహించిన ఆ ఖాండవ వనమునందు నాచే రక్షింపబడిన మయుడను మహాశిల్పి తన మాయా శిల్పములచే అద్భుతముగా నిర్మించిన మయసభను మనకొసగెను. అనేక మంది రాజులు నానా దిక్కులనుండి నీ రాజసూయ యాగమునకు కావలసిన కానుకలు సమర్పించిరి. అట్టి కృష్ణుని ఇక చూడలేము.(8)

9. శ్లో. యత్తేజసా నృపశిరోఽంఘ్రిమహన్మఖార్థే
ఆర్యోఽనుజస్తవ గజాయుతసత్త్వవీర్యః ।
తేనాఽహృతాః ప్రమథనాథమఖీయభూపాః
యన్మోచితాస్తదనయన్ బలిమధ్వరే తే ॥

టీ:- అనంతరశ్లోకో విగలితః తథాపి వ్యాఖ్యాయతే. యదితి. నృపశిరస్సు అంఘ్రిర్యస్య తం జరాసంధం, తవానుజో భీమః మఖార్థం అహన్ హతవాన్. తద్విజయం వినారాజసూయమఖానుపపత్తేః గజాయుతస్యేవ సత్వముత్సాహశక్తిః. వీర్యం బలం చ. యస్య సః. తం హత్వా ప్రమథనాథో మహాభైరవః. తస్య మఖాయ యే రాజానః తేనాహృతాః పశురూపేణానీతాః. యస్మాన్మోచితాః, తస్మాత్తే అధ్వరే బలిం పుష్కల ధనోపహరాదిరూపమానీతవంతః. (9)

(తరువాత శ్లోకము కొంచము నింద్యముగా ఉన్నను వ్యాఖ్యానింపబడుతున్నది.) కృష్ణుని తేజస్సుతో భీముడు భైరవ యజ్ఞము కొరకు బలి ఇచ్చుటకు సకల రాజుల శిరస్సులను పాదములతో తొక్కిపట్టి తెచ్చెను. మీ తమ్ముడు పదివేల ఏనుగుల బలముకల పరాక్రమవంతుడు భీముడు జరాసంధుని చంపెను. అట్టి కృష్ణుడు అదృశ్యుడాయెను. ఆ జరాసంధుని చంపకుండా రాజసూయయాగము చేయరాదు. జరాసంధుని వధించి విడిపింపబడిన బతికిన రాజులే నీ రాజసూయయాగమునకు అనేక కాసులు కానుకలు సమర్పించిరి.(9)

10. శ్లో. పత్న్యాస్తవాధిమఖ క్లుప్త మహాభిషేక
శ్లాఘిష్ఠచారుకబరం కితవైస్సభాయామ్ ।
స్పృష్టం వికీర్య పదయోః పతితాశ్రుముఖ్యాః
యైస్తత్ స్త్రియోఽకృత హతేశవిముక్తకేశాః ॥

ఓ యుధిష్ఠిరా ! రాజసూయయాగానంతరము గావించిన అవభృథస్నానము చేత మిక్కిలి పవిత్రమైన, శ్రేష్ఠమైన నీ భార్య ద్రౌపది యొక్క కేశపాశము సభలో జూదగాండ్రగు దుశ్శాసనాదులచేత లాగబడి, ఈడ్వబడి ముడి విడువబడి, స్పృశించబడగా, స్మరించగానే ఆ క్షణముననే చేరుకొని ఆ ద్రౌపదీ మానరక్షణచేసి, ఆమె కన్నీళ్ళచే పాదములు కడుగగా ఆ కృష్ణుడే నిజమునకు దుర్మార్గులగు

టీ:- పత్న్యా ఇతి. యైః కితవైః దుశ్శాసనాదిభిః. తవ పత్న్యాః కబరం వికీర్య ఉన్ముచ్య. స్పృష్టమాకృష్టం తేషాం దుశ్శాసనాదీనాం స్త్రియః హతేశాః అత ఏవ వైధవ్యాద్విముక్తకేశాశ్చ అకృత చకార. కథంభూతం కబరం.? అధిమఖం రాజసూయమధికృత్యక్లిప్తో రచితో మహాభిషేకో మంత్రపూర్వాభిషేకో యః ,తేన అభిషేకేణ శ్లాఘిష్ఠం అతిశయితశ్లాఘావిషయీభూతం, చారు అతిమనోహరం, తచ్చ కబరం కేశపాశః ధమ్మిల్ల ఇత్యర్థః. స్మరణాత్తదానీమేవ. అస్మత్కృపయా ప్రాప్తస్య శ్రీకృష్ణస్య నమనే పాదయోః పతితాన్యశ్రూణి.ముఖాద్యస్మాః తస్యాః పత్న్యాః పదశబ్దసాపేక్షస్యాపి పతితశబ్దస్యాశ్రుపదేన సమాసః, నిత్యసాపేక్షత్వాత్.(10)

11.శ్లో. యో నో జుగోప వనమేత్య దురన్తకృచ్ఛ్రాద్
దుర్వాససోఽరివిహితాదయుతాగ్రభుగ్యః ।
శాకాన్నశిష్టముపయుజ్య యతస్త్రిలోకీం
తృప్తామమంస్త సలిలే వినిమగ్నసంఘః ॥

టీ:- య ఇతి శిష్యాణామయుతస్యాగ్రే తత్పశ్చాత్ భుఙ్క్తేయః తస్మాద్దుర్వాససో హేతోః అరిణా రచితం యదురంతకృచ్ఛ్రం శాపలక్షణం తస్మాత్సకాశాన్నోఽస్మాన్ వనం ఏత్య జుగోప రక్షితవాన్. కిం కృత్వా?

దుశ్శాసనాదులను చంపి , వారి భార్యలను ముంగురులు లేని వారలుగా చేసినాడు. అట్టి కృష్ణుడు ఇక లేడు.(10)

శిష్యులతో వెళ్ళి దుర్వాసుడు భోజనమడిగి, పెట్టలేదను కోపంతో పాండవులను శపించవలెనని ఒకనాడు దుర్యోధనుడు దుష్టపన్నాగము పన్నెను. అప్పుడు శ్రీకృష్ణపరమాత్మ దయతో వనానికి వచ్చి ద్రౌపదిని అడిగి అక్షయపాత్రలో మిగిలిన ఒక శాకము ముక్కను తిని మూడులోకాలు తృప్తి పడునట్లు చేసెను. స్నానానికి వెళ్ళి నీటిలో మునిగి ఉన్న దుర్వాసుడు, అతని శిష్యుల కడుపులు నిండగా భోజనము చేయలేక, ధర్మరాజు వద్దకు రాలేక, భీమునికి కనిపించక, భయముతో పారిపోయెను. అదంతా కృష్ణుని అనుగ్రహము ఆయన అట్లు దుర్వాసుని శాపము నుండి మనలను కాపాడెను. అట్టి మిత్రుడు అదృశ్యుడాయెను.ఒకరోజు శిష్యసమేతుడై వచ్చిన దుర్వాసునికి,

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

శాకమేవాన్నం శిష్టం తస్మిన్ పాత్రే అవశిష్టం ఉపయుజ్య జగ్ధ్వా. వియత ఉపయోగాత్. సలిలే నిమగ్నో మునీనాం సంఘః త్రిలోకీం. తృప్తామమంస్త. ఏవం హిభారతే కథా. వదాచిద్దుర్వాససో దుర్యోధనేనాతిథ్యం కృతం. తేన చ పరితుష్టేన వరం వృణీష్వేత్యుక్తే దుర్వాసస శ్శాపాత్పాండవా నశ్యేయురితి మనసి నిధాయ దుర్యోధనేనోక్తం యుధిష్ఠిరోఽస్మత్కుల ముఖ్యః, అతస్తస్యాపి భవనే భవతా ఏవమేవ శిష్యాయుత సహితేనాతిథినా భవితవ్యం. కింతు ద్రౌపదీ యథా క్షుధా న సీదేత్తథాతస్యమపి భుక్తవత్యాం తద్గృహం గంతవ్యమితి. తతశ్చ తథైవ దుర్వాససి ప్రాప్తే పరమాదరేణ యధిష్ఠిరేణ మాధ్యాహ్నికం కృత్వా ఆగమ్యతామితి విజ్ఞాపితో మునిస్సమునిసంఘోఽఘమర్షణస్నానాయ జలేనిమజ్జ. తత్ర చింతాతురయా ద్రౌపద్యాస్మృత మాత్రః శ్రీకృషః తత్క్షణ మేవ భక్త వాత్సల్యాత్ర్పాప్తఃతయా నివేదితే వృత్తాంతే భగవతోక్తం. అహం చ బుభుక్షితో మాం భోజయేతి, తయాతిలజ్జితయోక్తం, స్వామిన్ మద్భోజనపర్యంతం అక్షయమన్నం సూర్యదత్తస్థాల్యాం మయా చ సర్వాన్ సంభోజ్య భుక్తం. తతో నాస్త్యన్నమితి. తథాప్యతినిర్బంంధేన స్థాలీమానాయ్య తత్కంఠ లగ్నం కించిచ్ఛాకాన్నమాత్రం ప్రాశ్యోక్తం భోక్తుం మునిసంఘమాహ్వ యేతి. స చ తావతాతితృప్తో వృథా పాకభయేన పలాయిత ఇతి. (11)

దుర్యోధనుడు ఆతిథ్యమిచ్చెను. ఆ ముని సంతుష్టుడై వరము అడుగుమనగా దుర్యోధనుడు, యుధిష్ఠిరుడు మా కులముఖ్యుడు అతని వద్దకు ఇదే విధముగా శిష్యసమేతుడవయి వెళ్ళి ద్రౌపది భోజనము చేసిన పిమ్మట ఆతిథ్యము తీసికొమ్మని అడిగెను. అపుడు ధర్మజుడు ఆతిథ్యమీయలేడని దాని వలన దుర్వాసుడు శపించునని పాండవులు నశింతురని, అనుకొనెను. తథాస్తు అని దుర్వాసుడు శిష్యులతో సహా ధర్మరాజు వద్దకు ఆతిథ్యమునకు వెళ్ళెను. ధర్మరాజు అలాగేనని స్నానము చేసిరండని ప్రార్థించెను. ఆ సమయము మధ్యాహ్నము. అప్పటికి ద్రౌపది కూడ భుజించియుండెను. ఏమియును లేదని ఆమె చింతించి శ్రీకృష్ణుని స్మరించెను. వెంటనే భక్తవత్సలుడైన కృష్ణుడు తొడమీదనున్న రుక్మిణిని విడిచి కూడా తొందరగా ద్రౌపది వద్దకు వచ్చెను. విషయమంతయు ద్రౌపది విన్నవించిన పిదప కృష్ణుడు అమ్మా ద్రౌపదీ నాకు ఆకలిగా ఉన్నది మొదట నాకు భోజనము పెట్టుమని అన్నాడు. ద్రౌపది, అన్నయ్యా నేను కూడా భుజించుట చేత సూర్యుడిచ్చిన అక్షయపాత్ర ఖాళీ అయినది అన్నది. అపుడు కృష్ణుడు నిర్బంధముతో అక్షయపాత్రను తెప్పించుకొని దాని కంఠమందున్న చిన్న శాకము ముక్కను తీసి తినెను. విశ్వాత్ముడగు భగవానుడు తృప్తిపడుగాక అనెను. అంతటితో ప్రపంచములోని యావన్మంది కడుపులు నిండిపోయినవి. తరువాత ధర్మరాజు దుర్వాసుని పిలువుమని భీముని

ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ. ఓం నమో భగవతే వాసుదేవాయ.

పంపెను. కాని కడుపులు నిండిన ముని సంఘము ఇక తినలేమరి. చేసిన వంట వ్యర్థమైనచో భీముని వలన ఇబ్బంది కలుగునని భయపడి, వారు ఎవరికి దొరకక ముందు పలాయనము చిత్తగించిరి. అటువంటి ఉపకారి కృష్ణుడు లేకుండా పోయెనన్నా.(11)

12. శ్లో. యత్తేజసాऽథ భగవాన్ యుధి శూలపాణిః
విస్మాపితస్సగిరిజోऽస్త్ర మదాన్నిజం మే ।
అన్యేऽపి చాహమమునైవ కలేబరేణ
ప్రాప్తో మహేంద్రభవనే మహదాసనార్థమ్ ॥

టీ:- యదితి. స గిరిజః. గిరిజాసహితో విస్మపితస్సన్. నిజం పాశుపతమస్త్రం అన్యేऽపి లోకపాలాః నిజాన్యస్త్రాణి దదుః. అన్యదప్యాశ్చర్యమాహ-అమునైవేతి. మహతః. ఇంద్రస్యాసనార్థం. (12)

కృష్ణుని తేజస్సుతోడనే శంకరభగవానుడు పార్వతితో సహా ఆశ్చర్యాన్ని పొంది యుద్ధమున విజయమునందించగల పాశుపతాస్త్రాన్ని తనకు సమర్పించెను. ఇతర దిక్పాలకులు కూడా తమ తమ అస్త్రాలనొసగిరి. నేను ఈ శరీరముతోనే దేవేంద్ర లోకానికి వెళ్ళి గొప్పదైన అర్ధాసనాన్ని అలంకరించితి. అటువంటి కృష్ణుడు నన్ను మోసగించి నాకు కనపడతేదు.(12)

13. శ్లో. తత్రైవ మే విహరతో భుజదండయుగ్మం
గాండీవ లక్షణమరాతివధాయ దేవాః ।
సేంద్రాః శ్రితా యదనుభావితమాజమీఢ
తేనాహమద్యముషితః పురుషేణ భూమ్నా ॥

ఓ ధర్మరాజా ! కృష్ణునిచే ప్రభావితుడనై ఆ స్వర్గముననే గాండీవినై విహరిస్తున్నప్పుడు. నా భుజదండములనే నివాతకవచ దైత్యుల వధకై దేవేంద్రునిడు దేవతలును ఆశ్రయించిరి. అట్టి గొప్ప మహిమను నాకు కలిగించిన కృష్ణుని చేత వంచింపబడితిని, అతడు నన్ను విడచిపోయెను.(13)

టీ:- తత్రేతి. తత్రైవ స్వర్గే క్రీడతః గాండివం లక్షణం చిహ్నం యస్య తత్. అరాతయః నివాతకవచా దైత్యాస్తేషాం యుద్ధార్థం. ఆశ్రితవంతః యేనానుభావితం. ప్రభావయుక్తం కృతం హే ఆజమీఢ యుధిష్ఠిర. తేన ముషితః వంచితోఽస్మి. కథంభూతేన! భూమ్నా నిజమహిమావస్థానేన. (13)

14. శ్లో. యద్బాంధవః కురుబలాబ్ధిమనంత పారమ్
ఏకో రథేన తతథేహమతార్యసత్త్వమ్ ।
ప్రత్యాహృతం బహుధనం చ మయా పరేషాం
తేజాస్పదం మణిమయం చ హృతం శిరోభ్యః ॥

టీ:- యదితి. యద్బాంధవ ఇత్యాదిశ్లోకత్రయస్య తేన మషితోఽహమితి పూర్వేణాన్వయః. కృష్ణబాంధవః. ఏకఏవాహం కౌరవసైన్యాబ్ధిం. నాస్త్యంతో గాంభీర్యేణ పారం చ దేశతో యస్య. అథవా అంతః సమాప్తిః, పారం సమాప్తస్యోత్తరతీరం, తదుభయరహితం తతరే తీర్ణవాన్. ఉత్తరగోగ్రహణే అతర్యాణి దుస్తరాణి. సత్వాని తిమంగిలాదీని. భీష్మాదిరూపాణి యస్మిన్. పరైర్నీతం గోధనం ప్రత్యాహృతం. పరేషాం చ శిరోభ్యస్సకాశాత్ తేజః పదం ప్రభావస్యాస్పదం. ఉష్ణీషరూపం, మణిమయం మకుటరత్న రూపం, పురుధనం బహుధనం, తావన్మోహనాస్త్రేణ మోహయిత్వా

'యద్బాంధవ' అను మూడు శ్లోకాలకు కూడ తేన ముషితోహమ్ అను పూర్వ శ్లోకముతోనే సంబంధము. కృష్ణుడు బంధువుగాగల నేను అంతులేని, దాట శక్యముగాని భీష్మ, ద్రోణులను తిమింగలాలు కల, కౌరవ సైన్యమను సముద్రమును, ఉత్తర గోగ్రహణ సమయమున రథముతో నేనొక్కడనైను దాటగలిగితిని. ఇతరులు శత్రువులు హరించిన గోధనాన్ని మరల పొందితిని. శత్రువుల తేజస్సును, ప్రభావమును తెలియజేయు వారి తలపాగాలు, మణిమయ కిరీటములు వారి విలువైన ధనాన్ని కూడ సమ్మోహనాస్త్రముతో మోహింపజేసి గ్రహించితిని. అట్టి శక్తినిచ్చిన కృష్ణునితో వంచింప బడితిని. (14)

నీతం. యః కృష్ణః బాంధవః సర్వవిధబంధుర్యస్య తేన యద్బాంధవేన మయా.(14)

15.శ్లో. యో భీష్మ కర్ణ గురు శల్య చమూష్వదభ్ర
రాజన్యవర్యరథ మండల మండితాసు ।
అగ్రేచరో మమ విభో రథయూథపానామ్
ఆయుర్మనాంసి చ దృశా సహ ఓజ ఆర్ఛత్ ॥

టీ:- య ఇతి. అదభ్రాః అనల్పాః యే రాజన్యవర్యాస్తేషాం. రథమండలైః మండితాసు భీష్మాదీనాం చమూషు సారథిరూపేణ రథికస్య మమాగ్రే చరస్సన్.సారథిరూపేణ వర్తమానస్సన్ హే విభో. తేషాం రథయూథపానామాయురాదీని యః దృశా దృష్ట్యైవ ఆర్ఛత్ హృతవాన్. మనాంసీత్యుత్సాహాదిశ క్తిః. సహోమనోబలం. ఓజః కాయికబలం. శస్త్రాది కౌశలమిత్యర్థః (15)

గొప్ప రాజుల రథములతో, భీష్మ, కర్ణ, ద్రోణ, శల్య మహారథులసేనలతో యుద్ధము చేయునపుడు, కృష్ణుడు రథముపై నా ముందుండి ఆ గొప్ప గొప్ప యోధుల ఆయువును, మనస్సులను, ఉత్సాహశక్తిని, ఆయుధాలను బలమును చూపులతోనే హరించెను. కావున నేను గెలువగలిగితి. అట్టి కృష్ణునిచే మోసగించబడితిని. (15)

16.శ్లో. యద్దోర్షు మా ప్రణిహితం గురుభీష్మకర్ణ
ద్రౌణిత్రిగర్తశలసైంధవబాహ్లికాద్యైః ।
అస్త్రాణ్యమోఘమహిమాని నిరూపితాని ।
నోపస్పృశుర్నృహరిదాసమివాసురాణి ॥

కృష్ణుని వలననే నా పైకి ద్రోణాచార్యుడు, భీష్ముడు, కర్ణుడు, త్రిగర్త దేశాధిపతి సుశర్మ,శల్యుడు, సైంధవుడు, సింధుదేశాధిపతి జయద్రథుడు,శంతనుని సోదరుడగు బాహ్లికుడు, మొదలగు శత్రువులు ప్రయోగించిన అమోఘములగు, మహిమాన్వితములగు దివ్యాస్త్రాలు నన్ను స్పృశించకుండెను. ప్రహ్లాదునిపై రాక్షసులు ప్రయోగించిన

టీ:- యదితి. యస్య దోర్షుమా మాం. ప్రణిహితం స్థాపితం గుప్తమిత్యర్థః. తైరేవ గుర్వాదిభిర్నిరూపితాని ప్రయుక్తాని. అస్త్రాణి న స్పృశన్తిస్మ. గురుః ద్రోణః త్రికర్తః. త్రికర్తదేశాధిపతిః. సుశర్మా. శలః శల్యః మద్రాధిపతిః. సైంధవః సింధుదేశాధిపతిః. జయద్రథః. బాహ్లీకః శంతనోర్భ్రాతా. అమోఘో మహిమా యేషాం తథాభూతాన్యపి ప్రతీకారాకరణేప్యస్పర్శే దృష్టాంతః ఆసురాణి హిరణ్యకశిపుప్రేరితాని అస్త్రాణి. నృహరిదాసం ప్రహ్లాదమివేతి.(16)

17.శ్లో. సౌత్యే వృతః కుమతినాత్మద ఈశ్వరో మే
యత్పాదపద్మమభవాయ భజంతి భవ్యాః ।
మాం శ్రాంతవాహమరయో రథినో భువిష్ఠం
న ప్రాహరన్యదనుభావనిరస్తచిత్తాః ॥

టీ:- స్వాపరాధమనుస్మరన్ సంతప్యమాన ఆహ- సౌత్యఇతి. సౌత్యే సారథ్యే. మయా కుమతినా. స వృత్తః. కుమతిత్వమేవాహ - ఆత్మద ఇత్యాదినా. ఆత్మదః జ్ఞానప్రదః. అభవాయ మోక్షాయ. భవ్యాః శ్రేష్ఠాః శ్రాంత్రాః వాహాః అశ్వాః యస్య, తం మాం. జయద్రథవధే హి జలపానం వినా అశ్వాః శ్రాంతాః తతో రథాదవతీర్య భువిష్ఠమపి బాణైర్భువం భిత్వా జలం సంపాదితం మయా. తదా యస్యానుభావేన

అస్త్రాలవలె అవి అన్నియు నాపట్ల వ్యర్థములు అయ్యెను. అట్టి కృష్ణపరమాత్మ నన్ను వంచించెను.(16)

తన తప్పును స్మరించుకొని పశ్చాత్తాపాన్ని పొంది అర్జునుడు పలుకుతున్నాడు. శ్రేష్ఠులగు పురుషులు కృష్ణుని పాదకమలాలను, పునర్జన్మలేని మోక్షము కొరకు ఆశ్రయిస్తారు. అంతే కాదు భక్తులకు తనను తాను సమర్పించుకొని, ప్రాణమైనా ఇచ్చే ఈశ్వరుడు కృష్ణుడు. కృష్ణుని మహిమచే, జయద్రథుని చంపునపుడు, భూమిపై దిగి దాహంతో అలసిన నా గుఱ్ఱాల కొఱకు బాణంతో భూమిని ఛేదించి నీరు తెప్పించితిని. అప్పుడు నా శత్రువులగు రథికులు ఏమి తోచక నన్ను కొట్టకుండా ఉండి పోయినారు. అట్టి మహానుభావుని కృష్ణుని చెడు బుద్ధిగల నేను నా రథసారథ్యమునకై వరించితిని. ఎంత దోషమొనర్చితినో కదా ! (17)

నిరస్తచిత్త అరయో మాం న ప్రహృతవంతః. స సౌత్యే వృత ఇతి కుమతిత్వం.(17)

18.శ్లో. నర్మాణ్యుదారరుచిరస్మితశోభితాని
హే పార్థ హేఽర్జున సఖే కురునందనేతి ।
సంజల్పితాని నరదేవహృదిస్పృశాని
స్మర్తుర్లుఠంతి హృదయం మమ మాధవస్య ॥

టీ:- నర్మాణీతి. హే నరదేవ. ఉదారం గంభీరం, రుచిరం, యత్స్మితం, తేన శోభితాని. నర్మాణి పరిహాసవాక్యాని. తథా కార్యప్రసాద్వేషు హే పార్థేత్యాదీని మధురాక్షరాణి సంజల్పితాని చ హృదిస్పృశాని మనోజ్ఞాని చ మాధవస్య యాన్యేతాని. స్మర్తుర్మమ హృదయం లుఠంతి క్షోభయంతి. ణిజభావః ఆర్షః. (18)

ఓ పృథానందనా ! ఓ అర్జునా ! ఓ స్నేహితుడా! ఓ కురునందనా! అని సంబోధించుచూ కృష్ణుడు నాతో మాట్లాడిన పరిహాసపు మాటలు ఔదార్యముతో గాంభీర్యముతో రమణీయమగు చిఱునగవుతో శోభిల్లుచుండెడివి. అట్టి మాటలు స్మరించుకొంటూండగనే నా హృదయాన్ని ఎంతో కలవరపరచు చున్నవి. (ఇచట లుఠంతి అను ధాతువునకు లోఠయంతి అను ప్రేరణార్థము చెప్పాలి. కాని అట్టి ప్రేరణార్థక ణిజ్ ప్రత్యయము లేకుండా వాడబడినది ఈ ప్రయోగము ఆర్షము.) (18)

19.శ్లో. శయ్యాసనాటనవికత్థనభోజనాదిషు
ఐక్యాద్వయస్య ఋతవానితి విప్రలబ్ధః ।
సఖ్యుస్సఖేవ పితృవత్తనయస్య సర్వం
సేహే మహాన్మహితయా కుమతేరఘం మే ॥

పడుకొనుట, కూర్చొనుట, తిరుగుట, ప్రశంసించుట, భోజనము చేయుటలయందు భేదములేక కలిసియుండుట వలన ఒకప్పుడు పొరపాటు జరిగినచో కృష్ణా నీవు సత్యసంధుడవయ్యా అని నేను వక్రోక్తితో వ్యంగ్యంగా తిరస్కరించేవాడిని, అయినా ఆ మహానుభావుడు గొప్పవాడగుటచే స్నేహితుడు స్నేహితుని, తండ్రి

టీ:- శయ్యేతి. వికత్థనం స్వగుణశాఘనం, విరుద్ధసంభాషణం వా. శయ్యాదిషు ఐక్యాత్. అవ్యతిరాకద్దేతోః ఐక్యం మానసికవ్యాపారాభేదః కదాచిద్వ్యభిచాం దృష్ట్వా. హే వయస్య, ఋతవాన్. సత్యముక్తస్త్వమితి వక్రోక్త్యా విప్రలబ్ధః తిరస్కృతోऽపి. ఋభుమానితి పాఠే ఋభవో దేవాస్సేవకాస్సంతి యస్య. అసౌ మహానపి వయస్య ఇతి మత్వా విప్రలబ్ధః. తిరస్కృత ఇత్యర్థః, ఋతమానితి పాఠే వత్యాభావస్త్వార్షః. మే అఘం అపరాధ: సేహే మహామహితయా మహత్త్వేన ఐకపద్యేన. అతిమహత్త్వేనేత్యర్థః. సఖ్యురఘం సఖేవ. తనయస్యాఘం పితేవ.(19)

తనయుని క్షమించినట్లు నా పాపాలను క్షమించెను. తిరస్కారమును గూడ ప్రేమచే సహించెను. కృష్ణుని మహాత్ముడని తలచక స్నేహితుడను భావముతో తిరస్కరించితిని. ఇదెంతయో నాకు పరితాపమును కలగజేయుచున్నది. (ఋతవా అనుదానికి బదులు శ్లోకమున ఋభువానని పాఠాంతరమున్నది. అప్పుడు ఋభుమానని మకారమునకు వకారమురాదు ముందు అకారములేదు కనుక అచ్చట ఋభువానని ఉండుట ఆర్షము. ఋభువులనగా దేవతలు, వారు సేవకులుగా కలవాడు కృష్ణుడని అర్థము.) (19)

20. శ్లో. సోऽహం నృపేంద్ర రహితః పురుషోత్తమేన
సఖ్యా ప్రియేణ సుహృదా హృదయేన శూన్యః ।
అధ్వన్యురుక్రమపరిగ్రహమంగ రక్షన్ ।
గోపైరసద్భిరబలేవ వినిర్జితోऽస్మి ॥

టీ:- త్వయాశంకితం పరాజయం చ ప్రాప్తోऽహమిత్యాహ-న ఇతి. తేన సఖ్యా రహితః. అతో హృదయేన శూన్యః. అంగ హే రాజన్. ఉరుక్రమస్య పరిగ్రహం షోడశసహస్రస్త్రీః రక్షన్. అసద్భిర్నీచైఃఅబలా యోషేవ.(20)

ఓ ధర్మరాజా ! మీరు ఊహించినట్లు నాకు పరాజయము కూడ కలిగినదని అర్జునుడనుచున్నాడు. ఓ రాజా ! మిత్రుడగు ఆ పురుషోత్తముడు లేనివాడనగు నేను హృదయము లేనివానివలె విచారముతో ఉన్నాను. కృష్ణుని పదునారువేల మంది భామలను దుర్మార్గులనుండి రక్షించదలచిన నేను మార్గమధ్యమున ఒక ఆడదాని వలె గోపాలురచే ఓడగొట్టబడితిని. బలహీనుడనై నిస్తేజుడనైతిని. (20)

21. శ్లో. తద్వై ధనుస్తు ఇషవస్స రథో హయాస్తే
సోఽహం రథీ నృపతయో యత ఆమనంతి ।
సర్వం క్షణేన తదభూదసదీశరిక్తం
భస్మన్ హుతం కుహకరాద్ధమివోప్తమూష్యామ్ ॥

టీ:- శ్రీకృష్ణవియోగ ఏవాత్రహేతుర్నాన్య ఇత్యాహ-తదితి. యతః యేభ్యః ఈశేన రిక్తం శూన్యం అసత్ కార్యాక్షమం. సర్వమపి క్షణేన శ్రీకృష్ణవియోగావ్యవహితక్షణఏవ. సన్మంత్రవిధానైరపి. భస్మన్నితి లుప్తసప్తమీకం పదం. భస్మని హుతం భస్మాహుతిమివ అతి ప్రీతాదపి కుహకాత్ మాయావినస్సకాశాత్. రాద్ధంం లబ్ధమివ అథవా కుహకే వంచకే అసత్పాత్రే. రాద్ధం దత్తమివ. సమ్యక్కరణాదప్యుష్యా మూషరభూమౌ ఉప్తం ప్రకీర్ణం బీజమివ.(21)

రథికుడిగా నేను ఏ ధనుర్బాణాలు ధరించితినో, ఏ గుఱ్ఱాలను పూన్చితినో, ఏ రథములో ఎక్కిఉంటినో ఏ రాజులందరు నన్ను చూచి తలలు వంచి నమస్కరించిరో, అదే ధనుస్సు, అవే బాణాలు, అదే రథము, అవే గుఱ్ఱాలు, ఆ రథికుడిగా ఉన్ననేనే శ్రీకృష్ణుడు లేకపోవుట వలన క్షణములో శూన్యమయి, పనిచేయనివయిపోయెను. మంచి మంత్ర విధానముతో, వేసినను భస్మములో వేసిన ఆహుతివలె, మాయావి వలన పొందిన వస్తువు వలె, చవట నేలలో బాగా దున్ని వేసిన విత్తనాల వలె, నా అస్త్రములు విఫలమైనవి.(21)

22. శ్లో. రాజంస్త్వయాభిపృష్టానామ్
సుహృదాం న స్సుహృత్పురే
విప్రశాపవిమూఢానాం
నిఘ్నతాం ముష్టిభిర్మిథః ॥

ఓ ధర్మరాజా ! మీరు అడిగిన మన స్నేహితులు, బంధువులు, బ్రాహ్మణులచే శపించబడి, మద్యము తాగి, మత్తెక్కి, ఒకరినొకరు గుర్తించుకొనక కొట్టుకొని చనిపోయిరి. వారిలో నలుగురైదుగురు మాత్రమే ద్వారకా నగరమందు మిగిలియున్నారు.(22,23)

23. శ్లో. వారుణీం మదిరాం పీత్వా
మదోన్మథిత చేతసామ్ ।
అజానతామివాన్యోన్యం
చతుష్పంచావశేషితాః ॥

టీ:- సుహృత్పురే త్వయాభిపృష్టానాం నస్సుహృదాం మధ్యేచత్వారః పంచ వావశేషితాః. తత్ర హేతుర్విప్రశాపేత్యాదినా వారుణీమన్నమయీ మజానతామివ, అన్యోన్యమజానతామివ స్వపితృపుత్రభ్రాతృప్రభృతీన్ కదాప్యజానతా మివ, ఏరకాముష్టిభిర్నిఘ్నతాం. అవశేషితా, ఇత్యనేనోక్తః (23)

24. శ్లో. ప్రాయేణైతద్భగవత
ఈశ్వరస్య విచేష్టితమ్ ।
మిథో నిఘ్నంతి భూతాని
భావయంతి చ యన్మిథః ॥

టీ:- హేతుకర్తారమాహ-త్రిభిః. ప్రాయేణేతి. భావయంతి పాలయంతి.(24)

నలుగురైదుగురు మిగిలారని చెప్పబడిన దానికి హేతువును మూడు శ్లోకాలతో చెపుతున్నాడు 'ప్రాయేణ' అని. ఇదంతయు భగవంతుని లీలయే . ఆ భగవానుని లీల చేతనే ఒకరినొకరు చంపుకొనుట లేదా పరిపాలించుకొనుట జరుగును.(24)

25. శ్లో. జలౌకసాం జలే యద్వత్
మహాంతోఽదంత్యణీయసః ।
దుర్బలాన్ బలినో రాజన్
మహాంతో బలినో మిథః ॥

టీ:- జలౌకసామితి. జలౌకసాం మత్స్యాదీనాం మధ్యే మహాంతః స్థూలాః, అణీయసకి సూక్ష్మాన్, యథా అదంతి భక్షయంతి.(25)

ఓ రాజా ! జలచరములగు ప్రాణులు పెద్దవి చిన్న వానిని తినుచుండునో, గొప్పనగు బలవంతుడు బలములేని వారిని చంపునో, అదే విధముగా బలముగల వారు కూడ పరస్పరము చంపుకొందురు. (25)

26. శ్లో. ఏవం బలిష్ఠైర్యదుభిః
మహద్భిరితరాన్ విభుః ।
యదూన్యదుభిరన్యోన్యం
భూభారాన్ సంజహార హ ॥

టీ:- ఏవమితి. ఏవం బలిష్ఠైర్మహద్భిః పాండవైః దుర్యోధన జరాసంధాదీన్ నిహత్య యదుభిః ఇతరాన్ సాల్వాదీన్ నిహత్య యదూన్ యదుభిరన్యోన్యం నిహత్య భగవాన్ భువో భారభూతాన్ సంహృతవాన్. (26)

బలవంతులగు పాండవులచేత దుర్యోధన, జరాసంధాదులను చంపించి భూమికి భారమైన యాదవులచేతనే యాదవులను కృష్ణభగవానుడు చంపించెను.(26)

27. శ్లో. దేశకాలార్థయుక్తాని
హృత్తాపోపశమాని చ ।
హరంతి స్మరతశ్చిత్తం
గోవిందాభిహితాని మే ॥

టీ:- అతః పరం వక్తుం న శక్నోమీతి సూచయన్నాహ-దేశ కాలేతి. దేశకాలోచితార్థయుక్తాని మనః పీడోపశమనకరాణి గోవిందస్య వచనాని స్మరతో మమ చిత్తం హరంతి ఆకర్షంతి.(27)

ఇంతకుమించి చెప్పలేనని సూచించుచూ ధర్మరాజుతో అర్జునుడు పలుకుతున్నాడు. దేశ కాలములకు ఉచితమైన అర్థము కలిగి, హృదయతాపమును తగ్గించునట్టి శ్రీకృష్ణుని పలుకులు స్మరించిన కొలది నా మనస్సును హరించుచున్నవి.(27)

**సూత ఉవాచ.**

28. శ్లో. ఏవం చింతయతో జిష్ణోః
కృష్ణపాదసరోరుహమ్ ।
సౌహార్దేనాతిగాఢేన
శాంతాఽసీద్విమలా మతిః ॥

టీ:- ఏవమితి సూతోక్తిః. ఏవమితి. దృఢేన స్నేహేన చింతయతోఽర్జునస్య మతిశ్శాంతా భగవత్మ్ఫరణజనితానందాతిశయేన శాంతిరసయుక్తా విమలా విశోకా విరక్తా చాసీత్.(28)

**సూతుడిట్లు చెప్పదొడగెను.**

మిక్కిలి ధృఢమైన ప్రేమతో శ్రీకృష్ణుని పాద కమలాలను ధ్యానిస్తున్న అర్జునుని యొక్క బుద్ధి ప్రశాంతమై, విమలమై, విరక్తితో కూడినదై ప్రాపంచిక విషయాసక్తి తొలగినదాయెను.(28)

29. శ్లో. వాసుదేవాంఘ్ర్యనుధ్యాన
పరిబృంహితరహంసా ।
భక్త్యా నిర్మథితాశేష
కషాయధిషణోఽర్జునః ॥

టీ:- మతివైమల్యఫలమాహ - వాసుదేవేతి, వాసుదేవాంఘ్ర్యను ధ్యానేన పరిబృంహితం సంవర్ధితం రంహో వేగో యస్యాః తయా భక్త్యానిర్మథితాః ఉన్మీలితాః అశేషాః కషాయాః కామాదయో యస్యాస్సా ధిషణా బుద్ధిర్యస్య సః. జ్ఞానం పునరధ్యగమదిత్యుత్తరేణాన్వయః.(29)

అర్జునుని మతి వైమల్యానికి ఫలాన్ని చెపుతున్నాడు. శ్రీకృష్ణుని పాదములను ధ్యానించుటచేత భక్తి కలిగి బుద్ధియందలి కామాది దోషములు మథించబడి, దోషములన్ని నిశ్శేషములుకాగా అర్జునుడు మంచి జ్ఞానాన్ని పొందెను. (ఉత్తర శ్లోకముతో అన్వయము.) (29)

30. శ్లో. గీతం భగవతా జ్ఞానం
యత్తత్సంగ్రామమూర్ధని ।
కాలకర్మతమోరుద్ధం
పునరధ్యగమద్విభుః ॥

టీ:- గీతమితి. కాలేనకర్మభిః. తమసా భోగాభినివేశేన. రుద్ధ ఆవృతంసత్.(30)

రణరంగమున భగవంతుడగు కృష్ణుని చేత బోధింపబడిన గీతాజ్ఞానము అర్జునునికి కాల కర్మల వలన కలిగిన తమోగుణ ప్రభావము, భోగావేశములచేత మరుగునపడెను. ఆవరింపబడెను. అది దైవికముగా అర్జునకు స్ఫురించెను.(30)

31. శ్లో. విశోకో బ్రహ్మసంపత్త్యా
సంఛిన్నద్వైతసంశయః ।
లీన ప్రకృతినైర్గుణ్యాద్
అలింగత్వాదసంభవః ॥

టీ:- జ్ఞానఫలమాహ - విశోక ఇతి. ఏతదేవ శోకహేత్వభావేన ఉపపాదయతి-శోకస్యాపి హేతుః ద్వైతభ్రమః. తస్యదేహః. తస్య లింగం తస్య గుణాః. తేషామవిద్యా. తతశ్చ బ్రహ్మసంపత్త్యా బ్రహ్మాహమితి, జ్ఞానేనలీనా ప్రకృతిరవిద్యా యస్మిన్, తన్నైర్గుణ్యం భవతి. నతు సుషుప్తిప్రళయయోరివఅవిద్యాశేషం. తస్మాన్నైర్గుణ్యాద్గుణ కార్యలింగనాశః. అలింగత్వాచ్చాసంభవః సమ్యగ్భోగాయ భవతి. పునః పునరితి సంభవః స్థూలశరీరం, తద్రహితః. తతశ్చ తత్పరిచ్ఛేదాభావాత్ సంఛిన్నో ద్వైతలక్షణః సంశయో భ్రమో యస్య సః విశోకో జాత ఇతి.(31)

అర్జునునికి జ్ఞానోదయమైనదని దాని ఫలాన్ని చెపుతున్నాడు 'విశోక' అని. అర్జునుడు బ్రహ్మజ్ఞానముచేత భేదబుద్ధి తొలగి శోకము లేనివాడాయెను. శోకానికి, దుఃఖానికి భేదబుద్ధి కారణము. వేదాంత ప్రమాణముచేత సత్వరజస్తమో గుణాత్మకమగు దేహము తాను కాదని, తాను నిర్గుణ పరబ్రహ్మయను జ్ఞానము ఏర్పడును. అపుడు ప్రకృతి గుణాలు, అవిద్య లీనమైపోవును, నిద్రా, ప్రలయములవలె మరల మిగిలియుండవు. గుణాలు, అజ్ఞానము పూర్తిగా నశించును. జ్ఞానానికి నిర్గుణత్వము వలన గుణముల కార్యమగు సూక్ష్మశరీరము, లింగ శరీరము నశించి లింగభంగమగును. ఏ వాసనలు ఉండవు,మరల దుఃఖము సంభవించదు, పునరావృత్తియుండదు. స్థూల సూక్ష్మ శరీరములు నశించుటచే శుద్ధ బుద్ధ ముక్త స్వరూపమగు ఆత్మానుభవము కలుగును. ఆత్మ ఆనందస్వరూపుడు కనుక అచట శోకమునకు ప్రసక్తియే లేదు అట్లు అర్జునుడు బ్రహ్మజ్ఞాన సంపన్నుడై దానిచే శోకరహితుడు జీవన్ముక్తుడాయెను. జగత్తు వేరు తాను వేరు అను భేద బుద్ధితో కలుగు సంశయములన్ని పటాపంచలైన అర్జునుడు పునర్జన్మలేని జ్ఞానిగా మారెను.(31)

32. శ్లో. నిశమ్య భగవన్మార్గం
సంస్థాం యదుకులస్య చ ।
స్వఃపథాయ మతిం చక్రే
నిభృతాత్మా యుధిష్ఠిరః ॥

టీ:- నిశమ్యేతి. భగవతో మార్గమాలక్ష్య యదుకులస్య సంస్థాం నాశం శ్రుత్వా, నారదోక్తంచానుస్మృత్య. స్వః పథాయ స్వర్గమార్గాయ నిభృతాత్మానిశ్చలచిత్తః నియమితాంతఃకరణ ఇత్యర్థః.(32)

ధర్మరాజు కూడ శ్రీకృష్ణుడు అవతారమును చాలించుటను, యాదవకులము నశించుటను, నారదుడు చెప్పిన మాటలను స్మరించుకొని నిశ్చలచిత్తుడై స్వర్గ మార్గమును అనుసరించుటకు నిర్ణయించుకొని, దేహమును చాలించ (విడువ) దలచెను.(32)

33.శ్లో. పృథాప్యనుశ్రుత్య ధనంజయోదితం
నాశం యదూనాం భగవద్గతిం చ తామ్ ।
ఏకాంతభక్త్యా భగవత్యధోక్షజే
నివేశితాత్మోపరరామ సంసృతేః ॥

టీ:- పృథేతి, తాం దుర్విజ్ఞేయాం. వక్ష్యతి. ఏకాదశే శ్లో. "సౌదామిన్యాయథాకాశే యాంత్యా హిత్వాభ్రమండలమ్, గతిర్నలక్ష్యతేమర్త్యైస్తథాకృష్ణస్యదైవతై"రితి. ఏకాంతభక్త్యా అవ్యభిచరితభక్త్యా, సంసృతేరు పరరామ జీవన్ముక్తా బభూవ. దేహం జహావితి వా.(33)

పృథాదేవి( కుంతీదేవి ) కూడ అర్జునుడు చెప్పిన యాదవ నాశనాన్ని, భగవన్మార్గమును విని, ఏకాంతభక్తితో శ్రీకృష్ణ భగవానునియందు తన ఆత్మను నిలిపి, సంసారబంధమును తొలగించుకొని, జీవన్ముక్తురాలై దేహమును చాలించెను (వదలెను). దేవతలకు కూడా తెలియరానటు వంటి దివ్య గమనము భగవానునిది. మేఘాలను వదలి ఆకాశమార్గమున ప్రయాణిస్తున్న మెఱుపుతీగల గమనమును మానవులు గుర్తించనట్లు, దైవగతి తెలియరాదని భావము.(33)

34. శ్లో. యయాऽహరద్భువో భారం
తాం తనుం విజహావజః ।
కంటకం కంటకేనేవ
ద్వయం చాపీశితుస్సమమ్ ॥

టీ:- తదేవముక్తమపి యాదవేభ్యో భగవతో వైలక్షణ్యమబుధ్వా తత్సామ్యం వదతో మందమతీన్ ప్రతి వైలక్షణ్యం స్పష్టయతి -ద్వాభ్యాం. యయేతి. యయా యాదవరూపయా తన్వా భువో భారం కంటకేన కంటకమివ కంటకోద్ధరణసాధనీభూతం కంటకమివాహరత్ యాదవతనుర్భూభారతనుశ్చేతిద్వయమపీశ్వరస్యసంహార్యత్వేన సమమేవ.(34)

ఈ విధముగా చెప్పబడినను, యాదవులకంటే భగవానుడగు కృష్ణుడు విలక్షణుడని తెలియక, ఆ యాదవులతో సామ్యము చెప్పే మందమతులకు తెలియునట్లు పరమాత్మ లక్షణాన్ని రెండు శ్లోకాలతో స్పష్టం చేస్తున్నాడు. పుట్టుకలేని కృష్ణుడు కృష్ణావతారముతో భూ భారాన్ని తొలగించి అట్టి శరీరాన్ని వదలిపెట్టెను. ముల్లుతో ముల్లు తీసి ఆ ముల్లును పారవేసినట్లు పరమేశ్వరుడగు కృష్ణునికి యాదవ శరీరము, భూ భారశరీరములును సమానమే భూమికి భారమగు శరీరము, భూ భారాన్ని తగ్గించిన శరీరము రెండును సమానమే.(34)

35. శ్లో. యథా మత్స్యాదిరూపాణి
ధత్తే జహ్యాద్యథా నటః ।
భూభారః క్షపితో యేన
జహౌ తచ్చ కలేబరమ్ ॥

టీ:- శ్రీకృష్ణమూర్తేర్విశేషమాహ-యథేతి. తాన్యపి యథా ధత్తే జహాతి చ.తదాహ-యథా నటో నిజరూపేణస్థిత ఏవ రూపాంతరాణి ధత్తే

శ్రీకృష్ణుని విశేషాన్ని చెపుతున్నాడు 'యథా' అని. లోకకల్యాణము కొఱకు భగవానుడు మత్స్య, కూర్మాద్యవతారములు ధరించి తన పని ముగిసిన పిమ్మట వానిని త్యజించినట్లు, నటుడు వేషము ధరించి, నటన పిమ్మట ఆ వేషమును వదలి నిజరూపమును పొందునట్లు, శ్రీకృష్ణుడు ఏ శరీరముతో భూభారాన్ని తగ్గించెనో ఆ శరీరాన్ని కూడా వదలి అంతర్ధానమాయెను.(35)

అంతర్ధత్తే చ తథా యేన కళేబరేణ క్షపితః, తదపికళేబరం జహౌ అంతర్దధావిత్యర్థః.(35)

36. శ్లో. యదా ముకుందో భగవానిమాం మహీం
జహౌ స్వతన్వా శ్రవణీయసత్కథః ।
తదాహరేవాప్రతిబుద్ధ చేతసామ్
అధర్మహేతుః కలిరన్వవర్తత ॥

ధర్మరాజు స్వర్గానికి వెళ్ళాడని తెల్పుతూ కలి ప్రవేశాన్ని చెపుతున్నాడు 'యదా' అని. వినదగిన మంచి కథలుకల కృష్ణుని శరీరము ఏ రోజైతే ఈ భూమిని వదలి వెళ్ళెనో, అదేరోజు అవివేకుల మనస్సులలో అధర్మాన్ని ప్రేరేపించు కలి ప్రవేశించెను. పూర్వము ఒక అంశ మాత్రముగా ఉన్న కలి పెరగసాగెను. (తదాహః అనుచోట ప్రథమావిభక్తి అహన్ పదానికి సప్తమ్యర్థము. అనగా ఆ అహస్సుయందే ఆ దినముననే అని అర్థము చెప్పాలి. అచట సప్తమీ విభక్తి లోపించినది ఇది ఆర్షము.) (36)

టీ:- యుధిష్ఠిరస్య స్వర్గారోహణప్రసంగాయ కలిప్రవేశమాహ- యదేతి. స్వతన్వా స్వదన్వా జహౌ స్వీయతనోరేవ వైకంటరోహోత్తదా యదహస్తస్మిన్నేవాహనీతి లుప్తస ప్తమ్యంతం పదం. అప్రతిబుద్ధ చేతసాం నావిష్టచిత్తానాం వివేకినాం తు సప్రభురిత్యుక్తం. అన్వవర్తతేతి పూర్వమేవాంశేన ప్రవిష్టస్య స్వేన రూపేణానువృత్తిరుక్తా.(36)

37. శ్లో. యుధిష్ఠిరస్తత్పరిసర్పణం బుధః
పురే చ రాష్ట్రే చ గృహే తదాత్మని ।
విభావ్య లోభానృతజిహ్మహింసనా
ద్యధర్మచక్రం గమనాయ పర్యధాత్ ॥

బుద్ధిమంతుడగు ధర్మరాజు, కూడా తన పట్టణమున, గృహమున, తనయందు, లోభము, అసత్యము, కపటము, హింస మొదలగు అధర్మములతోకూడిన కలి ప్రవేశమును గమనించి దేహమును విడిచి వెళ్ళవలెనని నిశ్చయించుకొనెను.(37)

టీ:- యుధిష్ఠిర ఇతి. ఆత్మని మనసిచ. తస్య కలేః పరిస్పరణం ప్రసారణం వీలోక్య. కథంభూతం? లోభాద్యధర్మచక్రం యస్మిన్ జింహం కౌటిల్యం. పర్యధాత్ తదుచితం పరిధానమకరోత్.(37)

38. శ్లో. స్వరాట్ పౌత్రం వినయినమ్
ఆత్మనస్సుసమం గుణైః
తోయనీవ్యాః పతిం భూమేః
అభ్యషించద్గజాహ్వయే ॥

ఆ ధర్మరాజు, సుగుణములలో తన సమానుడు, వినయ విధేయతలుగల తన పౌత్రుడగు పరీక్షిత్తును, హస్తినాపురమున సముద్రమే వస్త్రముగాగల భూమికి భర్తగా అభిషేకించెను. పరీక్షిత్తుకు పట్టాభిషేకము గావించెను.(38)

టీ:- స్వరాడితి. ఆత్మనస్స్వస్య గుణైః సుసమం స్వేనాత్యంతసదృశం, నియతం. నియమవంతం, తోయం సర్వతః స్థితం. సముద్రోదకమేవ నీవీ పరిధానవిశేషో యస్యాస్తస్యాః భూమేః పతిత్వేనాభిషిక్తవాన్.(38)

39. శ్లో. మధురాయాం తథా వజ్రం
శూరసేనపతిం తతః ।
ప్రాజాపత్యాం నిరూప్యేష్టిమ్ ।
అగ్నీనపిబదీశ్వరః ॥

అదే విధముగా మధురానగరమునకు వజ్రుడను వానిని, శూరసేనదేశాధిపతిగా అనిరుద్ధుని పుత్రుని అభిషేకించి, ప్రాజాపత్యేష్టి యజ్ఞమును గావించి ధర్మరాజు అగ్నులను ఆత్మారోపణము గావించుకొనెను.(39)

టీ:- మధురాయామితి. వజ్రం అనురుద్యస్య పుత్రం. ప్రాజాపత్యేష్టిం నిరూప్యకృత్వేత్యర్థః. అపిబత్ ఆత్మన్యారోపయామాస. ఈశ్వరస్సమర్థః (39)

40. శ్లో. విసృజ్య తత్ర తత్సర్వం
దుకూలవలయాదికమ్ ।
నిర్మమో నిరహంకారః
సంఛిన్నాశేషబంధనః ॥

పట్టు పీతాంబరాలను కటక హారాదులన్నింటిని వదిలిపెట్టి, అహంకార మమకారాలు లేనివాడై, సమస్త సంసార బంధాలను త్రెంచుకొని, పరలోక ప్రయాణము గావించనెంచెను.(40)

టీ:- విసృజ్యేతి. సంఛిన్నాన్యశేషాని బంధనాని ఉపాధయో యేన. (40)

41. శ్లో. వాచం జుహావ మనసి
తత్ప్రాణ ఇతరే చ తమ్ ।
మృత్యావపానం సోత్సర్గం
తం పంచత్వే హ్యజోహవీత్ ॥

ధర్మజుడు సమస్త బంధనాలను త్రెంచుకొని చిత్తము పరబ్రహ్మాయందు లగ్నముచేసినాడని రెండు శ్లోకాలతో చెపుతున్నాడు. ఇంద్రియాలన్నింటికిని మనస్సు ముఖ్యము కాబట్టి సమస్తేంద్రియములను మనస్సులో లీనం చేశాడు ధర్మజుడు. అది ప్రాణాధీనము కావున పంచ ప్రాణాలను అపానమునందు లీనము చేసినాడు. దానితో ఆకర్షింపబడినందున, అపానము యొక్క వ్యాపారము శరీర మాలిన్యమును విడుచుట, దానితో కూడిన అపానాన్ని మృత్యువునందు అనగా దాని అధిష్ఠాన దేవతయందులీనము చేసినాడు. దానితో వాగింద్రియాలకు ఆయా కర్మలతో కలయికను ఊహించి. వాటిని కూడా లీనము చేసినాడు. ఆ మృత్యువును పంచత్వమున అనగా పంచభూతముల ఐక్యమున లీనము చేసినాడు.

టీ:- తదేవ దర్శయతి-ద్వాభ్యాం. వాచమితి. వాచమిత్యుపలక్షణం. సర్వేంద్రియాణి మనసి ప్రవిలాపితవానిత్యర్థః. తచ్చ మనః ప్రాణే. ప్రాణాధీనవృత్తిత్వాత్తం ప్రాణమితరే ఇతరస్మిన్ అపానే. అపానే నాకర్షణాత్. అపానవ్యాపార ఉత్సర్గః. తత్సహితం అపానం మృత్యౌ. తదధిష్ఠానదేవతాయాం. అనేనైవ వాగాదీనామపి తత్తత్కర్మసాహిత్యం జ్ఞేయం. తం మృత్యం పంచత్వే పంచభూతానామైక్యే దేహే. దేహస్యైవ

మృత్యుర్నాత్మన ఇతి విభావితవానిత్యర్థః. అజోహవీదితి యజ్లుగంతా ల్లుజిరూపం.(41)

దేహమునందు దేహమునకే మృత్యువు కాని ఆత్మకు కాదని అనుభవించినాడు. (అజోహవీత్ అనునది యజ్లుగన్త లుజ్ రూపము.) (41)

42. శ్లో. త్రిత్వే హుత్వాథ పంచత్వం
తచ్చైకత్వేఽజుహోన్మునిః ।
సర్వమాత్మన్యజుహవీద్
బ్రహ్మణ్యాత్మానమవ్యయే ॥

టీ:- త్రిత్వ ఇతి త్రిత్వే గుణత్రయే. తచ్చత్రిత్వమేకత్వమేకత్వే అవిద్యాయం సర్వం సర్వారోపహేతుమవిద్యామాత్మని జీవే. అజుహవి దిత్యార్షం. ఏవం త్రిత్వాదిభిస్సమ్యక్ శోధితం ఆత్మానం జీవాత్మనాం బ్రహ్మణి అవ్యయే. కూటస్థే న తు తస్యాన్యత్ర లయ ఇత్యర్థః.(42),

దేహమును (పంచత్వమును) సత్త్వరజస్తమస్సులను మూడు గుణాలయందు, ఆ మూడు గుణాలను అవిద్యారూప ప్రకృతియందు (ఏకత్వమందు), ఆ అవిద్యను అన్నింటిని ఆరోపించుటకు కారణమైన ఆత్మయందు ( జీవునిలో ) ధర్మజుడు లయము చేసెను. ఇట్లు శోధింపబడిన జీవాత్మను నాశరహితుడు, మూలరూపుడు కూటస్థుడగు పరబ్రహ్మమున లయముచేసి, తద్రూపమున ధర్మజుడు నిర్వికల్పుడుగా నుండి దేహత్యాగమునకు సిద్ధపడెను. ( ఇచట హుధాతువు లుజ్ రూపము అజోహవీత్ అని ఉంటుంది కాని మూలమున అజుహవీత్ అను ప్రయోగము ఆర్షము.) (42)

43. శ్లో. చీరవాసా నిరాహారో
బద్ధవాఙ్ముక్తమూర్ధజః ।
దర్శయన్నాత్మనో రూపం
జడోన్మత్తపిశాచవత్ ॥

ఈ విధముగా ఆత్మ సంబంధ విషయాలను చెప్పి,'చీరవాసా' అని రెండు శ్లోకాలతో ధర్మరాజు యొక్క బాహ్యాస్థితిని తెలియచేస్తున్నాడు. ధర్మరాజు నారవస్త్రాలను ధరించి, ఆహారమును పరిత్యజించి, మౌనముగా ఉండి, జుట్టు విరబోసుకుని జడునివలె,

టీ:- తదేవమాత్మప్రతిపత్తిముక్త్వా బాహ్యస్థితిమాహ - ద్వాభ్యాం. చీరవాసాఇతి. బద్ధవాక్ మౌనీ. (43)

పిచ్చివానివలె , పిశాచము పట్టినవానివలె తన రూపాన్ని ఇతరులకు చూపిస్తూ వెడలెను. (ఉత్తర శ్లోకముతో అన్వయము.) (43)

44. శ్లో. అనవేక్షమాణో నిరగాత్
అశృణ్వన్ బధిరో యథా ।
ఉదీచీం ప్రవివేశాశాం
గతపూర్వాం మహాత్మభిః ।
హృది బ్రహ్మపరం ధ్యాయ
న్నావర్తేత యతో గతః ॥

టీ:- అనవేక్షమాణ ఇతి. అనవేక్షమాణః అనుజాదిషు ప్రతీక్షామ కుర్వన్. ఆశాం దిశం. మహాత్మభిః విదురధృతరాష్ట్రాదిభిఃగతపూర్వాం పూర్వం ప్రవిష్టాం. మహాత్మభిర్వివేకవద్భిః యతో యాం దిశం గతః. పునర్నావర్తేత.(44)

తమ్ముల కొరకు కూడా ఎదురుచూడక చెవిటి వాని వలె ఏ శబ్దాలను వినక, వివేకముగల తన పూర్వులు వెళ్ళిన ఉత్తరదిక్కువైపు వెళ్ళెను. నిర్గుణ పరబ్రహ్మను తన హృదయమున ధ్యానిస్తూ ఏ దిక్కు వెడలితే మరల రావడం (పునరావృత్తి) ఉండదో అటువైపు అనగా పరంధామమువైపు వెళ్ళెను.(44)

45. శ్లో. సర్వే తమను నిర్జగ్ముః
భ్రాతరః కృతనిశ్చయాః ।
కలినాఽధర్మమిత్రేణ
దృష్ట్వా స్పృష్టాః ప్రజా భువి ॥

అధర్మానికి దగ్గరి స్నేహితుడగు కలిపురుషుని చేత భూలోక ప్రజలందరు స్పృశింపబడగా ప్రభావితులు కాగా ధర్మజుని తమ్ములందరును ఒకే నిశ్చయముతో అన్నగారు వెళ్ళిన దిశవైపునకే, అదే విధముగా అనుసరించి వెళ్ళిరి. (45)

టీ :- అధర్మో మిత్రం యస్య తేన.(45)

46. శ్లో. తే సాధుకృతసర్వార్థాః
జ్ఞాత్వాऽऽత్యంతికమాత్మనః ।
మనసా ధారయామాసుః
వైకుంఠచరణాంబుజమ్ ॥

టీ:- సాధుకృతాస్సర్వే అర్థాః ధర్మాదయో యైః. అత ఏవ వైకుంఠస్య చరణాంబుజమేవ ఆత్యంతికం శరణం జ్ఞాత్వా. (46)

వారందరు ధర్మాది పురుషార్థాలను ఉత్తమముగా ఆచరించి, చివరికి ఆశ్రయించదగినవి విష్ణుమూర్తి చరణకమలాలే అని తెలిసికొని, తమ మనస్సులో విష్ణువు పాదకమలాన్ని ధ్యానించిరి.(46)

47. శ్లో. తద్ధ్యానోద్రిక్తయా భక్త్యా
విశుద్ధధిషణాః పరే ।
తస్మిన్నారాయణ పదే
ఏకాంతమతయో గతిమ్ ॥

48. శ్లో. అవాపుర్దురవాపాం తే
అసద్భిర్విషయాత్మభిః ।
విధూతకల్మషా స్థానే
విరజేనాత్మనైవ హి ॥

ఆ విష్ణుపాదములను ధ్యానించుటచే ప్రబలిన భక్తి కలిగి, నిర్మలమగు మనస్సులు కలవారై, ఉత్తమమగు నారాయణుని పాదములందు నిశ్చలమైనస్థితికలవారై, పాపములేనివారై, విషయవాసనలుకల అసజ్జనులకు పొందశక్యముగాని ఆత్మ స్వస్వరూపగతిని పొందిరి. షోడశ కలాత్మకమగు లింగశరీరము భంగముకాగా, పరమాత్మైక్యమును జెందిరి.(47,48)

టీ:- విధూతేతి కథంభూతే పదే? విధూతకల్మషాణాం యోగినాం అస్థానం వాసస్థానం యత్, తస్మిన్విరజేన ఆత్మనైవ అవాపుః యయుః న తు షోడశకళేన లింగేన. ఆస్థానమితి పాఠే గతేర్వావిశేషణం విరజేనాత్మనైవ ఆస్థానరూపాం గతిం తే విధూతకల్మషాః ప్రాపురితి. (47,48)

49. శ్లో. విదురోఽపి పరిత్యజ్య
ప్రభాసే దేహమాత్మవాన్ ।
కృష్ణావేశేన తచ్చిత్తః
పితృభిస్స్వక్షయం యయౌ ॥

ఆత్మజ్ఞానముగల విదురుడును తీర్థయాత్రలు చేస్తూ, ప్రభాసక్షేత్రముచేరి, కృష్ణునియందు మనస్సునుంచి దేహమును వదిలి పెట్టెను. ఇతనిని తీసుకపోవడానికి అచటకు వచ్చిన పితృదేవతలతో కలిసి తన పితృస్థానమునకు వెళ్ళెను. (49)

టీ :- ఆత్మవాన్ జ్ఞానవాన్. విధురోపి తీర్థాన్యటన్ ప్రభాసే. కృష్ణేతి. కృష్ణవేశేన శ్రీకృష్ణే చిత్తమావేశ్య దేహం త్యక్త్వా తచ్చిత్తస్సన్ తథానీం నేతుమాగతైః పితృభిస్సహ స్వక్షయం స్వాధికారస్థానం యయౌ. (49)

50. శ్లో. ద్రౌపదీ చ తదాజ్ఞాయ
పతీనామనపేక్షతామ్ ।
వాసుదేవే భగవతి
హ్యేకాంతమతిరాప తమ్ ॥

తన పతులు వైరాగ్యము పొందుటను, విషయవాంఛలయందు విరక్తులగుటను గమనించిన ద్రౌపది కూడా భగవానుడగు వాసుదేవుని యందు నిశ్చలముగా బుద్ధిని నిలిపి ఆ భగవంతునిలో లీనమాయెను. (50)

టీ:- ఆత్మానాం ప్రతి అనపేక్షతాం తదా జ్ఞాత్వా ఆప ప్రాప.(50)

51. శ్లో. యః శ్రద్ధయైతద్భగవత్ప్రియాణాం
పాండోస్సుతానామితి సంప్రయాణమ్ ।
శృణోత్యలం స్వస్త్యయనం పవిత్రం
లబ్ధ్వా హరౌ భక్తిముపైతి సిద్ధిమ్ ॥

టీ:- యదితి. ఏవం యత్సంప్రయాణం భగవతోదివ్యపదప్రాప్తిం అలం అతిశయేన స్వస్త్యయనం మంళాళస్పదం అలంపవిత్రంచ.(51)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం**
**సంహితాయాం ప్రథమేస్కంధే భావార్థదీపికాయాం**
**పంచదశోధ్యాయః**

ఎవడైతే ఈ శ్రీకృష్ణునికి మిక్కిలి ప్రియులగు పాండవుల స్వర్గారోహణ ప్రయాణమును శ్రద్ధతో వినునో, అతడు పవిత్రమైన, మిక్కిలి క్షేమాస్పదమగు స్థానమును పొందును. అతనికి విష్ణుభక్తి కలిగి సిద్ధి కూడా కలుగును.(51)

**శ్రీమద్భాగవతము యొక్క ప్రథమస్కంధ**
**పంచదశాధ్యాయమునకు శ్రీధరీయవ్యాఖ్యానుసార**
**ఆంధ్రానువాదము ముగిసినది.**

**షోడశాఽధ్యాయః**

**సూత ఉవాచ.**

1. శ్లో. తతః పరీక్షిద్ద్విజవర్య శిక్షయా ।
మహీం మహాభాగవతశ్శశాస హ ।
యథా హి సూత్యామభిజాతకోవిదాః ।
సమాదిశన్విప్ర మహాగుణస్తథా ॥

టీ :- శ్లో. తతశ్చషోడశే భూమిధర్మ యోః, కలిఖిన్నయోః సంవాదో వర్ణ్యతే ప్రాప్తిః పాలకస్య పరీక్షితః. తత ఇతి. ద్విజవర్యాణాం శిక్షయా. సూత్యాం జన్మని. అభిజాతకోవిదాః జాతకర్మవిదః హేవిప్ర. మహాన్తో గుణాః యస్మిన్.(1)

2. శ్లో. స ఉత్తరస్య తనయాం
ఉపమేమ ఇరావతీమ్ ।
జనమేజయాదీంశ్చతురః
తస్యాముత్పాదయత్సుతాన్ ॥

టీ:- స ఇతి. జనమేజయాదీనిత్యత్ర అక్షరదిక్యం ఛాందసం. ఉత్పాదయత్ అడాగమాభావశ్చార్షః.(2)

**షోడశాధ్యాయము**

**సూతుడిట్లు చెప్పదొడగెను.**

ఈ షోడశాధ్యాయమున భూదేవి, ధర్మదేవతల యొక్క కలికాలపు బాధలను సంవాద రూపమున వర్ణించుచున్నాడు. ఓ శౌనకా ! మహాభాగవతోత్తముడగు పరీక్షిన్మహారాజు బ్రాహణోత్తములు చెప్పిన ప్రకారము భూమిని పరిపాలించుచుండెను. జాతకము తెలిసినవారు తన జన్మ సమయమున తెలిపిన విధముగా గొప్ప గుణములు కలవాడై పాలించెను.(1)

ఆ పరీక్షిన్మహారాజు ఉత్తరుని కుమార్తెయగు ఇరావతిని పెండ్లి చేసుకొని, జనమేజయుడు మున్నగు నలుగురు కొడుకులను కనెను. (ఇచట జనమేజయాదీన్ చతురః అను పాదమున ఒక అక్షరము ఎక్కువ అయినది. అనుష్టుప్ శ్లోకమున ప్రతి పాదానికి ఎనిమిది అక్షరాలే ఉండాలి. కాని ఇట తొమ్మిది అక్షరములు ఉండుట ఆర్షమని ఛాందసమని గ్రహించవలెను. ఉత్పాదయన్ అను పాఠమున హేత్వర్థమున శతృప్రత్యయము అప్పుడు కుమారులను కనుటకు ఇరావతిని పెండ్లి చేసికొనెనని వాక్యార్థము.(2)

3. శ్లో. ఆజహారాశ్వమేధాన్ త్రీన్
గంగాయాం భూరి దక్షిణాన్ ।
శారద్వతం గురుం కృత్వా
దేవా యత్రాక్షి గోచరాః ॥

టీ:- ఆజహారేతి. ఆజహార కృతవానిత్యర్థః. శారద్వతం కృపం. యత్రయేష్వశ్వమేధేషు.(3)

కృపాచార్యుని గురువుగా చేసికొని, పరీక్షిన్మహారాజు గంగానదీ తీరమున మూడు అశ్వమేధ యాగములను గావించి, ప్రభూతమగు దక్షిణయొసగెను. ఆ అశ్వమేధయాగములో దేవతలు కనిపించిరి.(3)

4. శ్లో. నిజగ్రాహౌజసా వీరః
కలిం దిగ్విజయే క్వచిత్ ।
నృపలింగధరం శూద్రం
ఘ్నంతం గోమిథునం పదా ॥

టీ:- నిజగ్రాహేతి. నిజగ్రాహ నిగృహీతవాన్. కలిమేవ నిర్దిశతి - నృపేతి. నృపలింగధరం రాజవేషధారిణం.(4)

ఓ శౌనకా ! పరీక్షిత్తు తన పరాక్రమముతో చేస్తున్న దిగ్విజయయాత్రలో ఒక చోట రాజ చిహ్నాలతో నొప్పు శూద్రుడు (కలి) ఎద్దును, ఆవును కాలితో తన్నడం చూచి వానిని నిగ్రహించెను. (4)

**శౌనక ఉవాచ.**

5. శ్లో. కస్య హేతోర్నిజగ్రాహ
కలిం దిగ్విజయే నృప ।
నృదేవరూపధృక్ శూద్రః
కోఽసౌ గాం యః పదాహనత్ ॥

టీ:- కస్యేతి. కస్య హేతోరిత్యర్థః. అయమర్థః కలిం కస్మాద్ధేతోః కేవలం నిజగ్రాహ, న తు హతవాన్. యతోఽసౌ శూద్రః కః అతికుత్సితః. యో గాం పదాఽహనదహన్నితి.(5)

**శౌనకుడు అడుగుచున్నాడు.**

దిగ్విజయుడగు ఆ పరీక్షిన్మహారాజు కలిని చంపక నిగ్రహించడానికి కారణమేమి? ఆవును కాలితో తన్నిన రాజ చిహ్నములు కలిగిన ఈ శూద్రుడు ఎవడు ? (5)

6. శ్లో. తత్కథ్యతాం మహాభాగ
యది కృష్ణకథాఽఽశ్రయమ్ ।
అథవాఽస్య పదాంభోజ
మకరందలిహాం సతామ్ ॥

టీ:- తదితి. తత్ కలినిగ్రహరూపం కర్మ. అస్య విష్ణోః పదాంభోజయోః. మకరందః, తం లిహంతి ఆస్వాదయంతి యే, తేషాం సతాం. మహతాం వా. కథాశ్రయమితి సమాసాన్నిష్కృష్టస్యా నుషంగః. తర్హి కథ్యతాం.(6)

ఓ మహాత్మా సూతా ! ఈ వృత్తాంతము శ్రీకృష్ణుని కథను ఆశ్రయించినదైతే చెప్పండి. ఎందుకంటే ఆ కృష్ణుని పాదకమలముల మకరందాన్ని ఆస్వాదింపచేసే సత్కథలే శ్రేష్ఠమైనవి. సత్పురుషులకు ఇష్టమైనవి అగును. (6)

7. శ్లో. కిమన్యైరసదాలాపైః
ఆయుషో యదసద్వ్యయః ।
క్షుద్రాయుషాం నృణామ్ అంగ
మర్త్యానామృతమిచ్ఛతామ్ ॥

టీ:- కిమితి. నో చేత్, కిమన్యైరసద్భిః ఆలాపైర్యత్ యైరాయుషో వృథా క్షయః. అస్మాకమయం సత్రప్రయత్నోఽపి హరికథామృతపానార్థ ఏవేత్యాహ - సార్ధద్వాభ్యాం. క్షుద్రమల్పమాయుర్యేషాం తైరతో మర్త్యానాం మరణవతాం తథాపి, ఋతం సత్యం. మోక్షమిచ్ఛతాం.(7)

భగవత్కథలుగాక ఆయుష్యమును దుర్వినియోగపఱచు ఇతరములగు చెడ్డ మాటలు ఎందుకు? మానవుల ఆయుర్దాయము అల్పము కనుక మోక్షముకోరు వారికి హరి కథయే ఆశ్రయము ఇతరములతో పనిలేదు.(7)

8. శ్లో. ఇహోపహూతో భగవాన్
మృత్యుశ్శామిత్ర కర్మణి ।
న కశ్చిన్మ్రియతే తావద్
యావదాస్త ఇహాంతకః ॥

టీ:- ఇహేతి. యో మృత్యుః స ఇహసత్రే. శమితురిదం శామిత్రం కర్మ పశుహింసనం. తదర్థముపహూతః.(8)

పశువులను విశసనముచేయు ఈ యజ్ఞము కొరకు పూజ్యుడు మృత్యుదేవత ఆహ్వానింపబడి యున్నాడు. ఈ అంతకుడు ఇచట ఉన్నంత వరకు ఇక్కడున్న వారెవ్వరును చావరు.(8)

9. శ్లో. ఏతదర్థం హి భగవాన్
ఆహూతః పరమర్షిభిః ।
అహో నృలోకే పీయేత
హరిలీలామృతం వచః ॥

టీ:- ఏతదితి. తతః కిమత ఆహ-న కశ్చిదిత్యాది. తతోஉపి కిమత ఆహ - అహోనృలోకేహరిలీలామృతం వచః పీయేతేత్యేతదర్థం హరిలీలైవామృతం యస్మిన్ తం. తత్కథాప్రచురమిత్యర్థః. (9)

విశేషము ఏమి? అన్న దానికి చెపుతున్నాడు. యమధర్మరాజును ఇచటికి ఆహ్వానించుట వలన మానవులకు మృత్యుభయము తొలగి హరిలీలా మృతమును గ్రోలే అవకాశము లభించును.(9)

10. శ్లో. మందస్య మందప్రజ్ఞస్య
వయో మందాయుషస్యవై ।
నిద్రయా హ్రియతే నక్తం
దివా చ వ్యర్థకర్మభిః ॥

టీ:- తదభావే తస్య వృథైవ జీవనమిత్యాహ-మందస్యేతి. మందస్య అలసస్య. నక్తంరాత్రౌ. యద్వయః ఆయుః. తన్నిద్రయాదివా హ్రియతేఅహ్నిచ. యద్వయః. తద్వ్యర్థకర్మభిః అపహ్రియతే.(10)

భగవత్కథ వినని వాని జీవితము వ్యర్థమనుచున్నాడు. మానవుడు జడుడు, మందబుద్ధిగలవాడు, తక్కువ ఆయుర్దాయముగలవాడు ఆతని వయస్సు రాత్రి నిద్రతో, పగలు అనవసరమగు వ్యర్థకర్మలతో అపహరింపబడును.(10)

**సూత ఉవాచ.**

11. శ్లో. యదా పరీక్షిత్కురుజాంగలే వసన్
కలిం ప్రవిష్టం నిజచక్రవర్తితే ।
నిశమ్య వార్తామనతిప్రియాం తతః ।
శరాసనం సంయుగశౌండిరాదధే ॥

12. శ్లో. స్వలంకృతశ్యామతురంగయోజితం
రథం మృగేంద్రధ్వజమాస్థితః పురాత్ ।
వృతో రథాశ్వద్విపపత్తి యుక్తయా
స్వసేనయా దిగ్విజయాయ నిర్గతః ॥

టీ:- తత్ర తావత్కలినిగ్రహప్రసంగమాహ-యదేతి. యదా నిజచక్రవర్తితే స్వసేన యాపాలితే దేశేకలిం ప్రవిష్టం శుశ్రావ. తదా తాం అనతిప్రియాం వార్తాం కించిత్ప్రియాంచ. కలిమితి యుద్ధే కౌతుకసంపత్తేః. నిశమ్య తతః శరాసనం దుష్టనిగ్రహార్థం ఆదధే. సంయుగేశౌండః యుద్ధేప్రగల్భః,పాఠాంతరే, యుద్ధేశౌరిః కృష్ణతుల్యః (11,12)

ఇక కలి పురుషుని నిగ్రహించిన విషయమును సూతుడు చెప్పుచున్నాడు. పరీక్షిత్ చక్రవర్తి తన దేశములో కలి ప్రవేశించినాడను, మిక్కిలి అప్రియము, యుద్ధ ప్రియత్వముచే కొంచెము ప్రియమే అయిన వార్తను వినెనో,అప్పుడాతడు వెంటనే దుష్టనిగ్రహం కొఱకు ధనుస్సును ధరించెను. ప్రియము ఏలయన ఆ రాజు యుద్ధమున అతి నిపుణుడు. సంయుగశౌరి అని పాఠాంతరమున పరీక్షిత్తు యుద్ధమున కృష్ణునితో సమానుడని తెలియును.(11)

బాగా అలంకరింపబడిన నల్లని మంచి వయసులోనున్న (శ్యామాయౌ వనమధ్యస్థా అని నిఘంటువు.తన్వీశ్యామా శిఖరిదశనా అను మేఘసందేశ శ్లోక వ్యాఖ్యలో మల్లినాథసూరి తెల్పినారు.) గుఱ్ఱములు కట్టబడి, సింహధ్వజముతో గూడిన రథమును అధిరోహించిన పరీక్షిత్తు రథాలు, గుఱ్ఱాలు, ఏనుగులు, కాల్బలము అను చతురంగ బలాలతో కూడి తన గ్రామము నుండి దిగ్విజయ యాత్ర కొఱకు బయలుదేరెను.(12)

13. శ్లో. భద్రాశ్వం కేతుమాలం చ
భారతం చోత్తరాన్ కురూన్ ।
కింపురుషాదీని వర్షాణి
విజిత్య జగృహే బలిమ్ ॥

టీ:- భద్రేతి, భద్రాశ్వాదీని పూర్వపశ్చిమదక్షిణోత్తరతస్సముద్రలగ్నాని వర్షాణి. మేరోస్సర్వత ఇళావృతం. తత ఉత్తరతోరమ్యకం హిరణ్మయం చ.దక్షిణతో హరివర్షం కింపురుషం చ. తాని విజిత్య. కింపురుషేత్యత్ర వర్ణాధిక్యమార్షం. బలిం పుష్కల ధన ప్రదానపూర్వికాం సపర్యాం.(13)

సముద్రవలయితములగు భద్రాశ్వ, కేతుమాల, భారత, ఉత్తరకురు దేశాలను, కింపురుషాది దేశములను, జయించి ఆ దేశపు రాజుల నుండి కప్పము గ్రహించెను. మేరుపర్వతము చుట్టున్నది ఇలావృతము. దానికి ఉత్తరమున ఉన్నది రమ్యకము హిరణ్మయమగు దేశము. దక్షిణము వైపు ఉన్నది హరివర్షము కింపురుషము.(13)

14. శ్లో. తత్ర తత్రోపశృణ్వానః
స్వపూర్వేషాం మహాత్మనామ్ ।
ప్రగీయమానం చ యశః
కృష్ణమాహాత్మ్యసూచకమ్ ॥

పరీక్షిత్తు, మార్గ మధ్యమున అందరిచే ఆలపించబడుతున్న తన పూర్వికుల ధర్మరాజాదుల చరిత్రను, కీర్తిని, కృష్ణ ప్రభావమును విని ఆ ప్రజలకు ధన,వస్త్రాదులను బహూకరించెను ( మూడవ శ్లోకముతో అన్వయము.) (14)

15. శ్లో. ఆత్మానం చ పరిత్రాతుమ్
అశ్వత్థామ్నోఽస్త్ర తేజసా ।
స్నేహం చ వృష్ణిపార్థానాం
తేషాం భక్తిం చ కేశవే ॥

అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మశిరోనామక దివ్యాస్త్రము నుండి తాను కాపాడబడుట, యాదవులకు, పాండవులకు గల స్నేహము, అచటి ప్రజలకు కృష్ణుని యందుగల భక్తిని, గుఱించి విని వారికి ధన, వస్త్రాదులనిచ్చెను. ( ముందు శ్లోకముతో అన్వయము.) (15)

16. శ్లో. తేభ్యః పరమసంతుష్టః
ప్రీత్యుజ్జృంభిత లోచనః ।
మహాధనాని వాసాంసి
దదౌ హారాన్మహామనాః ॥

టీ:- తత్రేతి. ప్రగీయమానం యశః ఆదీని శృణ్వన్ తేభ్యోదదావితి తృతీయేనాన్వయః. (14,15,16)

వారి మాటల వలన పరమసంతోషాన్ని పొందిన పరీక్షిత్తు ప్రేమతో విప్పారిన కన్నులు కలవాడై, గొప్ప మనస్సుతో వారికి ధనమును, అమూల్య వస్త్రాదులను, మణి హారాలను ఇచ్చెను. (16)

17. శ్లో. సారథ్యపారిషదసేవనసఖ్యదౌత్య
వీరాసనానుగమనస్తవనప్రణామమ్ ।
స్నిగ్ధేషు పాండుషు జగత్ప్రణతిం చ విష్ణోః
భక్తిం కరోతి నృపతిశ్చరణారవిందే ॥

టీ:- సారథ్యేతి. కించ స్నిగ్ధేషు పాండుషు. పాండవేషు విష్ణోర్యాని సారథ్యాదీని కర్మాణి తాని శృణ్వన్ తదా విష్ణోర్జగత్కర్తృకాం ప్రణతిం చ శృణ్వన్ నృపతిః పరీక్షిత్ విష్ణోశ్చరణారవిందే భక్తిం కరోతి స్మ. సారథ్యాదీని వివేచయతి. సారథ్యం నియంతృత్వం. తత్ర పారిషదం సభాపతిత్వం సేవనం చిత్తానువృత్తిః వీరాసనం రాత్రౌ ఖడ్గహస్తస్య తిష్ఠతో జాగరణం. సేవనం పాండవచోదితకార్యకరణం. స్తవనం వందిమాగధాదివత్ తేషాం వైభవప్రఖ్యానం. (17)

శ్రీమహావిష్ణుస్వరూపుడగు కృష్ణుని విలాసములను, పనులను సారథ్యము చేయుట, ప్రక్కననే ఉండి కాపాడుట, స్నేహము, దౌత్యము చేయుట, స్తుతించుట, నమస్కరించుట మున్నగువానిని వినుచు, ప్రజలయెడ ప్రేమగల పాండవులపట్ల ప్రజలకున్న వినమ్రభావమును గూడా వినుచు, విష్ణు పాదములందు అమితమగు భక్తి కలవాడై రాజ్యము చేయుచుండెను. ఆయన విష్ణువు చేత కాపాడబడిన విష్ణురాతుడు గదా ! విష్ణువుపట్ల కృతజ్ఞుడైయుండెను. (ఇచట పారషదమని రేఫ షకారములను కలుపక పలుకుట ఆర్షము, ఛాందసము.) (17)

18. శ్లో. తస్యైవం వర్తమానస్య
పూర్వేషాం వృత్తిమన్వహమ్ ।
నాతి దూరే కిలాశ్చర్యం
యదాసీత్తన్నిబోధ మే ॥

టీ:- తస్యేతి. పూర్వేషాం వృత్తిమనువర్తమానస్య. నాతిదూరే శీఘ్రమేవ.(18)

పెద్దలు నడచిన నడవడిని అనుసరిస్తూ సాగుతున్న జీవితమును గడుపుతున్న పరీక్షిత్తు ఒకసారి ఒక ఆశ్చర్యకరమైన సంఘటన అతనికి దగ్గరలోనే ఆతడు చూచుచుండగనే సంభవించెను. ఓ శౌనకా ! ఆ సంఘటనను గూర్చి వినుము.(18)

19. శ్లో. ధర్మః పదైకేన చరన్
విచ్ఛాయాముపలభ్య గామ్ ।
పృచ్ఛతి స్మాశ్రువదనాం
వివత్సామివ మాతరమ్ ॥

టీ:- ధర్మ ఇతి. ధర్మోవృషరూపః విచ్ఛాయాం హతప్రభాం గాం గోరూపాం పృథ్వీం. వివత్సాం నష్టాపత్యాం.(19)

ధర్మదేవత ఒంటి కాలితో నడుస్తూ ఉండెను. కన్నీటివల్ల కళావిహీనమైన ముఖము కలిగి, పిల్లలు లేని తల్లి వలె విలపిస్తున్న తల్లి గోమాతను ఇట్లు అడుగుచుండెను. ఈ సంఘటనను పరీక్షిత్తు గమనించెను.(19)

20. శ్లో. కచ్చిద్భద్రేఽనామయమాత్మనస్తే
విచ్ఛాయాసి మ్లాయతేషన్ముఖేన ।
ఆలక్షయే భవతీమంతరాధిం
దూరేబంధుం శోచసి కంచనాంబ ॥

తల్లీ ఓ గోమాతా ! శుభప్రదురాలా ! నీకు కుశలమేనా ? ఆరోగ్యమేనా ? నీకు ఏ రోగమున్నట్లు పైకి కనిపించుట లేదు. అయినను నీలోన గొప్ప బాధననుభవించుచున్నట్లున్నావు. కాంతి విహీనముగా ఉన్నావు. ఆ విషయాన్ని వివర్ణమైన నీ ముఖము ద్వారా తెలియుచున్నది. . ఆ విషయమున కారణము ఏమి? ఓ తల్లీ నీ

టీ:- కచ్చిదితి. తే ఆత్మనోదేహస్య. యద్యపి బహిరామయో న లక్ష్యతే. తథాపి అంతర్మధ్యే ఆధిః పీడా యస్యాస్తాం. త్వామాలక్షయే. కేన యతో విచ్ఛాయాసి, అతః ఈషత్ మ్లాయతా వైవర్ణ్యం భజతా ముఖేన లింగేన. తత్ర కారణాని వికల్పయన్పృచ్ఛతి- దూరేబంధుమిత్యాదిపంచభిః. దూరేస్థితం బంధుం దేశాంతరవర్తినం వత్సం.(20)

బంధువులు ఎవరైనను నీకు దూరమైరా? (దూరేబంధుమను ప్రశ్న మొదలు అనేక ప్రశ్నలను అయిదు శ్లోకాలతో గోరూపమున ఉన్న భూదేవిని ధర్మదేవత అడుగుచున్నది.) (20)

21. శ్లో. పాదైర్న్యూనం శోచసిమైకపాదమ్
ఆత్మానం వా వృషలైర్భోక్ష్యమాణమ్ ।
అహో సురాదీన్ హృతయజ్ఞభాగాన్
ప్రజా ఉతస్విన్మఘవత్యవర్షతి ॥

టీ:- పాదేతి. త్రిభిః పాదైః న్యూనం శూన్యం అతఏవ ఏక పాదం. మా మాం వృషలైః ధర్మశూన్యైః కుత్సితరాజన్యైరిత ఊర్ధ్వం భోక్ష్యమాణం. పుంస్త్వమాత్మన్శబ్దవిశేషణత్వాత్. మంత్రాదిలోపపూర్వకయజ్ఞాద్యనుష్ఠానేన అసురైః హృతాః యజ్ఞభాగాః యేషాం. అథవా యజ్ఞాద్యకరణాత్. (21)

మూడు పాదములు కోల్పోయి ఒకే పాదముతో కుంటుతూ నడుస్తున్న నన్ను గురించి దుఃఖించుచున్నావా ? లేక భవిష్యత్తులో అధర్మ జీవనులగు శూద్రరాజులు నిన్ను పాలింపబోవుచున్నారని దుఃఖించుచున్నావా? లేక మానవులు యజ్ఞములు చేయకుండుటచే హవిర్భాగములు కోల్పోయిన దేవతల గురించి దుఃఖించుచున్నావా? లేక ఇంద్రుడు వర్షించుట లేదని ప్రజల గురించి ఏడ్చుచున్నావా? (ఇచట భోక్ష్యమాణం అని పుంలింగ ద్వితీయానిర్దేశము పృథ్విని సూచించు ఆత్మ శబ్దానికి విశేషణమగుటచే సమర్థనీయమే.)(21)

22. శ్లో. అరక్ష్యమాణాః స్త్రియ ఉర్వి బాలాన్
శోచస్యథాహో పురుషాదైరివార్తాన్ ।
వాచం దేవీం బ్రహ్మకులే కుకర్మణి
అబ్రహ్మణ్యే రాజకులే కులాగ్ర్యాన్ ॥

టీ:- అరక్ష్యమాణా ఇతి. హే ఉర్వి పృథ్వి. భర్తృభిరరక్ష్యమాణా స్త్రియః . పితృభిరరక్ష్యమాణాన్ బాలాన్. ప్రత్యుత తైరేవ పురుషాదైరివ నిర్దయైరార్తాన్ క్లిష్టాన్.వాచం దేవీం సరస్వతీం. కుకర్మణి దురాచారే. స్థితాన్ కులాగ్ర్యాన్ బ్రాహ్మణోత్తమాన్ సేవకాన్.(22)

ఓ భూదేవీ ! భర్తల చేత రక్షింపబడని స్త్రీల గురించి దుఃఖించుచున్నావా? తండ్రులచేత రక్షింపబడక రాక్షసుల చేత బాధ పెట్టబడుచున్నట్లున్న పిల్లలను జూచి ఏడ్చుచున్నావా? దురాచారపరులగు బ్రాహ్మణుల వద్దనున్న సరస్వతిని గూర్చి దుఃఖించుచున్నావా? లేదా బ్రాహ్మణ ద్వేషులు, దుర్మాగులగు రాజులను సేవించుచున్న సద్బ్రాహ్మణుల గురించి ఏడ్చుచున్నావా? (22)

23. శ్లో. కిం క్షత్ర బంధూన్ కలినోపసృష్టాన్ ।
రాష్ట్రాణి వా తైరవరోపితాని ।
ఇతస్తతో వా శయనాసనాన్న
పానవ్యవాయోన్ముఖ జీవలోకమ్ ॥

టీ:- కిమితి. కలినోపసృష్టాన్ వ్యాప్తాన్ అవరోపితాని ఉద్వాసితాని. వ్యవాయో మైథునం. విధినిషేధానాదరేణ సర్వతశ్శయనాదిషూన్ముఖం

కలి ప్రభావముతో అధర్మమార్గమవలంబించు దుర్మార్గులగు రాజుల గురించి ఏడ్చుచున్నావా? లేదా వారు నాశనము చేసి విడిచిపెట్టిన రాజ్యముల గుఱించి దుఃఖించుచున్నావా? లేదా భోజన, పాన, వస్త్ర, స్నాన, మైథున విషయాల్లో విధినిషేధాలు లేక స్వేచ్ఛగా ప్రవర్తించుచున్న మానవులను గుఱించి దుఃఖించుచున్నావా? (23)

ప్రవర్తమానం జీవలోకం వా.(23)

24. శ్లో. యద్వాంబ తే భూరిభరావవతార
కృతావతారస్య హరేర్ధరిత్రి ।
అంతర్హితస్య స్మరతీ విసృష్టా
కర్మాణి నిర్వాణవిలంబితాని ॥

టీ:- యద్వేతి. హే అంబ మాతః ధరిత్రి. తే తవ. యో భూరిభారః తస్యావతరణార్థం.కృవతారస్య కర్మాణిస్మరతీ తేన విసృష్టా సతీ, శోచసి. నిర్వాణం విలంబిత మాశ్రితం స్థితం యేషు తాని. పాఠాంతరే. నిర్వాణం విడంబితముపహసితం యైః. మోక్షాదప్యధిక సుఖానీత్యర్థః .(24)

25. శ్లో. ఇదం మమాచక్ష్వ తవాధిమూలం
వసుంధరే యేన వికర్శితాసి ।
కాలేన వా తే బలినాం బలీయసా
సురార్చితం కిం హృతమంబ సౌభగమ్ ॥

టీ:- ఇదమితి. హే అంబ తే తవ సౌభాగ్యం సౌభాగ్యం కాలేన వా

ఓ భూమాతా? నీ గొప్ప భారమును తగ్గించుటకు, దుష్టశిక్షణ, శిష్టరక్షణ గావించుటకు అవతరించి, నిన్ను విడిచి అంతర్ధానమైన శ్రీకృష్ణుని లీలలను స్మరించి దుఃఖించుచున్నావా? ఆ కృష్ణ లీలలు మోక్షమునకు ఆలంబనములు. ముక్తి కలిగించునవి కదా ( నిర్వాణ విడంబితాని అను పాఠాంతరమున మోక్షాన్ని గూడా అపహసించేవి కృష్ణుని లీలలు. అనగా మోక్షంకన్నా ఎక్కువ ఆనందదాయకమైనవి కృష్ణుని లీలలు అని అర్థము.(24)

ఓ తల్లీ ! నీ చింతకు కారణమేమి ? ఎందువల్ల నీవు ఇంతగా క్రుంగిపోతున్నావో తెల్పుము దేవతలచే పూజింపబడు, ప్రశంసింపబడు నీ సౌభాగ్యము, అదృష్టము, ఆనందమును బలవంతుల కన్నా బలవంతమగు కలికాలము హరించెనా యేమి?(25)

హృతం. (25)

**ధరణ్యువాచ.**

26. శ్లో. భవాన్ హి వేద తత్సర్వమ్ ।
యన్మాం ధర్మానుపృచ్ఛసి ।
చతుర్భిర్వర్తసే యేన ।
పాదైర్లోక సుఖావహైః ॥

టీ:- భవానితి. భవాన్ జానాత్యేవ, తథాపి వక్ష్యామీత్యాహ-యేన హేతుభూతేన. త్వం చతుర్భిః పాదైర్వర్తసే. యత్ర చ సత్యాదయో మహాగుణాః న వియంతి న క్షీయంతే తేన శ్రీనివాసేన రహితం లోకం శోచామీతి షష్ఠేనాన్వయః. (26)

27. శ్లో. సత్యం శౌచం దయా క్షాంతిః
త్యాగస్సంతోష ఆర్జవమ్ ।
శమో దమస్తపస్సామ్యం
తితిక్షోపరతిశ్శ్రుతమ్ ॥

టీ:- సత్యం యథార్థభాషణం. శౌచం శుద్ధత్వం. దయా పరదుఃఖాసహనం. క్షాంతిః. క్రోధప్రాప్తౌ చిత్తసంయమనం. త్యాగః అర్థిషు

**భూదేవి ( గోరూపమున) ఇట్లు పలికెను.**

నాయనా నీకు అన్నియు తెలియును అయినా నన్ను అడిగితివి కావున చెపుతాను వినుము.. నీవు లోకాలకు సుఖమునొసగు నాలుగు పాదాలతోనుండెడివాడవు. సత్యాది గుణములు గల శ్రీహరి నీ నాల్గుపాదాలకు కారణము. ఆ శ్రీనివాసుడు లోకమును వీడెనని దుఃఖించుచున్నాను ? ( ఆరవ శ్లోకముతో అన్వయము.) (26)

సత్యాది భగవద్ గుణములను తెల్పుచున్నారు. సత్యమనగా యథార్థము పలుకుట శౌచము పరిశుద్ధత్వము. దయ అనగా ఇతరుల దుఃఖమును సహించకపోవటము. క్షాంతి అనగా కోపమురాగా చిత్తాన్ని అణుచుకోవడము. త్యాగమనగా యాచకులకు చేయివిడిచి ఎక్కువగా దానమొసగుట. సంతోషమనగా చాలునను బుద్ధి, ఆర్జవమనగా కపటము లేకుండుట. శమమనగా మనోనిగ్రహము. దమమనగా బాహ్యేంద్రియ నిగ్రహము. తపస్సు అనగా స్వధర్మాచరణము సామ్యమనగా ఒకడు మిత్రుడు ఒకడు శత్రువు అను భావము లేకుండుట. తితిక్ష అనగా ఒకడు తప్పు చేసినచో దాన్ని సహించుట

ముక్తహస్తతా. సంతోషః అలంబుద్ధిః. ఆర్జవం అవక్రతా. శమో మనోనైశ్చల్యం. దమః బాహ్యేంద్రియనైశ్చల్యం. తపః స్వధర్మః.సామ్యం అరిమిత్రాద్యభావః. తితిక్షా పరాపరాధసహనం. ఉపరతిః లాభాప్రాప్తావౌదాసీన్యం శ్రుతం శాస్త్రవిచారః.(27)

28. శ్లో. జ్ఞానం విరక్తిరైశ్వర్యం
శౌర్యం తేజో బలం స్మృతిః ।
స్వాతంత్ర్యం కౌశలం క్రాంతిః
ధైర్యమార్జవమేవ చ ॥

టీ:- జ్ఞానమితి. జ్ఞానం ఆత్మవిషయం. విరక్తిర్వైతృష్ణ్యం. ఐశ్వర్యం నియంతృత్వం. శౌర్యం సంగ్రామోత్సాహః. తేజః ప్రావః.బలం దక్షత్వం. స్మృతిః కర్తవ్యార్థానుసంధానం. స్వాతంత్ర్యం అపరాధీనతా. కౌశలం క్రియానిపుణతా. కాంతిః సౌందర్యం. ధైర్యం అవ్యాకులతా. మార్దవం చిత్తాకాఠిన్యం.(28)

29. శ్లో. ప్రాగల్భ్యం ప్రశ్రయశ్శీలం
సహ ఓజో బలం భగః ।
గాంభీర్యం స్థైర్యమాస్తిక్యం

ఉపరతి అనగా లాభము వచ్చినను ఉదాసీనముగా ఉండుట శ్రుతమనగా శాస్త్రవిచారము.(27)

జ్ఞానమనగా ఆత్మ విషయమైనతెలివి, మోక్ష సాధనము. విరక్తి అనగా ఆశలేకుండుట. ఐశ్వర్యమనగా అధికారము. శౌర్యమనగా యుద్ధోత్సాహము. తేజస్సు అనగా ప్రభావము, బలము, రక్షకత్వము. స్మృతి అనగా ఏది చేయదగినదో ఏది చేయదగనిదో ఆలోచించుట. స్వాతంత్ర్యమనగా ఇతరులకు లోను కాకుండా ఉండుట (స్వేచ్ఛ) . కౌశలం అనగా పనిలో నేర్పు. కాంతి అనగా సౌందర్యము. ధైర్యము అనగా కలవరపాటు లేకుండుట. మార్ధవమనగా మనస్సు కఠినముగా ఉండకుండుట.(28)

పాగల్భ్యమనగా ప్రతిభ యొక్క అతిశయము. ప్రశ్రయమనగా వినయము. శీలమనగా మంచి స్వభావము. సహ ఓజోబలాని అంటే మనస్సు, పంచ జ్ఞానేంద్రియాలు, పంచ కర్మేంద్రియాలు బలంగా ఉండుట. భగమనగా భోగాస్పదము. గాంభీర్యమనగా చిత్త క్షోభమును పొందకుండుట. స్థైర్యమనగా నిశ్చలత్వము. ఆస్తిక్యమనగా శ్రద్ధ,

కీర్తిర్మానోఽనహంకృతిః ॥

టీ:- ప్రాగల్భ్యమితి. ప్రాగల్భ్యం ప్రతిభాతిశయః. ప్రశ్రయో వినయః శీలం స్వభావః. సహఓజోబలాని మనసో జ్ఞానకర్మేంద్రియాణాం చ పాటవాని. భోగః భోగాస్పదత్వం. గాంభీర్యం అక్షోభ్యత్వం. స్థైర్యం అచంచలతా. ఆస్తిక్యం శ్రద్ధా, కీర్తిర్యశః మానః పూజ్యత్వం అనహంకృతిః గర్వాభావః.(29)

కీర్తి,యశస్సు, మానము, పూజ్యత్వము. అనహంకృతి అనగా గర్వము అహంకారము లేకపోవడము.(29)

30\. శ్లో. ఏతే చాన్యే చ భగవన్
నిత్యా యత్ర మహాగుణాః ।
ప్రార్థ్యా మహత్త్వమిచ్ఛద్భిః
నవియంతి స్మ కర్హిచిత్ ॥

టీ:- ఏత ఇతి. ఏతే ఏకోన చత్వారింశత్. అన్యేచ బ్రహ్మణ్యశరణ్యత్వాదయో మహాంతో గుణాః. యస్మిన్నిత్యాస్సహజాః. న వియంతి న క్షీయన్తే స్మ.(30)

ఈ ముప్పదితొమ్మిది గుణాలు, మరియు బ్రహ్మణ్య, శరణ్యత్వాది గొప్ప గుణాలు ఎవని యందు ఎల్లప్పుడు స్థిరంగాఉండి, క్షీణించవో అట్టి వాడు కృష్ణపరమాత్మ.(30)

31\. శ్లో. తేనాహం గుణపాత్రేణ
శ్రీనివాసేన సాంప్రతమ్ ।
శోచామి రహితం లోకం

ఓ పూజ్యుడా నాయనా ధర్మదేవతా ! పై సమస్త గుణాలకు నిలయమైన ఆ శ్రీనివాసుడు, పాపాపు కలి ప్రవేశించుట కారణముగా ఈ లోకాన్ని విడిచివెళ్లాడు అందుకని విలపిస్తున్నాను. (31)

పాప్మనా కలినేక్షితమ్ ॥

32. శ్లో. ఆత్మానం చానుశోచామి
భవంతం చామరోత్తమమ్ ।
దేవానృషీన్ పితౄన్ సాధూన్
సర్వాన్వర్ణాంస్తథాఽఽశ్రమాన్ ॥

టీ:- తేనేతి. తేన గుణపాత్రేణ గుణలయేన పాప్మనా పాపహేతునా. (31),(32)

33. శ్లో. బ్రహ్మాదయో బహుతిథం యదపాంగమోక్ష
కామాస్తపస్సమచరన్భగవత్ప్రపన్నాః ।
సా శ్రీస్స్వవాసమరవిందవనం విహాయ
యత్పాదసౌభగమలం భజతేఽనురక్తా ॥

టీ:- తస్య విరహో దుస్సహ ఇత్యాహ -చతుర్భిః. బ్రహ్మాదయ ఇతి. బ్రహ్మాదయో యస్యాశ్శ్రియః, అపాంగమోక్షః స్వస్మిన్ దృష్టిపాతః తత్కామాస్సంతః బహుతిథం బహుకాలం తపస్సమచరన్ సమ్యక్చరంతి స్మ భగవద్భిః ఉత్తమైః ప్రపన్నా ఆశ్రితాఽపి సా శ్రీః యస్య పాదలావణ్యం అలమనురక్తా సతీ సేవతే.(33)

ఇంకను భూదేవి పలుకుచున్నది. దేవతలలో ఉత్తముడివగు నిన్ను గురించి, దేవతల గురించి, పితృదేవతల గురించి, ఋషుల గురించి, సాధు జనుల గురించి, బ్రాహ్మణాది అన్ని వర్ణాల వారి గురించి, బ్రహ్మచర్యాది అన్ని ఆశ్రమాలలో ఉన్న వారి గురించి, అందరిని గురించి నా గుఱించియు దుఃఖిస్తున్నాను. ( శ్రీకృష్ణ నిర్యాణంతో అందరికి కష్టము ప్రాప్తించినదని భావము.) (32)

అట్టి భగవానుని విరహము సహింపరానిదని నాలుగు శ్లోకాలతో చెప్పుతున్నాడు. శుభప్రదమగు లక్ష్మీ కరుణాకటాక్ష వీక్షణమును కోరుతూ బ్రహ్మాదిదేవతలు చిరకాలము తపస్సు చేసి లక్ష్మిని పొందగోరుదురు. కాని అట్టి లక్ష్మి కూడ తన నివాస కమల వనమును వదలి ఉత్తములకు ఆశ్రయించదగిన కృష్ణుని పాద సౌందర్యాన్ని ప్రగాఢంగా ప్రేమించి సేవించుచున్నది. అట్టి కృష్ణుడు లేడు కదా అని నా దుఃఖము.(33)

34.శ్లో. తస్యాహమబ్జకులిశాంకుశకేతుకేతైః
శ్రీమత్పదైర్భగవతస్సమలంకృతాంగీ ।
త్రీనత్యరోచ ఉపలభ్య తతో విభూతిం
లోకాన్ సమాం వ్యసృజదుత్స్మయతీం తదంతే ॥

టీ:- తస్యేతి. తస్యభగవతః శ్రీమద్భిః పదైః కేతుర్ధ్వజః. అబ్జాదయః కేతాశ్చిహ్నాని యేషాం తైః. యద్వా - అబ్జాదీనామాశ్రయైః సమ్యగలం కృతమంగం యస్యాస్సా అహం తతో భగవతః విభూతిం సంపద ముపలభ్య ప్రాప్య. త్రీన్ లోకానతిక్రమ్య అరోచే శోభితవత్యస్మి. పశ్చాత్తస్యా విభూతేః అంతే నాశకాలే ప్రాప్తే సతి. ఉత్స్మయన్తీం ఉత్స్మయమానాం గర్వం కుర్వాణాం మాం సః వ్యసృజత్ త్యక్తవాన్ (34)

శోభాయమానమగు పద్మ, వజ్ర, అంకుశ ధ్వజ రేఖలతో అలంకరింపబడిన పాదములుగల ఆ కృష్ణభగవానుని ఐశ్వర్యాన్ని చూరగొని నేను మూడు లోకాలను అతిక్రమించి శోభించితిని, ఇప్పుడు ఐశ్వర్యము తొలగి, నశించు కాలమురాగా గర్విష్ఠినగు నన్ను ఆతను వదలి వెళ్ళెను. (34)

35.శ్లో. యో వై మమాతిభరమాసురవంశరాజ్ఞామ్
అక్షౌహిణీశతమపానుదదాత్మతంత్రః।
త్వాం దుఃస్థమూనపదమాత్మని పౌరుషేణ
సంపాదయన్యదుషు రమ్యమబిభ్రదంగమ్ ॥

అంతే గాకుండా కృష్ణుడు రాక్షసవంశరాజుల అక్షౌహిణీ శత సేనా భారాన్ని నాకు తగ్గించినాడు. మూడు కాళ్ళు తొలగి దుఃఖము పొందిన నిన్ను పురుషాకారముతో, సంపూర్ణ పాదాలతో సుఖముకల వానినిగా చేయుటకు యదు వంశములో శరీరాన్ని ధరించి అవతరించినాడు. ఆ కృష్ణుడు లేడు కదా అని ఇపుడు విలపించు చున్నాను. (ఇచట సుస్థంత్వాం పావయన్ ఒకపాఠము కలదు. అపుడు

టీ:- య ఇతి. కించ, యోవై ఆసురో వంశో యేషాం తేషాం రాజ్ఞాం. అక్షౌహిణీశతరూపం మమాతిభరం? భారం? అపనీతవాన్ త్వాం చ ఊనపదత్వాద్దుఃస్థం సంతం పౌరుషేణ పురుషకారేణ. ఆత్మని స్వస్మిన్. సంపూర్ణపదం స్వస్థం సంపాదయన్. లక్షణహేత్వోః క్రియయా ఇతి హేతౌ శతృప్రత్యయః. సంపాదయితుమిత్యర్థః. అబిభ్రత్ ధృతవానిత్యర్థః (35)

శతృప్రత్యయము లక్షణ హేతుత్వయోః క్రియయా' అను సూత్రముచేత హేత్వర్థమున వచ్చినదని, గ్రహించవలెను. అపుడు నిన్ను బాగా ఉండునట్లు చేయుటకు అవతరించెనను విశేషార్థము స్ఫురించును.) (35)

36.శ్లో. కా వా సహేత విరహం పురుషోత్తమస్య
ప్రేమావలోకరుచిరస్మితవల్గుజల్పైః ।
స్థైర్యం స మానమహరన్మధుమానినీనాం
రోమోద్గమో మమ యదంఘ్రివిటంకితాయాః ॥

టీ:- కేతి. తస్యవిరహం కా వా సహేత. ప్రేమావలోకశ్చ రుచిరస్మితం చ వల్గుజల్పశ్చ తైః. మధుమానినీనాం సత్యభామాదీనాం. సమానం గర్వసహితం. స్థైర్యం స్తబ్ధత్వం చ యః అహరత్. యస్యాంఘ్రిణా రజస్యంకితేన విటంకితాయాః అలంకృతాయాః సస్యాదిమిషేణ రోమోద్గమో భవతి.(36)

పురుషోత్తముడగు శ్రీకృష్ణపరమాత్మ విరహాన్ని ఏ స్త్రీ సహించగలదు ? శ్రీకృష్ణుడు ప్రేమతో కూడిన క్రీగంటి చూపులతో, అందమగు చిరునగవుతో, మధురభాషణములతో, మధువనమున సత్యభామాది స్త్రీల గర్వముతో కూడిన స్తబ్ధతను హరించెను. కృష్ణుని పాదధూళి స్పర్శతో నాకు మేను పులకాంకురములు కలిగి మహోత్సవము కలిగెను. అట్టి శ్రీకృష్ణుని విరహము సహించరానిది. (36)

37.శ్లో. తయోరేవం కథయతోః
పృథివీధర్మయో స్తదా ।
పరీక్షిన్నామ రాజర్షిః
ప్రాప్తః ప్రాచీం సరస్వతీమ్ ॥

టీ:- తయోరితి. కథయతోస్సతోః ప్రాచీం పూర్వవాహినీం సరస్వతీం కురుక్షేత్రే. (37)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం సంహితాయాం ప్రథమేస్కంధే భావార్థదీపికాయాం షోడశోధ్యాయః**

ఈ విధముగా పృథివీ, ధర్మదేవతలు సంభాషించుకొనుచుండగా పరీక్షిత్తను ఆ రాజర్షి కురుక్షేత్రమున, వారు సంభాషించుకొనుచున్న చోటికి పూర్వ వాహినిగా నున్న సరస్వతీ నదీతీరానికి చేరెను.(37)

**శ్రీమద్భాగవతము యొక్కప్రథమస్కంధ షోడశాధ్యాయమునకు శ్రీధరీయవ్యాఖ్యానుసార ఆంధ్రానువాదము ముగిసినది.**

## సప్తదశోஉధ్యాయః

**సూత ఉవాచ.**

1. శ్లో. తత్ర గోమిథునం రాజా
హన్యమానమనాథవత్ ।
దండహస్తం చ వృషలం
దదర్శ నృపలాంఛనమ్ ॥

టీ:- శ్లో. తతస్సప్తదశే రాజ్ఞః కలేర్నిగ్రహ ఉచ్యతే, తస్యైవం వీర్యభాజోஉపి వైరాగ్యం వక్ష్యతేஉద్భుతం. తత్రేతి. హన్యమానం తాడ్యమానం.(1)

2. శ్లో. వృషంమృణాలధవలం
మేహంతమివబిభ్యతమ్ ।
వేపమానం పదైకేన
సీదంతంశూద్రతాడితమ్ ॥

టీ :- మృణాళం పద్మాకందస్తద్వర్ధవళం. భయాత్ మేహంతం మూత్రయంతం. ఇవేత్యనేన పదావశేషో ధర్మో భయాన్మూత్రయన్నివ. ప్రతిక్షణం క్షీయమాణం శస్యస్యోపి అనిర్వాపాదత్కంపమాన ఇవేతి

## సప్తదశాధ్యాయము.

**సూతులవారు చెపుచున్నారు.**

ఈ పదిహేడవ అధ్యాయమున పరీక్షిత్తు కలిని నిగ్రహించిన విషయము వర్ణింపబడుతున్నది. ఇటువంటి వీరుడు కూడా చివరికి విరక్తినొందుట ఆశ్చర్యము. అక్కడ ఒక వృషలునిచే దిక్కులేని వాటివలె కొట్టబడుచున్న ఆ గోవుల జంటను పరీక్షిన్మహారాజు గమనించెను. రాజు వేషమున నున్న, పొడుగాటి కఱ్ఱను ధరించిన ఆ శూద్రరాజును కూడ చూచెను.(1)

తామరతూడు వలె తెల్లగానున్న ఒక వృషభము భయముతో, మూత్రోత్సర్గము చేయుచూ, వణుకుతూ, ఉండెను. అది ఒకే కాలుతో నడుస్తుండగా దానిని ఆ శూద్రుడు కొట్టుటను పరీక్షిత్తు చూచెను. (ఇచట ఇవ అనుటచే ఒకే కాలు మిగిలియున్నను, అదియు ప్రతి క్షణం క్షీణించుచున్నదని అర్థము.) మంచిదే యైనను తనను తాను నిలదొక్కుకునే పరిస్థితిలోలేక వణుకుచున్న వృషభరూపముననున్న ఆ ధర్మమును పరీక్షిత్తు చూచెను.(2)

దర్శితమ్. (2)

3. శ్లో. గాం చ ధర్మదుఘాం దీనాం
భృశం శూద్రపదాహతామ్ ।
వివత్సాం సాశ్రువదనాం
క్షామాం యవసమిచ్ఛతీమ్ ॥

టీ :- ధర్మదుఘాం హవిర్దోగ్ధ్రీం క్షామాం కృశాం. యవసం తృణం. అత్రాపి సస్యాదిప్రసవక్షయాద్వివత్సేవ. యజ్ఞభాగాభావాత్కృశా. అత ఏవ యజ్ఞభాగమిచ్ఛంతీ సా పృథ్వీతి సూచితం. (3)

4. శ్లో. పప్రచ్ఛ రథమారూఢః
కార్తస్వరపరిచ్ఛదమ్ ।
మేఘగంభీరయా వాచా
సమారోపితకార్ముకః ॥

టీ:- కార్తస్వరం సువర్ణం తన్మయః పరిచ్ఛదం పరికరో యస్య స్వర్ణనిబద్ధమిత్యర్థః. సజ్జీకృతకార్ముకః.(4)

యజ్ఞానికి కావలసిన హవిస్సు అనగా పాలు, పెరుగు, నెయ్యి మొదలగు ద్రవ్యాలను, వర్షించునట్టిది ఆ ఆవు. అది కృశించుచే తినుటకు గడ్డిని ఆశించుచున్నది, కాని సస్యములు మొదలగు పంటలులేక దానికి గడ్డి లభించుటలేదు. దూడలేని దానివలె అది కన్నీళ్ళు కారుస్తున్నది, మాటిమాటికి శూద్రునిచే తన్న బడుతున్నది ఆ ఆవు. అట్టి గోవును అనగా గోరూపముననున్న భూదేవిని పరీక్షిత్తు చూచెను. (3)

బంగారు పరికరములు గల రథాన్ని అధిష్ఠించి, ధనుస్సునెక్కుపెట్టి పట్టుకున్న పరీక్షిత్తు మేఘమువలె గంభీరమగు వాక్కుతో ఆ గోవులను బాధించు వానిని ఆ వృషలుని ఇట్లు అడిగెను.(4)

5. శ్లో. కస్త్వంమచ్ఛరణే లోకే
బలాద్ధంస్యబలాన్ బలీ ।
నరదేవోఽసి వేషేణ
నటవత్కర్మణాఽద్విజః ॥

టీ:- క ఇతి. హంసిఘాతయసి. రాజాహమితి చేత్తత్రాహ-నట ఇవ వేషమాత్రేణ నరదేవోఽసి కర్మణా తు అద్విజః శూద్రః.(5)

ఓరీ ! బలవంతుడనగు నేను రక్షకునిగానున్న లోకమున, బలాత్కారముగా ఈ అబలను పట్టి తన్నుతున్నావు, రాజవేషధారివై శూద్రునివలె ప్రవర్తిస్తున్నావు నీవెవడవు? అని పరీక్షిత్తు కలిని ప్రశ్నించెను.(5)

6. శ్లో. యస్త్వం కృష్ణే గతే దూరం
సహగాండీవధన్వనా ।
శోచ్యోఽస్యశోచ్యాన్రహసి
ప్రహరన్వధమర్హసి ॥

టీ:- య ఇతి. అశోచ్యాన్ నిరపరాధాన్. రహసి యస్త్వం ప్రహరసి. శోచ్యః సాపరాధోఽసి అతోవధమర్హసి.(6)

నీవెవ్వడవురా ? కృష్ణుడు అర్జునితో సహా పరలోకమునకు వెళ్ళిపోయినాడు కదా అని నిరపరాధులగు గోవులను రహస్యముగా కొడుతున్న నీవు అపరాధివి. నీవు బ్రతకరాదురా చంపదగిన వాడవు. అని రాజు కలిననెను. (6)

7 .శ్లో. త్వం వా మృణాలధవలః
పాదైః న్యూనః పదాచరన్ ।
వృషరూపేణ కిం కచ్చిత్
దేవో నః పరిఖేదయన్ ॥

టీ:- వృషం ప్రత్యాహ-త్వమితి. త్వంవా కః.స్వయమేవ సంభావయతి. కిం కశ్చిద్దేవో వృషరూపేణ నః అస్మాన్ పరిఖేదయన్ వర్తసే(7)

స్వామీ ! తామర తూడువలె తెల్లగా నున్న నీవు ఒకే కాలుతో నడుస్తూ, మాకు జాలి కలిగిస్తున్నావు. నీవు ఎద్దు రూపమున నున్న ఏ దేవతవు? ఎవరు నీవు ? అని పరీక్షిత్తు ఊహించుచూ ఆ దూడను అడిగెను.(7)

8. శ్లో. న జాతు కౌరవేంద్రాణాం
దోర్దండపరిరంభితే ।
భూతలేఽనుపతంత్యస్మిన్.
వినా తే ప్రాణినాం శుచః ॥

టీ:- నేతి. దోర్దండైః పరిరంభితే పరిరంభితవత్సురక్షితే. తే తవ శుచః అశ్రూణి వినా అన్యేషిం అశ్రూణి నానుపతంతీతి ఖేదహేతుత్వం దర్శితం.(8)

పూరువంశపు రాజుల భుజదండములతో ఆలింగనము చేసికోబడి, రక్షింపబడిన ఈ భూతలమున నీవు తప్ప ఎవడును, ఎప్పుడును కన్నీళ్ళు విడుచుటలేదు. అయ్యో ఎవరవు నీవు? అని రాజు బాధతో ప్రశ్నించెను.(8)

9. శ్లో. మా సౌరభేయానుశుచో
వ్యేతు తే వృషలాద్భయమ్ ।
మారోదీరంబ భద్రం తే
ఖలానాం మయి శాస్తరి ॥

టీ:- ఏవ ముక్తేపునరపి శోచంతం ప్రత్యాహ-మేతి సురభేః పుత్ర. మానుశోచః శోకం మాకురుష్వ వ్యేతు అపయాతు గాం ప్రత్యాహ- అంబమాతః శాస్తరి మయి జీవతి సతి. తే బద్రమేవ అతో మారోదీః (9)

ఓ కామధేనువు కుమారా వృషభమా ! ఏడువకుము. ఈ శూద్రుని వలన నీకు కలిగిన భయము తొలగించెదను. అని పలికెను. ఆ తరువాత పరీక్షిత్తు ఆవుతో ఓ గోమాతా ! దుర్మాగులను శాసించు నేనుండగా నీకు క్షేమమే కలుగును కావున ఏడువకుము అనెను.(9)

10. శ్లో. యస్య రాష్ట్రే ప్రజాస్సర్వాః
త్రస్యంతే సాధ్వ్యసాధుభిః ।
తస్య మత్తస్య నశ్యంతి
కీర్తిరాయుర్భగో గతిః ॥

టీ:- మమ హితార్థమేవైనం హనిష్యామి. న తవోపకారాయేత్యాహ - ద్వాభ్యాం యస్యేతి. హే సాధ్వి సర్వాః యాః కాశ్చిదపీత్యర్థః.

నా మంచి కొరకే ఇతనిని చంపుతున్నాను, నీకును ఉపకారము కలుగును అని రెండు శ్లోకములతో పరీక్షిత్తు అనుచున్నాడు. ఓ సాధ్వీ! గోమాతా ! ఏ రాజు యొక్క రాజ్యమున ప్రజలు దుర్మాగులచేత బాధ పెట్టబడతారో అట్టి మత్తుడగు రాజు యొక్క కీర్తి, ఆయుష్యము, భోగాలు, పరలోకము అన్నియు నశించును.(10)

అసాధుభిస్త్రస్యం తే పీడ్యంతే భగో భాగ్యం గతిః పరలోకః.(10)

11 .శ్లో. ఏష రాజ్ఞాం పరో ధర్మః
ఆర్తానామార్తి నిగ్రహః ।
అత ఏనం హనిష్యామి
భూతద్రుహమసత్తమమ్ ॥

12. శ్లో. కోఽవృశ్చత్తవ పాదాం స్త్రీన్
సౌరభేయ చతుష్పదః ।
మాభూవంస్త్వాదృశా రాజ్యే
రాజ్ఞాం కృష్ణానువర్తినామ్ ॥

టీ:- పునరపి శోచంతం వృషం ప్రత్యాహ–క ఇతి. కః అవృశ్చత్ చిచ్ఛేద. త్వాదృశాః త్వద్విధా దుఃఖితాః.(11,12)

13. శ్లో. ఆఖ్యాహి భద్రం వృషభః !
సాధూనామకృతాగసామ్ ।
ఆత్మవైరూప్యకర్తారమ్
పార్థానాం కీర్తిదూషణమ్ ॥

టీ:- ఆఖ్యాహీతి. వో భద్రమస్తు. ఆత్మనస్తవ పాదచ్ఛేదే న వైరూప్యం

పీడితులగు వారి పీడను తొలగించుట రాజుల ముఖ్యధర్మము కావున ప్రాణిహింస చేయు ద్రోహి ఈ (కలిని) దుర్మాగుని వధింతును, అని పరీక్షిత్తు గోరూపముననున్న భూమాతతో పలికెను.(11)

ఓ వృషభమా ! నాలుగు పాదాలు కలదానా ! ఎవడు నీ మూడు పాదాలను నరికి వేసెను? కృష్ణ భగవానుని అనుసరించు రాజుల యొక్క రాష్ట్రాలలో (దేశాలలో) నీలాంటి దుఃఖితులు ఉండకూడదు. (12)

ఓ వృషభమా ! నీకు క్షేమమగుగాక ఏ తప్పుచేయని సాధువులకు అంగవైకల్యము కలుగచేసి పాండవుల యొక్క కీర్తిని కలుషితము చేయుచు నీ మూడు పాదాలను ఛేదించిన ఆ దుర్మార్గుడెవడు? అని పరీక్షిత్తు ప్రశ్నించెను.(13)

కృతవంతం కీర్తిం దూషయతీతి తథా తమాఖ్యాహి వద.(13)

14. శ్లో. జనేఽనాగస్యఘం యుంజన్
సర్వతోఽస్య చ మద్భయమ్ ।
సాధూనాం భద్రమేవ స్యా
దసాధురమనే కృతే ॥

టీ:- తదాఖ్యానే కృతే కథం భద్రం స్యాదిత్యత ఆహ-జన ఇతి యస్తావదనాగసి జనే. అఘం దుఃఖం యంజన్ కుర్వన్.భవతి. తస్య ఏవం భూతస్య. మత్ మత్తస్సకాశాత్, సర్వత్రాపి భయం భవతి. తతస్సాధూనాం భద్రం భవేదితి. (14)

ఆ దుర్మార్గుని పేరు చెపితే క్షేమము కలుగదు కదా అనుదానికి సమాధానము చెపుతున్నాడు. అపరాధము చేయని వానిని దుఃఖపెట్టు వానికి నా వలన అంతకంటే భయముకలుగును. దుర్మార్గులను శిక్షించుటతో సజ్జనులకు క్షేమము కలుగును అని పరీక్షిత్తు పలికెను. (14)

15. శ్లో. అనాగస్స్విహ భూతేషు
య ఆగస్కృన్నిరంకుశః ।
ఆహర్తాస్మి భుజం సాక్షా
దమర్త్యస్యాపి సాంగదమ్ ॥

టీ:- ఏతస్య దండే అయమసమర్థ ఇతి మాశంకీరిత్యాహ- అనాగస్స్వితి. ఆగస్కృదపరాధకర్తా. తస్య అమర్త్యస్యదేవస్యాపి. భుజం ఆహర్తాస్మి ఆహరిష్యామి సాంగదమిత్యనేన మూలతః ఉత్పాట్య

ఎవరి వలనను భయపడక, నిరంకుశుడై, తప్పు చేయని ప్రాణులకు దుఃఖమును కలిగించువాడు దేవుడైనాసరే వాని భుజకీర్తి ఆభరణంతో సహా అతని భుజాన్ని నరికివేతును.(15)

ఆహరిష్యామీతి దర్శితమ్.(15)

16. శ్లో. రాజ్ఞోహి పరమో ధర్మః
స్వధర్మస్థానుపాలనమ్ ।
శాసతో న్యాన్యథాశాస్త్రమ్
అనాపద్యుత్పథానిహ ॥

టీ:- నన్వేకస్య నిగ్రహే అన్యస్యానుగ్రహే తవ కిం ప్రయోజనమిత్యాశంక్య రాజ్ఞ ఇత్యాదినాహ...శాసతఇతి.అన్యాన్ అధర్మిష్ఠాన్ శాసతః దండయతః.(16)

ఒకరిని నిగ్రహించి మరియొకరిని అనుగ్రహించుట చేత నీకేమి లాభము అనుదానికి చెపుతున్నాడు. ధార్మికులను, మంచివారిని రక్షించుట ఏ ఆపద లేకుండగనే శాస్త్రాన్ని ఉల్లంఘించి దుర్మార్గమున వర్తించు వారిని శిక్షించుట రాజులకు శ్రేష్ఠమగు ధర్మము.(16)

**ధర్మ ఉవాచ.**

17. శ్లో. ఏతద్వః పాండవేయానాం
యుక్తమార్తాభయం వచః ।
ఏషాం గుణగణైః కృష్ణో
దౌత్యాదౌ భగవాన్కృతః ॥

టీ:- ఆర్తానామభయం యస్మాత్తద్వచః పాండవేయానాం వః యుక్తముచితమేవ.(17)

వృషభరూపమున నున్న ధర్మ దేవత పలుకుచున్నది. పాండవ వంశీయుడవగు ఓ పరీక్షిన్మహారాజా ! ఆపదలోనున్న వారికి అభయమొసంగుదునను మాట నీకు చాలా తగినట్లున్నది. పాండవుల మంచి గుణగణముల వలన సాక్షాత్తు శ్రీకృష్ణుడు దౌత్యాదులు సల్పి వారికి సాహాయ్యము చేసెను. అట్టి వంశమున పుట్టిన వాడవు నీవు అని ధర్మ దేవత రాజును ప్రశంసించెను.(17)

18. శ్లో. న వయం క్లేశబీజాని
యతస్స్యుః పురుషర్షభ ।
పురుషం తం విజానీమో
వాక్యభేదవిమోహితాః ॥

టీ:- యేషామితి.వయం తు యతః పురుషాత్ప్రాణినాం క్లేశహేతవో భవేయుః. తం పురుషం న విజానీమః యతః వాదినాం వాక్యభేదైః విమోహితాః.(18)

19. శ్లో. కేచిద్వికల్పవసనాః
ఆహురాత్మానమాత్మనః ।
దైవమన్యే పరే కర్మ
స్వభావమపరే ప్రభుమ్ ॥

టీ:- వాక్యభేదానేవాహ-వికల్పం భేదం వసతే ఆచ్ఛాదయంతి యే యోగినః తే ఆత్మానమేవాత్మనః ప్రభుం సుఖ దుఃఖ ప్రదమాహుః తదుక్తం-శ్లో."ఆత్మైవహ్యాత్మనో బంధురాత్మైవరిపురాత్మన"ఇతి. యద్వా - యేవికల్పైః కుతర్కై ప్రాకృతా నాస్తికాః.ఏవం హితే వదంతి. న

ఓ పురుష శ్రేష్ఠుడా ! పరీక్షిన్మహారాజా ! మేమైతే భేదవాదుల మాటల చేత విమోహితులమై, ఏమియు తెలియని వారమై, దుఃఖానికి కారణమైన వానిని గుర్తెరుగకున్నాము. అని ధర్మ దేవత పలికెను.(18)

దుఃఖానికి కారణమగు ఆ వాక్య భేదములను వివరించుచున్నాడు ధర్ముడు.భేదాన్ని కప్పిపుచ్చే యోగులు కొందరు తమ సుఖ దుఃఖాలకు కారణము తమ ఆత్మయే అనుచున్నారు. ఈ విషయము భగవద్గీతలో "ఆత్మైవహ్యాత్మనో బంధుః" అను శ్లోకంలోకృష్ణుడు వివరించాడు.లేదా మొండి వాదనలు చేయు నాస్తికులు దేవతలకు ప్రభుత్వము లేదని వారి వారి కర్మ ననుసరించే సుఖ,దుఃఖాది ఫలాలు ఇస్తారని కర్మకే కారణత్వం చెపుతారు. దైవజ్ఞులు కర్మ అచేతనము కావున దైవమేఫలదాయకమని చెపుతారు. మీమాంసకులు కర్మయే కారణమని, లోకాయతికులు స్వభావము కారణమని, ఈవిధంగా మానవుల సుఖ, దుఃఖాలకు ఒక్కొక్కరు ఒక్కొక్క కారణాన్ని చెబుతారు.(19)

తావద్దేవతాదీనాం ప్రభుత్వం కర్మాధీనత్వాత్. న చ కర్మణః తస్యా స్వాధీనత్వాదచేతనత్వాచ్చ. అతః స్వయమేవ ప్రభుః న వా కశ్చిదితి. అన్యేదైవజ్ఞాః-దైవం గ్రహాధిరూపాం దేవతాం అపరేతుమీమాంసకాః - స్వకర్మ. అపరే లోకాయతికాః-స్వభావః. (19)

ఈశ్వరుని నమ్మే ఆస్తికులు ఊహించ శక్యముగాని మనస్సుకు గోచరముగాని, వాక్కులకు గూడా అందని వైభవముగల సర్వజ్ఞ, సర్వవ్యాపి, సర్వసమర్థుడగు సరమేశ్వరుని వలన అంతయు జరుగుచున్నదని నిశ్చయించుచున్నారు. ఓ రాజర్షీ ఈ విషయమున నీ స్వబుద్ధితో తగినట్లుగా విమర్శించుకొనుము అని ధర్మదేవత పలికెను. (20)

20. శ్లో. అప్రతర్క్యాదనిర్దేశ్యాద్
ఇతి కేష్వపి నిశ్చయః ।
తత్రానురూపం రాజర్షే
విమృశ స్వమనీషయా ॥

టీ:- కేష్వపి సేశ్వరేషు. కేష్వపీతి దుర్లభత్వం దర్శితం నిశ్చయః ఇతి సిద్ధాంతత్వం అప్రతర్క్యాదమనోగోచరాత్. అనిర్దేశ్యాత్ వచనాగోచరాత్. పరమేశ్వరాత్సర్వం భవతీతి. విమృశ విచారయ స్వబుద్ధ్యా. (20)

ఓ శౌనకా ! ఈ విధముగా ధర్మదేవత చెప్పగా, ఆ చక్రవర్తియగు పరీక్షిత్తు భేదబుద్ధి తొలగగా మనస్సు ఏకాగ్రముకాగా ధర్మదేవతతో ఇట్లు పలికెను. విషయము తెలిసికొనెను. (21)

21. శ్లో. ఏవం ధర్మే ప్రవదతి
స సమ్రాడ్ద్విజసత్తమః ।
సమాహితేన మనసా
విభేదః ప్రత్యచష్ట తమ్ ॥

టీ:- సమాహి తేనేతి. విఖేదః గతమోహః ప్రత్యచష్ట ప్రత్యభాషత,

జ్ఞాతవానిత్యర్థః.(21)

**రాజోవాచ.**

22. శ్లో. ధర్మం బ్రవీషి ధర్మజ్ఞ
ధర్మోఽసి వృషరూపధృక్ ।
యదధర్మకృతస్థానం
సూచకస్యాపి తద్భవేత్ ॥

టీ :- అనిర్ధారితమివ బ్రువన్ ఘాతుకం జానన్నపి న సూచయేదిత్యేవం రూపం ధర్మం బ్రవీషి. అతో ధర్మోఽసి. సూచనే కోరోష ఇత్యత ఆహ - యదితి స్థానం నరకాది.(22)

పరీక్షిత్తు అనుచున్నాడు. ధర్మము తెలిసిన ఓ ధర్మదేవతా ! వృషభ రూపముననున్న నీవు ధర్మము చెపుచున్నావు. తెలిసినాగాని దుర్మార్గుని, పాతకుని గూర్చి చెప్పవద్దను ధర్మాన్ని సూచించావు. అందుకే నీవు ధర్ముడవు. చెపితే తప్పేమి అంటే అధార్మికుడు పొందే నరకాది స్థానాన్ని వానిని సూచించిన వాడు కూడా పొందుతాడు. కొండెములు చెప్పరాదని చెప్పుచున్నావు.(22)

23. శ్లో. అథవా దేవ మాయాయాః
గతిర్నూనమగోచరా ।
చేతసో వచసశ్చాపి
భూతానామితి నిశ్చయః ॥

టీ:- యద్వా అజ్ఞానాదప్య వధనం. భవతీత్యాహ అథవేతి దేవకస్య మాయయా గతివధ్య పాతక లక్షణావృత్తిర్భూతానాం చేతసో వచసశ్చ

ఓ ధర్ముడా ! నీకు సుఖ దుఃఖాలకు హేతువు తెలియకున్నను ఆశ్చర్యముకాదు. ఏలయన ఏలయన పరమేశ్వరుని మాయా శక్తి అగమ్యగోచరము.(23)

అగోచరా సుజ్ఞేయా న భవతీతి నిశ్చయః.(23)

24. శ్లో. తపశ్శౌచం దయా సత్యమ్
ఇతి పాదాః కృతే కృతాః ।
అధర్మాంగైస్త్రయో భగ్నాః
స్మయసంగమదైస్తవ ॥

టీ :- ధర్మోఽసావితి జ్ఞాత్వా తస్య పాదానువాదేన వ్యవస్థామాహ-తప ఇతి ద్వాభ్యాం. అధర్మపాదైః తవ త్రయః పాదాః త్రిభిరంగైర్భగ్నాః రుగ్ణాః స్మయోవిస్మయః.(24)

ధర్ముడితడని తెలిసికొని పరీక్షిత్తు అతని పాదములను అనువదించుచూ నిశ్చయము చేస్తున్నాడు తప అను రెండు శ్లోకములచేత. తపస్సు, శుచిత్వము, దయ, సత్యము అనునవి నీ (ధర్మము యొక్క) నాలుగు పాదములు. సమ్మోహము, దుస్సాంగత్యము, గర్వము అను అధర్మ అంశములతో మూడు కాళ్ళు విరిగినవి. సమ్మోహము తపస్సును, దుష్టసంగమము శౌచమును, గర్వము దయను విరగగొట్టినవి. (24)

25. శ్లో. ఇదానీం ధర్మ పాదస్తే
సత్యం నిర్వర్తయేద్యతః ।
తం జిఘృక్షత్యధర్మోఽయమ్
అనృతేనైధితః కలిః ॥

టీ:- ఇదానీం కలౌ. హే ధర్మ, తే తవ. పాదశ్చతుర్థాంశః. తత్రాపి సత్యమేవాస్తి యస్స త్యాద్భవా నాత్మానం నిర్వర్తయేత్ కథం చిద్ధారయేత్. యద్వా పురుషస్త్వాం సాధయేత్తమపి పాదమనృతేన సంవర్ధితః కలిరూపోఽయమధర్మః గృహీతుమిచ్ఛతి. తత్రేయం స్థితిః. కృతయుగే

ఓ ధర్మమా ! ఇపుడు నీ పాదమును నాలుగవ అంశమైన సత్యము ధరించుచున్నది. ఆ పాదమును కూడ అబద్ధముతో పెరిగిన కలి గ్రహించాలని ప్రయత్నిస్తున్నాడు. ఈ విషయమున వ్యవస్థ కృతయుగమున పరిపూర్ణముగా నాలుగు పాదాల ధర్మము. త్రేతాయుగమున నాలుగు పాదాల మధ్యన మోహముతో తపస్సు, ద్వాపరమున సాంగత్యముతో శౌచము, కలిలో మదముతో దయ, చివర అబద్ధముతో సత్యమును ఈ విధముగా నాలుగంశములు ఒక్కొక్కటి లోపించును. కలియుగములో ధర్మము యొక్క చతుర్థాంశము ఒకే ఒక కాలు మిగిలి యుండును. అది కూడ చివరకు నశించును అని పరీక్షిత్తు పలికెను.(25)

ప్రథమం సంపూర్ణశ్చతుష్పాద్ధర్మః. త్రేతాయామపి చతుర్ణాం పాదానాం మధ్యే స్మయేన తపః సంగేనశౌచం. మదేన దయా. అనృతేన సత్యం. ఇత్యేవంచతుర్థాంశో హీయతే. ద్వాపరే త్వర్ధం. కలౌ చతుర్థాంశోఽవ శిష్యతే. సోఽప్యన్తే నశ్యేదితి. (25)

26. శ్లో. ఇయం చ భూర్భగవతా
న్యాసితోరుభరా సతీ ।
శ్రీమద్భిస్తత్పదన్యాసైః
సర్వతః కృతకౌతుకా ॥

టీ:- నాసితః అన్యోన్యద్వారేణావతారితః ఉరుర్భారో యస్యాఃకృతం కౌతుకం మంగళం యస్యాః. (26)

శ్రీకృష్ణ భగవానుని చేత గొప్ప భారము తగ్గింపబడినదై, శుభప్రదములగు ఆ దేవుని పాదము మోపబడినందున ప్రస్తుతము ఈ భూమండలము అంతట సమస్త శుభములుకలదై విరాజిల్లుచున్నది. కృష్ణుడు భూభారమును తగ్గించెను. దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ ఆయన అవతార ధ్యేయములు. (26)

27. శ్లో. శోచత్యశ్రుకలా సాధ్వీ
దుర్భగేవోజ్ఝితాఽధునా ।
అబ్రహ్మణ్యా నృపవ్యాజాః
శూద్రా భోక్ష్యంతి మామితి ॥

టీ:- అశ్రూణి కలయతి ముంచత్యశుశ్రుకలా. తేన త్యక్తా సతీ.

కృష్ణుడు, సుశీలయగు భూదేవిని విడిచి వెళ్ళగా, ఆమె ఈ గోరూపమున ఇప్పుడు దౌర్భాగ్యురాలి వలె కన్నీళ్ళు కారుస్తూ, బ్రాహ్మణ భక్తి లేని శూద్రులు రాజుల్లా వ్యవహరిస్తూ నన్ను అనుభవిస్తారని ఏడ్చుచున్నది. (27)

అబ్రహ్మణ్యా ఇతి. శూద్రా భోక్ష్యంతి మామితి శోచతి.(27)

28. శ్లో. ఇతి ధర్మం మహీం చైవ
సాంత్వయిత్వా మహారథః ।
నిశాతమాదదే ఖడ్గం
కలయేఽధర్మ హేతవే ॥

టీ:- నిశాతమితి. నిశాతం. నిశితం ఖడ్గం. అధర్మస్య హేతుర్యః కలిః తం హన్తుమిత్యర్థః. (28)

ఈ విధముగా ధర్మ దేవతను, భూమిని ఓదార్చి మహారథుడగు పరీక్షిత్తు అధర్మకారకుడగు కలిని చంపుటకు గొప్ప పరాక్రమముగల తన వాడి ఖడ్గమును గ్రహించెను.(28)

29. శ్లో. తం జిఘాంసుమభిప్రేత్య
విహాయ నృపలాంఛనమ్ ।
తత్పాదమూలం శిరసా
సమగాద్భయవిహ్వలః ॥

టీ :- అభిప్రేత్య జ్ఞాత్వా. (29)

తనను చంపుటకు నిశ్చయించి వచ్చుచున్న ఆ పరీక్షిత్తు మహారాజును చూచి కలి తన రాజచిహ్నాలను వదలి భయకంపితుడై, తలవంచి ఆయన పాదములపై వ్రాలెను.(29)

30. శ్లో. పతితం పాదయోర్వీరః
కృపయా దీనవత్సలః ।
శరణ్యో నావధీత్ శ్లోక్యః
ఆహ చేదం హసన్నివ ॥

దీనుల యందు దయగల ఆ పరీక్షిత్తు శరణాగత రక్షకుడు మంచి కీర్తి కలవాడు కావున తన పాదములపై బడిన కలిని చంపక విడిచిపెట్టి, నవ్వుతూ ఇట్లు పలికెను.(30)

టీ:- తదితి శరణ్యాః శరణార్హాః శ్లోక్యాః సత్కీర్త్యర్హాః.(30).

**రాజోవాచ.**

31. శ్లో. న తే గుడాకేశయశోధరాణాం
బద్ధాంజలేర్వై భయమస్తి కించిత్ ।
న వర్తితవ్యం భవతా కథంచన
క్షేత్రేఽస్మదీయే త్వమధర్మబంధుః ॥

పరీక్షిన్మహారాజు అనుచున్నాడు. ఓ కలీ ! అర్జునుని కీర్తిని కాపాడవలసిన మా వలన శరణు పొందిన అధర్మ బంధువుడవగు నీకు ఏ మాత్రము భయము లేదు. కాని నీవు ఎట్టి పరిస్థితిలోను మా దేశమున, నా పరిపాలనలో ఉండరాదు. (31)

టీ:- నేతి. గుడాకేశోఽర్జునస్తస్య యశోధరా యే వయం తేషాం తాన్ ప్రతిబద్ధా అంజలిర్యేన. తస్య తే కించిత్కథంచన కేనాప్యంశేన న వర్తితవ్యం. యస్మాత్త్వమధర్మస్య బంధుః.(31).

32. శ్లో. త్వాం వర్తమానం నరదేవదేహేషు
అనుప్రవృత్తోఽయమధర్మయూథః ।
లోభోఽనృతం చౌర్యమనార్యమంహో
జ్యేష్ఠా చ మాయా కలహశ్చ దంభః ॥

దానినే చెపుతున్నాడు. ఓ కలీ ! రాజదేహముననున్న నిన్ను అనుసరించి అధర్మము అంతటను ప్రబలుచున్నది. లోభము, అసత్యము, దొంగతనము, దౌర్జన్యము, స్వధర్మత్యాగము, దారిద్ర్యము, కపటము, కలహము, దంభము ఇతరుల మెప్పు కొఱకు చేసే సత్కార్యము ఇవన్నియును నిన్ను ఆశ్రయించి ఉండును. కావున నీవు నా దేశమున ఉండరాదు.(32)

టీ:- తదేవాహ-త్వామితి. రాజదేహేషు వర్తమానం త్వాం అనుసర్వతః ప్రవృత్తః. అనార్యందౌర్జన్యం అంహః. స్వధర్మత్యాగః. జ్యేష్ఠా

అలక్ష్మీః. మాయా కపటం.(32).

33. శ్లో. న వర్తితవ్యం తవ ధర్మబంధో
ధర్మేణ సత్యేన చ వర్తితవ్యే ।
బ్రహ్మావర్తే యత్ర యజంతి యజ్ఞైః
యజ్ఞేశ్వరం యజ్ఞ వితాన విజ్ఞాః ॥

టీ:- నేతి. తత్తస్మాత్సత్యేనకర్మేణ చ వర్తితవ్యే వర్తితుమర్హేబ్రహ్మావర్తే దేశే. యజ్ఞస్య వితానం విస్తారః తత్ర విజ్ఞాః నిపుణాః. (33).

ఓ ధర్మరహితుడా ! ధర్మము, సత్యముతో ఉండు బ్రహ్మావర్త దేశమున సత్యధర్మ నిపుణులు, సజ్జనులు అనేక యజ్ఞములను ఆచరిస్తూ యజ్ఞేశ్వరుడగు నారాయణుని పూజించుచోట నీవు ఉండరాదు.(33)

34. శ్లో. యస్మిన్ హరిర్భగవానిజ్యమానః ।
ఇజ్యామూర్తిర్యజతాం శం తనోతి ।
కామానమోఘాన్ స్థిరజంగమానామ్
అంతర్బహిర్వాయురివైష ఆత్మా ॥

టీ:- యస్మిన్నితి. ఇజ్యాయాగః. తదూపా మూర్తిర్యస్య. శంక్షేమం. కామాంశ్చ. నను ఇంద్రాదయో దేవాఇజ్యం తే న తు హరిస్తత్రాహ- ఏష స్థావరాదీనామాత్మేతి. తథాపి జీవవన్నపరిచ్ఛిన్న ఇత్యాహ- అంతర్బహిరితి. యథా వాయుః ప్రాణరూపేణాఽంతస్థోఽసి బహిరప్యస్తి తద్వత్సర్వాంతర్యామీశ్వరోఽపీతి.(34).

భగవానుడు, యజ్ఞ స్వరూపుడు అగు కృష్ణపరమాత్మ యజ్ఞములతో ఆరాధింపబడి యజ్ఞకర్తలకు క్షేమమును కలిగించును. ఆత్మస్వరూపుడై వాయువువలె చరాచర ప్రపంచానికి లోపల, బయటను ఉండి వమ్ముకాకుండా అనేక కోరికలను వర్షించును. ఇంద్రాది దేవతల గురించి యజ్ఞాలు చేస్తారు. అయినను హరియే అందరిలోని ఆత్మస్వరూపుడు, అంతర్బహిఃస్థితుడు, పరమాత్మ జీవుని వలె పరిచ్ఛిన్నుడు కాడు. కాబట్టి యజ్ఞఫలవితరుణుడైన హరి ఉండుచోట నీవుండరాదు.(34)

**సూత ఉవాచ.**

35. శ్లో. పరీక్షితైవమాదిష్టః
స కలిర్జాతవేపథుః ।
తముద్యతాసిమాహేదం
దండపాణిమివోద్యతమ్ ॥

టీ:- పరీక్షితేతి. ఉద్యతాసిముద్ధృతఖడ్గం దండపాణిం యమం ఉద్యతం ఉద్యుతం ఉద్యుక్తం.(35)

**సూతుడు చెపుతున్నాడు.**

పరీక్షిన్మహారాజు చేత ఈ విధముగా ఆదేశింపబడి, యమధర్మరాజు వలె ప్రాణము తీయుటకు ఉద్యుక్తుడై, తనపై ఖడ్గము ఎత్తిన పరీక్షిన్మహారాజును చూచి కలి భయముతో వణుకుతూ ఇట్లనెను.(35)

**కలిరువాచ.**

36. శ్లో. యత్ర క్వ చ న వత్స్యామి
సార్వభౌమ తవాజ్ఞయా ।
లక్షయే తత్ర తత్రాపి
త్వామాత్తేషుశరాసనమ్ ॥

టీ:- యత్రేతి. అత్ర నవస్తవ్యమితి యా తవాజ్ఞా తయా. యత్ర క్వాపి వత్స్యామి కింతు తత్రాపి ఆత్తః గృహీతః ఇషుః శరాశనం చ యేన తం త్వామేవ లక్షయే.(36)

**కలి పలుకుచున్నాడు.**

ఓ చక్రవర్తీ ! పరీక్షిద్రాజా ! నీ ఆజ్ఞతో ఎక్కడో ఒకచోట ఉంటాను. కాని నాకు అంతటను ధనుస్సు నాపై ఎక్కుపెట్టిన నీవే కనిపిస్తున్నావు. భయంగా ఉంది.(36)

37. శ్లో. తన్మే ధర్మభృతాం శ్రేష్ఠ
స్థానం నిర్దేష్టుమర్హసి ॥
యత్రైవ నియతో వత్స్య
ఆతిష్ఠంస్తేஉనుశాసనమ్ ॥

టీ:- తదితి. తత్తస్మాన్నియతో నిశ్చలః. వత్స్యామి.(37)

**సూత ఉవాచ.**

38. శ్లో. అభ్యర్థిత స్తదా తస్మై
స్థానాని కలయే దదౌ ।
ద్యూతం పానం స్త్రియస్సూనాః
యత్రాధర్మశ్చతుర్విధః ॥

టీ:- అభ్యర్థిత ఇతి. పానం మద్యాది.సూనాః ప్రాణివధాః ద్యూతే అనృతం, పానేమదః దయానాశకత్వేనోక్తః. అత్రతు గర్వద్వారా తపోనాశకత్వేనోక్తః స్త్రీషు సంగః.హింసాయాం క్రౌర్యం దయానాశకమితి జ్ఞేయం. యద్యపి సర్వం సర్వత్రాపి సంభవతి. తథాపి ప్రాధాన్యేనానృతా దీనాం ద్యూతాదిషు యథాసంఖ్యం జ్ఞేయం. ద్వాదశస్కంధే తు,శ్లో.

ఓ ధార్మిక శ్రేష్ఠా ! నాకు నివాస స్థానమును చూపించుము. నీ ఆజ్ఞను పాటిస్తూ అక్కడే నియతముగా స్థిరముగా నివసిస్తాను. (37)

**సూతుడు చెపుతున్నాడు.**

అలా యాచించిన కలికి పరీక్షిత్తు నివాసస్థానాలు చూపించి ఇచ్చాడు. ద్యూతము, మద్యపానము, ప్రాణివధ, దుష్ట స్త్రీలు, ఈ నాలుగు అధర్మములు ద్యూతమున అసత్యము, పానమున మత్తు, స్త్రీ విషయమున కామాసక్తి, హింసలో క్రౌర్యము ఉండును. ఇంతకుముందు మదమనగా దయానాశనమని చెప్పబడినది. ఇచట గర్వము ద్వారా తపస్సు నశించునని అది స్త్రీ సాంగత్యము వలన నశించుననియు చెప్పబడినది హింస ఉన్నచో తపస్సు, దయయు నశించును. అయితే ఇవన్ని అంతట ఉండును కాని ప్రధానముగా అసత్యాదులు ద్యూతాదులకు విషయాలని తెలియదగును. భాగవత ద్వాదశ స్కంధమున 'సత్యం దయా తపోదానమితి పాదా విభోర్నృప' అనుచోట దాన శబ్దములో శౌచము చెప్పబడినది. శౌచము

"సత్యం దయా తపో దానమితి, పాదా విభోర్నృప" ఇత్యత్ర దానశబ్దేన శౌచమేవోక్తం. మనశ్శుద్ధిరూపత్వాత్. భూతాభయదాన మిత్యర్థః. శ్లో. "త్రేతాయాంధర్మ పాదానాంతుర్యాంశో హీయతే శనైః, అధర్మపాదైరనృత హింసా సంతోషవిగ్రహైః". ఇత్యత్ర చ అసంతోషశబ్దేన తస్య హేతుర్గర్వో లక్ష్యతే. విగ్రహశబ్దేనతద్ధేతుః స్త్రీసంగ ఇత్యవిరోధః.(38)

మనశ్శుద్ధిరూపము కావున త్రేతాయుగమున ధర్మము యొక్క నాలుగవ పాదము మెల్లగా క్షీణించును. అధర్మపాదములగు అనృతహింసా సంతోష నిగ్రహములచేత ' అనుచోట అసంతోష శబ్దము చేత దానికి కారణమగు గర్వము చెప్పబడును. నిగ్రహ శబ్దముతో దానికి కారణమగు స్త్రీ సాంగత్యము చెప్పబడినది. కావున విరోధము లేదు. (38)

39. శ్లో. పునశ్చ యాచమానాయ
జాతరూపమదాద్విభుః ।
తతోఽనృతం మదః కామో
రజో వైరం చ పంచమమ్ ॥

టీ:- పునరితి. చతుర్విధస్యాప్యేకత్రైవావస్థానం. దేహీతి పునర్యాచమానా య జాతరూపం సువర్ణః ఆదాత్ దత్తవాన్. తతస్సువర్ణ దానాదనృతం. మదం కామమితిసంగం రజఇతి రజోమూలాం హింసాం. చత్వారిచైతాని. పంచమం వైరం చాదాదితి.(39)

మరల ఈ నాలుగు ఉండే ఒక ఒకచోటును కూడ ఇవ్వండని కలి అడుగగా పరీక్షిత్తు బంగారమును ఒసంగెను. బంగారమున్నచోట అసత్యము, మదము, కామము, రజోగుణము, క్రౌర్యము ఈ ఐదును ఉండును.(39)

40. శ్లో. అమూని పంచస్థానాని
హ్యధర్మప్రభవః కలిః ।
ఔత్తరేయేణ దత్తాని
న్యవసత్తన్నిదేశకృత్ ॥

టీ:- అమూనీతి. అమూని అమీషు స్థానేషు న్యవసదిత్యర్థః.(40)

ఉత్తర కుమారుడగు పరీక్షిత్తు చేత ఈ ఐదు స్థానాలు కలికి ఒసగబడినవి. అధర్మరూపుడగు కలి ఆతని ఆదేశాన్ని పాటిస్తూ వీటి యందు నివసించెను.(40)

41. శ్లో. అథైతాని న సేవేత
బుభూషుః పురుషః క్వచిత్ ।
విశేషతో ధర్మశీలో
రాజా లోకపతిర్గురుః ॥

టీ:- అథేతి. ఏతాని బుభూషుః భవితుమిచ్ఛుః. స్త్రీసువర్ణయోరసేవనం నామ తయోరనాసక్తిః.(41)

అందువలన ఉత్తముడుగా ఉండదలచిన పురుషుడు వీటిని సేవించరాదు. స్త్రీలను, బంగారాన్ని, సేవించకపోవడమంటే వాటి యందు ఎక్కువ ప్రేమ చూపకుండుట. విశేషించి ధార్మికుడు లోకానికి గురువుగా ఆదర్శప్రాయముగా ఉండే రాజు వీటి విషయమున జాగ్రత్తపడవలెను.(41)

42. శ్లో. వృషస్య నష్టాం స్త్రీన్ పాదాన్
తపశ్శౌచం దయామితి ।
ప్రతిసందధ ఆశ్వాస్య

ఈ విధముగా కలిని నిగ్రహించి, ధర్మాన్ని ఓదార్చి, వృషరూపమున ఉన్న ధర్మము యొక్క నశించిన తపస్సు, శౌచము, దయ అను పాదాలను పునరుద్ధరించెను. పరీక్షిత్తు రాజ్యమున కాలము కృతయుగము వలె నాలుగు పాదాల ధర్మముతో విలసిల్లెను.(42)

మహీం చ సమవర్షయత్ ॥

టీ:- వృషస్యేతి. ఏవం కలిం నిగృహ్య, వృషస్య పాదాన్ ప్రతిం సదధే, తప ఆదీని ప్రవర్తితవానిత్యర్థః.(42)

43. శ్లో. స ఏష ఏతర్హ్యధ్యాస్తే
ఆసనం పార్థివోచితమ్ ।
పితామహేనోపన్యస్తమ్
రాజ్ఞాఽరణ్యం వివిక్షతా ॥

44. శ్లో. ఆస్తేఽధునా స రాజర్షిః
కౌరవేంద్రశ్రియోల్లసన్ ।
గజాహ్వయే మహాభాగః
చక్రవర్తీ బృహచ్ఛ్రవాః ॥

టీ:- యుష్మదీయసత్రప్రవృత్తిరపి తత్ప్రభావాదేవేత్యాహ-త్రిభిః స ఇతి. ఏతర్హి ఇదానీం, యుధిష్ఠిరేణ అరణ్యం ప్రవేష్టుమిచ్ఛతా ఉపన్యస్తం సమర్పితమాసనం అధ్యాస్తే. అధునా ఆస్తే పాలయతీతి చ. వర్తమానసామీప్యే వర్తమానవన్నిర్దేశః స్మేత్యధ్యాహారోవా. (43,44)

మీ సత్రయాగ ప్రవృత్తి కూడ దాని ప్రభావముననే జరుగుతున్నదని మూడు శ్లోకాలతో తెల్పుతున్నాడు. ధర్మరాజు అరణ్యానికి వెళుతూ కురురాజులకు ఉచితమైన పరంపరాగతమైన సింహాసనాన్ని, ఇప్పుడు పరీక్షిన్మహారాజు అధిష్ఠించి ఉన్నాడు.(43)

రాజర్షియైన ఆ పరీక్షిన్మహారాజు కౌరవ, పాండవుల రాజ్యలక్ష్మిచే ప్రకాశిస్తూ, చక్రవర్తియై, గొప్ప కీర్తికలవాడై హస్తినాపురమందు ఇంకను నివసిస్తున్నాడు.(44)

45. శ్లో. ఇత్థం భూతానుభావో౽యం
అభిమన్యుసుతో నృపః ।
యస్య పాలయతః క్షోణీం
యూయం సత్రాయ దీక్షితాః ॥

టీ :- సత్రాయ సత్రం కర్తుం దీక్షితాః దీక్షాం కృతవంతః. ఇతి.(45)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం**
**సంహితాయాం ప్రథమేస్కంధే భావార్థదీపికాయాం**
**సప్తదశోధ్యాయః**

శౌనకాది మునులారా ! అభిమన్యుని పుత్రుడగు పరీక్షిన్మహారాజు ఇంతటి గొప్ప గుణాలు కలవాడు, మహనీయుడు. ఆ రాజు పరిపాలిస్తుండగనే మీరు సత్రయాగము చేయుటకు ఉపక్రమించితిరి. (45)

**శ్రీమద్భాగవతము యొక్క ప్రథమస్కంధ**
**సప్తశాధ్యాయమునకు శ్రీధరీయవ్యాఖ్యానుసార**
**ఆంధ్రానువాదము ముగిసినది.**

## అష్టాదశోఽధ్యాయః

**సూత ఉవాచ.**

1. శ్లో. యో వై ద్రౌణ్యస్త్ర విప్లుష్టో
న మాతురుదరే మృతః ।
అనుగ్రహాద్భగవతః
కృష్ణస్యాద్భుత కర్మణః ॥

టీ:- శ్లో.రాజ్ఞస్త్వష్టాదశే తస్య బ్రహ్మశాపో నిరూప్యతే, స చానుగ్రహ ఏవాస్య జాతో వైరాగ్యమావహన్. పరీక్షితో నిర్యాణ మత్యాశ్చర్యం వక్తుం తత్సంభావనాయ జన్మాశ్చర్య మనుస్మారయతి-య ఇతి.విప్లుష్టో నిర్దగ్ధస్సన్(1)

2. శ్లో. బ్రహ్మశాపోత్థితాసోస్తు
తక్షకాత్ప్రాణవిప్లవాత్ ।
న సంముమోహోరుభయాత్
భగవత్యర్పితాశయః ॥

టీ:- బ్రహ్మేతి. బ్రహ్మశాపోత్థితాత్తక్షకాత్ యః ప్రాణ విప్లవః ప్రాణనాశః,ఉరుభయం చ. యస్మాత్.న సంముమోహ. అత్రహేతుః

## అష్టాదశాధ్యాయము

**సూతుడు ఇట్లు పలికెను.**

పరీక్షిత్తునకు బ్రాహ్మణశాపము ఈ పదునెనిమిదవ అధ్యాయమున నిరూపించబడుచున్నది. ఆ శాపము రాజుగారికి వైరాగ్యాన్ని కలిగించి అనుగ్రహముగా మారినది. అశ్వత్థామ ప్రయోగించిన అస్త్రముచే దహింపబడియు, అద్భుత లీలగల కృష్ణభగవానుని అనుగ్రహముతో ఏ పరీక్షిత్తు తల్లి గర్భమున చావక జీవించెనో, ఆ పరీక్షిత్తు నిర్యాణము కూడా ఆశ్చర్యకరము. ఆయన జన్మము ఆశ్చర్యమని ముందే తెలియును కదా ! (1)

బ్రాహ్మణ (శృంగి) శాపముతో తక్షకుని వలన ప్రాణాపాయము అను పెద్ద భయము పరీక్షిత్తుకు కలిగినను, ఆతని మనస్సు భగవంతుని యందు అర్పింపబడుటచే మోహము నేమాత్రము పొందలేదు. ఏ మాత్రము భయపడలేదు.(2)

– యస్తు భవత్యేవార్పితాశయ ఇతి.(2)

3. శ్లో. ఉత్సృజ్య సర్వతస్సంగం
విజ్ఞాతాఽజితసంస్థితిః ।
వైయాసికేర్జహౌ శిష్యో
గంగాయాం స్వకలేవరమ్ ॥

టీ:– ఉత్సృజ్యేతి. కింతు వైయాసికేః శుకస్య శిష్యస్సన్. విజ్ఞాతా అజితస్య హరేః సంస్థితిః. తత్త్వం యేన సః.(3)

వ్యాసుని కుమారుడగు శుకమహర్షికి పరీక్షిత్తు శిష్యుడయి, ఈశ్వరతత్త్వము తెలిసికొని, సర్వసంగపరిత్యాగముచేసి, గంగాతీరమున తన శరీరమును వదిలివేసెను.(3)

4. శ్లో. నోత్తమశ్లోకవార్తానాం
జుషతాం తత్కథామృతమ్ ।
స్యాత్సంభ్రమోఽంతకాలేఽపి
స్మరతాం తత్పదాంబుజమ్ ॥

టీ:– నైతచ్చిత్ర మిత్యాహ–నేతి. ఉత్తమశ్లోకస్యైవ వార్తా యేషు. తఏవ నిత్యం తత్కథారూపమమృతం జుషమాణానాం సంభ్రమో మోహో న స్యాత్.(4))

ఇది ఆశ్చర్యము కాదని చెపుతున్నాడు. పవిత్రమగు కీర్తిగల భగవానుని వృత్తాంతమును తెలిసికొని, ఆతని కథలు అను అమృతమును తాగువారికి, అంత్యకాలమున ఆ భగవానుని పాదపద్మములను స్మరించు వారికి మోహము, అజ్ఞానము కలుగదు. అనునదేమాత్రమునాశ్చర్యము కాదు.(4)

5. శ్లో. తావత్కలిర్న ప్రభవేత్
ప్రవిష్టోపీహ సర్వతః ।
యావదీశో మహానుర్వ్యాః
ఆభిమన్యవ ఏకరాట్ ॥

టీ:- రాజ్ఞిసురాం తన్న చిత్రమిత్యాశయేనాహ-తావదితి-అభిమన్యోః పుత్ర ఏకరాట్ చక్రవర్తీ ఈశఃతిస్తావత్.(5)

అందులోను పరీక్షిన్మహారాజు విషయమున ఇది ఏమాత్రము ఆశ్చర్యము కాదనుచున్నాడు. అభిమన్యుని కుమారుడగు పరీక్షిత్తు ఏకచ్ఛత్రాధిపత్యముతో ప్రజలను పరిపాలించుచు ఉన్నంత కాలము, కలి అంతటను ప్రవేశించినను దాని ప్రభావము లేకుండెను. అతడు చెడ్డపనులను చేయించుటకు సమర్థుడుకాలేకపోయెను.(5)

6. శ్లో. యస్మిన్నహని యర్హ్యేవ
భగవానుత్ససర్జ గామ్ ।
తదైవేహానువృత్తోऽసౌ
అధర్మప్రభవః కలిః ॥

టీ:- నను కలేరప్రవేశఏవాస్తు. ప్రవిష్టోऽపి న ప్రభవేదితి కుతః? తత్రాహ-యస్మిన్నితి.యర్హి యస్మిన్నేవ క్షణే గాం పృథ్వీం అనువృత్తః ప్రవిష్టః. అధర్మస్య ప్రభవో యస్మిన్(6)

అయితే అపుడు కలి ప్రవేశమే ఉండకూడదు కదా ! ప్రవేశించినా ఆయన ప్రభావము ఉండదనుటెందులకు అనుదానికి చెపుతున్నాడు. ఏ దినమున, ఏ క్షణమున, కృష్ణభగవానుడు భూమిని విడిచి వెళ్ళెనో ఆ క్షణముననే అధర్మాచరణ చేయించు కలి భూమండలమున ప్రవేశించెను. అయినను పరీక్షిత్కాలమున కూడా ఆతడు తన ప్రభావమును చూపలేకపోయెను.(6)

7. శ్లో. నానుద్వేష్టి కలిం సమ్రాట్
సారంగ ఇవ సారభుక్ ।
కుశలాన్యాశు సిద్ధ్యంతి
నేతరాణి కృతాని యత్ ॥

టీ:- నన్వ ధర్మహేతుం కలిం సర్వధా కిం న హతవాన్? తత్రాహ-నేతి.సారంగో భ్రమర ఇవ. సారభుక్ సారగ్రాహీ. సారమాహ-యత్ యస్మిన్ కుశలాని పుణ్యాని ఆశు సంకల్పమాత్రేణ ఫలంతి. ఇతరాణి పాపాని ఆశు న సిద్ధ్యన్తి. యతస్తాని కృతాన్యేవ సిద్ధ్యంతి. న తు సంకల్పితమాత్రాణీతి.(7)

అయితే అధర్మహేతువగు కలిని పరీక్షిత్తు ఎందుకు చంపలేదు? అనుదానికి చెపుతున్నాడు. తుమ్మెద పుష్పసారమును గ్రహించినట్లు కలిలోని విశేషాలను ఆ రాజు గ్రహించి, ఆతనిని ద్వేషించలేదు. మంచి పనులు కలికాలమున త్వరగా సంకల్ప మాత్రముతోనే సిద్ధించును చెడుపనులు ఆచరిస్తేనే గాని ఫలించవు. ఇది కలికాలపు గుణము.(7)

8. శ్లో. కింను బాలేషు శూరేణ
కలినా ధీరభీరుణా ।
అప్రమత్తః ప్రమత్తేషు
యో వృకో నృషు వర్తతే ॥

టీ:- నను దోషాధిక్యాదేష ఏవ యుక్తం:.న ధీరేషు. తస్యాకించిత్కరత్వాదిత్యాహ-కిన్వితి.కి న్ను తేన భవేద్బాలేషు అధీరేషు

అయితే కలిలో దోషాలు ఎక్కువగా ఉన్నందున ద్వేషమే యుక్తముగదా అన్నచో, గొఱ్ఱెల మందలో తోడేలు ప్రవేశించి తినునట్లు, ఆ కలి శూరుడు అవివేకులలో ప్రవేశించి వారిని బాధించును. కాని వివేకవంతులకు భయపడును. ధీరులకు భయపడు కలి ఏమి చేయగలడని ఆ రాజు ఉపేక్షించెను .(8)

అప్రమత్తః అవహితస్సన్యో వృక ఇవ వర్తతే.(8)

9. శ్లో. ఉపవర్ణితమేతద్వః
పుణ్యం పారీక్షితం మయా ।
వాసుదేవ కథోపేతమ్
ఆఖ్యానం యదపృచ్ఛత ॥

టీ:- ఉపవర్ణితమితి. పారీక్షిత మాఖ్యానం అపృచ్ఛత పృష్టవంతః. యూయం. (9)

మీరు అడుగగా నేను ఇంతవరకు పవిత్రమైన పరీక్షిత్తుకు సంబంధించిన, భగవంతుడగు కృష్ణుని కథలతో కూడిన ఆఖ్యానాన్ని మీకు వివరింతిని.(9)

10. శ్లో. యా యాః కథా భగవతః
కథనీయోరుకర్మణః ।
గుణకర్మాశ్రితాః పుంభిః
సేవ్యాస్తాస్తా బుభూషుభిః ॥

టీ:- కిం బహునా. నరైరేతావదేవ కర్తవ్య మితి సర్వశాస్త్రసారం కథయతి-యా యాఇతి. కథనీయాని ఉరూణి కర్మాణి యస్య తస్య, గుణకర్మవిషయాఃబుభూషుభిః సద్భావమిచ్ఛద్భిః.(10)

గొప్ప చిత్ర విచిత్ర కర్మలను చేసిన భగవంతుని యే యే కథలు ఆయన గుణాలను, కర్మలను ఆశ్రయించి తెలుపును. అవన్నియును మంచి భావముకల పురుషులు వినిచెప్పి తరింతురు. ఇతరములతో ఏమి ప్రయోజనమును కలుగదు. ఇదియే సర్వ శాస్త్రార్థ సారము.(10)

**ఋషయ ఊచుః**

11. శ్లో. సూత జీవ సమాస్సౌమ్య
శాశ్వతీర్విశదం యశః ।
యస్త్వం శంససి కృష్ణస్య
మర్త్యానామమృతం హి నః ॥

టీ:- పునర్విస్తరేణ కథనార్థం సూతోక్తం తత్సంగంచాభినందతి-త్రిభిః సూతేతి. శాశ్వతీస్సమాః అనంతాన్ సంవత్సరాన్. జీవ అత్యంతసంయోగే ద్వితీయా. విశుద్ధం యశః కీర్తయసి. తచ్చ అస్మాకం మర్త్యానాం అమృతం మరణనివర్తకం. (11)

**ఋషులు పలుకుచున్నారు.**

భగవత్కథలను ఇంకను విస్తరించి చెప్పుటకు, సూతుని పలుకులను, ఆతని సాంగత్యాన్ని అభినందిస్తున్నారు సూతయని మూడు శ్లోకాలతో. ఓ సౌమ్యుడా! సూతుడా ! నీవు అనేక సంవత్సరాలు జీవించుము. ఎందుకనగా నీవు స్వచ్ఛమైన శ్రీకృష్ణభగవానుని కీర్తిని వర్ణించి చెప్పుచున్నావు. అది మానవులమగు మాకు అమృతముతో సమానము. (11)

12. శ్లో. కర్మణ్యస్మిన్ననాశ్వాసే
ధూమధూమ్రాత్మనాం భవాన్ ।
ఆపాయయతి గోవింద
పాదపద్మాసవం మధు ॥

టీ:- కిం చ. కర్మణీతి. అస్మిన్ కర్మణి సత్రే అనాశ్వాస్యే అవిశ్వసనియే. వైగుణ్యబాహుళ్యేన ఫలనిశ్చయాభావాత్. ధూమేన ధూమ్రః వివర్ణః ఆత్మా శరీరం యేషాం తాన్ అస్మాన్. కర్మణి షష్ఠీ.

అంతేకాదు నమ్మరాని అవగుణములు కలది ఈ సత్రయాగము. ఇందు ఫలము తప్పక కలుగునను నమ్మకమును లేదు. ధూమములతో, మా శరీరములు ధూసరవర్ణములతో నిండినవి. నీవు కృష్ణుని పాదకమలములందున్న కావుననే ఈ సత్త్రయాగము సఫలమైనట్లు మకరందాన్ని మాకు తాపుచున్నావు. ( ఇచట ధూమ్రధూమ్రాత్మనాం అను షష్ఠీ విభక్తి కర్మార్థమున ఉన్నది.) (12)

ఆసవం మకరందం. మధు మధురం .(12).

13. శ్లో. తులయామ లవేనాపి
న స్వర్గం నా పునర్భవమ్ ।
భగవత్సంగిసంగస్య
మర్త్యానాం కిముతాశిషః ॥

టీ:- తులయామేతి. భగవత్సంగినో విష్ణుభక్తః తేషాం సంగస్య యో లవః అత్యల్పః కాలః తేనాపి స్వర్గం తులయామ న సమం పశ్యామ. నచాపవర్గం. సంభావనాయాం లోట్. మర్త్యానాం తుచ్ఛాః ఆశిషః రాజ్యాద్యాః న తులయామేతి కిము వక్తవ్యం. (13).

లేశకాలమైనను, భగవద్భక్తుల యొక్క సాంగత్యమునకు స్వర్గము కూడా సాటికాదు, సరితూగదు. ఇక మానవుల తుచ్ఛమైన రాజ్యాదులకు, భోగాలకు అది ఎట్లు సమానము కాగలదు. ( ఇచట తులయామ అను ధాతువునకు సంభావన రూపమున వచ్చిన లోట్ లకారము. ఉత్తమ పురుష బహువచనము.) (13)

14. శ్లో. కో నామ తృప్యేద్రసవిత్కథాయాం
మహత్తమైకాంత పరాయణస్య ।
నాంతం గుణానామగుణస్య జగ్ముః
యోగేశ్వరా యే భవపాద్మముఖ్యాః ॥

టీ:- ఏవం సత్సంగమభినంద్యశ్రవణౌత్సుక్యమావిష్కుర్వంతి-క ఇతి. రసవిత్ రసజ్ఞః. మహత్తమానామేకాంతేన పరం అయనం ఆశ్రయో యస్య తస్య. కథాయాం అగుణస్య ప్రాకృతగుణరహితస్య.

ఈ విధముగా సత్సంగమును అభినందించి భగవత్కథలను వినగోరు ఉత్కంఠతను తెలుపుతున్నారు ఋషులు కోనామయని. రసజ్ఞతగలవారు, గొప్పవారు ఆశ్రయించదగిన, గుణరహితుని విష్ణుని కథలనువిని, ఎవడు తృప్తినొందును? ఎవడు చాలనును? యోగీశ్వరులు శివుడు బ్రహ్మ ఉన్నగువారు కూడ నిర్గుణుడగు ఆతని అనంతములైన కల్యాణగుణములను తెలిసికోలేరు.(14)

కల్యాణగుణానామంతం. యే మే యోగేశ్వరాస్తేఽపి న జగ్ముః. ఏతవంత ఇతి న పరిగణయాంచక్రుః. భవః శివః. పాద్మోబ్రహ్మో ముఖ్యో యేషాం తే.(14).

15. శ్లో. తన్నో భవాన్ వై భగవత్ప్రధానో
మహత్తమైకాంత పరాయణస్య ।
హరేరుదారం చరితం విశుద్ధం
శుశ్రూషతాం నో వితనోతు విద్వన్ ॥

టీ:- తత ఇతి. నోఽస్మాకం మధ్యే. భగవాన్ ప్రధానం సేవ్యో యస్య సభవాన్. శుశ్రూషతాం నః. ఉదారం పరమపురుషార్థప్రదం హరేశ్చరితం విస్తారయతు.(15).

ఓ విద్వాంసుడా ! భగవంతుడే ముఖ్యముగా సేవించతగిన వాడని తలచువాడవు నీవు. మేమును గొప్పవారికి కూడా తప్పక సేవ్యుడగు భగవంతుని స్వచ్ఛమైన, ఉదారచరితాన్ని వినగోరు చున్నాము. కావున ఆ భగవచ్చరిత మాకు విస్తరించి చెప్పుము.(15)

16. శ్లో. స వై మహాభాగవతః పరీక్షిత్
యేనాపవర్గాఖ్యమదభ్రబుద్ధిః।
జ్ఞానేన వైయాసకిశబ్దితేన ।
భేజే ఖగేంద్రధ్వజపాదమూలమ్ ॥

టీ:- స ఇతి. తచ్చుకపరీక్షిత్సంవాదం నః కథయేత్యాహ-ద్వాభ్యాం. వైయ్యాసికినా శబ్దితేన కథితేన యేన జ్ఞానేన జ్ఞానసాధనేన అపపర్గ

భాగవతోత్తముడగు ఆ పరీక్షిన్మహారాజు గొప్ప బుద్ధితో, వ్యాసమునీంద్రుని కుమారుడైన శుకమహర్షిచే బోధింపబడి, ఆ జ్ఞానముచేత గరుడధ్వజుని విష్ణుని పాదమూలమును అపవర్గమును మోక్షమును పొందెను. భాగవత శ్రవణముచేతనే మోక్షాన్ని పొందెను. (16)

ఇత్యాఖ్యా యస్య తత్ ఖగేంద్రధ్వజస్య హరేః పాదమూలం భేజే. (16).

17. శ్లో. తన్నః పరం పుణ్యమసంవృతార్థమ్
ఆఖ్యానమత్యద్భుతయోగనిష్ఠమ్ ।
ఆఖ్యాహ్యనంతాచరితోపపన్నం
పారీక్షితం భాగవతాభిరామమ్ ॥

టీ:- తదితి. తత్ అసంవృతార్థం యథాతథా ఆఖ్యాహి. తదేవ నిర్దిశతి - పరీక్షితే కథితం పారీక్షతం. ఆఖ్యానం భాగవతం పురాణం. పరమం పుణ్యసత్త్వశోధకం.అత్యద్భుతే యోగే నిష్ఠా యస్య, అనం తస్యాచరిత్రై రుపపన్నం యుక్తం అత ఏవ భాగవతానామభిరామం ప్రియం, ఏతైర్విశేషణైః కర్మజ్ఞాన భక్తియోగప్రకాశకత్వం దర్శితం.(17)

**సూత ఉవాచ.**

18. శ్లో. అహో వయం జన్మభృతోఽద్యహాస్మ
వృద్ధానువృత్త్యాపి విలోమజాతాః ।
దౌష్కుల్యమాధిం విధునోతి శీఘ్రం
మహత్తమానామభిధానయోగః ॥

టీ:- శ్రీభాగవతస్యవ్యాఖ్యానేలబ్ధప్రసంగం మహతామాదరపాత్ర

అట్టి ఉత్కృష్ట పుణ్యప్రదమైన శ్రీమద్భాగవత పురాణమును రహస్యము లేకుండగ మాకు స్పష్టముగా వివరించి చెప్పవలయును. ఆ భాగవతము శుకమహర్షిచే పరీక్షిన్మహారాజుకు బోధించబడినది. భగవద్భక్తులకు మిక్కిలి ఇష్టమైనది. భగవంతుని చరితములతో నిండియుండును. ఆశ్చర్యకరమగు యోగనిష్ఠగలది. కావుననే భాగవతము జ్ఞాన, భక్తి యోగములను ప్రకాశింపచేయునది. కనుక మాకు ఉపదేశింపుము.(17)

**సూతుడు పలుకుచున్నాడు.**

భాగవతము చెప్పుటవలన లభించిన గొప్పఫలము పొందిన తనను ప్రశంసించుకొనుచున్నాడు "అహో " అని రెండు శ్లోకములచేత. ఓ ఋషులారా! ఎంత ఆశ్చర్యము ! మేము విలోమ కులమునకు చెందినవారము. తల్లి ఉత్తమకులమురాలు మా తండ్రి తక్కువ కులమువాడు అయినను జ్ఞాన వృద్ధుడగు శుకుని సేవాభాగ్యము దొరుకుట వలన మా జన్మ సఫలమైనది. ( వయమని బహువచనము చెప్పుట గొప్పతనమును సూచించును.) చెడ్డకులమున పుట్టుటవలన

మాత్మానం శ్లాఘతే-ద్వాభ్యాం.అహో ఇతి, అహో ఇత్యాశ్చర్యే, హేతి హర్షే. వయ మితి శ్లాఘాయాం , ప్రతిలోమజా అపి అద్య జన్మభృతః సఫలజన్మానః ఆస్మ జాతాః. వృద్ధానామనువృత్త్యా ఆదరేణ. జ్ఞానవృద్ధః శుకః తస్య సేవయేతి వా. యతో దుష్కులత్వం. తన్నిమిత్తమాధిం య మనఃపీడాం చ. మహత్తమానామభిధానయోగఃలౌకికోఽపి సంభాషణ లక్షణసంబంధః, విధునోతి అపనయతి.(18)

19. శ్లో. కుతః పునర్గృణతో నామ తస్య
మహత్తమైకాంత పరాయణస్య ।
యోఽనంతశక్తిర్భగవాననంతో
మహద్గుణత్వాద్యమనంతమాహుః ॥

టీ:- కుత ఇతి, కుతః పునః కిం పునర్వక్తవ్యం. తస్య అనంతస్య నామ గృణం తః పుంసః. మహత్తమానామభిధానయోగో దౌష్కుల్యం విధునోతీతి. యద్వా-నామ గృణతః కుతః పునర్దౌష్కుల్యమితి. యద్వా-గృణతః పుంసః తస్య నామ దౌష్కుల్యం విధునోతీతి కిం వక్తవ్యమితి కైముతికన్యాయమేవాహ - అనంతాః శక్తయో యస్య. స్వతోఽప్యనంతః కించ మహత్సుగుణా యస్య సః మహద్గుణస్తస్య భావస్తత్వం తస్మాత్. యం గుణతోఽప్యనంతమాహుః. (19).

కలిగిన బాధ, దోషము మీ వంటి పెద్దలతో సంభాషణము వలన తొలగిపోయినది.(18)

ఆ భగవానుని నామములను, గుణములను కీర్తించుట గురించి ఏమి చెప్పవలెను. మహాత్ములచేత కూడా ఆశ్రయించతగినవాడుకదా ఆ భగవానుడు. అట్టి వాని నామమును గ్రహించువానికి దుష్కులమెక్కడిది? ఆ నామము దుష్కులత్వాన్ని పోగొట్టునని ఏమి చెప్పవలయును ( ఇది కైముత్తిక న్యాయము.) అనంతశక్తి, అనంతగుణములు కలవాడు కనుకనే ఆ కృష్ణభగవానుడు అనంతుడు. అట్టి అనంతుడు నన్ను తరింపజేయును.(19)

20. శ్లో. ఏతావతాఽలం నను సూచితేన
గుణైరసామ్యానతిశాయనస్య ।
హితేతరాన్ ప్రార్థయతో విభూతిః
యస్యాంఘ్రి రేణుం జుషతేఽనభీప్సోః ॥

టీ:- ఏతత్ప్రపంచయతి - త్రిభిః. ఏతావతేతి. తస్య యదసామ్యం. అనతిశాయనం. గుణైః తత్సామ్యం తదాధిక్యం చ. అన్యస్య నాస్తీత్య స్యార్థస్య జ్ఞానాయ. ఏతావతా సూచితేన నను అలం పర్యాప్తం. కస్తద్విస్తరతో వక్తుం శక్నోతీత్యర్థః. తదేవాహ-ఇతరాన్. ప్రార్థయతః బ్రహ్మాదీన్ ప్రార్థయమానాన్హిత్వా. విభూతిః శ్రీః అనభీప్సోరపి యస్యాంఘ్రిరేణుం జుషతే సేవత ఇతి.(20)

దానినే విస్తరిస్తున్నాడు 'ఏతావతా' అని ప్రారంభించి మూడు శ్లోకాలతో. లక్ష్మీదేవి తనను ప్రార్థించుచున్న బ్రహ్మాది దేవతలను వదలి, తనను కోరకున్నను ఆ భగవంతుని పాదధూళిని ఆశ్రయించి ఆయనను సేవించుచున్నది. గుణములలో పరమేశ్వరునికి సమానుడుగాని అధికుడుకాని లేడు అనుటకు ఇది ఒక నిదర్శనము చాలును. ఎవడు ఇంతకంటెను ఎక్కువగా చెప్పగలడు.(20)

21. శ్లో. అథాపి యత్పాద నఖావసృష్టం
జగద్విరించోపహృతార్హణాంభః ।
సేశం పునాత్యన్యతమో ముకుందాత్
కో నామ లోకే భగవత్పదార్థః ॥

టీ:- అథేతి. అథేత్యర్థాన్తరే. యస్య. పాదనఖాదవసృష్టం నిస్సృతమపి

అంతేకాదు బ్రహ్మదేవునిచేత కడుగబడిన భగవంతుని పాదముల నుండి జారిన గంగోదకము ఈశ్వరుని నెత్తినబడి, ఆయనతో సహా ఈ జగత్తునంతను పవిత్రము చేయుచున్నది కదా! అట్టి ముకుందునికన్న ఈ లోకమున ఇతరుడు ఎవ్వడు భగవత్పదము నకు అర్థము, అర్హము. షడ్గుణైశ్వర్య సంపదకల భగవంతుడు ఆయనే. ఆరు గుణములనగా సమగ్ర ఐశ్వర్యము, ధైర్యము, కీర్తి, లక్ష్మి, జ్ఞానము, వైరాగ్యము.(21)

విరించేనోపహృతం సమర్పితం. అర్హణాంభః అర్ఘోదకం. ఈశసహితం జగత్పునాతి. విరించోపహృతం సేశమితి తయేరప్యుపాసకత్వముక్తం. తస్మాన్ముకుందవ్యతిరిక్తః కో నామ భగవత్పదస్యార్థః. సఏవ సర్వేశ్వర ఇత్యర్థః.(21).

22\. శ్లో. యత్రానురక్తాస్సహసైవ ధీరా
వ్యపోహ్య దేహాదిషు సంగమూఢమ్ ।
వ్రజంతి తత్పారమహంస్యమంత్యం
యస్మిన్నహింసోపశమస్స్వధర్మః ॥

టీ:- యత్రేతి. ధీరాస్సంతః. ఊఢం ధృతం.అంత్యం పరమకాష్ఠా పన్నం తదాహ-యస్మిన్ అహింసా ఉపశమశ్చ స్వాభావికో ధర్మః (22)

23\. శ్లో. అహం హి పృష్టోఽర్యమణో భవద్భిః
ఆచక్ష ఆత్మావగమోఽత్ర యావాన్ ।
నభః పతంత్యాత్మసమం పతత్రిణః
తథా సమం విష్ణుగతిం విపశ్చితః ॥

టీ:- ఏవం స్వభాగ్యమభినంద్య పారీక్షితోపాఖ్యానం వక్తుమాహ -

పరమేశ్వరునియందు విశేషభక్తిగల ధీరులు దేహము మొదలైన వానియందు దృఢముగా ఉన్న ఆసక్తిని వదలి అహింస, సర్వకర్మసంన్యాసము స్వధర్మముగా ఉండు సంన్యాసాశ్రమమును పొందుదురు. భగవద్భక్తులు ఐహిక విషయవాంఛలను వదిలి మోక్షేచ్ఛ గలవారై మాత్రమే ఉందురు.(22)

సూర్యునివలె ప్రకాశించు ఓ మహాత్ములారా ! మీరు అడిగిన భగవత్కథను నాకు తెలిసినంతవరకు వినిపించెదను. విస్తారమైన ఆకాశమున పక్షులు తమ శక్తికొలదియే ఎగురగలవు. ఆకాశమంతట ప్రయాణించలేవు.అదే విధముగా విద్వాంసులు కూడా భగవంతుని అనంతమైన లీలను తమ బుద్ధికి అందినంత వరకే చెప్పగలరు. (23)

అహమితి. హే అర్యమమణః సూర్యాః త్రయీమూర్తయః. ఆత్మావగమో మమ జ్ఞానం తావదాచక్షే ప్రవక్ష్యామి తథాహి యథా పక్షిణో నభ ఆత్మ సమం స్వశక్త్యనురూపేమేవోత్పతంతి. నకృత్స్నం తథా విపశ్చితోపి విష్ణోర్గతిం లీలాం సమం స్వయత్యనురూపమేవ వదన్తీత్యర్థః(23).

24. శ్లో. ఏకదా ధనురుద్యమ్య
విచరన్ మృగయాం వనే ।
మృగాననుగతః శ్రాంతః
క్షుధితస్తృషితో భృశమ్ ॥

టీ:- సంప్రతి కథాముపక్షిపతి - ఏకదేతి. మృగాననుగతోఽను గచ్ఛన్ శ్రాంతశ్చ తృషితశ్చ క్షుధితశ్చ బభూవ. (24).

ఒకప్పుడు పరీక్షిన్మహారాజు ధనుర్ధారియై వేటకు వెళ్ళి, వనమున మృగముల వెంబడించి, అలసిపోయి మిక్కిలి ఆకలి, దప్పిక కలవాడాయెను. (24)

25. శ్లో. జలాశయమచక్షాణః
ప్రవివేశ తదాశ్రయమ్ ।
దదర్శ మునిమాసీనం
శాంతం మీలితలోచనమ్ ॥

టీ:- జలాశయమితి. అచక్షాణః అపశ్యన్. తం ప్రసిద్ధమాశ్రమం.

ఎక్కడా జలాశయము కనిపించక నీరు దొరకక ప్రసిద్ధమగు శమీకమహాముని ఆశ్రమము చేరి, అచట కన్నులు మూసికొని తపస్సు చేస్తూ సమాధిలో ఉన్న ప్రశాంతుడగు శమీకమహామునిని చూచెను. (25)

తస్మింశ్చ మునిం శమీకం .(25)

26. శ్లో. ప్రతిరుద్ధేంద్రియ ప్రాణ
మనోబుద్ధిముపారమత్ ।
స్థానత్రయాత్పరం ప్రాప్తం
బ్రహ్మభూతమవిక్రియమ్ ॥

టీ:- ప్రతిరుద్ధేతి. ప్రతతిరుద్ధాః ప్రత్యాహృతాః ఇంద్రియాదయో యేన. అతఏవఉపరతం. స్థానత్రయాత్పరం జాగ్రదాదిలక్షణాత్పరం తురీయం పదం ప్రాప్తం. అత ఏవ బ్రహ్మభూతత్వాదవిక్రియం.(26).

పరీక్షిత్తు త్వగాదీంద్రియములు, ప్రాణములు, మనస్సు, బుద్ధిని నిగ్రహించినవాడు, జాగ్రత్స్వప్న సుషుప్తులను మూడు అవస్థలకంటె విశిష్టమైన నాలుగవ స్థానాన్ని పొందినవాడు. కనుకనే బ్రహ్మాత్మ భావాన్ని పొంది ఏవికారము లేని నిర్వికల్ప సమాధిలో ఉన్న శమీకమహర్షిని చూచెను, సమీపించెను. (నీరు అడిగెనని ముందటి శ్లోకముతో అన్వయము.) (26)

27. శ్లో. విప్రకీర్ణజటాచ్ఛన్నం
రౌరవేణాజినేన చ ।
విశుష్యత్తాలురుదకం
తథాభూతమయాచత ॥

టీ:- విప్రకీర్ణేతి. విప్రకీర్ణాభిర్జటాభిః ఆచ్ఛన్నం రురుః మృగవిశేషః తస్య చర్మణా చాచ్ఛన్నం విశేషేణ శుష్యన్ తాలుర్యస్యసః తాథాభూతం మునిముదకమయాచత.(27).

విరబోసి ఉన్న జడలతో కప్పిపుచ్చబడినవాడు రురుమృగ చర్మముతో ఆచ్ఛాదింపబడిన శరీరముగలవాడు, ఎండిపోయిన దవడలు కలిగి సమాధిస్థుడై ఉన్న శమీకమహామునిని దాహముతో బాధపడుతున్న పరీక్షిత్తు అతని స్థితిని గమనించకయే నీరు అడిగెను. (27)

28. శ్లో. అలబ్ధతృణ భూమ్యాదిః
అసంప్రాప్తార్ఘ్యసూనృతః ।
అవజ్ఞాతమివాత్మానం
మన్యమానశ్చుకోప హ ॥

టీ:- అలబ్ధేతి. న లబ్ధం తృణం తృణాసనం. భూమ్యాదిరుపవేశస్థానం చ యేన సః. న సంప్రాప్తం అర్ఘ్యం సూనృతంప్రియవచనం చ యేన సః. (28)

శమీకాశ్రమమున తాను కూర్చొనుటకు తగిన దర్భాసనమును గాని, భూమినిగాని, స్థలమునుగాని అర్ఘ్యమునుకాని, సత్యవాక్కుతో కూడిన మర్యాదపూర్వక స్వాగతవాక్కునుగాని పొందకుండుటచే, అది తనకు అవమానమని భావించి పరీక్షిన్మహారాజు మునిపై కోపగించెను. (28)

29. శ్లో. అభూతపూర్వస్సహసా
క్షుత్తృడ్భ్యామర్దితాత్మనః ।
బ్రాహ్మణం ప్రత్యభూద్రాజ్ఞో
మత్సరో మన్యురేవ చ ॥

టీ:- అభూతేతి. మత్సరః తదుత్కర్షాసహనమ్. (29).

ఓ శౌనకా ! ఆకలి దప్పులచే అలమటిస్తున్న పరీక్షిన్మహారాజుకు ఎన్నడూ లేనటువంటి మాత్సర్యము, కోపము ఆ శమీకమహర్షిపై కలిగెను. (29)

30. శ్లో. స తు బ్రహ్మఋషేరంసే
గతాసుమురగం రుషా ।
వినిర్గచ్ఛన్ ధనుష్కోట్యా
నిధాయ పురమాగతః ॥

టీ:- స ఇతి, గతాసుంమృతం. ధనుష్కోట్యా చాపాగ్రేణ.(30).

ఆ పరీక్షిన్మహారాజు కోపముతో తన ధనుస్సుకొనచేత చచ్చిపడియున్న పామును లాగితెచ్చి బ్రహ్మర్షియగు శమీకమహాముని భుజములపై పడవేసి తన పురమునకు వెళ్ళిపోయెను. (30)

31. శ్లో. ఏష కిం నిభృతాశేష
కరణోమీలితేక్షణః ।
మృషా సమాధిరాహోస్వి
త్కింనుస్యాత్ క్షత్రబంధుభిః ॥

టీ:- ఏష ఇతి. సర్పనిదానే రాజ్ఞోఽభిప్రాయమాహ - ఏష కిం ప్రత్యాహృతసర్వేంద్రియస్సన్ మీలితేక్షణః స్థితః. యద్వా - క్షత్రబందుభిః ఆగతైర్గతైర్వాకిన్ను స్యాదిత్యవజ్ఞయా మృషాసమాధిస్సన్ ఇతి జ్ఞాతుమిత్యర్థః. (31).

పామును మెడలో వేయుటలో రాజు అభిప్రాయమేమి? అనుదానికి "ఏష కిం" అని చెప్పుచున్నాడు. ఇంద్రియములనన్నింటిని వాటి వాటి పనులనుండి మరల్చి కన్నులు మూసికొని నిజంగా సమాధిలోనున్నాడా ? లేక ఈభ్రష్ట క్షత్రియులు వస్తేనేమి పోతేనేమి అని నిర్లక్ష్యము, అవమానముతో అబద్ధాల సమాధిలో నున్నాడా? నిజము తెలికోవాలని పరీక్షిత్తు మునిమెడలో సర్పశవమును వేసినాడు. (31)

32. శ్లో. తస్య పుత్రోఽతి తేజస్వీ
విహరన్ బాలకోఽర్భకై ।
రాజ్ఞాఘం ప్రాపితం తాతం
శ్రుత్వా తత్రేదమబ్రవీత్ ॥

టీ:- తస్యేతి. తస్య పుత్రః శృంగీనామా. అతితేజస్వీ తపోబల సంపన్నః. అఘం దుఃఖః తత్రార్భకమధ్యే. (32).

ఆ శమీక మహాముని కుమారుడు శృంగియను వాడు మహాతేజోవంతుడు, తపోబలము కలవాడు. పిల్లల మధ్య తిరుగుతూ రాజు తన తండ్రి యెడ పెద్దతప్పు పాపము చేసినాడని విని అచటికి వెళ్ళి ఇట్లనెను.(32)

33. శ్లో. అహో అధర్మః పాలానాం
పీవ్నాం బలిభుజామివ ।
స్వామిన్యఘం యద్దాసానాం
ద్వారపానాం శునామివ ॥

టీ:- అహో ఇతి. పాలానాం రాజ్ఞాం పీవ్నాం పుష్టానాం. అధర్మమేవ దర్శయతి- స్వామినీతి. దాసానాం యదఘం పాపాచరణం. బలిభుజాం కాకానామివ శునామివ చేతి.(33).

బలిసిన ఈ రాజుల అధర్మమేమి అధర్మము ! ఎంత ఆశ్చర్యము! బలిఅన్నము తిను కాకులు, తలుపు దగ్గర దాసులవలె కాపలా ఉండెడి కుక్కలు ,తమ ప్రభువు యెడ పాపమును ఆచరించునట్లున్నది. గుమ్మము దగ్గర కాపలా కాసే కుక్కలు లోపల జొరబడి తమ స్వామికి అపకారము చేసినట్లున్నది.(33)

34. శ్లో. బ్రాహ్మణైః క్షత్రబంధుర్హి
ద్వారపాలో నిరూపితః ।
స కథం తద్గృహే ద్వాస్థ
స్సభాండం భోక్తుమర్హతి ॥

టీ:- దాసత్వం దర్శయతి. బ్రాహ్మణైరితి. సభాండం భాండ ఏవ స్థితం. (34).

అయోగ్యుడగు క్షత్రియుడు బ్రాహ్మణుల ఇంటి దగ్గర కాపలా ఉండు ద్వారపాలకుడుగా ఉండదగినవాడు. అట్టి ద్వారపాలకుడు ఇంటిలో జొరబడి గిన్నెలోని అన్నమును తినుటకెట్లుతగును. (34)

35. శ్లో. కృష్ణే గతే భగవతి
శాస్తర్యుత్పథగామినామ్ ।
తద్భిన్నసేతూనద్యాహం
శాస్మి పశ్యత మే బలమ్ ॥

టీ:- కృష్ణ ఇతి. తత్ తదనంతరం. అహం శాస్మి దండయామి.(35).

మర్యాదను తప్పి ప్రవర్తించు వారిని శాసించే కృష్ణుడు వెళ్ళిపోగా, దుర్మార్గమున ప్రవర్తిస్తున్న రాజులను నేను నేడు శాసించి దండింతును. నా బలమును చూడండి. అని శృంగి తన స్నేహితులతో అనెను .(35)

36. శ్లో. ఇత్యుక్త్వా రోషతామ్రాక్షో
వయస్యానృషి బాలకాన్ ।
కౌశిక్యాప ఉపస్పృశ్య
వాగ్వజ్రం విససర్జహ ॥

ఈ విధముగా తన చెలికాండ్రు, ఋషి బాలకులతో పలికి, కోపముతో కన్నులు ఎఱ్ఱబడగా కౌశికీనది నీటిని చేత పుచ్చుకొని తన వాక్కను వజ్రమును వదిలెను. శాపమునిడెను. (ఇచట కౌశిక్యాప అను చోట దీర్ఘసంధి ఆర్షము.) (36)

టీ:- ఇతీతి. ఇతి వయస్యానుక్త్వా. రోషేణ తామ్రే అక్షిణీ యస్య. కౌశికీ నదీ. తస్యా అపః సంధిరార్షః(కౌశిక్యప ఇతి పాఠాంతరే న కాప్యనుపపత్తిః.) వాగ్వజ్రంశాపం.(36)

మర్యాదను ఉల్లంఘించి, మానాన్న గారికి ద్రోహం చేసిన ఆ రాజును, కులానికి నిప్పులాంటివాడై పాపముచేసి వంశనాశమును చేసుకొన్న ఆ రాజును, నాచే ప్రేరేపింపబడిన, తక్షకుడు నేటికి ఏడవరోజున కరచి చంపును. (ఇచట స్మ అను అవ్యయము పాదపూరణము కొఱకు వేయబడినది. తు హి చ స్మ వై పాదపూరణేఅని. ఈ నాలుగు పాదపూరణములు. దంక్ష్యతి అను దానికి భస్మీకరిష్యతి అని అర్థాంతరము. అదే విధముగా తాతద్రుహమ్ అని ఉండాలి. తాత అంటే తండ్రి కాని తాత కాదు తాతస్తు జనకః పితా అని అమరము. ఇచట తాతకు తత అని అనుట ఆర్ష ప్రయోగము) (37)

37. శ్లో. ఇతి లంఘితమర్యాదం
తక్షకస్సప్తమేఽహని ।
దంక్ష్యతి స్మ కులాంగారం
చోదితో మే తతద్రుహమ్ ॥

టీ:- ఇతి ఇతి.ఇతి సర్పనిక్షేపేణ ధక్ష్యతి భస్మీకరిష్యతి. స్మేతి పాదపూరణే.దఙ్క్ష్యతీతిభక్షిష్యతీతి చ పాఠాంతరం. కులస్యాంగారతుల్యం. మే మయా. తాతద్రుహం తతేతి హ్రస్వమార్షం.(37).

తరువాత ఆ పిల్లవాడు (శృంగి) ఆ ఆశ్రమమునకు వచ్చి కంఠమున సర్ప శవముకల తన తండ్రిని (శమీక మహర్షిని) చూచి దుఃఖముతో బాధ పడుతూ ముక్తకంఠముతో (బిగ్గరగా) ఏడ్చెను. (గలేసర్పకలేవరమ్ అనుచోట గల శబ్దము సప్తమీ విభక్తి సమాసము లోపించ లేదు. 'హలదంతాత్సప్తమ్యాః అను సూత్రము చేత అలుక్ సమాసము)(38)

38. శ్లో. తతోఽభ్యేత్యాశ్రమం బాలో
గలే సర్పకలేబరమ్ ।
పితరం వీక్ష్య దుఃఖార్తో
ముక్తకంఠో రురోద హ ॥

టీ:- తత ఇతి. గళే కంఠే సర్పకళేబరం యస్యత్యలుక్సమాసః. ముక్తకంఠః ఉచ్చైరిత్యర్థః.(38)

39. శ్లో. స వా అంగిరసో బ్రహ్మన్
శ్రుత్వా సుత విలాపనమ్ ।
ఉన్మీల్య శనకైర్నేత్రే
దృష్ట్వా స్వాంసే మృతోరగమ్ ॥

టీ:- స ఇతి. ఆంగిరసః శమీకః. పప్రచ్ఛేత్యుత్తరేణాన్వయః.(39).

ఆంగిరస గోత్రజుడగు ఆ శమీక మహర్షి కుమారుని శోకము విని మెల్లగా కన్నులు తెరచి, భుజాలపైనున్న సర్పశవమును చూచి దానిని తొలగించి కుమారుని అడిగెను. (ముందటి శ్లోకముతో అన్వయము.) (39)

40. శ్లో. విసృజ్య పుత్రం పప్రచ్ఛ
వత్స కస్మాద్ధి రోదిషి ।
కేన వా తే ప్రతికృత
మిత్యుక్తస్స న్యవేదయత్ ॥

టీ:- కిమితి పృష్టవానిత్యత ఆహ-విసృజ్యేతి. తం చ సర్పం విసృజ్య కస్మాద్ధేతోః రోదిషి? కేన వాపకృతం? ఇతి.(40).

శమీకముని ఆ సర్పాన్ని తొలగించుకొని కుమారునిచూచి ఓ నాన్నా ! ఎందుకు ఏడ్చుచున్నావు అని అడిగెను. నీకు అపకారము చేసినవాడు ఎవడు ? అని కుమారుని అడుగగా అతడు విషయమునంతయు చెప్పి తాను శపించిన విషయాన్ని కూడా విన్నవించెను.(40)

41. శ్లో. నిశమ్య శప్తమతదర్హం నరేంద్రం
స బ్రాహ్మణో నాత్మజమభ్యనందత్ ।
అహో బతాంహో మహదజ్ఞ తే కృతమ్
అల్పీయసి ద్రోహ ఉరుర్దమో ధృతః ॥

శాపానికి అర్హుడు కాని రాజును శపించిన కుమారుని శమీకముని అభినందించలేదు. అయ్యో ! ఓరీ అజ్ఞుడా ! నీవు గొప్ప పాపము చేసితివి. చిన్న తప్పునకు పెద్దశిక్ష విధించితివని పలికెను.(41)

టీ:- నిశమ్యేతి. అభినందనమిత్యాది బత కష్టం. తే త్వయా. మహత్పాపం కృతం. అల్పీయసి ద్రోహేఅపరాధే. దమో దండః. (41).

42. శ్లో. న వై నృభిర్నరదేవం పరాఖ్యం
సంమాతుమర్హస్యవిపక్వబుద్ధే ।
యత్తేజసా దుర్విషహేణ గుప్తా
విందంతి భద్రాణ్యకుతోభయాః ప్రజాః ॥

టీ:- నేతి. పరో విష్ణురిత్యాఖ్యా ఖ్యాతిర్యస్య తం నరదేవం. నృభిః సంమాతుం సమం ద్రష్టుం. (42).

పరిపక్వ బుద్ధి లేని ఓరీ కుమారా ! విష్ణు స్వరూపుడగు రాజును మామూలు ప్రజలతో పోల్చదగదు. 'నావిష్ణుః పృథివీపతిః' విష్ణ్వంశలేనిదే రాజుకాడు. రాజు విష్ణువు అంశ. రాజు యొక్క దివ్యమగు దుస్సహమైన తేజస్సుచే రక్షింపబడి ప్రజలు ఏ భయము లేనివారై క్షేమమును పొందుదురు. రాజు లేనిచో ప్రజలకు దుష్ట చోరాది బాధలు కలుగును. (42)

43. శ్లో. అలక్ష్యమాణే నరదేవనామ్ని
రథాంగపాణావయమంగలోకః ।
తదా హి చోరప్రచురో వినంక్ష్య
త్యరక్ష్యమాణోఽవివరూథవత్ క్షణాత్ ॥

టీ:- అలక్ష్యమాణ ఇతి. అలక్ష్యమాణే అదృశ్యమానే. అవివరూథవత్ మేషసంఘవత్. (43).

ఓ కుమారా ! నరదేవుడను పేరుగల విష్ణువగు రాజు లేనిచో, గమనింపబడనిచో, గౌరవింపబడనిచో, కనిపించనిచో ఈలోకము రక్షించే దిక్కులేక దొంగలతో నిండి, కాపలా లేని మేకల గుంపువలె క్షణములోనశించును. తోడేళ్ళు, పులులు కాపలా లేని మేకలను చంపుకొని తినును కదా ! (43)

44. శ్లో. తదద్య నః పాపముపైత్యనన్వయం
యన్నష్టనాథస్య వసోర్విలుంపకాత్ ।
పరస్పరం ఘ్నంతి శపంతి వృంజతే
పశూన్ స్త్రియోऽర్థాన్ పురుదస్యవో జనాః ॥

టీ:- తదితి. నష్టో నాథో యస్య లోకస్య తస్య వసోః వసునో ధనస్య. విలుంపకాత్ అపహర్తుశ్చోరాదేః హేతోః. యత్పాపం భవిష్యతి. తదస్మన్నిమిత్తత్వాదస్మాకముపైష్యతి. అనన్వయం సంబంధశూన్యమేవ. తదేవ పాపం దర్శయతి-పరస్పరమితి. శపంతి పరుషం వదంతి. పశ్వాదీన్ వృంజతే అపహరంతి.పురుదస్యవః చోరబహుళాః.(44).

ప్రస్తుతము సాక్షాత్తుగా దోషసంబంధములేకున్నను, రాజనాశనానికి కారణమైనందున, శపించిన మనకు పాపము కలుగుతుంది. రాజు లేకపోతే దొంగలు విజృంభించి ప్రజల ద్రవ్యాన్ని దోచుకొందురు. అంతేకాదు ఒకరినొకరు చంపుకొందురు, తిట్టుకొందురు. ఒకరి పశువులను ధనములను, స్త్రీలను మరొకరు అపహరింతురు. దొంగలు ఎక్కువై ప్రజలు బాధపడుదురు.(44)

45. శ్లో. తదాऽర్య ధర్మశ్చ నిలీయతే నృణాం
వర్ణాశ్రమాచారయుతస్త్రయీమయః ।
తతోऽర్థకామాభినివేశితాత్మనాం
శునాం కపీనామివ వర్ణసంకరః ॥

టీ:- తదేతి. ఆర్యధర్మః సదాచారః. శునాం కపీనామివ చ అర్థకామయో రేవాభి నివేశితచిత్తానాం.(45).

రాజులేనపుడు మనుజులలో వేదబోధితము, వేదచోదితముగా వర్ణాశ్రమాచార సహితధర్మము సదాచారము లోపించును. కేవలము డబ్బు, కామమునందే ఆసక్తికల మనుజులలో కుక్కలు, కోతులోవలె వర్ణ సాంకర్యమేర్పడును. మాతా సుతాదిభేదము లేకుండ పశుప్రవర్తన కలుగును.(45)

46. శ్లో. ధర్మపాలో నరపతిస్స తు సమ్రాడ్బృహచ్ఛ్రవాః ।
సాక్షాన్మహాభాగవతో రాజర్షిర్హయమేధయాట్ ।
క్షుత్తృట్ శ్రమయుతో దీనో నైవాస్మచ్ఛాపమర్హతి ॥

టీః- ఏవం రాజమాత్రస్య శాపానర్హత్వముక్త్వా ప్రస్తుతే విశేషమాహ-సార్ధేన. ధర్మేతి. హయమేధయాట్ అశ్వమేధయాజీ. నన్వేవం భూతశ్చేత్కుతోఽపకృతవానిత్యాహ. క్షుత్తృడితి స్వాగత ప్రశ్నోద్యభావేన అవజ్ఞాతః ప్రత్యుత శాపం కథమర్హతీత్యర్థః (46).

ఈ విధముగా ఏ రాజునైనా శపించరాదని తెల్పి విశేషముగా పరీక్షిన్మహారాజు శాపానికి అర్హుడే కాదని పుత్రునికి శమీకముని వివరిస్తున్నాడు. పరీక్షిన్మహారాజు సామాన్యుడైన రాజుకాడు. ఆతడు చక్రవర్తి, అశ్వమేధ యాగము చేసినవాడు, ధర్మబద్ధముగా కలినిగ్రహముచేసి ప్రజలను పాలించుచున్నాడు, గొప్ప కీర్తి కలవాడు, మహాభాగవతోత్తముడు. సాక్షాత్తుగా రాజర్షి, ఆకలి,దప్పులచే బాధపడి దీనుడై మన ఆశ్రమానికి వచ్చి ఆతిథ్యమును పొందలేకపోయినాడు. శాపానికి అర్హుడు కాడు. పరీక్షిత్తు తనపై పాము శవాన్ని వేసినా, పరమశాంతుడు, మహాతపస్వియగు ఆ శమీకముని రాజుది తప్పు కాదని తెలిపాడు. (46)

47. శ్లో. అపాపేషు స్వభృత్యేషు
బాలేనాపక్వబుద్ధినా ।
పాపం కృతం తద్భగవాన్
సర్వాత్మా క్షంతుమర్హతి ॥

టీః- క్షుదితి. అస్య మహాపాపస్యాన్యత్ప్రాయశ్చిత్తమదృష్ట్వా పాపమావేదయన్ భగవంతం హరిం ప్రార్థయతే-అపా పేష్వితి. (47)

ఈ పాపానికి ప్రాయశ్చిత్తములేదని తెల్పి, భగవంతుని ప్రార్థిస్తున్నాడు ముని. పరిపక్వబుద్ధిలేని, ఈ బాలుడు ఏ పాపములేని భగవత్సేవకుడైన రాజు విషయమున గొప్ప పాపాన్ని చేసినాడు, శాపాన్ని ఇచ్చినాడు. ఈతనిని సర్వాత్మయగు భగవానుడు క్షమించుగాక అని శమీకుడు ప్రార్థించెను. (47)

48. శ్లో. తిరస్కృతా విప్రలబ్ధాః
శప్తాః క్షిప్తా హతా పివా ।
నాస్య తత్ప్రతికుర్వంతి
తద్భక్తాః ప్రభవో౽పివా ॥

టీ:- పాపమితి. రాజా చేత్ప్రతిశాపం దద్యాత్తర్హి నిష్కృతిర్భవేదపి. తత్తు న సంభవతి. తస్య భాగవతత్వాదిత్యాహ- తిరస్కృతా ఇతి. తిరస్కృతాః నిందితాః విప్రలబ్ధాః వంచితాః. క్షిప్తాః అవజ్ఞాతాః. హతాః తాడితాః. అస్య తిరస్కారాదికర్తుర్న తత్ప్రతీకారం కుర్వంతి. తద్భక్తాః విష్ణుభక్తాః ప్రభవః సమర్థా అపి.(48)

శమీకముని ఈ విధముగా తలచుచున్నాడు. ఒకవేళ ఆ రాజు ప్రతి శాపమునిస్తే మా శాపానికి ప్రతీకారమయ్యేది, పాపము తొలగేది. కాని, భగవద్భక్తులు సమర్థులైనను, ఇతరులకు ప్రతీకారము తలపెట్టరు. వారు నిందింపబడినా, వంచిపబడినా, శపింపబడినా, అవమానింపబడినా, తిట్టబడినా, కొట్టబడినా, ప్రతీకారము చేయరు. భగవద్భక్తులు సత్త్వ గుణ ప్రధానులు కావున సుఖ,దుఃఖాలు వారికి సమానమే.(48)

49. శ్లో. ఇతి పుత్రకృతాఘేన
సో౽నుతప్తో మహామునిః ।
స్వయం విప్రకృతో రాజ్ఞా
నైవాఘం తదచింతయత్ ॥

టీ:- స్వయమితి. విప్రకృతః అపకృతః. అఘం అపరాధం.(49)

ఈ విధముగా కుమారుడు చేసిన అపరాధానికి చాలా పరితపించిన ఆ మహాముని, స్వయముగా రాజు తనపట్ల చేసిన అపరాధాన్ని గురించి విచారించ లేదు(49)

50. శ్లో. ప్రాయశస్సాధవో లోకే
పరైర్ద్వంద్వేషు యోజితాః ।
న వ్యథంతి న హృష్యంతి
యత ఆత్మాఽగుణాశ్రయః ॥

టీ:- యుక్త చైతదిత్యాహ - ప్రాయశ ఇతి. ద్వంద్వేషుసుఖదుః ఖాదిషు. నేతి. అగుణాశ్రయః సుఖదుఃఖాద్యాశ్రయో న భవతి. (50)

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం సంహితాయాం ప్రథమేస్కంధే భావార్థదీపికాయాం అష్టాదశాధ్యాయః**

ఇది యుక్తమేననుచున్నాడు సూతుడు. తరచుగా సాధువులు లోకములో ఇతరులచేత సుఖ దుఃఖాదులకు గురికావింపబడినవారైనను వాటిని పట్టించుకొనరు, సుఖ దుఃఖాలను పొందరు. ఎందుకనగా అవి రెండును వారికి సమానమే. ద్వంద్వాలను వారు సహిస్తారు. (50)

**శ్రీమద్భాగవతము యొక్క ప్రథమస్కంధ అష్టాదశాధ్యాయమునకు శ్రీధరీయవ్యాఖ్యానుసార ఆంధ్రానువాదము ముగిసినది.**

## ఏకోనవింశోऽధ్యాయః

**సూతఉవాచ.**

1. శ్లో. మహీపతి స్త్వథ తత్కర్మ గర్హ్యం
విచింతయన్నాత్మకృతం సుదుర్మనాః ।
అహో మయా నీచమనార్యవత్కృతం
నిరాగసి బ్రహ్మణి గూఢతేజసి ॥

టీ:- శ్లో.ప్రాయోపవిష్టే గంగాయాం రాజ్ఞి యోగిజనావృతే. శుకస్యాగమనం తత్ర ప్రాక్తమేకోనవింశకే. మహీపతిరతి. స్వకృతం తత్కర్మ మునిస్కంధే సర్పనిక్షేపణం. గర్హ్యం నింద్యం. చింతయన్ సుదుర్మనాః జాతః, చింతామేవాహ-సార్ధద్వాభ్యాం. నీచం పాపం. అమీ వయతితి పాఠేऽపి సఏవార్థః. బ్రహ్మణి బ్రాహ్మణే. గూఢం గుప్తం తేజో యస్య. తస్మిన్(1)

## పందొమ్మిదవ అధ్యాయము

యోగీశ్వరులతో కూడి గంగా తీరమున పరీక్షిన్మహారాజు ప్రాయోపవిష్టుడై ఉండగా అచటికి శ్రీశుక మహర్షి రావడము ఈ పందొమ్మిదవ అధ్యాయమున చెప్పబడుచున్నది.

**సూతుడు పలుకుచున్నాడు.**

పరీక్షిన్మహారాజు తాను చేసిన, శమీకమహర్షి భుజములపై చచ్చిన పామును వేయుట అను నింద్యమైన పనిని గురించి పశ్చాత్తప్తుడగుచు, బాధపడినాడు. (ఆ చింత యెట్టిదనిన 'అహో' అని రెండు శ్లోకాలతో వివరిస్తున్నాడు) అయ్యో ! ఏ దోషము లేని అంతర్నిగూఢమగు తేజస్సుగల బ్రాహ్మణుని విషయమున, దుర్మార్గుని వలె అపచారమును పాపమును చేసితిని కదా. (ఇచట అమీకమను పాఠాంతరము కలదు. అనార్య శబ్దానికి బదులుగా దానికి కూడా నింద్యమైనపని అని అర్థము) (1)

2. శ్లో. ధ్రువం తతో మే కృతదేవహేలనాద్
దురత్యయవ్యసనం నాతిదీర్ఘాత్ ॥
తదస్తు కామం హ్యఘనిష్కృతాయ మే
యథా న కుర్యాం పునరేవమద్ధా ॥

టీ:- ధ్రువమితి. కృతం యద్దేవహేళనం ఈశ్వరావజ్ఞా. పాపమిత్యర్థఃతస్మాన్నూనం వ్యసనం భవిష్యతి.తత్తు నాతిదీర్ఘాత్కాలాత్. అచిరాదేవాస్తు. తత్రాపి అద్ధా సాక్షాత్. మమైవాస్తు. న పుత్రాదిద్వారేణేతి ప్రార్థనా. కామం అసంకోచతః. ఏవంప్రార్థనాయాః ప్రయోజనం. అఘస్య నిష్కృతాయ ప్రాయశ్చిత్తాయ. యథాపునరేవం న కుర్యామితి చ.(2)

పరీక్షిత్తు ఇంకను ఇట్లు చింతిస్తున్నాడు. దేవునిలాంటి బ్రహ్మర్షిని అవమానించిన నాకు కొద్ది కాలముననే తప్పించుకొన శక్యముగాని గొప్ప కష్టము కలుగుగాక. ఆ కష్టము నా సంతానానికి కాక నాకే కలుగుగాక. దాని వలన నాకు పాప ప్రాయశ్చిత్తము కలుగును. మరల నేను అట్టి పాపపు పని చేయకుందునుగాక.(2)

3. శ్లో. అద్యైవ రాజ్యం బలమృద్ధికోశం
ప్రకోపితబ్రహ్మకులానలో మే ।
దహత్వభద్రస్య పునర్నమేఽభూత్
పాపీయసీ ధీర్ద్విజదేవగోభ్యః ॥

టీ:- ఏవం సాక్షాత్స్వస్యైవ వ్యసనం సంప్రార్థ్య తతః ప్రాగేవ కించిత్ప్రార్థయతే-అద్యేతి. అద్యైవ మే రాజ్యాది దహతు. ప్రకోపితం బ్రహ్మకులమేవానలః పునర్ద్విజాదీన్ పీడయతుం ధీర్మే నాభూత్ న భవేదిత్యర్థః.(3)

ఈ విధముగా సాక్షాత్తుగా తనకే కష్టము కలుగుగాక అనితలచి దానికి ముందుగానే కొంచెము కోరుకుంటున్నాడు పరీక్షిత్తు. నేను చేసిన పాపిష్ఠపు పనికి ప్రతీకారముగా ఈ రోజే నా రాజ్యము, సైన్యము, కోశాగారము అన్నింటిని కోపించిన బ్రాహ్మణ వంశానలము దహించుగాక, దాని వలన మరల బ్రాహ్మణాదులను పీడించే దుష్టబుద్ధి నాకు కలుగపోవుగాక. (3)

4. శ్లో. సంచితయన్నిత్థమథాశృణోద్యథా
మునేస్సుతోక్తో నిరృతిస్తక్షకాఖ్యాత్ ।
స సాధు మేనే న చిరేణ తక్షకా
నలం ప్రసక్తస్య విరక్తికారణమ్ ॥

టీ:- సంచింతయన్నితి. ఇత్థం సంచింతయన్ స రాజా మునేస్సుతేనోక్తః. సప్తమేఽహని నిరృతిర్మృత్యుః యథా భవిష్యతి తథా అశృణోత్. శమీకప్రేషితాచ్ఛిష్యాత్ శ్రుత్వా చ స తక్షకస్య విషాగ్నిం సాధు మేనే. యతో విషయేషు ప్రసక్తస్య విరక్తికారణం.(4)

5. శ్లో. అథో విహాయేమమముం చ లోకౌ
విమర్శితౌ హేయతయా పురస్తాత్ ।
కృష్ణాంఘ్రిసేవామభిమన్యమానః
ఉపావిశత్ప్రాయమమర్త్యనద్యామ్ ॥

టీ:- అథో ఇతి. అథో అనంతరం ఉభౌలోకౌ. పురస్తాద్రాజ్య మధ్యఏవ హేయతయా విచారితౌ విహాయ. కృష్ణాంఘ్రిసేవాభి మన్యమానస్సన్ సర్వపురుషార్థాధికాం జానన్ నృపః. ప్రాయమనశనం తస్మిన్నిత్యర్థః. తత్సంకల్పేనోపావిశదితి యావత్. యద్వా-ప్రకృష్టమయనం మరణం యథా భవతి. తథా.(5)

ఈ విధముగా అనుకొనుచుండగానే పరీక్షిన్మహారాజు ఒకానొక ముని కుమారుని వలన, (శమీకముని పంపిన గౌరముఖుని వలన ) శృంగి శాప వృత్తాంతమును, అనగా తక్షకునిచే తనకు ఏడవ రోజు మరణము ప్రాప్తించునని తెలిసికొని, బాధపడక అది తనకు మంచిదే అని, తక్షక విషాగ్ని తక్షణమే నన్ను దహించుగాక అనుకొన్నాడు. విషయవాంఛలయందు తగులుకొనియున్న నాకు ఇది వైరాగ్య కారణమగునుగాక అనియు అనుకున్నాడు రాజు.(4)

ఇహపర లోకములు ముందే వదలిపెట్టదగినవని విచారణద్వారా నిర్ణయము చేసికొని, అన్ని పురుషార్థముల కంటె శ్రీకృష్ణుని పాదసేవయే గొప్పదని తలచి, గంగానది ఒడ్డున పరీక్షిన్మహారాజు ప్రాయోపవేశము చేసెను. (ఆహారముమాని చావుకు ఎదురుచూచుటను ప్రాయోపవేశమందురు. లేదా ప్ర అనగా ప్రకృష్టము. అయ మనగా శరణము. అనగా ఉన్నత స్థానమును, శుభమును, మోక్షమును పొందనిశ్చయించెనని భావము.(5)

6. శ్లో. యా వై లసచ్ఛ్రీ తులసీవిమిశ్ర
కృష్ణాంఘ్రిరేణ్వభ్యధికాంబునేత్రీ ।
పునాతి లోకానుభయత్ర సేవాన్ ।
కస్తాం న సేవేత మరిష్యమాణః ॥

టీ:- అమర్త్యనద్యామితి విశేషణస్య ఫలమాహ-యేతి. యా గంగాలసంతీ శ్రీర్యస్యాస్తయా తులస్యా విమిశ్రా యే కృష్ణాంఘ్రిరేణవః . తైరభ్యధికం సర్వోత్కృష్టం యదంబు తస్య నేత్రీ తద్వాహినీ. ఉభయత్ర అంతర్బహిశ్చ సేశాన్ లోకపాలైస్సహితాన్ లోకాన్. పునాతి మరిష్యమాణః ఆసన్నమరణః. మరణస్యానియతకాలత్వాత్సర్వోఽపి తథా. అతస్తాం.కో న సేవేత. (6)

అమర్త్యనది అనగా దివ్యనది గంగ. దాని తీరమున నివాసమునకు ఫలము చెపుతున్నారు.ఏ నది ప్రకాశిస్తున్న తులసి గంధముతో శ్రీకృష్ణుని పాద రేణువులతో నొప్పారునో ఎక్కువ జలము కలిగి, ఇహపరలోకాల్లో పారునో, లోకపాలకులతో కూడిన లోకాలకు లోపల వెలుపల (మనః శరీర) శుద్ధులను కలిగించునో, అట్టి గంగానదిని (మరణము సమీపించినవాడు) సేవించవలెను. మరణము ఎప్పుడు వచ్చునో తెలియదు కనుక ప్రతి ప్రాణికూడ ఆ నదిని (గంగను) సేవించవలెను. (ఎవరు సేవించాలి అంటే అందరును సేవించాలి అని సమాధానము. గంగ విష్ణుపాదోద్భవ కావున అచటి తులసి గంధము రేణువులు కలసిన గంగాజలము గొప్పదని అర్థము.(6)

7. శ్లో. ఇతి వ్యవచ్ఛిద్య స పాండవేయః
ప్రాయోపవేశం ప్రతి విష్ణుపద్యామ్ ।
ధ్యాత్వా ముకుందాంఘ్రిమనన్యభావో
మునివ్రతో ముక్తసమస్తసంగః ॥

టీ:- ఇతీతి. ఇత్యేవం విష్ణుపద్యాం గంగాయాం. ప్రాయోపవేశం ప్రతి. వ్యవచ్ఛిద్య నిశ్చిత్య. పాండవేయ ఇతి తత్కులౌచిత్యం దర్శయతి- నాస్త్యన్యస్మిన్ భావో యస్య సః కుతః? మునివ్రతః ఉపజాతః తత్కృతః ముక్తః సమస్తస్సంగో యేన సః.(7)

పాండవవంశీయుడగు పరీక్షిత్తు ఈ విధముగా గంగానది తీరమందు ప్రాయోపవేశముచేయ నిశ్చయించుకొని, ఏ ఇతర భావన లేకుండా,ముని వృత్తినవలంబించి ప్రశాంతుడై, సర్వసంగములను, సంబంధములను వదలి, తదేకనిష్ఠతో శ్రీకృష్ణుని పాదములను ధ్యానించుచుండెను. పాండవేయపదముతో ఆతని వంశము యొక్క ఔన్నత్యము సూచించబడినది.(7)

8. శ్లో. తత్రోపజగ్ముర్భువనం పునానాః
మహానుభావా మునయస్సశిష్యాః ।
ప్రాయేణ తీర్థాభిగమాపదేశైః
స్వయం హి తీర్థాని పునంతి సంతః ॥

టీ:- తత్రేతి. తత్రతదా తద్దర్శనార్థం. మునయ ఉపాగతాః. న తు తీర్థస్నానార్థం. కృతార్థత్వాత్. నను తాదృశానామపి తీర్థయాత్రాదృశ్యతే. తత్రాహ - ప్రాయేణేతి తీర్థయాత్రావ్యాజైః.(8)

అపుడు ఆ పరీక్షిన్మహారాజును చూచుటకు మహానుభావులగు అనేకమంది మునీశ్వరులు లోకాలను పవిత్రము చేస్తూ శిష్యులతో సహా అక్కడికి వచ్చిరి. సత్పురుషులు తీర్థయాత్ర అనే మిషతో వచ్చారే కాని నిజముగా తీర్థ స్నానము కొఱకు కాదు. ఏలయన వారు స్వయముగానే కృతార్థులు అయితే వారు తీర్థయాత్రలు చేయుట ఎందుకు? అంటే తీర్థయాత్రా వ్యాజముచేత వారు తీర్థాలనే పవిత్రము చేస్తారు. గంగాది తీర్థాలకన్నా సజ్జనులు గొప్పవారు..(8)

9. శ్లో. అత్రిర్వసిష్ఠచ్యవనశ్శరద్వాన్
అరిష్టనేమిర్భృగురంగిరాశ్చ ।
పరాశరో గాధిసుతోఽథ రామః
ఉతథ్య ఇంద్రప్రమదేధ్మవాహౌ ॥

ఆ వచ్చిన మునులను పేర్కొనుచున్నాడు. వసిష్ఠుడు, చవ్యనుడు, శరద్వంతుడు, అరిష్టనేమి, భృగుమహర్షి, ఆంగిరసుడు, పరాశరుడు, విశ్వామిత్రుడు, పరశురాముడు, ఉతథ్యుడు, ఇంద్రప్రమదుడు, ఇధ్మవాహుడు మున్నగువారు పరీక్షిత్తు వద్దకు వచ్చిరి.(9)

10. శ్లో. మేధాతిథిర్దేవల ఆర్షిషేణో
భరద్వాజో గౌతమః పిప్పలాదః ।
మైత్రేయ ఔర్వః కవషః కుంభయోనిః
ద్వైపాయనో భగవాన్నారదశ్చ ॥

ఇంకను మేధాతిథి, దేవలుడు, ఆర్షిషేణుడు, భరద్వాజుడు, గౌతముడు, పిప్పలాదుడు, మైత్రేయుడు, ఔర్వుడు, కవషుడు, అగస్త్యుడు, వ్యాసుడు, నారదభగవానుడు వీరందరును పరీక్షిత్తును సమీపించిరి. (10)

11. శ్లో. అన్యే చ దేవర్షి బ్రహ్మర్షివర్యాః
రాజర్షివర్యా అరుణాదయశ్చ ।
నానార్షేయప్రవరాంస్తాన్ సమేతాన్
అభ్యర్చ్య రాజా శిరసా వవందే ॥

టీ:- అన్య ఇతి. అరుణాదయః కాండఋషిత్వవిశేషేణ పృథఙ్నిర్దిష్టాః. నానావిధాన్యార్షేయాణి ఋషీణాం గోత్రాణి. తేషు ప్రవరాన్ శ్రేష్ఠాన్ శిరసా భూమిం స్పృష్ట్వా వవందే.(9,10,11)

ఇంకను అనేకమంది దేవర్షులు, బ్రహ్మర్షులు, రాజర్షులు, అరుణాదులు, కాండర్షులు, అనేక గోత్రాలలో ముఖ్యులైన ఋషి ప్రవరులు వచ్చినారు. ఆ వచ్చిన మహర్షులకు పరీక్షిన్మహారాజు శిరస్సుతో భూమిని తాకుతూ నమస్కరించెను.(11)

12. శ్లో. సుఖోపవిష్టేష్వథ తేషు భూయః
కృతప్రణామః స్వచికీర్షితం యత్ ।
విజ్ఞాపయామాస వివిక్తచేతాః
ఉపస్థితోఽగ్రేఽభిగృహీతపాణిః ॥

టీ:- సుఖేతి. విజ్ఞాపనార్థం పునః కృతప్రణామః. వివిక్తం విశుద్ధం చేతో యస్య సఃఅభిగృహీతౌ సంయోజితౌ పాణీ యేన సః. స్వచికీర్షితం ప్రాయోపవేశనాది. యుక్తమయుక్తం వేతి విజ్ఞాపయామాస.(12)

ఆ మహర్షులందరు సుఖముగా కూర్చొనిన పిదప పరీక్షిన్మహారాజు పరిశుద్ధమైన మనస్సు కలవాడై, చేతులు జోడించి నమస్కరించి, వారికి తాను చేయదలచిన ప్రాయోపవేశ కార్యమును నివేదించెను. తాను చేయుపని ఉచితమా ? అనుచితమా ? తెలుపుడని విజ్ఞాపనచేసికొనెను. జరిగిన దానిని విన్నవించెను.(12)

**పరీక్షిదువాచ.**

13. శ్లో. అహో వయం ధన్యతమా నృపాణాం
మహత్తమానుగ్రహణీయశీలాః ।
రాజ్ఞాం కులం బ్రాహ్మణపాదశౌచాద్
దూరాద్విసృష్టం బత గర్హ్యకర్మ ॥

టీ:- అనుమోదనేన అనుగ్రహమాలక్ష్య శ్లాఘతే-అహో ఇతి. నృపాణాం మధ్యే మహత్తమైరనుగ్రహణీయం శీలం వృత్తం యేషాం. ఏతచ్చ రాజ్ఞామతిదుర్లభమిత్యాహ - "బ్రాహ్మణానాం పాదశౌచాత్పాద ప్రక్షాల నోదకాత్, దూరాదుచ్ఛిష్టవిణ్మూత్రపాదాంభాంసి సముత్సృజేత్" ఇతి స్మృతేః. దూరే హి త్రైస్తద్విసృజ్యతే. తతోఽసి దూరాదేవ విసృష్టం క్షిప్తం. తత్రాపి స్థాతుమయోగ్యమిత్యర్థః. గర్హ్యం కర్మయస్యేత్యాత్మాన ముద్దిశ్యోక్తం.(13)

14. శ్లో. తస్యైవ మేఽఘస్య పరావరేశో
వ్యాసక్తచిత్తస్య గృహేష్వభీక్ష్ణమ్ ।
నిర్వేదమూలో ద్విజశాపరూపో
యత్ర ప్రసక్తో భయమాశు ధత్తే ॥

**పరీక్షిత్తు ఇట్లనెను.**

మహర్షులు వచ్చినవారు తనను అనుమోదించారని అనుకొని తాను ధన్యుడనని భావిస్తున్నాడు పరీక్షిత్తు. మహాత్ములచే అనుగ్రహింపబడిన శీలముకల మేము రాజులందఱిలో చాలా ధన్యులము. మహదనుగ్రహము రాజులకు అత్యంత దుర్లభము. నింద్యమగు పనులను చేయు రాజ వంశములు బ్రాహ్మణ పాదోదకములకు మిక్కిలి దూరముగా ఉండును. బ్రాహ్మణుల పాద ప్రక్షాలన భాగ్యము వారికి లభించదు. బ్రాహ్మణ పాదోదకమున్న చోటికి దూరముగా ఎంగిలిని, మూత్రపురీషములను విసర్జించవలెనని ధర్మశాస్త్రము. బుద్ధిమంతులు వానిని దూరముగానే వదులుదురు. అట్టి ఎంగిలి మలమూత్రములకన్నను దూరముగా పారదోరవలసినది, అచట కూడ ఉండుటకు యోగ్యముకానిది రాజకులము.(13)

ఋషుల అనుగ్రహము అటుంచి, బ్రాహ్మణ శాపము కూడ భగవదనుగ్రహముననే కలిగినదని పరీక్షిత్తు అనుచున్నాడు. నింద్యమగు పనిని చేసిన పాపాత్ముడను, ఇంటిలో ఉండి విషయవాంఛలతో తగులుకొని ఉన్నవాడను, అట్టి నాకు కార్యకారణ రూప జగత్తుకు ప్రభువగు ఈశ్వరుని అనుగ్రహమే బ్రాహ్మణ శాపరూపమున సంప్రాప్తించినది. ఆ శాపము వలననే కదా ! ఇంట్లో ఉన్న నాకు

టీ:- ఆస్తాం తావదనుగ్రహః. బ్రాహ్మణశాపోఽపి భగవత్ప్రసాదాదేవ జాత ఇత్యాహ -తస్యేతి తస్య గర్హ్యకర్మణ ఏవ. అతః అఘస్య పాపస్య పాపాత్మనః గృహేష్వాసక్తచిత్తస్య మే స్వప్రాప్తయే. పరావరాణామీశ ఏవ ద్విజశాపరూపో బభూవ. యత్ర యస్మిన్ శాపేసతి. గృహేషుప్రసక్తో భయం ధత్తే నిర్విణ్ణో భవతి స్వయం యతో నిర్వేదమూలః నిర్వేదః వైరాగ్యం మూలం ప్రాప్తికారణం వా యస్మిన్. స్వస్యవైరాగ్య ప్రాప్యత్వాత్తస్య భయమూలత్వాత్తదర్థం ద్విజశాపం కారితవానిత్యర్థః (14)

భయము కలిగి, వైరాగ్యము జనించినది. మరల సంసారమున ప్రవేశింపరాదను నిశ్చయము కలిగినది. పవిత్రమగు గంగా తీరమున, మునుల సాన్నిధ్యమున విరక్తుడనై ప్రయోపవేశమును చేయుటకు ఆ శాపమే కదా కారణము ( పరిపక్వమైన మనస్సుగల మహానుభావుడు పరీక్షిన్మహారాజు. శాపాన్ని ప్రశంసించినాడు కాని నిందించలేదు.) (14)

15. శ్లో. తం మోపయాతం ప్రతియంతు విప్రాః
గంగా చ దేవీ ధృతచిత్తమీశే ।
ద్విజోపసృష్టః కుహకస్తక్షకాఖ్యో
దశత్వలం గాయత విష్ణుగాథాః ॥

టీ:- తాన్ ప్రార్థయతే ద్వాభ్యాం - ఇవమితి. తం మామాం. ఉపయాతం శరణాగతం. ప్రతియంతు జానంతు. దేవీ దేవతారూపా గంగా చ. ప్రత్యేతు వా. చ శబ్దః ప్రతి క్రియానాదరే. గాథాః కథాః (15)

ఆ మహర్షులను పరీక్షిత్తు ప్రార్థిస్తున్నాడు. ఓ బ్రాహ్మణోత్తములారా ! మిమ్ములను శరణుపొందిన నన్ను అనుగ్రహింపుడు. ఈశ్వరుని యందే చిత్తమునుంచిన నన్ను దేవతారూపమగు గంగ గుర్తించుగాక. బ్రాహ్మణుడగు శృంగిచేత ప్రేరేపింపబడిన దుష్ట తక్షకుడు నన్ను బాగా కఱచుగాక, అనుగ్రహించుగాక ! (ఇచట మూలమున వా అను శబ్ద ప్రయోగము ప్రతిక్రియ యందు ఆదరము లేకుండుటను సూచించును. అనగా పాముకాటుకు ఏదో ప్రతీకారము చేసికొని బ్రతుకాలి అన్న ఆశ రాజుకు లేదు అని తెలియును) ఓ ఋషులారా మీరు విష్ణు కథలను గానముచేసి నాకు వినిపింపుడు చాలును నాకింకేమియు అక్కఱలేదు.(15)

16. శ్లో. పునశ్చ భూయాద్భగవత్యనంతే
రతిః ప్రసంగశ్చ తదాశ్రయేషు ।
మహత్సు యాం యాముపయామి
సృష్టిం మైత్ర్యస్తు సర్వత్ర నమో ద్విజేభ్యః ॥

టీ:- పునరితి. స ఆశ్రయో యేషాంతేషు.ప్రకృష్టస్సంగో భూయాత్. అహం యాం యాం సృష్టిం జన్మ ఉపయామి; తస్యాం తస్యాం సృష్టౌజన్మని. (16)

ఓ మహర్షులారా ! నేను మునుముందు ఏ జన్మ ఎత్తినను అనంతుడగు భగవంతుని యందు భక్తి కలుగుగాక. ఆ భగవంతుని కథలయందే ఆసక్తి కలుగుగాక, సజ్జన సాంగత్యము లభించుగాక సర్వ ప్రాణులయందును నాకు స్నేహ భావము ఏర్పడుగాక. మీకు నమస్కారము (16)

17. శ్లో. ఇతి స్మ రాజా వ్యవసాయయుక్తః
ప్రాచీనమూలేషు కుశేషు ధీరః ।
ఉదఙ్ముఖో దక్షిణకూల ఆస్తే
సముద్రపత్న్యాస్స్వసుతన్యస్తభారః ॥

టీ:- ఇతీతి. అధ్యవసాయో నిశ్చయః ప్రాగగ్రేషు కుశేషు ఆస్తే స్మ. స్వసుతన్యస్తభారః స్వసుతే జనమేజయే న్యస్తో భారో రాజ్యం యేన సః.(17)

వివేక జ్ఞానముగల ఆ పరీక్షిన్మహారాజు ఆ విధముగా దృఢనిశ్చయము కలవాడై తన కుమారుడగు జనమేజయునికి రాజ్య భారమునప్పగించి, గంగానది దక్షిణ తీరమున తూర్పు దిక్కు కొసలు ఉండునట్లుగా దర్భలను పరచుకొని వానిపై ఉత్తరముఖముగా కూర్చొనెను. (17)

18. శ్లో. ఏవం తు తస్మిన్నరదేవదేవే
ప్రాయోపవిష్టే దివి దేవసంఘాః ।
ప్రశస్య భూమౌ వ్యకిరన్ ప్రసూనైః
ముదా ముహుర్దుందుభయశ్చ నేదుః ॥

టీ:- ఏవమితి. మదా వ్యకిరన్. దేవసంఘైః వాదితా దుందుభయో నేదుః.(18)

ఆ విధముగా ఆ పరీక్షిన్మహారాజు ప్రాయోపవిష్టుడుకాగా ఆకసమున దేవసంఘములు ఆ భగవద్భక్తుని ప్రశంసించి పుష్పవర్షము కురిపించినవి. సంతోషముతో మాటిమాటికి దుందుభులు మ్రోగినవి. (18)

19. శ్లో. మహర్షయస్తం సముపాగతా యే
ప్రశస్య సాధ్విత్యనుమోదమానాః ।
ఊచుః ప్రజానుగ్రహశీలసారాః
యదుత్తమశ్లోకగుణానురూపమ్ ॥

టీ:- మహర్షయ ఇతి. ప్రజానుగ్రహే శీలం సారో బలం చ యేషాం. ఉత్తమశ్లోక గుణైరభిరూపం సుందరం.(19)

అక్కడికి వచ్చిన ఋషులు ప్రజలను అనుగ్రహించే స్వభావము కలవారు కావున పరీక్షిత్తును ప్రశంసించి, ఆతని విన్నపాన్ని అనుమోదించి, ఉత్తముడగు శ్రీహరి గుణముల వర్ణనలుగల సుందరమగు మాటలను పల్కిరి.(19)

20. శ్లో. న వా ఇదం రాజర్షివర్య చిత్రం
భవత్సు కృష్ణం సమనువ్రతేషు ।
యేఽధ్యాసనం రాజకిరీటజుష్టం
సద్యో జహుర్భగవత్పార్శ్వకామాః ॥

టీ:- నేతి. భవత్సు పాండోర్వంశ్యేషు యే జహురితి. యుధిష్ఠిరాద్యభిప్రాయేణ.(20)

ఓ రాజర్షి శ్రేష్ఠా ! శ్రీకృష్ణుని అనుసరించుచూ సేవించిన మీ పాండవ వంశీయులకు ఇది ఆశ్చర్యము కాదు. సాష్టాంగ ప్రణామములొనర్చు సామంత రాజుల కిరీటములచే సేవింపబడు చక్రవర్తి సింహాసనమును సైతము భగవత్సన్నిధినికోరిన ధర్మరాజాదులు క్షణములో విడిచిపెట్టిరి. అట్లే నీవును భోగములను వదలితివి. (20)

21. శ్లో. సర్వే వయం తావదిహాస్మ హేఽద్య ।
కలేబరం యావదసౌ విహాయ ।
లోకం పరం విరజస్కం విశోకమ్ ।
యాస్యత్యయం భాగవత ప్రధానః ॥

టీ:- పరస్పరం సమ్మంత్రయంతే సర్వ ఇతి. పరం శ్రేష్ఠం లోకం, తత్రహేతుః - విరజస్కం నిర్మాయం విశోకం చ. యాస్యతీతి. కుతస్త్రాహ - అయమితి.(21)

అచ్చటి ఋషులు ఒకరితోనొకరు ఆలోచించుకొని, ఈ భగవద్భక్తాగ్రగణ్యుడగు పరీక్షిన్మహారాజు శరీరాన్ని వదలిపెట్టి త్రిగుణాతీతము, శోకరహితము, ఆనందమయమగు, ఉత్కృష్టమగు లోకమును పొందువరకు మనమందరము ఇచటనే ఉండెదము అని నిశ్చయించుకొనిరి.(21)

22. శ్లో. ఆశ్రుత్య తదృషి గణ వచః పరీక్షిత్ ।
సమం మధుచ్యుద్గురు చావ్యలీకమ్ ।
అభాషతైనానభినంద్య యుక్తమ్ ।
శుశ్రూషమాణశ్చరితాని విష్ణోః ॥

టీ:- ఆశ్రుత్యేతి. ఆశ్రుత్య ఆకర్ణ్య. సమం పక్షపాతశూన్యం. మధుచ్యుత్ మధుస్రావి. గురు గంభీరార్థం. అవ్యలీకం సత్యమ్.(22)

విష్ణు కథలను వినగోరుచున్న పరీక్షిన్మహారాజు ఆ ఋషి సముదాయము యొక్క వాక్కులను విని, వారిని అభినందించి పలికిన వాక్కులు పక్షపాతరహితములై, అమృతమయములై, గొప్ప గంభీరార్థముకలవై, సత్యమైనవిగా ఉండెను.(22)

**రాజోవాచ.**

23. శ్లో. సమాగతాస్సర్వత్ర ఏవ సర్వే ।
వేదా యథా మూర్తి ధరాస్త్రిపృష్ఠే ।
నేహాథవాముత్ర చ కశ్చనార్థే ।
ఋతే పరానుగ్రహమాత్మశీలమ్ ॥

టీ:- సమాగతా ఇతి. త్రయాణాం లోకానాం పృష్ఠే ఉపరి సత్యలోకే. వేదాః యథా మూర్తిధరాః భవంతి తత్తుల్యాః. జ్ఞానాతిశయముక్త్వా కృపాళుతామాహ-నేహేతి. భవతాం ప్రయోజనం పరానుగ్రహం వినా నాస్తి. తర్హి స ఏవార్థస్స్యాత్కథం ఆత్మశీలం స్వభావం.(23)

**పరీక్షిత్తు ఇట్లనెను.**

అన్నివైపుల నుండి వచ్చిన మునులు మూడు లోకములకు పైనున్న సత్యలోకమున మూర్తీభవించిన వేదములున్నట్లుగా ఉండిరి. ( ఆ ఋషుల జ్ఞానాన్ని ప్రశంసించి, 'నేహ' అని వారి దయను ప్రశంసిస్తూ ) అయ్యా ఋషులారా ! మీకు ఇతరులను అనుగ్రహించుట తప్ప వేరే పని, ఈ లోకమునగాని, పరలోకమునగాని లేదు అది మీ యొక్క సహజ స్వభావము. (23)

24. శ్లో. తతశ్చ మే పృచ్ఛామిమం హి పృచ్ఛే ।
విసభ్య విప్రా ఇతి కృత్యతాయామ్ ।
సర్వాత్మనా మ్రియమాణైశ్చ కృత్యమ్ ।
శుద్ధం చ తత్రామృశతాభియుక్తాః ॥

టీ:- తత ఇతి. పృచ్ఛ్యం ప్రష్టవ్యం, విస్రభ్య విశ్వాసం కృత్వా. ఏవం కర్తవ్యమిత్యస్య భావః ఇతికర్తవ్యతా. తస్మిన్ విషయే. సర్వాత్మనా సర్వావస్థాసు కృత్యం విశేషతశ్చ మ్రియామాణైః. తచ్చ శుద్ధం పాపసంకల్పరహితం ఆమృశత విచారయత.(24)

ఓ విప్రులారా ! మీ యందలి విశ్వాసముచే నేను అడుగతగిన ఒక ప్రశ్నను అడుగుతున్నాను. మానవుడు అన్ని అవస్థలలో, విశేషించి చావసిద్ధమయి ఉన్నపుడు చేయదగిన, పాపసంపర్కములేని పవిత్రమగు కార్యమేది ? సమాహిత చిత్తులై, బాగా ఆలోచించి వివరింపుడు.(24)

25. శ్లో. తత్రాగమద్భగవాన్ వ్యాసపుత్రో
యదృచ్ఛయా గామటమానోఽనపేక్షః ।
అలక్ష్యలింగో నిజలాభతుష్టో
వృతశ్చ బాలైరవధూత వేషః ॥

టీ:- తత్రేతి. తత్ర తేషు యాగయోగతపోదానాదిభిర్వివదమానేషు సత్సు. యదృచ్ఛయా గాం పర్యటన్ , వ్యాసపుత్రాస్తత్రాభవత్. ప్రాప్తః న లక్ష్యం ఆశ్రమాదిలింగం యస్య.అవధూతః అవజ్ఞయా జనైస్త్యక్తో యస్తస్యైకవేషో యస్య సః. (25)

శరీరము వదిలే వానికి ఆచరించ యోగ్యములు యాగములా, యోగములా, తపస్సా, దానాదులా అని వాదోపవాదములు తలెత్తే సమయములో, ఏ నిమిత్తము లేకుండానే, ఏది కోరకనే, భూలోకమున సంచరించు శుకమహర్షి (వ్యాసులవారి కుమారుడు) అచటికి వచ్చెను. అతనిలో ఏ ఆశ్రమ చిహ్నాలు కనిపించలేదు. అవధూత వేషములో ఉన్నాడు. అవధూత అనగా జనులచేత గుర్తింపబడక, తిరస్కరింపబడేవాడు. ఆ శుకమహర్షి తనకు లభించిన దానితోనే తృప్తి పడేవాడు, ఆడవారు, బాలురు కుతూహలముచేత అతనిని గుర్తెఱుగక చుట్టుముగినారు.(25)

26. శ్లో. తం ద్వ్యష్టవర్షం సుకుమారపాద
కరోరుబాహ్వంసకపోలగాత్రమ్ ।
చార్వాయతాక్షోన్నసతుల్యకర్ణ
సుభ్ర్వాననం కంబుసుజాత కంఠమ్ ॥

టీ:- తమితి. తమిత్యాదీనాం ప్రత్యుత్థితా ఇతి. తృతీయేనాన్వయః .ద్విగుణాన్యష్టౌ వర్షాణి యస్య. సకుమారౌ పాదౌ కరౌ ఊరూ బాహూ అంసౌ కపోలౌ గాత్రం చ యస్య. చారుణీ ఆయతే అక్షిణీ యస్మిన్. ఉన్నతా నాసా యస్మిన్ ఉన్నతా నాసా యస్మిన్. లంబహ్రస్వాదివైషమ్యం వినా తుల్యౌకర్ణౌ యస్మిన్ శోభనౌ భ్రువౌయస్మిన్. ఏవంభూతమాననం యస్య. కంబువద్రేఖాత్రయాంకింతః, సుష్ఠుజాతః కంఠోయస్యసః.(26)

"తం" అను ఇత్యాది శ్లోకాలకు ప్రత్యుత్థితా అని మూడవ శ్లోకంతో అన్వయము. ఆ పరీక్షిత్ సమీపానికి వచ్చిన శుకమహర్షిని వర్ణిస్తున్నాడు. ఆ శుకమహర్షి పదునారు సంవత్సరాల వయస్సు కలవాడు. కోమలమగు పాదములు, చేతులు, ఊరువులు, బాహువులు, భుజములు, గండస్థలములు, చెక్కిళ్ళుకల చక్కని శరీరముకలవాడు. అందమైన విశాల నేత్రములు, ఎత్తైన ముక్కు, పొడువు పొట్టిలేని మంచి చెవులు, మంచి కనుబొమ్మలు కల ముఖము కలవాడు శంఖమువలె మూడు రేఖలుగల అందమైన కంఠముగలవాడు.(26)

27. శ్లో. నిగూఢ జత్రుం పృథుతుంగ వక్షసమ్
ఆవర్తనాభిం వలివల్గూదరం చ ।
దిగంబరం వక్రవికీర్ణకేశం ప్రలంబ
బాహుం స్వమరోత్తమాభమ్ ॥

టీ:- నిగూఢేతి కంఠస్యాధోభాగే స్థితే అస్థినీజత్రుణీమాంసేన నిగూఢేజత్రుణీ యస్యపృథువిస్తీర్ణం తుంగమున్నతం వక్షోయస్య.

ఇంకను శుకమహర్షిని వర్ణిస్తున్నాడు. జత్రువులు కంఠమునకు క్రింద ఉన్న ఎముకలు మాంసముతో కప్పబడినవాడు, విశాలమైన ఎత్తైన వక్షస్థలముకలవాడు, సుడిలాంటి బొడ్డుచేత అడ్డముగానున్న రేఖలచేత అందమైన ఉదరముగలవాడు, దిగంబరుడు, వంపులు తిరిగిన కేశములు కలవాడు. పొడుగాటి చేతులు కలవాడు, దేవతలలో ఉత్తముడగు శ్రీహరి వంటి దివ్యకాంతి కలవాడు శుకమహర్షి. (27)

ఆవర్తవన్నాభిర్యస్య. వళిభిస్తిర్యజ్నిమ్న రేఖాభిర్వల్గు రమ్యముదరం యస్య. దిశ. ఏవాంబరం యస్య. వక్రా వికీర్ణా కేశా యస్య. ప్రలంబౌ బాహూ యస్య. స్వమరేషు శ్రేష్ఠేషు దేవేషూత్తమో హరిః తద్వదాభా యస్య తం.(27)

28. శ్లో. శ్యామం సదాపీచ్యవయోఽంగలక్ష్మ్యా
స్త్రీణాం మనోజ్ఞం రుచిరస్మితేన ।
ప్రత్యుత్థితాస్తే మునయః స్వాసనేభ్యః
తల్లక్షణజ్ఞా అపి గూఢవర్చసమ్ ॥

టీ :- శ్యామమితి. సదా అపీచ్యం అత్యంతోత్తమంయద్వయో యౌవనం. తేన యా అంగలక్ష్మీర్దేహకాంతిః. తయారుచిరం. స్మయేన చ గూఢవర్చసమపి. ప్రత్యుత్థితా తం దృష్ట్వా ప్రత్యుద్గమనం కృతవంత ఇత్యర్థః.(28)

అత్యుత్తమమైన, నల్లని రంగుచేత,యౌవనము వలన కలిగిన దేహకాంతిచేత మనోజ్ఞమగు చిరునగవుచేతను స్త్రీలకు మనోహరుడుగా కనిపించుచున్నాడు, ప్రకటింపబడని బ్రహ్మవర్చస్సుకల ఆ శుకుని చూచి, భగవత్కథా పారంగతత్వము ఆతని బ్రహ్మవేత్తృత్వము మొదలగు లక్షణములను తెలిసినవారు కావున మునీశ్వరులందరు వెంటనే తమతమ ఆసనాలనుండి లేచి నిలబడిరి.(28)

29. శ్లో. స విష్ణురాతోఽతిథయ ఆగతాయ
తస్మై సపర్యాం శిరసా జహార ।
తతోనివృత్తా హ్యబుధాఃస్త్రియోఽర్భకాః ।
మహాసనే సోపవివేశ పూజితః ॥

వచ్చినటువంటి అతిథికి పరీక్షిన్మహారాజు తన శిరస్సు వంచి నమస్కరించి, పూజించి, ఆత్మనివేదన గావించుకొనెను. అప్పుడు అతని గొప్పతనము కొంత తెలిసి అజ్ఞులగు స్త్రీలు, పిల్లలు అచటినుండి వెనుకకు మరలివెళ్ళిరి. పిదప ఆ శుకమహర్షిని ఋషులు, మహారాజును గొప్ప ఉన్నతాసనమున కూర్చొనబెట్టిరి. (ఇచట సోపవివేశ అనుచోట సంధి ఆర్షము.) (29)

టీ:- స ఇతి. శిరసైవ సపర్యామాహజహార ఆత్మనివేదనం కృతవాన్. తేన సహ ఆగతాః స్త్ర్యాదయస్తతో నివృత్తాః. సఉపవివేశ సంధిరార్షః (29)

30. శ్లో. స సంవృతస్తత్ర మహాన్మహీయసాం
బ్రహ్మర్షిరాజర్షిసురర్షిసంఘైః ।
వ్యరోచతాలం భగవాన్యథేందుః
గ్రహర్ష తారానికరైః పరీతః ॥

గొప్పవారిలో గొప్పవాడగు ఆ శుకమహర్షి, అచట బ్రహ్మర్షి, రాజర్షి, దేవర్షి సముదాయములచే పరివృతుడై, శుక్రుడు మొదలైన గ్రహాలు, అశ్విని మొదలగు నక్షత్రాలతో చుట్టుముట్టబడి ఉన్న చంద్రునివలె మిక్కిలి ప్రకాశించెను.(30)

టీ:- స ఇతి. స భగవాన్. బ్రహ్మర్షిసంఘాదిభిస్సంవృతస్సన్, అలం వ్యరోచత. గ్రహాః శుక్రాదయః. ఋక్షాణ్యశ్విన్యాదీని. అన్యాస్తారాః (30)

31. శ్లో. ప్రశాంతమాసీనమకుంఠ మేధసం
మునిం నృపో భాగవతోఽభ్యుపేత్య ।
ప్రణమ్య మూర్ధ్నాఽవహితః కృతాంజలిః
నత్వా గిరా సూనృతయాఽన్వపృచ్ఛత్ ॥

ప్రశాంతుడు, నిశితమైన బుద్ధికలవాడు, సర్వార్థముల నెరిగినవాడు అగు శుకముని దగ్గరకు భగవద్భక్తుడగు పరీక్షిత్తు వచ్చి, సమాహితచిత్తుడై, శిరస్సు వంచి నమస్కరించి, సత్యము, ప్రియమైన వాక్కుతో ఇట్లు ప్రశ్నించెను. (31)

టీ:- ప్రశాంతమితి. న కుంఠా సర్వార్థేషు మేధా యస్య తంప్రశ్నార్థం పునర్నత్వా. (31).

**రాజోవాచ.**

32. శ్లో. అహో అద్య వయం బ్రహ్మన్
సత్సేవ్యాః క్షత్రబంధవః
కృపయాఽతిథిరూపేణ
భవద్భిఽస్తీర్థకాః కృతాః ॥

33. శ్లో. యేషాం సంస్మరణాత్పుంసాం
సద్యశ్శుధ్యంతి వై గృహాః
కిం పునర్దర్శనస్పర్శ
పాదశౌచాసనాదిభిః ॥

టీ:- సూనృతాంగిరమాహ పంచభిః-అహోఇతి. సతాం సేవ్యః జాతాః యతః అతిథిరూపేణ హేతునా తీర్థకాః యోగ్యాః కృతాః.(32,33.).

34. శ్లో. సాన్నిధ్యాత్తే మహాయోగిన్
పాతకాని మహాంత్యపి ।
సద్యో నశ్యంతి వై పుంసామ్
విష్ణోరివ సురేతరాః ।

టీ:- సాన్నిధ్యాతితి. విష్ణోస్సాన్నిధ్యాదసురా ఇవ.(34).

**పరీక్షిత్తు ఇట్లనెను.**

ఆ మంచి వాక్కును అహో ! అని ఐదు శ్లోకాలతో తెల్పుచున్నాడు. ఓ బ్రాహ్మణోత్తమా అసత్ క్షత్రియులమగు మేము ఈ రోజు సత్పురుషుల సేవించదగిన వారమై అతిథి రూపముగా వచ్చిన మీ దయతో తీర్థమువలె యోగ్యులమైతిమి. (32)

పరీక్షిత్తు శ్రీ శుకమహర్షితో అనుచున్నాడు. ప్రభూ ! మీలాంటి మహర్షుల యొక్క స్మరణముచేతనే మా ఇండ్లు సద్యస్కాలమున పరిశుద్ధమగును అట్టి మీ దర్శనము, స్పర్శనము, పాదప్రక్షాళనము, ఆసన కల్పనముల వలన మాకు ఇంకను గొప్ప ఫలితము కలుగును. మేము మరింత పవిత్రములమగుదుము. మా ఇండ్లు అత్యంత శుద్ధములగును అని ఇంకను చెప్పవలయునా? (33)

ఓ మహాయోగీశ్వరా ! మీ సాన్నిధ్యమువలన బ్రహ్మహత్యాది మహాపాతకాలు కూడా, విష్ణుమూర్తి సాన్నిధ్యమున రాక్షసులు నశించినట్లు వెంటనే తొలగి అదృశ్యములగును. (34)

35. శ్లో. అపి మే భగవాన్ ప్రీతః
కృష్ణః పాండుసుతప్రియః ।
పైతృష్వసేయప్రీత్యర్థం
తద్గోత్రస్యాత్తబాంధవః ॥

టీ:- అపీతి. పాండుసుతానాం ప్రియః అత స్తేషాం పైతృష్వసేయానాం ప్రీత్యర్థం. తద్గోత్రస్య తత్పౌత్రస్య మే ఆత్తం స్వీకృతం బాంధవం. బంధుకృత్యం యేన సః.(35).

శ్రీకృష్ణభగవానుడు పాండవులకు మిక్కిలి ఇష్టుడు కావున ఆయన తన మేనత్త కొడుకులగు పాండవుల తృప్తి కొరకు వారి వంశమున జనియించిన వాడై (బంధుత్వమును పొందినవాడై) నాయందు ప్రేమ చూపియుండవచ్చును. లేనిచో మీ దర్శనాది కృపను పొందుట ఎట్లు సంభవించును.(35)

36. శ్లో. అన్యథా తేఽవ్యక్తగతే
ర్దర్శనం నః కథం నృణామ్ ।
నితరాం మ్రియమాణానాం
సంసిద్ధస్య వనీయసః ॥

టీ:- అస్యథేతి. అన్యథా శ్రీకృష్ణస్య ప్రసాదం వినా. అవ్యక్తా గతిర్యస్య. మ్రియమాణానాం నితరాం కథంస్యాత్? వనయితా యాచయితా. వనయితృతమో వనీయన్. తస్యాతువయదారతయా మాం యాచేథాఇతి ప్రవర్తకస్యేత్యర్థః.(36).

భగవదనుగ్రహము లేకపోతే అవ్యక్తగతియైన, ఎక్కడికి ఎప్పుడు వెళ్ళుదురో తెలియని వనవాసివైన మీ దర్శనము మరణించబోయే మాలాంటి వారికి ఎట్లు లభ్యమగును? (36)

37. శ్లో. తతః పృచ్ఛామి సంసిద్ధం
యోగినాం పరమం గురుమ్
పురుషస్యేహ యత్కార్యం
మ్రియమాణస్య సర్వథా ॥

టీ:- అత ఇతి. సమ్యక్సిద్ధిర్యస్మాత్తం కార్యం కర్తుం యోగ్యం. కర్తవ్యం త్వావశ్యకమితి భేదః. అతఏవ సర్వథా మ్రియమాణస్య పురుషస్య యస్మిన్ కృతే సంసిద్ధిర్మోక్షలక్షణో సిద్ధిర్భవతి తత్త్వాం యోగినాం గురుం పృచ్ఛామి. (37).

అందువలన యోగీశ్వరులకు పరమగురువగు మిమ్ము అడుగుతున్నాను. స్వామీ శీఘ్రముగా మరణించబోయే మనుష్యునికి సద్గతి కొరకు (మోక్షప్రాప్తి కొరకు) చేయదగిన పనియేదో? దానిని సెలవీయుడు.(37)

38. శ్లో. యచ్ఛ్రోతవ్యమథో జప్యం
యత్కర్తవ్యం నృభిః ప్రభో ।
స్మర్తవ్యం భజనీయం నో
బ్రూహి యద్వా విపర్యయమ్ ॥

టీ:- యదితి. యచ్ఛ్రోతవ్యం యజ్జప్యం యత్కర్తవ్యాం యదారాధ్యం తత్ బ్రూహి. విపర్యయం అశ్రోతవ్యాది.(38).

ఓ మహాత్మా! మనుష్యులు దేనిని వినవలెనో, దేనిని జపించవలెనో, దేనిని ఆచరించవలెనో, దేనిని స్మరించవలెనో, ఏమి భజించవలెనో దానిని చెప్పండి. అంతేగాక దానికి వ్యతిరేకంగా దేనిని విడువవలెనో, దేనిని చేయకూడదో, దేనిని జపించరాదో కూడా చెప్పండి.(38)

39. శ్లో. నూనం భగవతో బ్రహ్మన్
గృహేషు గృహమేధినామ్ ।
న లక్ష్యతేహ్యవస్థానమ్ ।
అపి గోదోహనం క్వచిత్ ॥

టీ:- త్వద్దర్శనస్య పునర్దుర్లభత్వాదిదానీ మేవ కథ నీయమిత్యాశయే నాహ - మానమితి. గోదోహనకాలమాత్రమపి. అస్మాకం భాగ్యవశాత్త్వద్దర్శనం జాతమితి భావః. (39).

భగవంతుడవగు ఓ బ్రహ్మర్షీ ! శుకదేవా ! గృహస్థుల ఇండ్లలో మీరు ఎక్కడను ఆవు పాలు పితికినంత సమయము కూడ నిలువరు. మీరు మావద్దను వచ్చి నిలుచుట మా భాగ్యము. మీ దర్శనము మాకు ఇంకను దుర్లభము కావున ఇపుడే తెలుపగోరుచున్నాను.(39)

40. శ్లో. ఏవం సంభాషితః పృష్టః
స రాజ్ఞా శ్లక్ష్ణయా గిరా ।
ప్రత్యభాషత ధర్మజ్ఞో
భగవాన్ బాదరాయణిః ॥

టీ:- ఏవమితి. ఏవం అహో ఇత్యాదికయా శ్లక్ష్ణయా మధురయా గిరా ఆభాషితః అభిముఖీకృతః పృష్టశ్చ. ఆర్యం ధర్మరాజమహోతాం మననే కృత్వా పరీక్షిన్నృపం బ్రహ్మాస్త్రాదిభి రక్షితం కలిజయభ్యాతం కృత్వా భువి. అంతేయశ్శుకరూపతః స్వ పరమజ్ఞానోపదేశేన తం శాపాదావదముం నమామి పరమానందాకృతిం మాధవమ్.(40).

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం**
**సంహితాయాం ప్రథమేస్కంధే భావార్థదీపికాయాం**
**ఏకోనవింశోధ్యాయః**
**సమాప్తోయం**
**పథమస్కంధః.**
**శ్రీకృష్ణార్పణమస్తు.**

ఆ శుకమహర్షి ఈవిధంగా రాజు గారి చేత మధురమైన వాక్కుతో అడుగబడినవాడై అన్ని ధర్మములు తెలిసిన భగవానుడు, బాదరాయణియగు, ( వ్యాసమహర్షి కుమారుడగు) శుకమహర్షి ఆయనకు సమాధానమును ఇచ్చెను. ఆర్యుడగు పరీక్షిత్తును బ్రహ్మాస్త్రముబారి నుండి కాపాడి, కలినిగ్రహము చేయించి, మహారాజుగా కొంత కాలముంచి, చివరకు శుక రూపమున ప్రత్యక్షమయి ఆయనకు బ్రహ్మజ్ఞానోపదేశము గావించి, మోక్షమార్గమునుజూపి పరీక్షిత్తును కాపాడిన మాధవుడైన కృష్ణుని నేను నమస్కరిస్తున్నాను అని మంగళమును పలికి శ్రీధరులు శ్రీమద్భాగవతపథమస్కంధమున పందొమ్మిదవ అధ్యాయము యొక్క భావార్థ దీపికా వ్యాఖ్యానము ముగించిరి.(40)

**శ్రీమద్భాగవతము యొక్క ప్రథమస్కంధ**
**పందొమ్మిదవఅధ్యాయమునకు శ్రీధరీయవ్యాఖ్యానుసార**
**ఆంధ్రానువాదము ముగిసినది.**

**జైకృష్ణ ఓం తత్సత్ శ్రీకృష్ణపరబ్రహ్మార్పణమస్తు.**

